# శ్రీ యాదగిరి
# లక్ష్మీనృసింహస్వామి దేవస్థాన కమిటీ
## యాదగిరిగుట్ట.

* * * * *

ఆంధ్రప్రదేశ్ తెలంగాణ ప్రాంతంలో పవిత్రమైన దేవాలయాలలో శ్రీ యాదగిరి లక్ష్మీనృసింహస్వామి దేవాలయము ఒకటి. జగత్ప్రసిద్ధమైన ఈ దేవాలయానికి ధనికులు, పేదలు అనే తారతమ్యాలు లేకుండ భక్తులు రోజు వేలసంఖ్యలో వచ్చి శ్రీ స్వామిని దర్శించి వెళ్తుంటారు. శ్రీ శ్రీ స్వామివారిని సంపూర్ణ భక్తి విశ్వాసముతో దర్శించి పూజించేవారిని ఆపదలనుంచి రక్షిస్తారని ఏలాంటి రోగపీడితులైనా స్వామి దర్శనమువల్ల నయమౌతారనే ప్రగాఢ విశ్వాసం భక్తులలో నాటుకొనివుంది.

* * * * * * * * *

భక్తులు ఎల్లవేళలలో శ్రీ స్వామివారిని దర్శించుకోవచ్చు. ప్రత్యేక పూజలకు వ్రతాలకు అన్ని సౌకర్యములు కలవు. రైళ్లలో ప్రయాణము చేసి వచ్చేవారు రాయిగిరి స్టేషన్‌లో దిగవలయును. హైద్రాబాద్ నుండి ప్రత్యేకంగా R. T. C. బస్సులు యాదగిరిగుట్టకు నడుపబడుతున్నవి.

వై. బసవయ్య,
ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు.

# శ్రీ భద్రాచలక్షేత్ర మహిమ



సంపాదకుడు :

డి. సుదర్శన్.



పబ్లిషర్ :

కాంగ్రెస్ జాతీయ వార పత్రిక.

వరంగల్. (ఆంధ్ర ప్రదేశ్.)

ప్రతులకు



| | | | |
|---|---|---|---|
| ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ | | .... | భద్రాచలం దేవస్థానం, భద్రాచలం. |
| ,, | ,, | .... | శ్రీ రాజేశ్వరస్వామి దేవస్థానం, P. O. వేములవాడ. జిల్లా: కరీంనగర్. |
| ,, | ,, | .... | శ్రీ యాదగిరి లక్ష్మీనృసింహస్వామి, P. O. యాదగిరిగుట్ట. తా: భోనగర్. |
| ,, | ,, | .... | తిరుమల తిరుపతి దేవస్థానం. P. O. తిరుపతి. జిల్లా: చిత్తూరు. |

మరియు

మేనేజర్, కాంగ్రెస్ వార పత్రిక

వరంగల్. (ఆంధ్ర ప్రదేశ్.)

## మనవి - మాట * * * * *

పది సంవత్సరాల పత్రికా ప్రచురణ మహోద్యమంతో భౌతికంగా కొంత అలసినట్లై - ప్రకృతి రమణీయతను అస్వాదించాలనే తలంపుతో కాంగ్రెస్ వారపత్రిక నిర్వాహకులు మిత్రులతో బయలుదేరి వెళ్లి ఈ సంవత్సరం అతి మనోజ్ఞంగాను, రమ్యంగాను జరిగిన రాముని కళ్యాణోత్సవాన్ని భద్రాచలంలో తిలకించటం జరిగినది. ఆ భద్రగిరిపై రామునికై మా కార్యమేమిటన్న ఊహ జనించి మాచేతను - సహృదయులచేతను - చేయూతకాగల కార్యభారాన్ని చేపట్టాలనుకున్నాం. అంతే - ఈ భావన కల్గినవెంటనే కొన్ని ఛాయాచిత్రాలు సేకరించటానికి అప్పటికప్పుడు పర్పాట్లుచేసాం. ఇతోధిక కృషితో "శ్రీ భద్రాచలక్షేత్ర మహిమ"ను ఒక పుస్తకాన్ని ప్రచురించాలని నిర్ణయించి అందుకు సావధానంగా ప్రయత్నాలు ప్రారంభించాం. ఈ ప్రయత్నంలో సహృదయులు, రచయితలు, మరియు ప్రకటనదారులు తమ సహకారాన్ని అందించటమేకాకుండా మేము తలపెట్టిన ఈ కార్యక్రమం సఫలీకృతం కావాలని ఆశీర్వదించారు.

ఐతే శ్రీ భద్రాచలక్షేత్ర మహిమను వెలువరించటంలో ఔచిత్యం - సందర్భం - సంస్కృతీగత దృక్పథంకూడా లేకపోలేదు. మనదేశంలో ఎన్నో దేవాలయాలు శిల్పకళాఖండాలుగా వెల్లివిరిసి వున్నాయి. అలనాటి శిల్పకళనుచూచి ఆనందించటమే తప్ప,

ఈ నాడు అలాంటి శిల్పాచార్యులు - శిల్పులు, సమధాటి శిల్పకళా ఖండాలను నిర్మింటం కనులారా చూచి ఆ శిల్పకళా ప్రాశస్త్యాన్ని కనులకు కట్టునట్లు ప్రకటించటం ఎంతేని అవసరమని భావించాము. ఈ సంపుటంలో "సీతారామాలయం శిల్పకళా సంపద" అన్న పేరుతో సుదీర్ఘమైన వ్యాసం ఒకటి సేకరించి ప్రచురించినాము.

ఈ పుస్తకము వెలువరించటంలో రామదాసు ఆదర్శమే మా ముందు నిలిచింది. అవధుల మేరకు ప్రయత్నించి ఈ రామకృతిని వెలువరించగలిగాము.

ఈ సంపుటంలో ఇతర విషయాలకు సంబందించిన ఒకటి రెండు రచనలుకూడా ముద్రితమైనవి. వాటి విషయంలో పాఠకులు ఎలాంటి విమర్శలకు తానివ్వకూడదని ప్రార్థన.

దీని ముద్రణలో సహాకరించిన తిరుమల తిరుపతి దేవస్థానం ప్రెస్ యాజమాన్యానికి - రచనలను సహృదయంతో పంపిన రచయితలకు - తమ వ్యాపార ప్రకటనలను ప్రకటించిన సంస్థలకు - ప్రకటనదారులకు మా కృతజ్ఞతలు. ఇది మా తొలి ప్రయత్నం. పొరపాట్లు ఏ రూపంలోనైనా దొర్లివుంటె పాఠకులు అభిమానించి సూచనలందజేస్తారని ఆశిస్తున్నాము.



—పబ్లిషర్.

# విషయసూచిక

# సంపాదకీయం....

భారతీయుల సంస్కృతి అతి పురాతనమైనది. అది మన ప్రజల జీవన విధానంలో అడుగడుగునా అనాదిగా ప్రతిఫలింబిస్తూ వచ్చింది. ఆధునిక ప్రభావం దానిపై పడినా దాని మూలస్రోతస్సు మాత్రం అవిచ్ఛిన్నంగా సాగుతుంది. ప్రతి గాతిలో మన పూర్వ సంస్కృతి భద్ర పరుచబడినది. అందుకే మన దేవాలయాలు తరతరాల మన సంస్కృతికి మూలాధారాలుగా నిలిచివున్నాయి.

విశ్వం అవతరించి మానవుడు జిజ్ఞాసానురక్తుడైన నాటినుండి అనేక విధాలుగా జ్ఞానసంపద పెరుగుతూవస్తున్నది. పెరుగుతున్న ఇట్టి జ్ఞానసంపద సంపుటీకరించబడటం ఒక విశేషం. కవి ధారాళంగా కావ్యాలు వ్రాయగలడు శిల్పి మనోహరంగా రాళ్లను చెక్కగలడు. వైజ్ఞానికుడు విశ్వాంతరాలను పరిశోధించగలడు. చిత్రకారుడు మేలి రంగులతో నయనానందంగా చిత్రాలు గీయగలడు. ఈ వికసిత జ్ఞాన సౌందర్యం ఆ యా రూపాలలో వెల్లివిరియటం సహజమే. ఈ జ్ఞాన సర్వసం వివిధంగా కనుపించినా అన్నింటి వస్తువు (Subject) ఒక్కటిగానే ఉండడం ప్రధానాంశం. దానికి అనేక రూపకల్పనలు చేయబడ్డాయి. అంతా భగవంతుని లీలావినోదమని మన విశ్వాసం.

ఆ భగవంతునికి నిలయమైన ఆలయాలు మనదేశంలో సర్వత్రా నిర్మించబడ్డాయి. ఆస్తికతలోని వైవిధ్యం ఆలయాల వైవిధ్యంగా కానవస్తుంది. అందుకే దేవాలయ ప్రాంగణంలోకి వెళ్ళిన ఏ నాస్తికుడైనా ఆ క్షణాన ఒకవింత అనుభూతిని పొందడం సహజం. అయితే ఈ దేవాలయాల నిర్మాణానికి కేవలం శాస్త్రజ్ఞానమే సరిపోదు. స్థల చరిత్ర ఉదాత్తమై భక్తి ప్రేరకమైనప్పుడే శిల్పి భావనలో భవ్యత సిద్ధించి, మనోజ్ఞమైన కళాఖండాలు ఏర్పడుతాయి. ఈ విధంగా నిర్మింపబడిన దేవాలయాలు వందల వేల సంవత్సరాలైనా చెక్కు చెదరక భారతీయ మూలధర్మ సందేశాలను చాటుతూ మన సంస్కృతికి ప్రతిబింబాలై తరతరాలకు తరగని సంపత్తిగా విలసిల్లుతున్నాయి.

మన సంస్కృతికి చిహ్నములైన దేవాలయాలనేకం శిథిలమై పోగా వాటిని పునరుద్ధరించగల శాస్త్రజ్ఞానం మనలో వున్నదా అన్న

సందేహం కలుగుతున్న ఈ రోజుల్లో మన ఆస్తిక్యం జాగరితమవడం ముదావహం.

నేడు మన ఆధునిక విజ్ఞాన సంపత్తితో పురాతన సంస్కృతి మేళవింపు జరగాలి. అలా జరిగినప్పుడు మన దేవాలయాలు సంస్కృతీ భాండాగారాలే కాదు - ఆస్తికనిలయాలే కాదు. వర్తమాన భూతభవిష్యత్ భారతీయ జీవన ప్రాశస్త్యానికి ప్రతీకలై నిలుస్తాయి.

దేవాలయాలు మన దేశంలో కొల్లలు - రామాలయమో శివాలయమో లేని గ్రామం ఉండదంటె అతిశయోక్తి కాదు. దేవాలయాల ఉనికి ప్రజల్లో ఆస్తిక ప్రమాణాల హేతువవడమే కాక నైతిక విలువలకు కూడా దోహదం చేస్తుంది.

ముందే మనవిచేసినట్లు దేవాలయాల నిర్మాణానికి ఒకానొక చరిత్ర ఆధారంగా ఉంటుంది. అదేవిధంగా ఖమ్మంజిల్లాలోని భద్రాచల క్షేత్రానికి పవిత్రమైన భక్తిగాథ ఆధారమై ఉన్నది. రాముడు భారతీయులకు ఆరాధ్య దేవుడు, ఆదర్శ చక్రవర్తి.

రామాలయాలలో భద్రాద్రి రామాలయానికి ప్రత్యేకస్థానం ఉంది. పవిత్ర గోదావరి తీరానఉన్న భద్రాద్రి రామాలయాన్ని దర్శించి, పునరుద్ధరింపబడుతున్న దేవాలయ వాస్తు శిల్పకళా ప్రాశస్త్యాన్ని కనులారా తిలకించినప్పుడు, అలనాటి రామాయణ గాథ మన కన్నులముందు జరుగుతున్నదా అన్నట్లుంటుంది.

చల్లని గోదా మతల్లి ఒడిలో, పిల్లగాడ్పుల సుఖస్పర్శతో భక్తుల లాలింపుతో సమస్త పూజావిధులచే కొలువబడి వేంచేసియున్న రామునిసేవలో మన కర్తవ్యమేమి?

ప్రజారాజ్యానికి ఆలంబనమైన రామరాజ్య భావమును, రామ చరితను - సామాన్య పాఠకునికి అందించడమే నేటి మన కర్తవ్యం. దానినే పురస్కరించుకొని "భద్రాచలక్షేత్ర మహిమ" అనే ఈ సంపుటమును శ్రీరామాంకితంచేసి భక్తజనుల కందిస్తున్నాం.

ఓం తత్సత్.



శ్రీ సీతారామాలయ సింహద్వార గోపురము

# శ్రీ భద్రాచల క్షేత్రము

— డా॥ దివాకర్ల వేంకటావధాని.

ఆంధ్రదేశమందలి సుప్రసిద్ధ క్షేత్రరాజములలో శ్రీ భద్రాచలమొకటి. ఈ క్షేత్రము పేరు వినఁగనే భక్త శిఖామణియు సార్థక బిరుద నాముఁడు నగు శ్రీరామదాసు స్మృతిపథమున నిల్చును. ఆయన యతిలోక భక్తికిని శ్రీరామ చంద్రుని భక్తావన పరాయణతకును శాశ్వత చిహ్నమై నిల్చి ప్రత్యహము సహస్రములకొలంది యాత్రికుల నాకర్షించు దివ్యక్షేత్రము భద్రాచలము. ఈ క్షేత్రమునకు పురాణప్రశస్తితోపాటు చరిత్ర ప్రసిద్ధికూడ నున్నది. భక్తరామ దాసు ప్రభుత్వ ధనముతో భద్రాచలమున శ్రీ సీతారామ చంద్రుల దేవాలయము నిర్మించుట, తత్ఫలితముగా కారాగృహ శిక్ష ననుభవించుచు శ్రీరామచంద్రునిఁ గూర్చి భక్తిరస వాహినులైన కీర్తనల వెలయించుట, శ్రీరాముఁడు తానీషాకు ధనము చెల్లించి రామదాసు కారాగృహ విమోచనమునకుఁ గారణమగుట మున్నగు నంశము లాంధ్రులు నిరంతరము భక్తితో స్మరించు చారిత్రక సత్య ములు. పురాణ ప్రసిద్ధములైన క్షేత్రములు భారతదేశము నందెన్నోయున్నవి. అవి యెప్పుడెట్లు పుట్టినవో చారిత్రకాధారములతో నిర్ణయించి చెప్పుట కవకాశము లేదు. కాని భద్రాచలము విషయమట్టిదికాదు. చరిత్ర నెఱింగిన వారెల్లరు నీ క్షేత్రమునందలి దేవాలయ నిర్మాణ వృత్తాంతమును నిస్సంశయముగా విశ్వసింతురు. సుమారు మూడు శతాబ్దుల క్రిందనే నిర్మితమైన దేవాలయముతోఁ గూడిన యీ క్షేత్రము పురాణ ప్రసిద్ధములైన మహాక్షేత్రముల కెందును దీసిపోని మహి మాతిశయముల కిరవై యాంధ్రుల భక్తి సంపదను దశదిశా వ్యాప్త మొనరించు చున్నది. శ్రీరామచంద్రుఁడు సర్వ భారతీయులకు సమాన దైవమైనను ఈ క్షేత్ర మున వెలసిన కారణమున తెలుఁగువారి ప్రత్యేక దైవముగా భావింపఁబడు చున్నాఁడు.

భద్రాచలమను గ్రామము గోదావరి యుత్తర తీరమునందలి యదే పేరు గల కొండపై నున్నది. ఈ కొండతూర్పు కనుమలందలి యొక భాగము భద్రా చల గ్రామము పూర్వము తూర్పుగోదావరి మండలమునకుఁ జెందియుండినను

ప్రస్తుతము ఖమ్మం మండలమునఁ జేర్పఁబడి భద్రాచలం తాలూకాకు కేంద్ర స్థానమై యున్నది. భద్రాద్రి కాపేరు వచ్చుటకుఁ గారణము బ్రహ్మాండ పురాణ మందలి గౌతమీ మాహాత్మ్య ఖండమున నిట్లు చెప్పఁబడియున్నది. తొల్లి మేరు పర్వతమును అతని భార్యయైన మేరుదేవియు పుత్ర సంతానార్థులై ఘోరమైన తప మొనరింప బ్రహ్మ వారికిఁ బ్రత్యక్షమై వారికోరిక యీ దేరునని వర మొసంగెను. ఆవరము ననుసరించి వారికి భద్రుఁడను కుమారుఁడుదయించెను. భద్రుఁడు పెరిఁగి పెద్దయై పర్వతరూపము దాల్చి గోదావరీ తీరమునందలి దండ కారణ్య భాగమున భక్తితోఁ దపమొనరింప నారంభించెను. శ్రీరామచంద్రుఁడు పితృవాక్పరిపాలనమునకై సీతాలక్ష్మణులతో వనవాస మొనరించుచు దండ కారణ్యమున సంచరించు సమయమున నొకప్పుడు భద్రుని పర్వతాకృతి యందలి యొక శిలపైఁ గూర్చుండెను. వెంటనే యపూర్వ చిత్త శాంత్యానందము లనుభవమునకు రాఁగా నతఁడు భద్రుని వృత్తాంతమును స్మరించి యాతని ప్రేమపూర్వకముగాఁ దనచెంతకు రమ్మని యాహ్వానించెను. భద్రుఁడంత ముని రూపధారియై యరుదెంచి యాతని పాదపద్మములకు భక్తితో నమస్కరింప శ్రీరాముఁడతని "నీకేమి కావలయు" నని యడిగెను. భద్రుఁడు శ్రీరాముఁడా రూపముతోఁ దనపై శాశ్వతముగానిల్చి సంతతార్చితుఁడై దివ్యదర్శన మొసం గుచు భక్తులకు మోక్ష సంపద ప్రసాదింపవలెనని ప్రార్థించెను. కరుణామయుఁ డైన శ్రీరాముఁడట్లు చేయుట కంగీకరించెను. వెంటనే యాతఁడు నిల్చిన శిల శ్రీ సీతారామ లక్ష్మణ మూర్తులుగా రూపొందెను. మిగిలిన యరణ్యమంతయు వక్లే యుండి పోవుటచే జనులెవ్వరు నా విగ్రహములను దర్శించు నవకాశము లేకపోయెను. అందుచేఁ జాల యేండ్లు దేవతలును ఋషులును మాత్రమే యా మూర్తుల నారాధించుచు నానందము ననుభవించు చుండిరి. భద్రుని రూపమైన పర్వత మగుటచే దానికి భద్రాచలమను పేరుగల్గినది. రామభద్ర పదాం కత్వాత్ భద్రాద్రిరితి విశ్రుతిః అను శ్లోకమునుబట్టి శ్రీరామభద్రుని పాద చిహ్నములను ధరించిన దగుటచే దాని కాపేరు గల్గినట్లు కొందఱు చెప్పుదురు. భద్రాచలమున కాపేరుగల్గుట కీ పై రెండు వృత్తాంతములలో నేదైనను గారణము గావచ్చును.

భద్రాద్రియందలి సీతారామ లక్ష్మణుల దర్శించి యారాధించిన మహా నీయులలో జగద్గురు శంకరాచార్య స్వాములవారొకరు. వారు మహా మహిమ సంపన్నులగుటచే దుర్గమములైన గిరినదీ పర్వతారణ్యముల సరకు చేయక బదరీ కేదారాది మహాక్షేత్రములను దర్శింపఁ జాలిరి. అట్లే వారు దండకారణ్య

మందున్న భద్రగిరినిగూడ దర్శించి యందునెలకొనియుండి యంత దనుక ఋషి దేవతామాత్రార్చితులైన సీతారామ లక్ష్మణులను సేవించి యుండిరి. శ్రీరామ కర్ణామృతమునందలి "వామాంకస్థితజానకీ" త్యాది శ్లోకము వారప్పుడు రచించి నదే యని చెప్పుదురు. ఆ మూర్తిత్రయమును యథాతథముగ వర్ణించు నా శ్లోక మిప్పటికిని భద్రాచలమున నిత్యాను సంధానమునఁ బఠింపఁ బడుచుండును.

భద్రాచలమునకు సుమారొక మైలుదూరమున భద్రిరెడ్డి పాలెమను చిన్న పల్లెయున్నది. అందప్పుడు పలువురు శబరజాతివారు నివసించు చుండిరి. వారిలో దమ్మక్క యను భక్తురాలొకతె. ఆమె యింటిపేరు పోకలవారు. ఒకనాఁటిరాత్రి శ్రీరాముఁడామెకుఁ గలలోఁ గనఁబడి తాను సీతాలక్ష్మణ సమేతుఁడై భద్రగిరిపై నొక తాళవృక్షము సమీపమున నెలకొనియున్న విషయముతెల్పి యామె తమకు ప్రతిదినమర్చనాదులు కావింపవలెనని యెఱింగించెను. దమ్మక్క ప్రాతః కాలముననే లేచి తన స్వప్న వృత్తాంతమును గ్రామస్థులకుఁ దెల్పెను. ఆమె భక్తురాలని యెఱిగినవారగుటచే వారామె మాటలు మన్నించి యామె చెప్పిన గుర్తుల ననుసరించి భద్రగిరిపైనున్న యాచోటికి దారిచేసికొని వెళ్ళి సీతా రామ లక్ష్మణుల విగ్రహములను గాంచి పరమానంద భరితులైరి. దమ్మక్క కోరిక ననుసరించి తక్షణమే యచ్చట నా విగ్రహములపై లతా పత్రాదులతోఁ గుటీరా కారమైన చిన్నగుడి నిర్మింపఁబడెను. దమ్మక్క ప్రతి దినమచ్చటి కరిగి సీతారామ లక్ష్మణుల నారాధించుచుఁ బ్రక్కనున్న తాడిచెట్టునుండి రాలినఫలమును నైవేద్య ముగా నర్పించు చుండెను. ఈ విధముగా భద్రగిరిపైనున్న యా విగ్రహముల మొట్టమొదట దర్శించి యారాధించిన సామాన్య జనులలో ప్రథమురాలు దమ్మక్కయే. ఆమెవలన నా విగ్రహముల యుదంత మెఱిఁగి రామదాసు దేవాలయాదులను గట్టించువఱకు వానికల్లే పూజాదికము జరుగుచుండెను. ఇప్పటికిని భద్రాచల మందలి పూజారులలోఁ గొందఱు దమ్మక్కపేర నేర్పడిన పోకలవారి వంతు ననుభవించుచు నర్చనాదికము లొనరించు చున్నారు.

శ్రీ సీతారామలక్ష్మణులకు భద్రాచలమున నాలయ ప్రాకారాదులు నిర్మించి యా క్షేత్రమును సర్వజనసంసేవ్య మొనరించిన భక్తశిఖామణి రామదాసను ప్రసిద్ధ నామముగల కంచర్ల గోపన్న ఇతని చరిత్రము సర్వాంధ్రజన సుపరిచితము. ఇతఁడు తానీషాయనఁబడు అబుల్ హసన్ షా అను గోల్కొండ నవాబు కొలువున మంత్రి దండనాథులుగా నుండిన అక్కన్న మాదన్నల మేనల్లుఁడని చెప్పుదురు. చిన్నప్పటినుండియు నితఁడు రామభక్తుఁడై మెలఁగుచుండెననియు భక్తకబీ

రితనికి దర్శనమొసంగి రామమంత్ర ముపదేశించెననియుఁ బ్రతీతి. అప్పటి నుండియు నితఁడు మఱింత భక్తిసంపన్నుఁడై శ్రీరామచంద్రుని నామస్మరణ మొనరించుచుఁ గాలము గడపుచుండెను. ఆకాలమున దుర్భరమైన క్షామము చెలరేఁగుటచే నితఁడు కరుణాళువై తన యాస్తినంతను దీనులైన యనాధులకు భోజనాదులొసంగుటకై వినియోగించెను. పిమ్మట తల్లిదండ్రులుకూడ మరణింప నితఁడు చేయునదిలేక తన మేనమామలసాహాయ్యమున తానీషాకొలువున నేదైన నుద్యోగము సంపాదింపనెంచి గోల్కొండ కరిగెను. ఇతఁడు సంస్కృతాంధ్రము లలో పండితుఁడై యుండుటయేకాక ఉర్దూ పారశీక భాషలనుగూడ నెఱింగి యుండెను. తానీషా యితనిఁగాంచి దయార్ద్రుఁడై మొదట ఖమ్మమ్మెట్టుమండల కార్యాలయమున పేష్కారుగా నియమించెను. తరువాత నితఁడు హసానాబాదు (పాల్వంచ) పరగణాయందలి శిస్తులు బకాయిపడియున్న కారణమున వానిని వసూలు చేయుటకై పరగణాధికారిగా నియోగింపఁబడెను. అప్పుడు పాల్వంచ, బూర్గుంపాడు, భద్రాచలముతాలూకాలు మూఁడును ఆపరగణాలో చేరియుండెను. అందుచేతనే లోకమున నాతఁడు భద్రాచలము పాల్వంచ తాలూకాలకు తహసీల్దారుగా నుండెనను ప్రతీతి యేర్పడినది.

గోపన్న పరగణాకు ముఖ్యస్థానమైన పాల్వంచలో మకాముచేసి ప్రజల నే విధముగను నొప్పింపకుండనే సత్త్వమార్గమున క్రమముగా శిస్తుల బకాయి లన్నియు వసూలు చేయఁజాలెను. అతఁడాసమయమున నిత్యము రామభజన చేయుచు నిరతాన్నదానము సాగించుచునే యుండెను. భక్తిబంధురుఁడు సత్త్వగుణ సంపన్నుఁడునైన గోపన్నపైఁ బ్రజల కాదరాభిమానము లేర్పడెను. వారుకూడ నప్పుడప్పుడతని నివాసమున కరిగి యతనితోపాటు రామభజన చేయుచుండిరి. గోపన్న భక్తి ప్రపత్తులను గుణగణములను విని దమ్మక్క యాతని కడ కరిగి భద్రగిరియందలి సీతారామలక్ష్మణుల విషయమాతనికెఱింగించెను. గోపన్న యామెతోనరిగి యావిగ్రహములను గాంచి భక్తిపరవశుఁడై "దాశరథీ కరుణాపయోనిధీ" యను మకుటముతోఁ దన హృదయావేదనను వెల్లడించుచు రసవంతములైన పద్యములు వెలయించెను. అవే క్రమముగా నూఱు పద్యములై దాశరధీశతకమను పేరఁబ్రసిద్ధి గాంచినవి. ఆంధ్రశతక వాఙ్మయమున భక్తి సంపదకును, భావసంపదకును, గవితాసంపదకును బేరుపడ్డయుత్తమ శతకముల లోనిది యగ్రేసరమైనది. గోపన్న తన మకామును పాల్వంచనుండి భద్రాచలమునకు మార్చి, కంజీవరమునుండి పంచగోత్రములకుఁజెందిన వైష్ణవులను

రప్పించి, పాంచరాత్రాగమ విధానమననుసరించి శ్రీ సీతారాముల కర్చనాదులు చేయింప నారంభించెను. దానితోపాటతఁడు పేదల కన్నదానమును గూడఁ జేయించు చుండెను. ఒకనాఁడన్నదానము జరుగుచుండఁగా నతని కుమారుఁడు రఘురాముఁడు వేడిగంజి గుంటలోఁబడి మరణోన్ముఖుఁడయ్యెననియుఁ దల్లి యాతనిఁ జూచియు నన్నదానమున కెక్కడ భంగము కలుగునోయని కిమ్మనక యూరకుండె ననియుఁ దరువాత రామదాసది యెఱిగి కొనయూపిరితోనున్న రఘురాముని శ్రీరామచంద్రుని పాదపద్మముల కడనుంచి "కోదండరామ"యను కీర్తన పాడి ప్రార్థించెననియు, వెంటనే బాలుడు పునరుజ్జీవితుఁడయ్యెననియుఁ జెప్పుదురు. రామదాసు భద్రాచలమున నివసించినచోటిది యని యచ్చటి వారిప్ప టికిని యాత్రికులకుఁ జూపుచుందురు. రామదాసునకు కారాగృహశిక్ష విధింపఁ బడిన పిమ్మటఁ దత్సంతతివారు భద్రాచలమును విడిచి వినుకొండ తాలూకా యందలి పెరుమాళ్ళపల్లిలో స్థిరనివాస మేర్పఱుచుకొనిరి.

గోపన్న సీతారామలక్ష్మణులున్న గుడి కుటీరప్రాయమై యుండుటచే వారికి శాశ్వతమైన యాలయమొకటి నిర్మింపవలెనని సంకల్పించెను. ఆతని మిత్రులందఱు నతని నట్లుచేయుటకెన్నో విధములఁ బ్రోత్సహించిరి. కాని దురదృష్ట వశమున దేవాలయనిర్మాణమునకుఁ దగినంత ధనముమాత్రము చేకూరి యుండలేదు. అంతగోపన్నఁ దనయొద్దనున్న ప్రభుత్వధనముతో దేవాలయ నిర్మాణ మొనర్చుట కనుజ్ఞయొసంగవలెనని నవాబునకు విన్నపము పంపుకొని యదివచ్చువఱకు నూరకుండనేల యని నిర్మాణ క్రియకారంభ మొనరించెను. సుమారు రెండేండ్లలోఁ బ్రధానాలయ ప్రాకారములయు వాహనములయు నిర్మా ణమును గనకరజతాలంకారముల పనియుఁ బూర్తి యయ్యెను. రామదాసు కళాశిల్పాలంకరణాదులకై యా సొమ్ములో నొక్కపైసయు వ్యర్థము కావించి యుండలేదు. ఇంతలో గోల్కొండ యందలి రాజకీయ పరిస్థితులలోఁ గొంత మార్పు కలిగెను. అచ్చట నక్కన్న మాదన్నల ప్రాభవము సన్నగిల్లెను. రామదాసు ముందనుజ్ఞవడయకయే యాఱులక్షల ప్రభుత్వ ధనమును వమ్మొన రించెనను నేరమునకు గోల్కొండ దుర్గమున బంధింపఁబడెను. క్రీ. శ. 1674 నుండి 1686 వఱకు సుమారు పండ్రెండు వత్సరములతఁడు కారాగృహశిక్ష ననుభవించెను. ఆ సమయమునఁ దానుపడిన పాట్లన్నియు నతఁడు కీర్తనల రూపమున వెలయింప నవి వెంటనే యాంధ్రదేశ మందంతటను వ్యాపించెను. ఆ కీర్తనలలో నతఁడు శ్రీరాముని గుణగణములను బలువిధములఁ బ్రశంసించుచు

వేఁడుకొనెను. కొన్నింట నాతనిఁ దనయెదుట నున్నవానిఁగా భావించి వాదించుచు నీ తాతిగుండె కరఁగదేమనియు ప్రారంభించెను. ఒక కీర్తనలో నతఁడు సీతారామ లక్ష్మణుల కొఱకుఁ దాను చేయించిన యాభరణములను వానికైన వ్యయమును వివరముగాఁదెల్పి "యిది నీ యబ్బసొమ్మా - తాతసొమ్మా" యని ధిక్కార పూర్వకముగా హెచ్చరించెను. ఈ విధముగా నెన్నిభంగుల మొఱపెట్టు కొన్నను లాభము లేకపోవుటచే నతఁడు దయార్ద్రహృదయయైన సీతను సంబో ధించుచుఁ బ్రోవుమని వేఁడుకొనెను. ఎట్టకేలకాతని మొఱలాలించి శ్రీరాముఁడును లక్ష్మణుఁడును దేవాలయభటుల యాకారమున తానీషా పడక గదికేగి, యతని కాఱులక్షల ధనము చెల్లించి, రసీదు కారాగృహమున నిద్రించుచుండిన రామదాసు తలక్రిందఁబెట్టి యరిగిరి. తానీషా ఉదయముననే లేచి ధనముచూచి యాశ్చర్య చకితుఁడై వెంటనే కారాగృహమునకుఁ బరువెత్తి రామదాసు పాదములపైఁబడి క్షమింపుమని వేఁడుకొనుటయేకాక భద్రాచలము తాలూకానుండి వచ్చు శిస్తంతయు దేవాలయ వ్యయమునకై వెచ్చింపవచ్చునని యనుజ్ఞ యొసంగెను. ఈ సందర్భ మున రామదాసునకును సుల్తానునకును జరిగిన సంభాషణముతోఁ గూడిన కీర్తన రమ్యమై వినువారికి వీనుల విందొనరించుచుండును. రామదాసు భద్రాచలమున కరుదెంచి దేవాలయ వ్యవహారముల నతి భక్తితోడను శ్రద్ధతోడను నిర్వహింప నారంభించెను. అచిరకాలముననే రామదాసు భక్తియు శ్రీరామచంద్రుని భక్త రక్షణ పరాయణతయు దేశమందంతట వ్యాపించుటచే వేలకొలఁది భక్తులు శ్రీరామ నవమి ఉత్సవముల దర్శించుటకై భద్రాచలము రాఁదొడంగిరి. అప్పటినుండియు భద్రాచల మాంధ్రదేశమందలి సుప్రసిద్ధ క్షేత్రములలో నొకటియై విరాజిల్లుచున్నది.

తరువాతఁ గొన్నిదినములకు రామదాసు రోగగ్రస్తుఁడై కాలి బాధచే శ్రీరామచంద్రుని దర్శనమునకు స్వయముగా నరుగఁజాలక యతనినే దర్శన మిచ్చుచుండవలెనని ప్రార్థించినట్లాతఁడు రచించిన యొక కీర్తనవలనఁదెలియు చున్నది. కొన్నినెలలిట్లుండి 'జాతస్యమరణం ధ్రువ' మ్మను సూక్తిచొప్పున నా మహాభక్తుఁడు తన భౌతిక కాయమును జాలించి శ్రీరామచంద్రుని యం దైక్యముచెందెను. తానీషా రామలక్ష్మణులు తన కొసంగిన నాణెములను మరల రామదాసునకే యర్పింపఁ దలంచెననియు రామదాసు వానినన్నిటిని గ్రహింప నంగీకరింపక విగ్రహముల నలంకరించుటకై రెండింటిని మాత్రము గ్రహించె ననియుఁ జెప్పుదురు. అవి యిప్పటికిని ఉత్సవ విగ్రహముల కలంకారములై విరాజిల్లుచున్నవి. భద్రాచలమునకరుగు యాత్రికు లా నాణెములను గన్నులారఁ

జూచి తరింపవలెనని యువ్విళులూరు చుందురు. ఆనాణెములు రామరాజ్యమునఁ బ్రచారమందుండిన నాణెములని ప్రతీతి వానివెనుకనున్న లిపి నెవ్వరును గుర్తింపఁ జాలకున్నారు. ఆ నాణెముల ప్రతికృతులను దేవాలయ సంఘమువారు వెండి రాగి బంగారు లోహములపై ముద్రించి 'రామమాడ' లను పేర విక్రయింతురు. యాత్రికులు వానిని భక్తిపూర్వకముగాఁగొని ధరించుచుఁ దద్ధారణమున సర్వరోగ భయోపద్రవములు తొలంగునని విశ్వసించుచున్నారు.

తానీషాయనఁగా మంచి రాజని యర్థము. అతఁడు పూర్వజన్మమున మహా శివభక్తుఁడైన బ్రాహ్మణోత్తముఁడనియు నొక సమయమునఁ బూజావిధాన మందించుక యలసత ప్రదర్శించినకతమున వెంటనే మోక్షము పొందుట కనర్హుఁడై మఱుజన్మమున తానీషాగా నుద్భవించి శ్రీరామసాక్షాత్కారము నొంది మోక్షసామ్రాజ్యము చూఱగొనెననియుఁ జెప్పుదురు. రామదాసునంతటి మహా భక్తుఁడుకూడఁ జర్మచక్షువులతోఁ జూడఁజాలని శ్రీరామ లక్ష్మణులను తానీషా చూడఁజాలుట నిజముగా నొక భాగ్యవిశేషమే.

మొగలు చక్రవర్తియైన ఔరంగజేబు క్రీ. శ. 1687 వ సంవత్సరమున తానీషానోడించి గోల్కొండ రాజ్యమును మొగలుసామ్రాజ్యమునఁగలుపుకొనెను మొదట గోల్కొండ సుబాకు గజియుద్దీనను నతఁడు సుబేదారుగా నియమింపఁ బడెను. అతని పిమ్మట సుబేదారైనవాఁడు నిజాముల్ముల్కు. ఔరంగజేబు మరణానంతరము ఢిల్లీ సామ్రాజ్యమునఁ బలువిధములైన కలఁతలేర్పడెను. అతని కుమారులు సింహాసనమునకై యొండొరులతోఁ గలహించిరి. చివరికి మొఅజ్జా అను నతఁడు బహదూర్షా అను పేరుతోఁ జక్రవర్తియై తన యాధిపత్యమున కెట్టి యాటంకము కలుగకుండుటకై సోదరులనెల్లఁజంపించెను. ఈ కల్లోలములోఁ బలుప్రాంతములందు సామంత రాజులు స్వాతంత్ర్యము ప్రకటించిరి క్రీ. శ. 1724 వ సంవత్సరమున గోల్కొండ సుబేదారైన నిజాముల్ ముల్క్ అసఫ్జా కూడ స్వతంత్రత ప్రకటించి హైద్రాబాదు రాజ్యమును స్థాపించెను. 1748 వ సంవత్సరమున అసఫ్జా మరణింపఁగా ఫ్రెంచి గవర్నరగు డూప్లే హైద్రాబాదు రాజ్యవ్యవహారములలో జోక్యముకలిగించుకొని తొలుత అసఫ్జా మనుమఁడైన ముజఫర్జంగును, దరువాత అసఫ్జా కుమారుఁడైన సలబత్ జంగును నిజాములుగా నొనరించెను, క్రీ. శ, 1761 వ సంవత్సరమున సలబత్ జంగును రాజ్యభ్రష్టునొనరించి నిజామలీఖాను హైద్రాబాదు సింహాసనమధి

ష్టించెను. 18 వ శతాబ్ద ఆరంభము నుండియు దేశమున బలవంతమైన కేంద్ర ప్రభుత్వము లేని కతమున పెక్కు చిన్న చిన్న రాజ్యములేర్పడుట సంభవించెను. చోరభయము ప్రబలెను; అశాంతి పెంపొందెను. ముష్కరులైన దుండగీండ్రు యథేచ్ఛముగా ధనికుల గృహములపైని గ్రామములపైని దండెత్తి ధనకనకాదులను గొల్లగొట్టుచుండిరి. ధంసా (జఫర్ బేగ్ ఖాన్)యను యవనసేనాని యొకఁడు వేల్పుకొండపై దుర్గము నిర్మించి దండయాత్రకు బయల్వెడలి పెక్కు దురంతములొనరించుచు 1769 ప్రాంతమున భద్రగిరిపై దండెత్తెను. అతఁడచ్చటి ప్రజలకును భక్తులకును గలిగించిన కష్టములకు మేరలేదు. అతఁడు శ్రీరామచంద్రుని దేవాలయముచొచ్చి విగ్రహములను బాడుచేయునేమో యనుభీతిచే నర్చకులు వానిని పోలవరము చేర్చిరి. ఈ సమయముననే భల్లాపేరయ్య యనుకవి వ్యాజస్తుతి పూర్వకముగా భద్రగిరి శతకము రచించెను. భక్తులందఱును ధంసాక్రౌర్యమునకుఁ బాల్పడి పలుపాట్లు పడుచుండ నీవు మాత్రము పోలవరమున సుఖముగాఁ గూర్చుందువా ? ముష్కరులైన శత్రువులు నిన్నును విడువరు సుమా యనియు ప్రాంభించుచు నతఁడందు శ్రీరాముని వచ్చి శత్రుసంహారము కావింపు మని హెచ్చరించెను, కొన్ని పద్యములలో నతఁడు శ్రీరాముని యుల్లముచ్చిపోవునట్లు నిష్ఠురములు పల్కి యుండెను. కొంత యలజడి చల్లారుటచే 1775 వ సంవత్సరమున నర్చకులు విగ్రహములను మరల భద్రాచలము కొని వచ్చిరి. కాని 1776 వ సంవత్సరమున మరల వానిని బస్తరు రాష్ట్రమందలి కమలాపురమునకు మార్చవలసి వచ్చెను. 1782 లో ధంసా మరణించెను. 1785 వ సంవత్సరమున అశ్వారావుల సాయమున విగ్రహములు మరల భద్రాచలమునకుఁగొని రాఁబడెను. ఈ విధముగా రామదాసు మరణానంతరము చాలకాలమువఱకు భద్రాచలదేవాలయ వ్యవహారములు చిక్కు పరిస్థితిలోనుండెను. దేవాలయమొక శతాబ్దికి పైఁగా నసమర్థులయు నధర్మపరులయుఁ జేతులలోనుండి పోవలసివచ్చెను.

ఇట్లుండఁగా గుంటూరుపురవాసియైన తూము లక్ష్మీనరసింహదాసు, చెన్నపురినివాసియైన భద్రగిరి ఎరదరామదాసు అను నిరువురు భక్తులు రెండేండ్లు వరుసగా శ్రీరామనవమికి భద్రాచల మరుదెంచుటయు, నచ్చటి పరిస్థితులుచూచి దుఃఖితులై దేవాలయమును బునరుద్ధరించి మరల రామదాసు కాలమునాఁటి వైభవము నెలకొల్పవలెనని సంకల్పించుటయు సంభవించెను. నరసింహదాసు గొప్పకవి యగుటయేకాక వ్యవహారదక్షుఁడుకూడనై యుండెను. వరదరామదాసు సంపన్నుఁడు. అంతరమైన శ్రీరామభక్తి ప్రేరేప వారిరువురును అగ్నిసాక్షిగా

మైత్రీబంధ మేర్పఱుచుకొని తమ శక్తికొలఁది దేవాలయోద్ధరణమునకు నడుము కట్టిరి. వరదరామదాసు మదరాసునకరిగి తన కుటుంబమును ధనమును ఆస్తిని గొని భద్రాచలమునకుఁ దిరిగి వచ్చెను. నరసింహదాసు హైద్రాబాదున కరిగి నాల్గవ నిజామైన నజరుద్దౌలా మంత్రియైన శ్రీచందూలాలును దర్శించి భద్రాచల దేవాలయశోచనీయ పరిస్థితులు విన్నవించెను. చందూలాలు నరసింహదాసు ప్రసన్నోజ్జ్వలమైన ముఖమును జూచినంతనే యాకర్షింపఁబడి దేవాలయ నిర్వహణమునకై తానీషా రామదాసున కొసంగిన యధికారమునంతను బునరుద్ధరించుటయేకాక యతనికి 'రాజా' యను బిరుదమునొసంగి యా సంస్థానము నంతను నిర్వహింపుమని కోరియుండెను. నరసింహదాసు దానిని స్వయముగా నిర్వహించుట కంటె వరదరామదాసుపేర నిర్వహించుట యుచితతరముగానుండునని సూచించుటచే చందూలాలు వరదరామదాసుపేర ఫర్మానాయొసంగి నరసింహదాసు వ్యవహార నిర్వాహకుఁడుగా నుండునట్లును ఆస్తియంతయు శ్రీరాముని పేర నుండునట్లును ఏర్పాటు గావించెను. ఈ విషయమే భద్రుని యాలయము ముందున్న స్తంభములపై తెలుఁగు లిపిలోఁ జెక్కఁబడిన శాసనము నందున్నది. రామదాసు వేయించిన శాసన స్తంభములు కూడ నచ్చటనే యుండెడివనియు వానిని ధంసాయనుచరులు ధ్వంసముచేసిరనియుఁ జెప్పుదురు.

ఈ విధముగా చందూలాలు ననుజ్ఞనుబొంది వరదరామదాసు శ్రీరాముని మొహరుతో పూర్వ పూజా విధానమునంతను బునరుద్ధరింపవలెనని 1831 లో పూజారుల కాజ్ఞాపత్రము నొసంగెను. ఈ పత్రమిప్పటికిని దేవాలయమున సురక్షితమైయున్నది. నరసింహదాసుగారు దక్షిణ భారతయాత్ర కరిగి నప్పుడు త్యాగరాజస్వామిని దర్శించి వారిని భద్రాచలమునకు రమ్మని గౌరవ పూర్వకముగా నాహ్వానించిరఁట; త్యాగరాజస్వామి యట్లే భద్రాచలమున కరుదెంచి శ్రీరామ దివ్యసందర్శనానందమున మైమఱచి దేవాలయ ప్రాంగణమున "మోహన రామ" యను కీర్తనను గానము చేసెనఁట. మఱియు "ఎన్నగానురామభజన" "గిరిపై నెలకొన్న" "క్షీరసాగరశయనా" మున్నగు కీర్తనలలో నాయన మహాభక్తుఁడైన రామదాసును స్మరించెనని పెద్దలు చెప్పుదురు. క్రీ. శ. 1832 వ సంవత్సరమునకు సరియైన నందన సంవత్సరమున ఘోరమైన క్షామము చెలరేఁగెను. నరసింహదాస వరదరామదాసు లిరువురును ధైర్యమువహించి క్షుధితులై తండోపతండములుగా వచ్చు నార్తజనుల కెడతెఱపి లేకుండ నన్నదానము చేయ సాగిరి. దురదృష్టవశమున నామరుసటి సంవత్సరము వరదరామదాసు మరణిం

చుట సంభవించెను. నరసింహదాసు విరక్తుఁడై సుహృద్వ్రతంసుఁడైన వరద రామదాసుతోఁ గూడఁ దానును దనువు చాలింప నిశ్చయించెను. వరదరామదాసు మహాప్రస్థానము వైకుంఠయాత్రోత్సవముగాఁ బరిణమించెను. వివిధములైన వన్నాహము లొనరింపఁబడెను. ఆ యాత్రలో నాభక్తుల ననుసరింపఁదలఁచిన వారికందఱకు నరసింహదాసు నంగీకారము లభించెను. ఆ నాఁడు సెప్టెంబరు 18 వ తేదీ బుధవారము. గోదావరి జలప్రపూర్ణయై యొడ్డులొరసి ప్రవహించు చుండెను. పుష్పమాలాలంకృతమైన యొక పడవలో వరదరామదాసు కళేబరము నుంచి నరసింహదాసునుమఱి పదునెనమండుగురు భక్తులును దాని నధిష్ఠించిరి. సహస్రములకొలంది జనులు తీరమున నిలఁబడి హాహాకారము లొనరించుచుండఁ బడవ భయంకరమైన గోదావరీ ప్రవాహము మధ్యభాగమునకుఁ ద్రోయఁబడెను. నరసింహదాసు భక్తి భరితములైన కీర్తనలుపాడుచు నితరుల సాయమున మిత్రుని శవమును నదిలో విడిచివైచి తానునందు దుమికెను. పడవలోనున్న వారందఱు నొకరి తరువాత నొకరాతని ననుసరించిరి. కాని నదిలోఁబడి మునిఁగిపోవువారిని వెంటనేతీసి రక్షింప వలెనని నరసింహదాసు ముందే యేర్పాటు చేసియుండుటచే నారితేరిన యీతగాండ్రు నదిలోఁబడి గుటకలువేయుచున్న వారిని గొందఱి నొడ్డునకుఁ జేర్పఁ జాలిరి, నరసింహ వరదరామదాసుల శవములును మఱియైదు గురి శవములును ఈతగాండ్రెంత గాలించినను లభింపలేదు. వారితరులను సజీవముగనో నిర్జీవముగనో తీరమునకుఁ జేర్పఁ జాలిరి. నరసింహదాసు భార్య భర్త వలదని చెప్పుచున్నను వినక మూఁడుసార్లు గోదావరిలో నుఱికెను. మూఁడు సార్లును ఈతగాండ్రామెనెట్లో రక్షింపఁ జాలిరి. చివరిసారి యామె నదిలో దుమికి కొంతదూరము కొట్టుకొనిపోయి నదీమధ్యమునసున్న యొక చెట్టుకొమ్మలలోఁ జిక్కుకొనియుండి పోయెను. మఱునాఁడామెను గాంచి జనులొడ్డునకుఁ గొని వచ్చిరి. తరువాత నామె కొన్ని యేండ్లు జీవించి యొక కుమారునిఁ బెంచుకొనెను. మంత్రి చందూలాలు వారిరువురి జీవనమునకు నైదూళ్ళశిస్తు విరాళముగా నొసంగెను. నరసింహదాసాదు లొనరించిన త్యాగసాహసము లాధునికయుగము నందరుదని చెప్పఁదగినట్టివి. అవి వారి భక్తి సౌహృదములకుఁ దార్కాణములు. వైకుంఠయాత్రా సమయమున నరసింహదాసు పాడిన చరమగేయము లిప్పటికిని భక్తజనులచే భక్తిపూర్వకముగా గానము చేయఁబడుచున్నవి,

నరసింహదాస వరదరామదాసులు భద్రాచలమునకు వచ్చిన పిమ్మట మూఁడేండ్లు మాత్రమే జీవించినను శ్రీరామ దేవాలయోద్ధరణమునకై వారు

కావించిన కృషిమాత్ర మపారమైనది. ధనమును దేహమును బ్రాణములను గూడ లెక్క-సేయక వారు దేవాలయ వ్యవహారములను సరిదిద్దుటకెన్నో విధములఁ బాటుపడియుండిరి. ప్రతిదినమును ప్రతివారమును ప్రతిమాసమును బ్రతివర్షమును జేయఁదగిన పూజోత్సవ విధానములను నిర్ణయించి వారు వానిని యథావిధిగ సాగించిరి. నరసింహదాసు కవి యగుటచే భక్తిరసభరితములైన పెక్కు- కీర్తనలు రచించెను. భక్తులిప్పటికిని వాని నాదరముతోఁ బాడుచుందురు. వరదరామదాసు కవి కాకపోయినను రామదాసు జైలులో పాడిన కీర్తనలన్నియు సేకరించుటయే కాక అతని చరిత్రను సక్రమముగా సమకూర్చి తరువాత హరి కథకులు కాలక్షేపమునఁ జెప్పుటకనువుగా దానిని వెలయించియుండెను. అనంతరకాలమునఁ బలువురు రచించిన రామదాసు చరిత్రల కన్నిటికి నదే మూలము. వరదరామదాసునకుఁ జెందిన సువర్ణాభరణాదులన్నియు దేవాలయ మున సునిక్షిప్తములై యున్నవి.

నరసింహ వరద రామదాసుల యనంతరము దేవాలయ బాధ్యతను, సంస్థాన బాధ్యతను వహించు సమర్థులెవ్వరును లేనికతమున చందూలాలు దేవ శక ప్రధానులను బిలిపించి భద్రాద్రి దేవాలయము యొక్కయుఁ దత్సంబంధ దేవాలయములయొక్కయు వ్యయమునకై సంవత్సరమునకు రూ. 18,500/-లు నిర్ణయించి శ్రీరాముని పేరనే సనదు నొసంగెను. రెండవనైజాము కాలమున దేవాలయ వ్యయమునకై సంవత్సర మునకు నలువదివేల రూపాయలు నిర్ణ యింపఁబడెననియు, తరువాత నది పందొమ్మిదివేల యైదువందలకుఁ దగ్గింపఁ బడెననియుఁ దెలియుచున్నది.

తానీషాయు నతని తరువాత నిజాబు నవాబులును సమరస భావముకల్గి భద్రాద్రి శ్రీరామచంద్రునియెడ భక్తి శ్రద్ధలను బ్రదర్శించు చుండిరి. ప్రతి సం వత్సరమును శ్రీరామనవమినాఁడు సీతారాముల కల్యాణోత్సవ సందర్భమున తలఁబ్రాలుగా నుపయోగించుటకై నిజాము నవాబులు మంచిముత్యములను బంపు చుండిరని చెప్పుదురు. హైద్రాబాదు రాష్ట్రము భారత రాజ్యమునఁ జేరినపిమ్మట నైజాము నవాబుగారాసదాచారమును గొనసాగించుచున్నారో లేదో తెలియదు.

భద్రాద్రి దేవాలయమున నుదయమైదుగంటల మొదలు రాత్రి తొమ్మిది గంటలవఱకుఁ బ్రతిదినము పది యుత్సవములు నిర్వహింపఁబడును. ఇవి ప్రబోధోత్సవముతో మొదలిడి శయనోత్సవముతో ముగియును. చీఁకటిపడు

సమయమున జరుగు దర్బారుత్సవముకూడ ముఖ్యమైనది. ఈ యుత్సవములు భోగములు మున్నగునవి పాంచరాత్రాగమ విధానము ననుసరించి నిర్వహింపఁ బడును. శుక్రవారము, ఏకాదశి, ద్వాదశి, పూర్ణిమ, అమావాస్య, పునర్వసు సంక్రమణము మున్నగు దినములం దూరేగింపుటుత్సవములును సేవలును జరుగుచుండును. ఇవిగాక ప్రతిమాసమునందు జరుగు ప్రత్యేకోత్సవము లెన్నో కలవు. చైత్రమాసము నందలి మొదటి తొమ్మిది దినములు కల్యాణోత్సవము జరుగును. నవమినాఁడుజరుగు శ్రీసీతారామ కల్యాణమును దశమినాఁడు జరుగు రథోత్సవమును దర్శించుటకు లక్షలకొలఁది యాత్రికు లరుదెంచు చుందురు. జ్యేష్ఠ, పూర్ణిమనాఁడు సహస్ర కలశాభిషేకము నిర్వర్తింపఁబడును. శ్రావణ మాసమున పూర్ణిమకు ముందరి శుక్రవారమున లక్ష్మ్యుత్సవమును, పూర్ణిమకు ముందైదురోజులు పవిత్రోత్సవమును, కృష్ణ పక్షాష్టమినాఁడు శ్రీకృష్ణజన్మోత్సవ గోపాలోత్సవములును జరుగును. ఆశ్వయుజ శుక్ల పక్షమున మొదటి పదిరోజులు లక్ష్మీపూజ జరుగును. అప్పుడు ప్రతిదినము చిత్రముగా నలంకరింపఁబడిన వాహనములపై నూరేగింపు టుత్సవముకూడ జరుగును. దశమినాఁడు జరుగు శమీ పూజకు పలువు రరుదెంతురు. నరకచతుర్దశినాఁడును దీపావళినాఁడును జరుగు నుత్సవములు దర్శనీయములుగా నుండును. కార్తికదీపోత్సవ సమయమున దేవాలయమునందంతట పెక్కు నూనెదీపములు వెలిఁగింతురు. కార్తిక ద్వాదశి నాఁడు జరుగు చిలుకు ద్వాదశి ఉత్సవము భద్రాద్రి దేవాలయమునకుఁ బ్రత్యేకమైనది. జగన్మోహిన్యలం కారోత్సవమును దర్శించుటకుఁగూడ బహుసంఖ్యాకులగు యాత్రికు లరుదెంతురు. ధనుర్మాసమునందు జరుగు దశావతారోత్సవములందు శ్రీరాముని నొక్కొక్క దినమున నొక్కొక్క యవతారము వేషము వేయుచుందురు. వీనికి 'పగల్పత్' ఉత్సవములనిపేరు. ఈ యుత్సవముల సందర్భమున ద్రవిడ ప్రబంధములను వైదికాశీర్వాదమంత్రములను బఠింతురు. వైకుంఠ ఏకాదశినాఁటి ప్రభాతముననైదాఱుగంటల నడుమ వేలకొలఁది యాత్రికులు చలిని లెక్క సేయక గోదావరిలో స్నానముచేసి శ్రీరాముని ద్వారదర్శనము కావించి యానందింతురు. తరువాత గరుడవాహనా రూఢుఁడైన శ్రీరాముఁడితర వాహనములుకూడ ననుసరింప గ్రామమంతయు నూరేగును. భోగినాఁడు గోదా కల్యాణోత్సవమును మకరసంక్రాంతి దినమున రథోత్సవమును జరుగును. ఫాల్గుణమాస పూర్ణిమనాఁడు డోలోత్సవము నిర్వహింపఁబడును. ఆనాఁడు మొదలు సీతారాములు వధూ వరాకృతులు ధరింతురు. అప్పటినుండి శ్రీరాముఁడు

చైత్రమాసమున జరుగు తన కల్యాణమున కెల్లర నాహ్వానింప నాలయము విడిచి బయటి కరుగుననిచెప్పుదురు. ఈ విధముగా భద్రాచలమున ప్రతిమాసమునఁ బ్రత్యేకదినములందు దర్శనీయములైన మహోత్సవము లెన్నోనిర్వర్తింపఁ బడుచుండును. ఇవిగాక మ్రొక్కుబడు లున్నవారు కొంత ధనమిచ్చి ప్రత్యేకముగా నూరేగింపుటుత్సవములను జేయించుచుందురు.

భద్రాద్రిదేవాలయమున పదిరకములైన వాహనములున్నవి. రామదాసును దదితర భక్తులను స్వామికిఁ జేయించిన యాభరణములన్నియు నద్దపుబీరువాలలో నిక్షిప్తములై యుండును. వానిని భక్తులెల్లరును దర్శించి యానందింపవచ్చును. భక్తులువ్రాసి పోష్టుద్వారమునఁగాని స్వయముగాఁగాని సమర్పించిన రామకోటి గ్రంథములు పూజానంతరమచ్చట నిలువచేయఁబడియుండును. భక్తులైనవారు శాశ్వతనిధులర్పించి వానివలన వచ్చు వడ్డీధనముతో స్వామికి శాశ్వత పూజా భోగాదులు చేయింపవచ్చును.

భద్రాచలమునకు సమీపముననే పర్ణశాలయున్నది. ఇచ్చటి దేవాలయము కూడ భద్రగిరి దేవాలయమునకు సంబంధించినదే. అరణ్యవాస సందర్భమున సీతారామలక్ష్మణులు పర్ణశాల కట్టుకొని నివసించిన ప్రదేశమగుటచే దీనికీపేరు కలిగినదని చెప్పుదురు. రావణుఁడు సీత నపహరించుకొనిపోయిన స్థలమునకుఁ బ్రక్కనే యిచ్చటనొక దేవాలయము నిర్మింపఁబడియున్నది. ఇచ్చటి గోదావరి చూచుటకు మిక్కిలి యింపుగానుండును. ఏటవాలుగాఁ గనఁబడు కొండమీఁదఁ గొన్ని గుర్తులనుజూపి యచ్చటివా రవి రావణరథనేమి చిహ్నములనిచెప్పుదురు. ఇచ్చటి కాఱుమైళ్ళదూరమున దుమ్ముగూడెమను గ్రామమున్నది. శ్రీరామునిచే మడిసిన ఖరదూషణాది చతుర్దశ సహస్రరాక్షసుల బూడిద(దుమ్ము)పై నిర్మింపఁబడిన గ్రామమగుటచే దీనికాపేరు వచ్చినదందురు. పర్ణశాల సమీపమున నొక చక్కని స్నానగుండమున్నది. అచ్చటికి సమీపమునఁగల కొండపై వివిధ వర్ణ శబలమై పలురంగుల చీరలారవేసినట్లు కనిపించును. అచ్చటనే పసుపుకుంకుమ రంగులుగల చిన్నచిన్న శిలలు గోచరించును. పర్ణశాలకు పరిసర ప్రదేశము లందు పెక్కు లేళ్ళు సంచరించుచుండినను పర్ణశాలలో మాత్రమొక్క లేడియుఁ గనిపింపదఁట. దానికి ఋషులశాపము కారణమని చెప్పుదురు. పర్ణశాలనుండి భద్రాచలమునకుఁ బోవుదారిలో 'యేటపాక' యను గ్రామమున్నది. ఇది 'జటాయుపాక' యను దాని మాఱురూపమనియు జటాయువు రావణునితోఁబోరి

మడిసిన ప్రదేశమగుటచే దానికా పేరు వచ్చినదనియుఁ బ్రతీతి. భద్రాచలమునకు రెండుమైళ్ళ దూరమున గోదావరిలో నుష్ణజల కుండములున్నవి. అచ్చట నిసుకత్రవ్వినచో వేడినీరూరుచుండును. సీతారామలక్ష్మణులు పర్ణశాలలో నివసించునప్పుడు శీతకాలమున నచ్చట స్నానము చేయుచుండిరఁట. సర్పరాజైన ఆదిశేషు వర్షించిన దివ్యాగ్నుల కతమున నా యుష్ణజలకుండము లేర్పడినవని బ్రహ్మాండ పురాణము చెప్పుచున్నది.

భద్రాచలమున శ్రీరాముఁడు రామునివలె ధనుర్బాణములు ధరించియు నారాయణునివలె శంఖచక్రములు గూడ ధరించి చతుర్భుజుఁడై కనిపించును. సీతవామాంకస్థితయైయుండ భయనివారణ చిహ్నముగాఁ గుడిచేత శంఖమును ధరించి యతఁడు పద్మాసనమున నుండును. ఉత్సవమూర్తులందు సీతాలక్ష్మణు లాతని కిరుపార్శ్వములందున్నను మూల మూర్తులలో నిరువురును వామపార్శ్వముననే కనిపింతురు. అ, ఉ, మ్ అను నక్షరముల సంపుటిచే ఓంకార మేర్పడును. అకారము పరమాత్మ(శ్రీరాముఁడు) మకారము జీవాత్మ(లక్ష్మణుఁడు) వారిరువురి నడుమ ఉకార వాచ్యయగు సీతామహాలక్ష్మి గోచరించును. పై స్థితిని గొందఱీవిధముగా వ్యాఖ్యానింతురు. దండకాటవిని జరించుచు రక్కసుల బారి నుండి తమ్ము రక్షింప వాగ్దానమొనరించిన శ్రీరాముని మునులు శ్రీమన్నారాయణునిగా భావించిరి. అందుచేతనే భద్రాచలమున రాముఁడు శ్రీమన్నారాయణ రూపమున వెలసెనని యభిజ్ఞులు చెప్పుదురు.

ఇప్పుడు యాత్రికులు క్రొత్తగూడెమువఱకును ధూమశకటముపైఁ బయనించి యచ్చట బస్సునెక్కి క్రొత్తగా గోదావరిపై నిర్మింపఁబడిన వంతెన మీదుగా భద్రాచలము చేరుదురు. వంతెన నిర్మింపఁబడుటకు ముందు వారు బస్సుపై గోదావరీతీరమువఱకు నేఁగి యట పడవలపై గోదావరిదాఁటి భద్రాచలముచేరెడివారు. వేసవి కాలమున గోదావరి చాల భాగ మెండిపోవును గాన యాత్రికులు పడవల వఱకును ఇసుకపై నడచిపోవుట బహు క్లేశకరముగా నుండెడిది. అర్ధశతాబ్దికిఁ బూర్వము యాత్రికులు గోదావరీ తీరమువఱకును బండ్లపైఁగాని కాలినడకనుగాని పోవుచుండెడివారు. అప్పుడు మైలుమైలునకు నుచితముగా భోజనము పెట్టునట్టియు చల్లనిమజ్జిగ దాహ మొసంగునట్టియు కేంద్రములుండెడివి. ఆ యా ప్రదేశములందలి గ్రామస్థులు తమ్మాడు పెండ్లివారిఁగా భావించుకొని శ్రీరామ దర్శనార్థమై యరుగు యాత్రికులను మగపెండ్లి

వారుగా భావించి సకల సౌకర్యములను గలిగించుచుండెడివారు. ఆదృశ్యమును, స్వాగతీకరించు విధానమును జూచినచో మగపెండ్లివారి కెదురేగి వారిని స్వాగత వాక్యములతోఁగొనివచ్చు నెదుర్కోలు సన్నాహము స్మృతికిఁ దగులుచుండెడిదఁట ! ఆంధ్రదేశమందంతటఁగల యుదారులు ధర్మాత్ములు యాత్రికుల కట్టి సౌకర్యములు గలిగించు గ్రామస్థులకు ధనవస్తురూపమున సాయమొనరించుచుండెడివారఁట. ధూమశకటములయు బస్సులయు నాగమనముచే పూర్వమందుండిన యా సుందరదృశ్యము లిప్పుడు కనిపించుటలేదు కాని యాత్రికులు సుఖముగా వానిపైఁ బయనించి స్వామిదర్శనము కావించి యానందింపఁగల్గుచున్నారు.

రామదాసు నిర్మించిన దేవాలయము జీర్ణప్రాయమౌటచే నాంధ్రప్రభుత్వమువారు శ్రీ సీతారామ దేవాలయోద్ధరణ సంఘము నేర్పాటుచేసి తద్ద్వారా దేవాలయ ప్రాకారాదులను శిల్పసుందరముగా నిర్మింపఁ జేయుచున్నారు. ఇప్పటికే కల్యాణమండప నిర్మాణము పూర్తియైనది. అదిశాస్త్రీయమై శిల్పకళా శోభితమై దానిని నిర్మించిన శిల్పుల శిల్ప కౌశలమును వేనోళ్ళఁ జాటుచున్నది. దేవాలయ నిర్మాణముకూడఁ గొలఁది మాసములలోనే పూర్తికానున్నది. భద్రాద్రి సీతారామదేవాలయము నిట్లు పునరుద్ధరింపఁజేయుచు భక్తజన దర్శనీయముగా నొనరించుచున్న ప్రభుత్వమువారును, దేవాలయోద్ధరణ సంఘమువారును, అపూర్వ శిల్ప కౌశలమును బ్రదర్శించుచు పూర్వశిల్పివరేణ్యులఁ దలపించుచున్న శిల్పివర్గమువారును, ఉద్ధరణ కార్యమునకుఁ గావలసిన ధనమును భక్తిమై విరాళములుగా నొసంగిన వదాన్యులును పుణ్యులు ; శ్రీరామభక్తుల కృతజ్ఞతకు పాత్రులు. భద్రాద్రిలో వెలసిన తెలుఁగు దైవము శ్రీరామచంద్రమూర్తి దయాళువై సర్వదేశములను సంరక్షించుఁగాక.



# భద్రాచల సీతారామాలయం
# శిల్పకళాసంపద

— గణపతి స్థపతి శిల్పాచార్య.

భారత ప్రాచీన కళలలో శిల్పం, భరతం సంగీతం ప్రత్యేకస్థానము నాపాదించు కొన్నవి. శిల్పశాస్త్రమునకు ఇప్పటి ఇంజనీరింగ్‌నకు అతి దగ్గర సంబంధము కల్పించు చున్నది. పూర్వకాలమున శాస్త్రరచన సంస్కృత భాషలో సాగినందున-జనసామాన్యమునకు అందుబాటులో లేనందున అందరికీ తెలియుట సాధ్యపడలేదు. శాస్త్రము లుద్భవించిన విధానము ఈ క్రిందివిధముగా తెల్పబడు చున్నది. అందు.........శిల్ప విధానమొకటి.

## काश्यपशिल्पम्

### प्रथमः पटलः

महादेवं शशिधरं सर्वलोकैकनायकम् ।
माहेन्द्रमध्यगं शान्तं पार्वतीसहितं परम् ॥

देवदानवसिद्धाद्यैः सेवितं सुरपूजितम् ।
प्रणमय देवचरणमेवं ब्रूयात्सकास्यपः ॥

शुचेत्परमसद्भावं प्रसन्नात्सृष्टिकारणम् ।
जगतामभिवृद्ध्यर्थं योगिनामुपकारकम् ॥

देवानां चहितार्थाय शिवज्ञानं परंमहत् ।
महार्थमल्पग्रन्थं च कर्षणाद्यर्चनान्तकम् ॥

अंशुमन्तमहातन्त्राच्चयोक्त हि पुरार्थकम् ।
तन्त्रं तद्वच देवानां रुद्राणामधिकारिणाम् ॥




శ్రీ సీతా రామ లక్ష్మణులు.

भृगुरत्रिर्वसिष्ठश्च विश्वकर्मा मयस्तथा ।
अल्पायुष्यादिधर्माणां नराणां त्वधिकारिणाम् ।
अनुग्रहार्थं त्वेतेषां सक्षेपाद्वद मे प्रभो ॥

साधु साधु महाविप्रयच्चया परिचोदितम् ।
दुर्लभं तदहं वक्ष्ये श्रृणु चैकाग्रमानसः ॥

भृगुरत्रिर्वसिष्ठश्च विश्वकर्मा मयस्तथा ।

సృష్టికర్త బ్రహ్మసృష్టించిన సకల జీవచరములలో మానవుడు అన్ని జీవులకన్న విశిష్టతను పొందియున్నాడు. అట్టిమానవుల జీవనోపాధికై పరమేశ్వరుడు విశ్వకర్మను సృష్టించినాడు. "సకలకోటిజీవానాం, జీవనంవిశ్వకర్మనః" అందువల్ల ఈ విశ్వకర్మ, విశ్వకర్మ్యం అను శిల్పశాస్త్రమును విరచించినాడు. ఈ విశ్వకర్మ సిద్ధాంతములను ముప్పదిరెండు శాస్త్రభాగములుగా, పరమేశ్వరుడు బ్రహ్మ, విష్ణు, పార్వతి, సరస్వతి, లక్ష్మి, మహాఋషులు అందరు వివరించినట్లు ఋగ్వేద యజుర్వేదములో శిల్పముగూర్చి చెప్పబడినది.

नारदो नग्नजिच्चैव विशालाक्षः पुरंदरः ॥

ब्रह्मा कुमारो नन्दीशः शैनको भर्गकवच ।
वासुदेवोऽनिरुद्धश्च तथा शुक्रबृहस्पती ॥
अष्टादशैते विख्याताः शिल्पशास्त्रोपदेशकाः ॥

(मत्स्यपुराणा अ० २५२)

పైన జెప్పిన ముప్పదిరెండు శిల్పశాస్త్ర భాగములలో ఏ పది పదహారు శాస్త్రములో, అవీగ్రంథాక్షర లిపిలో మద్రాసు రాష్ట్రమున లభించుచున్నవి. చారిత్రక నిదర్శనములబట్టి, ఈ కళలను పల్లవ చోళ, నాయక, విజయనగర, కాకతీయరాజులు పోషించునట్లు తెలియుచున్నది. ఇప్పటికి శిల్పశాస్త్రం సజీవమై వుండుటకు మధ్యకాలమున ఈ రాజులవల్ల శిల్పకళకు లభించిన ఆదరణే ముఖ్య కారణం. తమిళనాడులో చోళరాజులు భారతదేశంలో ఎక్కడా నిర్మింపబడ నంతటి ఎత్తైన (గర్భాలయముపై వచ్చునది.) 216 విమానములను తంజా వూరు, బృహదీశ్వరాలయమున కట్టించినారు. అంతకన్న ఎత్తైన ప్రాకారముపై నున్న గోపుర నిర్మాణము కావించవలెనను తలంపుతో విజయనగర సామ్రాజ్యా

ద్వారపాలకులు గరుడుడు ఒకప్రక్క, ద్వారపాలకులు ఆంజనేయులు మరోప్రక్క నిర్మాణం గావించబడినారు.

కన్యాదానం, పట్టాభిషేకం ఘట్టములలో శిల్పచాతుర్యం మహా అద్భుతంగా వుందని ప్రముఖులు కొనియాడారు.

పైన వర్ణింపబడిన కంఠమునకు మీద కపోతకపట్టిక నిర్మింపబడినది దీనిని చూడవలసినదేతప్ప వ్రాయనలవిగానంత శిల్పనైపుణ్యంతోగూడియున్నది ఈ పట్టికలో ఉత్తరం ఎటుతుకం అను భాగములున్నవి. ఈ ఎటుతుకంలో రెండుంగుళంల ఎత్తుగల అతి చిన్న శిల్పాకారం "మతశై" అనునది కొన్ని వందలు చెక్కబడినవి. వీటికిపైన కపోతక మను భాగమున్నది. ఇది మామూలు ఇంటిచూరువలె నుండి వాటి చివరమేకులు బిగించినట్లు మలచబడినది. దీనిలో ఇంకా పదమూడు పద్మదళములు–అష్టదిక్పాలురు అష్టలక్ష్మి, గరుడుడు, మహనాసికలు చెక్కబడినవి.

పత్రోపపీఠము నధిష్ఠించుటకుగల మెట్టుప్రక్కల రెండు చిన్న ఏనుగులు నిర్మించబడినవి. ఈ మెట్లలోను రకరకముల బొమ్మలు చెక్కబడినవి. మొదటి మెట్టుపై 30 కొలాటస్త్రీలు, రెండవదానిపై హంసలు, మూడవమెట్టుపై వృషభకుంజరం (ఒకవైపునుండి దర్శించిన వృషభాకారం, మరోవైపునుండి తిలకించిన ఏనుగాకారం కల్గియున్నట్టిది.) మరోమెట్టుపై వాద్యాయుక్తమైన భరతనాట్య భంగిమలు తీర్చిదిద్దబడినది.

పత్రోప పీఠముపైన పద్మాసనము, 9 టన్నుల బరువుగల ఏకశిలపై చెక్కబడినవి. దీనిచుట్టు ఎనిమిదితలములున్నవి. వీనిమీద శ్రీరామ అష్టమంగళం అను శంఖం, చక్రం, మత్స్యయుజ్మం, దర్పణం, స్వస్తికం, దీపం, పూర్ణకుంభం, శ్రీవస్తం చెక్కబడినవి.

మెరుస్తున్నట్లు మేలిమి చేయబడిన ఈ నల్లరాయి పద్మాసనముపైననే శ్రీరామకళ్యాణము జరుగును. ఈ మంటపమునకు నాల్గుమూల స్థంభములు. ఒక్కొక్కస్థంభమునకు మూడు ఉపస్థంభములు, వెరసి (16) స్థంభములున్నవి కావునదీనికి షోడస్థభ మంటపమనిపేరు.

ఇదర్యం అంసుమాన్ భేతే కాష్యపే,
స్థంభలక్షణవిధానో నామపుటలాః
అను కాష్యపం ప్రమాణంగా ఈ స్థంభములు మలచబడినవని అర్థం,

ఈ మంటపమునకు ఈశాన్య, ఆగ్నేయ, నైఋతి, వాయవ్యమూలలందు యున్న స్థంభము లీ క్రిందివిధముగా చెక్కబడినవి.

ఈశాన్యస్థంభ ఉపపీఠములోకూడ గోష్ఠాతి పంజరం, "10 ఎత్తు 3 వెడల్పుతో ఒక సంపూర్ణ ఆలయాకారము చెక్కబడినది. 100" ఎత్తునచేయ వీలగునవి 10" ఎత్తులో మలచటం ఒకవిశేషం, దీనిని చేయుటకు ఒక శిల్పికి ఒక సంవత్సరమున్నర కాలము పట్టినది. దీనిఖర్చు మూడువేలరూపాయలు. దీని పైన దిండివనంనుండి గొనితేబడ్డ పచ్చధాతురాయిని ఏకశిలతో చేయబడిన 6½' ఎత్తు 3½'' వెడల్పుగల ఈ భాగమును ఆరుగురు శిల్పులు 2 సంవత్సరముల కాలములో తయారు చేసినారు. దీని మీద పద్మపుష్పలమను, అదిష్టానమును, పద్మదళములు చెక్కబడినవి. దీని ముందు భాగమున మూడు వైపుల ముఖ పత్రములున్నవి. వీనిపై చెక్కబడిన మూడు సింహముల నోళ్ళలో అదేరాతితో చేయబడిన రాతి గుండ్లున్నవి. ఇలాచేయటం అపూర్వమని పెద్దలు శ్లాఘించారు.

ఈ సింహముల తలల ఆధారంగా మూడు ఉపస్తంభములు మలుచ బడి నవి. ఉపానాది స్థూపపర్యంతం, 7'' ఎత్తులో ఒక ఆలయాకారం చెక్కబడినది. నాగపంతం, కలశం, వీనిపై 32 కోణములతో పొడుగ్గా ఈ స్థంభములు మలుచ బడినవి. ఈ చిరు స్థంభములమీద పెద్ద మతశికలు, వానిమధ్య రాయితో చేసిన గొలుసు చెక్కబడినది.

ముఖ స్థంభములో రామదాసు కమలాదేవి, మంటపద్వారమువైపు, పశ్చిమదిశగా రుక్మిణి, సత్యభామాసమేతుడై విష్ణు, ఉప స్థంభములపై నున్నట్లే దీనిపై కూడా నాగభందం, కలశం, చెక్కబడినవి.

దీనిపై అష్టముఖ స్థంభము—నాగబంధముపై చతుర్ముఖ కుంభపంజరం అతి శోభాయాన మానంగా తొలుచబడినవి.

నాల్గు కుంభపంజరముల ఆధారముతో పై జెప్పిన అష్టతలమునకు పైన చతురస్రాకార తలములున్నవి. వీనిపై పశ్చిమాన కాళింగమర్దన, దక్షిణాన వీణా స్త్రీ కనులకింపుగా చెక్కబడినవి. ఈ ఆకృతిపై అష్టఫలకములుగల కుంభ పంజరం వానిపై నాలుగు సింహములు, గరుడలు, ఈ గరుడల తల పై భాగ మున చతురస్ర మున్నది. దక్షిణతలముపై కామధేనువు, సుదర్శన చక్రము ఒక రాతితో మలచి త్రిప్పినపుడు గుండ్రముగా తిరుగునట్లు చేయబడినది. ఇది అపూర్వ కళానైపుణ్యం.

## ఆగ్నేయస్తంభం :

ఇది ఈశాన్య స్థంభమువలెనే చెక్కబడినది కాని ఒక్కొక్క ముఖ తలముపై వేర్వేరు విగ్రహములుండటం గమనార్హం. వీనిపై పర వాసుదేవుడు ఆదిశేషునిపై కూర్చుండి శ్రీ, భూదేవిలతో గోదావరికి అభిముఖుడై వున్నట్లు ఉత్తర తలంపై రామదాసుభార్య కమలాదేవి సహితంగా, రామకళ్యాణాన్ని తిలకిస్తున్నట్టు, దీనికిపైన పశ్చిమంవైపు సుదర్శనచక్రం 18 హస్తములతో శట్కోణ మధ్యస్థముగా జ్వాలాకేశముతో అతి ఉగ్రతతో గోదావరోన్ముఖుడై వున్నట్లు చెక్కబడినది. ఉత్తరతలంపై విష్ణుస్వరూపముచుట్టూ ఆళ్వార్ స్వాములు 12 కోష్టములు, ఒకేచతురస్రముపై మలచబడినవి. ఈ విగ్రహములు 1½' ఎత్తులో చేయబడినవి. ఈశాన్య స్థంభమునకు చక్రమున్నచోట, ఈ స్థంభ మునకు చక్రమున్నది. ఈ స్థంభమునకు ఉత్తరతలంపై లక్ష్మి చెలికత్తెలలో నున్నట్లు మనోహరంగా చెక్కబడినవి.

వెనుకవైపు స్థంభములు—నైఋతి స్థంభములో చెక్కడములు పై స్తంభ ముల మాదిరేవుండి 32 కోణములకు బదులుగా 8 కోణములు మాత్రమే కల్గి యున్నవి. వీనిపై ఆయాతలములపై చెక్కబడిన విగ్రహములువేరు. స్థంభం అడుగు భాగమున ఉత్తరంవైపు వేణుగోపాలుని పాదమును గోవు, లాలిస్తున్నట్లు మలచబడినది. మధ్యతలంలో ద్విభుజ వేణుగోపాలుడు గోమాత సహితంగా మరియు, పైతలంలో వటపత్రశాయి తొలుచబడినవి. ఈ స్థంభం తూర్పువైపు క్రింది భాగంలో హరనారాయణుడు, (కుడివైపు ఈశ్వరుడు, ఎడంవైపు నారాయణమూర్తి) మధ్యతంలపై వీణాపాణి సరస్వతి, పైతలంపై పంచ వాద్యములు చెక్కటంలో శిల్పులు తమ ప్రతిభను వెల్లడించారు.

## వాయవ్య స్థంభము :

ఈ స్థంభము మిగతా స్థంభములవలెనే నుండి దీనిపై దక్షిణతలంపై కాళింగమర్దన, దీనికిపైన రాధాకృష్ణులు, రుక్మిణి దీనికిపైన దనుర్బాణములు తూర్పువైపు హంసవాహనములు, బ్రహ్మ, సావిత్రి. సరస్వతీ సమేతులై వున్నట్లును పైతలంపై పంచముఖి బ్రహ్మ విగ్రహములు చెక్కబడినవి.

## ఈశాన్య స్థంభము :

ఈ స్థంభముపై బోధిక అనుభాగమున్నది. దీనికి పశ్చిమ, దక్షిణ భాగములలో అరటిపూవు ఆకృతి 32 కోణములలో తొలుచబడినది. సుమారు 50 రింగుల రాతిగొలుసుల మధ్య గోపాలుడు ఊయల లూగుతున్నట్లు చెక్కారు. దక్షిణంవైపు 10 రింగుల గొలుసులు మాత్రమే వున్నది. ఉపస్థంభముపైన గోపానధారి విగ్రహములు 8 చెక్కటం జరిగినది.

ఆగ్నేయస్థంభముపైనున్న విధముగానేవుండి భోధికును వుపస్థంభమునకు మధ్య మూడు రాతి బంతులు తిరుగునట్టు రాతికడ్డీల దోనిలో అమర్చబడినవి. పశ్చిమంవైపు ఒక చిన్నరాతికడ్డీ దానికి-గాజులమాదిరి చెక్కబడినవి. పైస్థంభ ములకు గొలుసులున్నచోట నైఋతి వాయవ్యస్థంభములకు సర్పములు చెక్క బడినది.

బోధికపై నాల్గు నిటారు స్థంభములు అడ్డంగావేయబడి, వీని అడుగు భాగమున అనేక లతలు, దీనిపైనుండి ప్రక్కలకు చూరువలె (చఢభః) దించబడి, దీనిలో అనేక పద్మదళములు మలచటం జరిగినవి. ఈశాన్యంవైపు నాల్గు అంగుళాల పొడవున 50 రింగుల గొలుసు దాని చివర ఓంకారం, ఆగ్నేయ మూల అదేమాదిరి గొలుసుకు గంట, నైఋతిమూల గొలుసుకు శంఖం, వాయవ్య దిశ గొలుసుకు చక్రం చెక్కటం జరిగినది. ఈ అడ్డ స్తంభములపై కప్పు వేయబడినది. దీనికి లోపలిభాగమున మధ్య స్థంభమందు 12 కోష్టములలో మేషాదీమీనరాశుల స్వరూపములు తొలుచబడి సరిగా దీని క్రింద పద్మాసనము అమర్చబడినది.

ఈ కప్పుపైన వ్యాళమను భాగమున్నది. దీనికి నాలుగు మూలలు. 8 మకరములు చెక్కబడినవి. దీనితో కళ్యాణమంటపం రాతి పని ముగిసినది.

దీనిపైన సార్వగామ్యం ప్రమాణముగా సూళహర్మ్యం విమానం సిమెంటుతో చేయబడినది. శిఖరము విష్ణుకాంత స్వరూపముగా 8 తలములతో నిర్మింప బడినది. దీనిలోకూడా కోష్ఠాదిపంజరం, చత్రనాసి, మహానాసి, అల్పనాసి అను నాసిరూపభేదములు చేయబడినవి.

తూర్పు (ముందు) భాగమున శ్రీ భద్రాద్రి చతుర్భుజరాముడు సీతాదేవికి తలంబ్రాలు పోస్తున్నట్లు, దశరథుడు ముగ్గురు భార్యలయుక్తంగా, సతీసమేతంగా జనకుడు, లక్ష్మణ భరతశత్రుఘ్నులు, వాద్యబృందము, విశ్వామిత్ర మహాఋషి ఇత్యాది విగ్రహములున్నవి. నాలుగు మూలలందు హన్మంతుని విగ్రహము లున్నవి. దక్షిణంవైపు రామదాసు భార్య సమేతంగా, కళ్యాణం తిలకించవెళ్తున్నట్లున్న దృశ్యం. భద్రమహాఋషికి మోక్షం లభిస్తున్నట్లున్న దృశ్యం మొదలగునవి కాననగును.

పశ్చిమంవైపు గీతోపదేశం, చతుర్భుజ వేణుగోపాలుడు, సత్యభామ రుక్మిణి, కాళింగమర్ధన, అహల్యా శాపవిమోచనం, విగ్రహాలున్నవి. ఉత్తరం వైపు పర్ణశాల, పరవాసుదేవనీ, వాల్మీకి ప్రథమ అంతస్తులోనున్నవి. రెండవ అంతస్తులో ముందువరుసలో శేషశయనం, నాల్గు గరుడులు దక్షిణంవైపు ఉమామహేశ్వరుడు, వెనుకవైపు లక్ష్మీనృసింహుడు ఉత్తరదిశయందు బ్రహ్మ అష్టదిక్పాలుర విగ్రహములున్నవి.

18 హస్తములతో షట్చక్ర మధ్యంలో అరికోపావేశ భయంకరజ్వాలా కేశములతో ప్రభామండలము మధ్యమున సుదర్శనచక్రం పంచలోహములతో తయారు చేయబడినది. దీనిని కళ్యాణమండపముపై ప్రతిష్టించెదరు. దీనిచుట్టు 250′ పొడవు 100′ వెడల్పు దళవరుస చేసినారు. దీనికి ఉత్తర దక్షిణ దిశల ననుసరించి 200′, 500′ 200′ వెనక పొడవుతో ప్రదర్శక మందిరం (Auditorium) నిర్మించు ప్రణాళిక తయారు చేయబడినది. ఈ కళ్యాణమంటపం దేవాలయమునకుత్తరమున పూర్వమున్నచోటనే నిర్మింపబడినది.

## గర్భాలయము :

భద్రాద్రిక్షేత్ర నూతన గర్భాలయం నిర్మించుటకు సముద్ధరణ సంఘం. 1962 మే 4 న తీర్మానించినది. ఆ గర్భాలయం మహోన్నత శిల్పసంపద కల్గియుండాలని నిర్దేశించబడినది. కట్టడమంతా రాతితోనేకాని సిమెంటుతో కట్ట

రాదని నిర్ణయించారు. ఇంకా పాంచరాత్రాహ మానుసారముగా నిర్మింపవలెనని, పండితులు సూచించారు. పాంచరాత్ర ఆహమసంహితలు 108 లో, 15—16 శాస్త్రములు మాత్రమే శిల్పశాస్త్రమునుండి స్వీకరించినారు.

శైవాహమం, వైదీకం, పాంచరాత్రం వైగానసం, అను నాల్గువిధము లైన పూజావిధానములలో పాంచరాత్రానుసార పూజావిధానము ఈ క్షేత్రంలో నిత్యం జరుపబడుచున్నది. కావున ఈ ఆలయమునకు పాంచరాత్రాహ మనం ప్రధానంగా తీసుకోవలసి వచ్చినది. పాంచరాత్రాహమనానికి తమిళనాడులోని శ్రీరంగక్షేత్రం ప్రధానమైనది. భద్రాద్రిలోని పండితులు పాంచరాత్రాహమం క్షుణ్ణంగా తెలిసినవారేకాక దీనికి సంబంధించిన కొన్ని శాస్త్రగ్రంధాలను అచ్చు వేయించినారు. కావున ఈక్షేత్రమునకు శ్రీరంగక్షేత్రమునకున్నంత ప్రాధాన్యత వున్నది.

పాంచరాత్రాహమ శాస్త్రానుసారముగా విశ్వకర్మ్యం, కాశ్యపం, మను సారం, బ్రాహ్మ్యం, నారాయణీయం అను శిల్పశాస్త్రముల ఆధారంగా ప్రస్తుత గర్భాలయపు పునర్నిర్మాణం జరుగుచున్నది.

ఇచ్చట భద్రాద్రి చతుర్భుజ రాముని మూర్తులు బింబప్రాసాదమని లింగ ప్రాసాదమని రెండు విధములుగా నున్నవి.

కాశ్యపశిల్పేలింగ ప్రాసాదః, బింబప్రాసాదః,
లక్షణ విధానే నామపటలాః,

శివలింగం స్వయంభుగా వుండుటచే దాన్ని కదిలించకుండా దానిప్రమాణంగా, విగ్రహాన్ననుసరించి, దేవాలయం నిర్మించటం జరుగుచున్నది, అదే విధముగా బింబప్రాసాదం స్వయంభూమూర్తి కావున దానిప్రమాణంగా ఆలయం పూర్వపు కొలతలతో నిర్మాణం ప్రారంభించబడినది.

శంఖుస్థాపనకు పూర్వం దిక్సూచిచే పరీక్షించి, ఆలయనిర్మాణం ప్రారంభించబడినది. దీనిని కంచికామకోటి జగద్గురు ఆజ్ఞానుసారంగా శ్రీ లక్కినేని నర్సయ్యగారు ప్రారంభం చేసినారు. శిలాసంగ్రహం" అను శిల్పశాస్త్ర అధ్యాయములో శిలలను తీయటం, శిలలగుణదోషములు, ఉపయోగం ఇత్యాదులు చెప్పబడినవి. దీనిననుసరించి ఈ ప్రాంతంలో రాయికై వెదికి ఇచ్చటికి

22 మైళ్ళదూరములోనున్న పర్ణశాల దాపుననున్న రామకొండ, లక్ష్మణకొండ నుండి కావలసిన మంచి రాయి తేబడినది. ఈ రాయిలో స్త్రీరాయి, పురుషరాయి నపుంసక రాయిలను మూడువిధములున్నవి. ఇవి ఒక్కొక్కచోట వేర్వేరుగా ఉపయోగపడును. ఈ రాయినిమిత్తం అక్వారీలో సుమారు 150 మంది శిల్పులు పనిచేసినారు. కొన్ని వేల ఘనపుటడుగుల రాయితో పనిప్రారంభించ బడినది. ఆ క్వారీలో పని జరుగుచుండగా రాగిణిపేట క్వారినుండి. 60. 70. శిల్పులతో వేరురాయికొని తేబడినది.

ఈ రాయితో గర్భగృహం ముఖమండపం, మరియు మహామండపం విమానం, పర్ణశాలరాయితో చేయబడుచున్నవి. గర్భగృహం, అంతరాళం, ముఖమండపం, మహామంటపం ఇవన్నీ ఒకేవరుసలో నున్నవి.

ఉపపీఠము :

## प्रतिसुन्दर उपपीठम्

द्विभागं पातुकोत्सेधं द्विभागं पङ्कजोदयम् ।
कम्पमेकेन कर्तव्यमेकेनान्तरितं भवेत् ॥
द्विभागं प्रतितुङ्गं तु एकेनैव तु वाजनम् ।
अष्टांशं गलमानं तु कम्पमेकेन कारयेत् ॥
अब्जमेकेन कर्तव्यं कपोतोच्चं गुणांशकम् ।
एकेन लिङ्गमेकेनातरितं तु प्रकल्पयेत् ॥
प्रतितुङ्गं द्विभागेन वाजनं चैकभागया ।
सप्तविंशतिभागेन नाम्मतः प्रतिसुन्दरम् ॥

(काश्यपशिल्प पञ्चमः पटलः)

దీనికి ప్రతిసుందరమని పేరు. చోళవంశపు రాజుల కాలంలో తాంచు, తారాసులం, చిదంబరం, అను ప్రదేశములలో కాకతీయుల కాలంలోను, ఈ ఉపపీఠము చేసినారే తప్ప, ఇటీవలి కాలములో ఇలాంటివి చేయబడలేదు. ఇందులో అనేక పద్మదళములు, 600 యాళమలు, మకరములు, అనేక కుడ్య స్థంభములు, వాటిపైన కపోతక పట్టిక, ఆలింకం, అందరీప్రధీవాచనం, చెక్క బడియున్నవి. ఒక్కొక్క స్థంభములో అనేక యాళులు, మహనాసిలు, నాసి కూటములు, చెక్కబడినవి.

అధిష్టానము :

## पुष्पपुष्कल अधिष्टानम्

एकोनविंशदंशं तु तलोत्सेधं विभाजिते ॥
उपानमेकभागेन अब्जोच्चमनलांशकम् ।
कम्पोच्चं मध्यभागेन जगत्युच्चं युगांशकम् ॥
अम्बुजं त्वर्धभागेन दलमर्धांशमानतः ।
अर्धांशं पद्मतुङ्गं तु गुणांशं पट्टमानतः ॥
पद्मं मध्यांशमानेन तत्समं कम्पमुच्यते ।
अत्यर्धांशं तु खण्डोच्चं कम्पमन्येन कारयेत् ॥
पद्ममन्येन कर्तव्यं पट्टिकासार्धभागया ।
अम्बुजं सार्धभागेन कम्पमध्येन कारयेत् ॥
पुष्पपुष्कलमाख्यातं पादबन्धे तु मेदिनम् ।

(काश्यपशिल्पे षष्ठः पटलः)

దీనికి పుష్ప పుష్కళమని పేరు. దీనిలో ఉపానం పద్మజగతి, అలం కారజగతి, కుముదం, త్రివట్ట కుముదం, పట్టిక చెక్కబడినవి. పత్రోపపత్ర ములలో (యందుపత్రపు) కర్ణకూటం, అహరై ముఖశాల, ముఖపత్ర భేదా భేదములు చెక్కటం జరిగినది. ఈ అదిష్టానములో పద్మజగతి భాగమునుండి సోమసూత్రనాళస్థాపన ఒకేరాయిలో శిల్పాభిమానులను ఆకర్షించేటట్లు తొలుచ బడినవి. అభిషేకము చేయబడిన నీరు, గోముఖమునుండి, సింహ ముఖ ములనుండి వచ్చునట్లు చెక్కబడినది. ఇంకా అనేక పద్మకోణములు గల్గిన ఈ అధిష్టానమును ఒక చిలుక మోస్తున్నట్లు చూపరులకు కానవగును.

స్థంభవర్గము :

5' ఎత్తులో స్థంభం, స్థంభభూషణం, పంచరం, పదిమంది అప్సరస స్త్రీలు, కర్ణకూడ భాగములు చెక్కబడినవి. సుమారు 3' ఎత్తులో చామర కన్యగా, వీణా వాయించినట్లు, మరికొన్ని లతలు పట్టుకున్నట్లు, కొన్ని చిల కలు పట్టుకొన్నట్లు, నానా విధములైన స్త్రీ విగ్రహములు చెక్కబడినవి. దీనికి మొత్తం 108 స్థంభములున్నవి. మహామండప అంతరాళమను భాగములో, కుంభ పంజరమను ఒక అద్భుతశిల్పం తయారుచేయబడినది. గర్భగృహ అంతరాళంలో నానావిధ లతలను చెక్కిన కిటికీ పొందుపరుచబడినది.

ప్రస్థరము :

ఉత్తరం, ఎటుతగం, వీటిపైన కపోతకం అను భాగములు చెక్కబడి నవి. వీనిలో మహానాసి కిన్నెరాది దేవతలు, మకరములు, మహామంటపద్వార మందు, మహాలక్ష్మి, గజలక్ష్మి స్వరూపములు మలుచబడినవి. మహామంటప ద్వారంలో, గర్భగృహ, ముఖమంటప, మహామంటపద్వారములు మొత్తం 5 ద్వారములున్నవి. ప్రతి ద్వారమున కిద్దరు ద్వారపాలకులు, ముందు ద్వార ములో 7' ఎత్తుగల బ్రహ్మాండమైన రెండు ద్వారపాలకుల విగ్రహములున్నవి. మహామండపము ఉత్తర, దక్షిణ ద్వారముల కిరుప్రక్కల రెండు ఏనుగులు, ప్రథమద్వారములో కోణార్క సూర్యరథం అశ్వములు లాగుతున్నట్లు చక్రం చెక్కబడినది. మహామంటపంలో నాల్గు స్థంభములున్నవి. అందులో అష్టలక్ష్మి 2½' ఎత్తులో నిర్మించబడినది. ఈ స్థంభములకు చిత్రకంఠ స్థంభములని పేరు. ఇది 16 పలకలుగా చేయబడినవి. వానిపై 24 విష్ణుభేదములు, 12 ఆళ్వారులు, 18 శివమూర్తులు, దశావతారములు చెక్కబడినవి. దీనిపై బోధిక అను భాగము దానిపై స్థూపములు అడ్డముగా వేయబడి దానిలో రాతి కిటికీలు మలచబడి కప్పు వేయబడినది. దీనిపై ద్వాదశ రాశిచక్రములు, మధ్యములో కమలములు, దానిలో నాల్గు రాతిగొలుసులు వాటికంటుకొని అదే రాయిలో ఓంకారము వ్రేలాడదీసినట్లు బహు సుందరముగా చెక్కబడినది.

ప్రతిద్వారమునకు చిన్నగజలక్ష్మి, ముందు ద్వారంలో ఇద్దరు అప్సరసలు తలపట్టుకొన్నట్లు విచిత్రముగా చెక్కబడినది.

ఉపానాది స్థూపపర్యంతం 32' రాయిలో విమానములు చేయనున్నవి. ఈ విమానం సార్వకామిక లక్షణానుసారముగా ఈక్రింది శాస్త్రాధారముగా ఎత్తుగా నిర్మింపబడుతున్నది.

## वितलम्

प्रसादस्य तु तुङ्गेन षडष्टांशविभाजिते ।
अधिष्ठानयुगांशं तु वस्वंशं चरणायतम् ॥

पञ्चमानं तु वेदांशं तलीपं सार्धसप्तकम् ।
सार्धत्रिभागमञ्चोर्ध्वे सप्तांशं चरणायतम् ॥

प्रस्तरोच्चं गुणांशं तु शिवांशं वेदिकोदयम् ।
द्विभागं गलमानं तु रसांशं शिखरोदयम् ॥
द्विभागं तु शिखामानमेवं स्यात्सर्वदेशिकम् ।
(इति काश्यपशिल्पे त्रितलविधानं नामैकोनत्रिंशः पटलः)

ఈ శిఖరమునకు విష్ణుకాంతమను పేరుకలదు. దీనికి మూడు అంతస్తులు ఉన్నవి. నారాయణుని శిల్పశాస్త్రం ఎక్కువగా విమాన నిర్మాణంలో ఉపయోగింపబడినది. కూడకోష్టాది పంచరం. మహనాసి, అల్పనాసి, చుత్రనాసి, స్థంభ వర్గములు, కంఠములు, అన్నియు తంజావూరు బృహదీశ్వరాలయములో ఏకశిలతో నిర్మించినారు. అల్లె ఇచ్చటకూడా పర్ణశాలనుండి తేబడిన 36 టన్నుల రాయిపై ఏకశిలపై శిఖరము పని చురుకుగా సాగుతున్నది. ఈలాంటి శిఖరము భారత దేశములో ఒక్కటి మాత్ర మేనున్నది. దానిపై పద్మాకారపురాయి. దానిపై రామదాసు ప్రతిష్టించిన పూర్వపు సుదర్శనచక్రం ప్రతిష్టించబడును. ఈ గర్భాలయంయొక్క నిర్మాణం. చోళ. కాకతీయ, నాయకరాజుల తర్వాత, ఇదే గొప్ప నిర్మాణం అవుతుంది.

విమానములో దేవతావిగ్రహములన్నియు చెక్కబడుతున్నవి. ద్వాదశ విష్ణు, ఆంజనేయులు, 4 గరుడులు. 4 సింహములు, 8 బ్రహ్మ, విష్ణు, ఈశ్వరుడు ఇంద్రాది దేవతల అష్టదిక్పాలుర మరియు మహామంటపము నాల్గు మూలలు నాల్గు గరుడులు, సింహముల చెక్కేపని చురుకుగా సాగుతున్నది.

చిత్రకూట మంటపము:

ఈ మంటపము సుమారు 127′ పొడవు 60′ వెడల్పుతో నిర్మించబడుతున్నది. దీనికి చిత్రకంఠ స్థంభములను 24 స్థంభములు దానిముందు 8 అనివెట్టి స్థంభములు, 36 టన్నుల ఒకేరాయితో చెక్కబడిన 8′ ఎత్తుగల విగ్రహములు బ్రహ్మాండముగా చెక్కబడుతున్నవి. అనివెట్టి స్థంభములపై భోదిక, సింహములు అనేకవర్గములు మలచబడ్తున్నవి. ఈ మంటపములోనున్న చిత్రకంఠస్థంభములో అనేక విష్ణురూప బేదములు, విష్ణుభక్తుల విగ్రహాలు చెక్కటం జరుగుతున్నది. ఈ మంటపానికి ముందుభాగంలో సింహస్థంభములతో మూడు అంతస్తులుగల విమానం, గోదనాసుకొని అపూర్వంగా నిర్మింపబడుతున్నది. వాల్మీకి, సరస్వతీ నారదుల విగ్రహములు ప్రతిష్టింపబడుతున్నవి. ఈ మంటపలోపలిభాగంలో

వాల్మీకి రామాయణంనుండి 100 శ్లోకములు నాగరిలిపిలో వ్రాసి తత్సంబంధమైన చిత్రములు చెక్కబడుతున్నవి. భక్తులు శ్రీరామ దర్శనానంతరం రామాయణ చిత్రదర్శనం చేసుకొనే వీలుకలుగునట్లు చక్కని శిల్పసంపదతో చిత్రకూట నిర్మాణం జరుపబడుతున్నది. ఇంతేగాక ఈ మంటపము పెద్దహాలువలె నుండుట వలన ఇతరత్రా ఉపన్యాసములు, హరికథాకాలక్షేపములు తదితర కార్యక్రమాలు నిర్వహించుటకు వీలుఉండగలదు. దీనిలోని స్థంభములు మధురై, సుచీంద్రం, హంపీలలోనున్నట్లు శబ్దస్వరస్థంభములవలె ఏర్పాటు చేయబడుతున్నవి.

## రామదాసు ధ్యానమందిరము :

ఈ రామదాసుధ్యానమందిరం దేవాలయానికి దక్షిణముననున్న రంగనాయకుల గుట్టపై కట్టబడుతున్నది. దీని నిర్మాణము కాంక్రీటు, సిమెంటు, రాయితో జరుగుచున్నది. ఇది శిల్పశోభాయమునైన గోపురములతో నిర్మింపబడుచున్నది. దీనిలో 6′ ఎత్తుగల పచ్చధాతు రాయితో చేయబడుతున్న రామదాసు విగ్రహం ప్రతిష్ఠించెదరు. ఈ మందిరం లోపలి గోడలయందు రామదాసు కీర్తనలు, ధ్యానమునకు వీలుగా, ఆరాధనాత్మక సంబంధమైనపుస్తకములు ఉంచుటకు వీలుకలుగునట్లు, పఠనయోగ్యంగా నిర్మించబడుచున్నది.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం. భద్రాద్రిదేవాలయసముద్ధరణ సంఘం దేవాలయ సముద్ధరణకు నడుంకట్టినందులకు అభినందించక తప్పదు. భద్రాద్రిదేవాలయము భారతదేశంలోని ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్‌లోని పుణ్యక్షేత్రాలలో ఒకటి దేవాలయ పునరుద్ధరణ కార్యక్రమమంతా మే మొనరించు శిల్పకళానైపుణ్యంమీద ఆధారపడి వుంది. భద్రాద్రి సీతారామాలయము మహోన్నతమైన శిల్పకళతో విరాజిల్లాలనే సదాశయంతో మా శక్తి వంచనలేకుండా కృషి చేస్తున్నాము. "ఇందుగల డందులేడని" అన్నట్లు ఆ భగవంతుడు ఈ రాళ్లలోకూడా సాక్షాత్కరించి మా వూహలకు, చేతులకు మరింత బలంచేకూర్చి మా ఆశయాన్ని ప్రతిఫలింప చేస్తాడని నమ్ముతున్నాము.



# భద్రాచలము—రామదాసు

— ఉభయభాషాప్రవీణ హరిరాధాకృష్ణమూర్తి, P. O. L.

భద్రాచలమువేఱు - రామదాసువేఱు. ఈ యిద్దఱికి అవినాభావ సంబంధ మేర్పడి భద్రాచల రామదాసని ఒకానొక పౌరుషనామ మేర్పడినది. ఈ బాంధ వ్యము నొకించుక విచారింతము.

భద్రుఁడొకానొక అచలము. ఇదిమన ఆంధ్రావనియందు గౌతమీనదీ తీరమందున్నది. ఇది దండకారణ్య మధ్యమందున్నది. ఈ పర్వతజనన వృత్తాం తము బ్రహ్మాండ పురాణమందిట్లు చెప్పబడియున్నది.

భూగోళమున కక్షమువంటిది మేరుపర్వతము. ఆ అచలము తన భార్య యగు మేనకతో సంతానార్థియై బ్రహ్మనుపాసించి యతని యనుగ్రహ విశేషంబున ఆత్మారామునుపాసించు భద్రుని కుమారునిగా గాంచెను. ఇక్ష్వాకుఁడగు రామ చంద్రుఁడు తండ్రియగు దశరథుని యాజ్ఞచే సీతాలక్ష్మణ సమేతుఁడై దండకా రణ్యమున సంచరించుచు మార్గాయాసంబున నీపర్వత శిఖరంబున విశ్రమించెను. మార్గాయాస ముపశమించెను. అంతట రామచంద్రుడానంద భరితుఁడై వరము గోరుకొమ్మనిన భద్రుఁడు వారిముగ్గురను తనశిరంబుపై సుస్థిరముగా నివసింపు డని కోరుకొనెను. రామచంద్రుఁడు కలియుగంబున నట్లే నివసింతునని వర మొసగెను. కల్పాంతమున భద్రునికా గిరిరూపము నశించి ముక్తి కలుగునని కూడ వరమొసఁగెను. తత్ప్రకారముగా సీతారామ లక్ష్మణులీపర్వత శిఖరమున నివసించిరి. ఇది భద్రునికథ.

ఒకా నొక క్షేత్రమునకు తీర్థమునకుగల దివ్యత్వము గుఱుతించుట మన సంస్కృతి. అది యితర మతస్థుల దృష్టిలో అప్రత్యక్షము. ఆప్తవాక్య ప్రమా ణము, మనదేశమందది యిట్టిదికాదు. ప్రత్యక్షము దానికాధారముగ తాను గతి కమే కాకుండ 'వ్యాసోనారాయణోహరిః' అని మనము విశ్వసించు వ్యాసునిచే విరచితములైన అష్టాదశ మహాపురాణములు. ఇంతమాత్రమేకాదు. అపౌరు షేయమగు వేదముకూడ నెక్కడో యొకచోట యీ దివ్య తత్త్వము నుగ్గడించు

చున్నది. ఇంతకంటె ప్రామాణ్యమేమి కావలయును ? ఈ గిరి ప్రదక్షిణంబు కావించువారలకు నిర్మల జ్ఞానసంపన్నత్వము కలుగునట. ఇట సీతారామోత్సవ మాచరించినవారలకు అఖండైశ్వర్యము కలుగునట. ఈగౌతమి, మనము దీని నిప్పుడు గోదావరి యని పిలుచుచున్నాము. దక్షిణ గంగయని ప్రశస్తివహించి నది. పోతనామాత్యుఁడు ఆంధ్ర మహాభాగవత రచనోపోద్ఘాతమున పేర్కొనిన దక్షిణ గంగ యీ గోదావరీనదియే. ఆయనకు దర్శనమిచ్చినవాడీ రామచంద్ర మూర్తియే. 'పలికించెడివాడు రామభద్రుఁడ'ని స్తుతింపబడిన వాడితడే.

ఇక రామదాసు ప్రస్తుతపు ఖమ్మముజిల్లాలో నేలకొండపల్లియను గ్రామ మున్నది. అందు కంచర్లవారి వంశమున 'గోపన్న' అను నొకప్రజ్ఞాశాలి యుదయించెను. అతడు గోలకొండ సామ్రాజ్యమును తీర్చిదిద్దిన మంత్రి సత్తములగు అక్కన్న మాదన్నలకు మేనల్లుడని ప్రసిద్ధి. బాంధవ్యవిషయ మెట్లున్నను గోపన్న గొప్ప రాజకీయ ప్రతిభాశాలి. గోల్కొండ నవాబు తానీషాచే భద్రాచలమునకు తాహశీల్దారుగా నియమితుడయ్యెను. మొదటి నుండియు నతడు శ్రీరామచంద్రుని భక్తుఁడు.

భక్తికికూడ ఒకానొక నిమిత్తముండునని కృష్ణపరమాత్మ గీతాశాస్త్రమున ప్రవచించెను. 'చతుర్విధాభజంతే మాం జనాస్సుకృతినోర్జున, ఆర్తోజిజ్ఞాసు రర్థార్థీజ్ఞానీచ భరతర్షభ' అని. ఆర్తుడు అనగా నేదేని ఆపదయందు తగుల్కొనిన వాడు. మోక్షార్థి, ద్రవ్యాగమన మపేక్షించువాడు, జ్ఞానసంపన్నుడు భక్తు లయ్యెదరు. భక్తిమార్గమపేక్షింతురు. ఎందువలన ననగనిది ఉపేయమును పొందుటకు దగ్గఱ ఉపాయమార్గము.

గోపన్న ఈ నాల్గునిమిత్తములకు జెందిన భక్తుడుగాడు. సాత్త్వికభక్తుఁడు. సంప్రదాయసిద్ధమైనభక్తి యాతని యందు మొదటినుండియు కలదు. గోదావరియందు స్నానమాడుట, రామచంద్రమూర్తిని సేవించుట, అతిథి అభ్యాగతులనాదరించుట అతని నిత్యకృత్య వ్యవహారములు. శ్రీరామచంద్రు డాతని దృష్టిలో నొకానొక శిలామూర్తికాదు. ప్రత్యక్షావతారమూర్తి, మన సంప్రదాయము కూడ 'మంత్రేతీర్థేద్విజే దైవే దైవజ్ఞే భేషజేగురౌ, యాదృశీ భావనాతత్రసిద్ధిర్భవతి తాదృశీ' అని చెప్పుచున్నది. అనగా మంత్రమునందు తీర్థమునందు బ్రాహ్మణునియందు దేవాయ తనమందలి దైవమునందు జ్యోతి



అద్భుత శిల్పకళా నైపుణ్యంతో
నూతనంగా నిర్మించబడిన కళ్యాణ మంటపము.

ష్కునియందు వైద్యునియందు గురువునందు తన హృదయభావనమెట్లుండునో అట్టిదియే తనకు ఫలములభించును. ఈ వైద్యునితో తనకు స్వస్థతచేకూరు ననుకొనిన అతడిచ్చిన మట్టి అమృతతుల్యమగు నౌషధమగును. 'వీని బొంద వీనికేమి చేతవగునను కొనిన అతడమృత మిచ్చినను వ్యర్థమగును. అట్లే ఈదేవాలయమూర్తి సాక్షాత్పరమేశ్వరుని అర్చావతారమనుకొనిన అట్టి భగవ దనుగ్రహము లభించును. కేవలము శిలామూర్తియనుకొనిన ఫలము శిలా సదృశము. గోపన్నభక్తి అతిగాఢమైనది. అంతరాంతరములని గూఢమైనదై వెలికివచ్చి పరాకాష్ఠనందినది. అతని దృష్టిలో రామచంద్రుఁడు. 'ఎంతో మహానుభావుఁడు అతడెంతో చక్కని దేవుడు. లోకమునందలి వింత లనన్నిటిని చేసినవాడు అనేకావతారములలో ననేకుల కడతేర్చినవాడు' ఈ భావముతో నతడాస్వామిని సేవించినవాడు. అంతమాత్రమేకాదు. శ్రీరాముడు సర్వసమర్థుడని అతని అభిప్రాయము. ఒకప్పుడతని పుత్రుడు అన్నదానము జరుగుచున్న సమయమున నడయాడుచు ప్రాకిపోయి గంజిగుంట యందుపడి స్మృతిరహితుడయ్యెను. అతడవంచల భక్తియుక్తుఁడై ఆపిల్లవానిని భుజముపై నిడుకొని రామచంద్రుని యెదుట 'ఏ బుద్ధి వీడు ఎఱుగనివాడు పాపడు వీడు బడలియున్నాడు. పాపనిలేపి ప్రజలను గల్పి ఆ పదబాపి అటు ప్రేమ చూపు' మని వేడికొని రామానుగ్రహము బడసినవాడు.

భగవదనుగ్రహమువలన గలుగునట్టి సిద్ధియేమో చాలమందిభక్తులకు తెలియదు. తమకదికావలయునిది కావలయునని ధారావాహికముగా కోర్కెల కోరుకొనుట, సిద్ధించిన సంతసించుట. లేకున్నభగవంతుని తూలనాడుట ఈమాత్రమే తెలియును. గోపన్నకోరినదట్టి ఫలముకాదు. పరమసాత్త్వికమగు భక్తితో శ్రీరామచంద్రుని నిష్కామముగా సేవించిన వాడగుటచే అతనికి త్యాగబుద్ధి అలవడినది. తీర్థయాత్రల రహస్యమిది జన్మసాఫల్య రహస్యమిది. ఎన్ని సత్కార్యములు చేసినను ఎవనికి త్యాగబుద్ధి అలవడకుండునో అతని కృత్యములు ఫలవంతములు కానివని విస్పష్టము.

అతనికి దేవాలయ జీర్ణోద్ధారణము, విమానమంటపాదుల ప్రతిష్ఠలు గావించి అందు సీతారామలక్ష్మణులు కులుకుచున్న తానానందింపవలెనని కలిగినది.

'పోయ్యేటప్పుడు వెంటరాదుగా పుచ్చినవక్కైన, వెయ్యారులు దాచు కొనియు నర్థులకియ్యలేని లోభులకయ్యయ్యో' అనితోచినది. ఈ త్యాగము తన పుత్రమిత్రకళత్రాదులయందు వినియోగింపరాదా అనిన౯ తలతురువారలు పశుసుతాదులు తమవని భ్రమిసేరు. తనవారెక్కడ తానెక్కడనో! తనువు విడిచిన జీవుడొంటియా' అనెడు భావము కలిగినది. ఇదే శంకరభగవత్పాదులు 'కాతేకాన్తా కస్తేపుత్రః సంసారోయమతీవ విచిత్రః, కస్త్వం? కుత ఆయాతః మనసి విచింతయవారమ్ వారమ్' అని ఉపదేశించినది నీవు మురియునట్టి భార్య ఎవతె? నీవు ప్రేమించు పుత్త్రిదెవ్వడు? అసలు నీవెవ్వడవు? ఎక్కడ నుండి వచ్చితివి? ఇది విచారించుకొనుము, అని చెప్పబడినది. ప్రశ్నమాత్రమే పుట్టి యూరకొనలేదు. సమాధానము వేఱొకచోట చెప్పబడినది. 'ఇదంకాష్ఠ మిదం కాష్ఠం నదీతీరేన సంగమమ్, సంయోగశ్చ వియోగశ్చ కాతత్ర పరివేదనా' ఒకనదియందు వెల్లువ ప్రవహించుచున్నది. ఒడ్డుననున్న ఒకచెట్టు పెల్లగిలి ప్రవాహమున పడినది. కొంతదూరముపోయిన పిమ్మట వేఱొకవృక్షము పెల్లగిలి మఱల ప్రవాహమున బడినది. ఈ రెండుచెట్లు కలిసి కొంతదూరము పయనించి నవి. ప్రవాహము రెండుపాయలైనది. రెండుచెట్లు చెరియొకపాయను పొందినవి. ఈ సంయోగవియోగములకు విచారింపవలసిన పనియేమి? ఈ సమాధానముతో సంసారవృక్షము, సమూలముగా కాకపోయినా, కొమ్మలు నరుకబడినవి. ఈజ్ఞానము గోపన్న హృదయమున దృఢముగాకలిగినది. తానొక తహశీల్దారు. తన గ్రామాదులందు శిస్తుదస్తులు వసూలుచేయు అధికారము తనకున్నది. తన అధికారమును న్యాయముగా వినియోగించుకొని ప్రభుత్వమునకు రావలసిన దానిని వసూలుచేసినాడు. తానాసొమ్మును ప్రభుత్వమునకు బంపవలయును. అనగా గోల్కొండ తానీషాగారికి బంపవలయును. అది తన విధ్యుక్తధర్మము. కాని రాముని యందలిభక్తి సంసారమునందు విరాగము అతని ధర్మాతిక్రమణకు త్రోవ తీసినది. 'బ్రహ్మసత్యమ్ జగన్మిథ్య' అను సూత్రము దృఢముగా నాటుకొన్నది.

రామచంద్రుడు తన స్థితికి తగిన తోరణమంటపాదులు లేక అల్లాడు చున్నాడని తనకు తోచినది. భగవంతుడు దుఃఖపడునో లేదో కాని భగవంతు డట్లు భావించుచున్నాడని భక్తుల హృదయమట్లు దుఃఖపడును. అందుచేత భగవంతునకట్టి లోటుపాట్లులేకుండ చేయదలచుకొన్నాడు. కాని తనయొద్ద ధనమెక్కడ నున్నది. తన సంపాదనము సమారాధనములకు చాలదు. ఈ గుడులు గోపురములు కట్టించుట కెక్కడినుండి వచ్చును? చేతిలో

సర్కారు పైకమున్నది. చూచుకొందుము లెమ్మనికొనినాడు. ఆ ద్రవ్యము ఆరు లక్షల వరహాలు. ఆ డబ్బునంతయు వెచ్చించి శ్రీరామచంద్రునకు గర్భాలయము, ప్రాకారము మంటపాదులు మొదలగునవి కట్టించి ప్రతిష్ఠాదికముల చేయించెను. కొంతమంది పౌరులతని వితరణమునకు సంతసించిరి. కొంతమంది ఈ ధర్మాతిక్రమణమునకు వెరగంది ఆపద సంభవింపవచ్చునని హెచ్చరించిరి. అతడు ముచ్చుసోమకునిమును జంపిన యామత్స్యమూర్తి మన పక్షముండగను తక్కువేమి మనకు. రాముండొక్కడుండువఱకు, అని సమాధానము చెప్పినాడు. 'అనన్యాః చింతయంతో మాం యేజనాఃపర్యుపాసతే, తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమమ్ వహామ్యహమ్' నన్ను దృఢముగా విశ్వసించిన వారి యోగక్షేమము వహింతునను భగవద్వాక్యమునందంతటి దృఢవిశ్వాసము రామచంద్రుని యందంతటి విస్రంభము.

భద్రాచలము పైకము ఖజానాలో జమలేదని తెలిసి అక్కన్నమంత్రి గోపన్నకు వర్తమానము చేసెను. దానికి తిరుగుసమాధానము 'భూమీశుని కృపగల్గిన భూమీశుని దయయు గల్గుభూతలమందున్' అని, ఒకభూమీశుఁడు రామచంద్రుఁడు రెండవవాడు తానీషా ఈ సమాధానము విని చిత్తయినాడు అక్కన్న. రానున్న అనర్థముగుర్తించినాడు గోపన్న. అతడు శరణాగతి తప్ప వేఱొకటి ఏమిచేయగలడు ? 'మురిపెముతో నా స్వామివి నీవని ముందుగ తెలిసితి రామా, మఱువక యిక నభిమానముంచు నీ మఱుగు చొచ్చితిని రామా. ఏతీరున నను దయచూచెదవో యినవంశోత్తమ' అని మొఱపెట్టుకొన్నాడు.

కార్యము పదును తప్పినది. గోపన్నను విచ్చుకత్తులపారాతో గోల్కొండ గొని వచ్చుట కాజ్ఞాపింపబడినది. యమభటులగుబోని యీ యవనదూతల జూచి గోపన్న యించుకచలించి 'కటకట రామచంద్రనను గావగదే యిటువేగ రాగదే అని మొఱపెట్టుచు 'వావి తొలిగి నీదాస జనులు భువిగాసిపడిన యీఘన మెవ్వరిదో అని నిష్ఠూరమాడినాడు. తనకు చెఱసాల శిక్ష తప్పదనుకొన్నాడు. అట్టి సమయమున రాముని దూషించిన తనకున్న ఒక్క ఆశ్రయమును గోల్పోవుట. అందుచే ఈ దుర్దోషమునకు కాలమే కారణమని నిర్ణయించుకొని 'రాకన్మానవు హానివృద్ధులు మహారణ్యంబులోదాగినన్ - లేకన్మానునె యెంతజాలి పడినన్ లేముల్ సిరుల్‌రాఘవా' అని తన కర్మమును తాను నిందించుకొనినాడు. 'పాలముంచినను నీటముంచినను పాలబడితినిక జాలము సేయకు గరుడగ

మనరారా ' అని వాపోవుచు 'ఏమిరా రామా, నావల్ల నేరమేమిరా రామా' అని నిగ్గదీసి అడిగినాడు. 'అధికునిచేపట్టి అడ్డమేమనుకొంటి రామచంద్రా, స్వామి అధములకన్నను అన్యాయమైపోతి రామచంద్రా' అని తన స్థితిని దలచి కన్నీరు కార్చినాడు. 'ఇతరము లెఱుగనయ్యా నాగతి నీవే రామయ్యా' అని తన దుస్థితిని దెలిపికొన్నాడు. 'నాతప్పులన్ని క్షమింపుమీ జగన్నాథ నీవాడ రక్షింపుమీ' అని శరణాగతి మననము చేసికొన్నాడు.)

'ఆ ద్రుపదరాజ తనూజ తలంచినంతనే అక్షయమైన వల్వొవిడి తక్కాట నామొఱ యాలకించి ప్రత్యక్షముగావవేమిటికి అని నిగ్గతీసినాడు. శ్రీరామ చంద్రుడు శిలావిగ్రహమైనాడు. గోపన్నకు శ్రీకృష్ణజన్మస్థాన నివాసము తప్ప లేదు. శ్రీరాముని సంకల్పమనినట్లుభావించి ' సెలవా మాకు సెలవా ? ఈ చెఱ కేగ అని చెప్పికొని బందీయైనాడు. అంతమాత్రముననేమైనది ! డబ్బురాలేదు. కాపుదారులు కొఱడాలతో కొట్టుట కారంభించిరి. ఆదెబ్బలు తాళజాలక "ఎన్నటి దాకనోర్తు ? నేవిన్నపమెంత చేసినను వీనులు మూసుకయున్నయట్లు నీవున్నది యేమికారణ' మని ప్రశ్నించినాడు. సమాధానములేదు. 'రామ, ఇదేమిరా నిరపరాధివి దుర్జను లేర్చుచుండగా, ఏమి యెఱుంగనట్టుల సహించి యిటుండు టిదేమి చెప్పరా, నీమదికింతసహ్యమగునే' అని తానొక బల్లెపుపోటు రామ చంద్రుని పొడిచినాడు. 'శరణాగతత్రాణబిరుదాంకుడవుగావ, శరధిబంధించిన శౌర్యమేమాయెరా' అని దెప్పినాడు. దేనికిని సమాధానము రాకున్న 'ఇన్ని కల్గి మీరూరకున్న నే నెవరివాడనౌదు, కన్నతండ్రివలె రక్షించుటకును కరుణ యేలరాదు' అని వాపోయినాడు. సమాధానములేదు. ఇట్లు బ్రతిమిలాడుటతో కార్యము కట్టదనియెంచి పరుషముగా మాట్లాడిన త్వరగా కార్యసానుకూల మగునని తానుచేయించిన ప్రాకారములకు ఆభరణములకు వెచ్చపెట్టిన డబ్బు నంతయు జెప్పి 'కలికితురాయి నీకు పొలుపుగజేయిస్తి రామచంద్రా, నీవు కులుకుచు తిరిగెద వెవరబ్బసొమ్మని రామచంద్రా ' అని ఎత్తిపొడిచినాడు. తెగునంతవఱకు లాగరాదను నీతిని గుఱుతెఱిగి శ్రీరామచంద్రునకు కోపము వచ్చినచో తన కెవరింక ఆప్తులని మఱల గడ్డముపుచ్చుకొని 'అబ్బ తిట్టితినని ఆయాసపడబోకు రామచంద్రా, ఈదెబ్బలకోర్వక అబ్బతిట్టితినయ్య రామచంద్రా' అని బ్రతిమిలాడు కొన్నాడు. (ఆగోపన్న చేయించిన ఆభరణములు నేటివఱకు గలవు. భక్తజనంబులు దర్శించుచుందురు) అప్పటికి ఆ శిలాప్రతిమమాట్లాడదు.

గోపన్నకు ఆశతీరదు. రాముడు మాట్లాడకున్నను అతని దృష్టిలోదేవుడే. 'ఆశించియుండిన దాసుని శ్రీరాములూ, నీకు పోషించేభారములేదా శ్రీరాములూ' అని బాధ్యతను జూపించినాడు. అప్పటికి సమాధానము రాకున్న రోషము తెచ్చి కొన్నాడు. కుస్తీపట్టియైన రామానుగ్రహము సంపాదింప దలచుకొన్నాడు. బొడ్డులోచేయివేసి నిలువబెట్టినట్లు 'అడుగుదాటి కదలనివ్వను, నాకభయ మివ్వక నిన్ను విడువను' అని పలుకుచు ఆదేవుడు సాచి వేతగాకూర్చుండు నేమోయని 'కుదురుగ గూర్చుండనివ్వను, నీకు కోపమొచ్చిన భయపడను' అని బెదిరించినాడు, అప్పటికి శ్రీరాముడు పలుకకుండుటచే పలుకు విధాన మింకొకవిధముగా మార్చినాడు. తాను దేవునకు రోషము పుట్టించి రక్షణ పొందదలచి రామా నీచేతేమికాదుగా, సీతాభామకైన జెప్పరాదుగా' అని పలికి నాడు. అదిపర్వతముమీది తాయి ఏవిధముగాను పలుకదు. తుట్టతుదకు గోపన్న పరమ లౌకికుడు కావున భార్యచేత సిఫారసుచేయించిన కార్యసాను కూలమగునని 'రామచంద్రులు నాపై చలముచేసినారు, సీతమ్మచెప్పవమ్మ' అని ఆమెను బ్రతిమిలాడుచు ఏవ్యవహార నిమగ్నతలోనైన జెప్పినవ్యవహారము సమూలముగా జెడిపోవునేమోయని ప్రక్కనుజేరి చెక్కిలి నొక్కుచు జక్కగ మరుకేళి సొక్కియుండువేళ నన్నుబ్రోవుమని చెప్పవే, సీతమ్మతల్లి' అని సమ యమునుగూడ జెప్పినాడు. కఠినులగు ఉద్యోగస్థులచే కార్యసానుకూలము గావించుకొనదలచినవారు పన్నునట్టి పన్నాగమిదియేకదా! వేదాంతులకును 'యదస్తి సన్మాత్రమ్-యద్విభాతి చిన్మాత్రమ్' అనునదియే ఆధారము కదా! సత్తున ఉనికిమాత్రమే – దానిని ప్రకాశింపజేయునది చిత్తు - పరాశక్తి పరాశక్తి అనుగ్రహముచేతనే మోక్షసంపాదనము. ఆత్మైక్యతానుభవము. అందువలననే ఒకభక్తుడు 'ముక్తిద్వారము తల్పుతీయగదె చాముండా జగన్మోహినీ' అని పరాశక్తినినుతించినాడు. పన్నాగముపారినది. వేయి ఉపన్యాసములకంటె ఒక్క తలుపుచాటు గుసగుస పనిచేయునన్నట్లు ఆ సీతమ్మ 'నామనవిని వినివేగ ప్రాణనాథా, రామదాసుని వదలించు ప్రాణనాథా' అని చెవిలో ఊదినది. రామ లక్ష్మణులు బయలుదేరినారు. తానీషాకు పైకము చెల్లించి గోపన్నను చెఱనుండి విడిపించినారు. అంతటిలో గోపన్న రామదాసైనాడు – ఆయనయే భద్రాచల రామదాసు.

ఈ రామదాసు కవికూడ. అతనిది భక్తిరసామృతములో ప్లుతమైన ఇక్షు ఖండకవిత్వము. త్యాగరాజాదులకు భక్తిగేయకవితారూపమున ప్రసరించినట్లు

ఇతని ఆర్తి గేయకవితా రూపమున ప్రసరించినది. ఈయన కవిత ఛందో బద్ధమైనది. కేవలము గేయకవిత్వమే కాకుండ పద్యకవిత్వముకూడ చక్కగా వ్రాయనేర్చిన సుకవి. భక్తిశతకములలో దాశరథీశతకము వంటి శతకములు వాఙ్మయమున జాల తక్కువగా నున్నవి. 'చక్కెరమాని వేముతిన జాలిన కైవడి మానవాధముల్, పెక్కురు బక్కదైవముల వేమఱుమ్రొక్కి భజింతు రక్కటా, మ్రొక్కిన నీకు మ్రొక్కవలె మోక్షమొసంగిన నీవె యీవలెన్, దక్కిన మాటలేమిటికి దాశరథీ కరుణాపయోనిధీ ' మచ్చునకిదియొక పద్యము. ఇందలి ఉపమానోపమేయములు సంప్రదాయము హృదయంగమములు ఆత్మా రాముడొక్కడే మోక్షదాత—మిగిలినవారు బక్కదైవతములు—ఇట్లు రామదాసు ఆంధ్రజనంబుల హృదయములలో భద్రాచల శ్రీరామచంద్రునితో సమానముగ సుస్థిరావాసమేర్పరుచు కొన్నాడు. ఇది భాగవత సంప్రదాయము. భద్రాచల మున్నన్నాళ్లు భగవంతుడగు రామచంద్రునితోబాటు రామదాసు అజరామ రణుఁడు.



# తెలుగువారి........
# సంస్కృత శ్రీరామసాహిత్యము

— శ్రీ బి. రామరాజు.

శ్రీరామచంద్రుడు తెలుగువారికి కన్నతండ్రి; సీతమ్మ కన్నతల్లి. తక్కిన దైవతములకన్న ఎక్కువగా సీతారామచంద్రులకే తెలుగువారి హృదయము లర్పితములైనవి. సీతారామలక్ష్మణులు వనవాసము చేసినప్పుడు కొంతకాల మాంధ్రమండలమున విహరించిరి. పర్ణశాలా ప్రాంగణమున పెంచిన లత కూన లకు సీతమ్మ నీళ్ళు పోసినప్పుడు రామలక్ష్మణులు గోదావరీ జలము లందించిరట. అప్పుడా ముగ్గురాడుకొన్న ముచ్చటలు గోదావరి తన గుండెలలో రంగరించు కొన్నది, అవియే గోదావరి గలగలలు. నాటినుండి నేటివరకా గలగలలు విను చున్న తెలుగువారికి శ్రీ సీతారామ చంద్రుల చరిత్రము ఉచ్ఛ్వాసనిశ్శ్వాసములు. అరచేత వైకుంఠ మబ్బినను అరికాలముల్లు నాటినను రామనామము తెలుగువాని కొననాలుక నిల్లు కట్టుకొనును. ఆదికవి తన కరుణార్ద్ర హృదయమునుండి వెడలిన శోకశ్లోకముల కుశలవులచే గానము చేయించెనట. అది విన్న సంస్కా రులు సంస్కృతాంధ్రభాషలలో శతాధిక రామాయణ సంబంధికావ్య నాటకాదులు రచించినారు, ఇక జానపదుల హృదయముల వందిరికల్లుకొన్న రామాయణలత కాద్యంతములులేవు. తెలుగులో శిష్టులు రచించిన రామాయణ వాఙ్మయము భాషాసమితివారి ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము తెలుగుసంస్కృతి మూడవసంపుట మునను జానపదుల రామాయణ వాఙ్మయమ నా "తెలుగు జానపదగేయ సాహి త్యము"నను కొంతకు కొంత కాంచనగును. ఇక గీర్వాణ గిరాంధురంధరు లైన యాంధ్రులు సృష్టించిన రామాయణ వాఙ్మయముగూర్చి దిఙ్మాత్రముగా సూచించి భద్రాద్రిరాముని సాహిత్యముగూర్చి నా యోపినంత మనవి చేయుదును.

రామాయణేతి వృత్తమాధారముగా కావ్యనాటకాది వివిధ సాహిత్య ప్రక్రియలు సాధించి తరించిన తెలుగువారిపేర్లు అకారాదిగా నిచ్చుచున్నాను.

అనంతరామ పండితుడు (పరశురామపంతుల) – సీతావిజయ చంపూ
అనంతాచార్యులు (ఆసూరి) – చంపూరాఘవం
అనపోత నాయకుడు (రాచకొండ) – అభిరామరాఘవనాటకం
అప్పల దేశికులు (మరింగంటి) – శ్రీరామపాదుకాస్తుతిః
ఉపమాక వేంకటేశ్వరకవి – రామాయణ సంగ్రహకావ్యం
ఏకామ్రనాథుడు – యుద్ధకాండ చంపూ
కుప్పుస్వామయ్య (నాగపూడి) – శ్రీ సీతారామస్తోత్రం
కృష్ణపండితుడు (శేష) – క్రియాగోపన రామాయణం
కృష్ణపండితుడు (ఇటికాల) – రాఘవ పాండవీయం
కృష్ణమాచార్యులు (యెళవెళ్ళి) – నిరోష్ఠ్య రామాయణం
కృష్ణమాచార్యులు (హొసదుర్గం) –
1. విక్రాన్తరాఘవం (నాటకం) 2. శ్రీరామవేదపాదస్తవం (స్తో)
3. శ్రీరామ సుప్రభాతం (స్తో) 4. శ్రీరామాష్టకం (స్తో)
5. శ్రీరామాయణ వైభవం (స్తో) 6. శ్రీరామచంద్ర మంగళమాలికా(స్తో)
కృష్ణమూర్తిశాస్త్రి (శిష్టు) – కంకణబంధ రామాయణం
కృష్ణరావు (తడకమళ్ళ) – రామతారావళీ
కృష్ణశాస్త్రి (శ్రీధర) – శ్రీరామ మందహాసచంపూ
గంగాధరకవి(అగస్త్య విద్యానాథుని బావమరది)-రాఘవాభ్యుదయనాటకం
గోపాలరావు (వనపర్తిరాజు) – రామచంద్రోదయం (యమకకావ్యం)
గోపాలశాస్త్రి (నడిమింటి) – సీతారామాభ్యుదయం
చినబొమ్మ భూపాలుడు – సంగీతరాఘవం
త్యాగరాజు (కాకర్ల) – పంచరత్న కీర్తనలు
దీక్షాచార్యులు (పుల్లగుమ్మి) – రామచంపూ
దేవరాయలు – ప్రసన్నరామాయణం
నాగనాథసూరి (కందుకూరి) – రామవిజయః (కావ్యం)
నారాయణదాసు (ఆదిభట్ల) – రామచంద్రశతకం
పార్వతీశ్వరశాస్త్రి (మండపాక) సీతానేత్రస్తుతిః
బ్రహ్మసూరి (చెరుకూరి) – ఉత్తరకాండ చంపూ

భద్రాద్రి రామశాస్త్రి (కొంతి) – శ్రీరామవిజయః (చంపూ)
భవభూతి - ఉత్తరరామ చరిత్ర (నాటకం)
భాష్యకారశాస్త్రి (చెర్ల) – (1) కంకణబంధరామాయణం
(2) మేకాధీశరామాయణం

మధురవాణి – రామాయణకావ్యం
మల్లికార్జునభట్టు (హుళక్కి) – అభిషిక్తరాఘవం (నాటకం)
మల్లినాథసూరి (కోలాచల) – రఘువీరచరిత్ర (కావ్యం)
మల్లుభట్టు (శాకవల్లి) – ఉదార రాఘవం (కావ్యం)
మురారి అనర్ఘరాఘవం – (నాటకం)
రఘునాథరాయలు (తంజావూరు) – రామాయణసారసంగ్రహం
రాఘవాచార్యులు – భద్రాచలచంపూ
రామసూరి (దేవులపల్లి) – రామాభ్యుదయచంపూ
రామచంద్రశాస్త్రి (కోరాడ) – రామచంద్రవిజయవ్యాయోగః
రామచంద్రుడు (పుల్లేల) – పౌలస్త్యరాఘవం (మహాకావ్యం)
రామసుధి సీతారామబుధోదయః (కావ్యం)
రామస్వామి (బండ్లమూడి) – రామచంపూ
రామస్వామిశాస్త్రి (గుండు) – సీతాచంపూ
లక్ష్మణకవి (ఓరుగంటి) – సీతారామవిహారకావ్యం
లక్ష్మణకవి (దిట్టకవి) – హనుమద్రామాయణం (కావ్యం)
లక్ష్మణసూరి (శనిగరం) – భోజ చంపువులోని యుద్ధకాండం
వరదాచార్యులు (చిట్టిగూడూరు) – దాశరథీశతకం
వామనభట్ట బాణుడు – రఘునాథచరితం (కావ్యం)
వీరరాఘవుడు – భద్రాద్రి రామాయణం (కావ్యం)
వీరరాఘవకవి (నెల్లూరి) – విశేషణరామాయణం (కావ్యం)
వెంకటకృష్ణుడు – రామచంద్రవిజయః (కావ్యం)
వెంకటకృష్ణశాస్త్రి (లక్కావజ్ఝల) – శ్రీరామస్తవమాలా (స్తో)
వెంకటరామనృసింహాచార్యులు (ముడుంబి) – రామచంద్రకథామృతం
వెంకటరామరాజు (చెన్నమాధవుని) – రామకృష్ణయుధిష్ఠిర చంపూ

వెంకటశాస్త్రి (కాకిరపర్తి) – సీతారామచంపూ
వెంకటాచార్యులు (ముప్పిరాల) – రామాయణ సారసంగ్రహం
వెంకటేశ్వరుడు (చెరుకూరి) – చిత్రబంధ రామాయణం
వెంకటాచార్యులు (మంచాలకట్ట జిల్లప్రోలు) – రామత్రింశత్ స్తోత్రం
వెంకన్న (జయంతి) – అభినవ రామాయణం
సీతారామశాస్త్రి (అనివిళ్ళ) – 1. చంపూరామాయణం
2. సీతారామదయాలహరీ
సీతారామశాస్త్రి (లంకా) – సీతారామాయణం (అశ్వధాటీ)
సుబ్బరాయశాస్త్రి – రామకథాసారః (కావ్యం)
సుబ్బరాయశాస్త్రి, తమ్మనశాస్త్రి (దేవులపల్లి) – శ్రీరామపంచాశత్
సూరకవి (ఎఱ్ఱాప్రగడతంద్రి) – సంక్షేపరామాయణం
సోమేశ్వరకవి (వింజమూరి) – రాఘవ యాదవీయం

నా యజ్ఞానము మూలమున పై పట్టికలో చేరని వారెందరు మహానుభావు లున్నారో!

ఆంధ్రదేశమందలి శ్రీరామ క్షేత్రములలో భద్రాచల మగ్రగణ్యాము మతత్రయము వారిచేతనేకాక మహమ్మదీయులైన గోలకొండ సుల్తానులచే కానుకలందుకొన్న వాడచటి శ్రీరామచంద్రుడు ప్రభుత్వమువారి యనుమతి లేకుండ "చుట్టుప్రాకారములు సొంపుగ కట్టించు" కొని తనకొక కలికితురాయి సీతమ్మకొక చింతాకుపతకము చేయించుకొన్న భక్తుని కడగండ్లు బాపుటకు 'జవాను' అవతారమెత్తిన వాడచటి శ్రీరామచంద్రుడు ఆ భద్రాద్రీశ్వరునిపై వెలసిన సంస్కృత సాహిత్యమును సమీక్షింతము.

దేశకాలాదులు తెలియరాని వీరరాఘవాచార్యులను శ్రీవైష్ణవకవి అశ్వధాటి వృత్తములందు భద్రాద్రి రామాయణమును వ్రాసినాడు. ఈ గ్రంథము సంపూర్ణముగా లభించుట లేదు. దీనిలో బాలకాండము సంపూర్ణముగను అయోధ్యా కాండము కొంతభాగము మాత్రము లభ్యము.

దీనిప్రారంభ శ్లోకమిట్లున్నది:

శ్రీమాధవప్రణయ భూమాభి వృద్ధతమ ధీమాననీయ శరజిత్
ప్రేమాత్త జన్మయుత సామాన్య బుద్ధిజిత కామాది దోషవితతిః।

భూమానవోచ్చరిత భీమాఘహారినిజనామాతివేల మహిమా
రామానుజో వచన సీమాతివర్తి ఘనధామా విభుర్విజయతే॥

అటు తరువాత పూర్వాచార్యుల స్తుతి శ్లోకములున్నవి. ఆపై గురుస్తుతితో రామాయణోపక్రమ మిస్తైనది.

శ్రీవత్స వంశజను రావర్తితార్య పదసేవర్ధి రాఘవగురుం
శ్రావ్యం సుధీభిరనుభావ్యం కరోతి రఘుకావ్యం స్వలం కృతియుతమ్।
సన్తస్సమాకలితవన్తః ప్రబంధ మిమ మన్తర్ప్స హి స్ఫుటరసం
స్వాదాధివృద్ధఘనమోదా దయాంకురుత పాదాశ్రితే కృతికృతి

దేవర్షిణా విధిభువావర్ణితం రఘుప భావత్క మంగళగుణం
శ్రుత్వా మునిర్మనసి ధృత్వాముదం తదనుగత్వా దదర్శ తమసామ్।
బాణాహతం రుధిరశోణాకృతిం నయనకోణాదపేక్ష్య విహగం
శ్లోకం జగా వుదిత శోకం సుధీ సుకృతపాకం ధరాశ్రవణభూః॥

తన్మానిషాదపరవన్మాన్య పాదయుత మున్మాదనం సుమనసం
పద్యం సమస్తజనహృద్యం విమృశ్యముని ముద్యన్మహాద్భుతరసమ్।
శ్లోకోఽయ మస్త్వనృతవాకో న తేఽత్రకురు లోకోత్తరోన్నతమునే
రామాయణం సకల కామావహం త్వమితి రామాత్మభూస్స నిరగాత్॥

బాలకాండము క్రింది శ్లోకముతో ముగిసినది.

భద్రాద్రినాథ తవ ముద్రాయుతే జయతు ముద్రాశితే తనుభృతాం
రామాయణే సకల కామావహే వితత భూమాస్పదేఽతి లలితే।
శ్రీ వీక్ష్యభావగురు సేవీద్య సూక్తి శుభధీ పీరరాఘవకృతే
శ్రీ బాల కాండమిద మాబాలవృద్ధ మఖిలాబోధజనకమ్॥

రాఘవాచార్యులను మరియొక శ్రీవైష్ణవకవి భద్రాచల చంపూకావ్యమును సుందరనాయకుడను నొక పాళెగాని ప్రోత్సాహమున రచించెను. మాడభూషి కృష్ణమాచార్యులవారు తమ సంస్కృతవాఙ్మయ చరిత్రమున భద్రాచల చంపూ కర్తయైన రాఘవార్యుడును రామాయణోత్తర చంపూరచయితయైన రాఘవార్యుడును ఒకరే కానోపుదురని యూహించి మనకవీశ్వరుని చెంగల్పట్టు మండల మండలి తిరువెల్లూరునకు నెట్టిరి. రామణోత్తర చంపూ రచయిత తమిళుడు. భద్రాచల చంపూ రచయిత తెలుగువాడు భద్రాచల చంపూ కావ్యము భద్రగిరి

మాహాత్మ్యమును వర్ణించుట కుద్దేశింపబడినకావ్యము. ప్రారంభ శ్లోకములు, శ్రీరంగపతి, సింహాచలస్వామి, శార్ఙపాణి, మధురాపుర శ్రీహరి, స్తోత్రములు. అటుపై శ్రీరామానుజులవారిని శ్రీపరాశరభట్టరులను వర్ణించు శ్లోకములిట్లున్నవి.

త్రిదండ పరిమండితం తరళ పంకజాక్షస్రజం
కనత్కనకవాససం కలిత మూర్ధ్వ పుండ్రశ్రియా ।
శిఖారచిత శేఖరం శుచితరో పవీతోజ్జ్వలం
శ్రయే యతిపురందరం శమితగర్వదుర్వాదికమ్ ॥

శ్రీరంగరాజ చరణాంబుజ రాజ హంసం
శ్రీవత్సలాంఛన పయోనిధి పారిజాతమ్ ।
విజ్ఞానభక్తి వినయాది మహాగుణాబ్ధిం
వందేయ సంప్రతి పరాశరభట్ట సూరిమ్ ॥

భద్రాచల వర్ణన మీ క్రింది విధముగా నున్నది.

"గోదావరీతీరే శుభే మోదావహే యోగస్పృశాం
శ్రీ రాఘవక్షేత్రాభిధో ఘోరాశుభధ్వంసీ మహాన్
భద్రాచలాభిఖ్యో గిరిర్విద్రావితధ్వాన్తశ్రియా
నేతాభువో యత్రేక్ష్యతే సీతాపతి స్స్వామిత్రిణా"

గోదావరీ రోధసి కశ్చిదీడే
భద్రాచలోనామ నగాధిరాజః ।
యమద్రిరాజస్య సుతం సుమేరోః
ప్రాహుః పరంధామ పరస్యధామ్నః ॥

ద్రుతం తదభ్యర్ణముపేత్య తత్ర
గోదావరీ సైకతమణ్డలాన్తే
హరం సముద్దిశ్య చరంస్తతస్త్వం
తూర్ణం సమేష్యస్యరివర్గ శాన్తిమ్ ॥

కావ్యాంతమున కవి తన్నుగూర్చి యిట్లు చెప్పుకొన్నాడు.

ఇత్థం రాఘవసూరీ రఘువరగుణరత్న వర్ణన పవిత్రమ్ ।
చిత్రం శుభాద్రిచంపుం వ్యరచయదరుణాబ్జలోచనప్రీత్యై ॥

ఉపదిశ్య సుందరవిభో రాదేశం రాఘవార్యదాసేన।
భద్రగిరి చంపురిత్థం రచితో రఘునాయక ప్రసాదాయ ॥

ఆనాడు ప్రభుత్వమువారి యనుమతి లేకున్నను ఒక రామదాసుచే గుళ్ళు గోపురములు కట్టించుకొన్న శ్రీరామచంద్ర ప్రభువు ఈనాడు దేవస్థానమువారి యనుమతి చొప్పున ఒక రామరాజుచే భద్రాద్రి చంపువును ప్రకటింపలేదా? ఊరు పేరు తెలియని మరియొక తెలుగువాడొనర్చిన భద్రగిరీశుని స్తుతితో నీ వ్యాసము ముగింతును.

శ్రీమన్నిర్మల పుణ్యవైభవ సుధాప్రాయాంబు గోదావరీ
తీరే కల్పకకాననాన్తరరుహ శ్రీ భద్రశైలాన్తరే।
శోభాయుక్త విచిత్ర రత్నఖచితే సింహాసనే సంస్థితం
శ్రీ భద్రాచల రామచంద్రమనిశం సీతాసమేతం భజే ॥

ధీరం గౌతమదార శాపహరణం గాంభీర్యవారాన్నిధిం
నిత్యానంద మనేకనిర్మలగుణై ర్ఖ్యాతిప్రదం భూపతిమ్।
భక్తప్రీతికరం భవార్తిహరణం భాగ్యప్రదం రాఘవం
శ్రీ భద్రాచల రామచంద్రమనిశం సీతాసమేతం భజే ॥



# దేవాలయములు

— ఆదిరాజు వీరభద్రరావు.

అత్యంత ప్రాచీనకాలంలో దేవాలయములున్నట్లు కనబడదు. ప్రాచీన కాలంలో — వైదికయుగంలో — ఆర్యులు ప్రకృత్యారాధనా పరులయియున్నట్లుగా కనబడుచున్నది. ఋగ్వేదార్యుల ఆరాధనవిషయంపృధ్వీస్థాన—అంతరిక్షస్థాన—ద్యుస్థాన అని మూడువిధములుగా నుండేది. పృధ్వీస్థానములో అగ్ని, పృధ్వి, సోమ, బృహస్పతి, ప్రార్థన దేవతలుగా నుండిరి. అంతరిక్షస్థాన విషయంలో ఇంద్ర, అహంనపాత, రుద్ర, వాయు, వాత, పర్జన్య, ఆపి, మాతరిశ్వన్ ప్రార్థన దేవతలుగా నుండిరి. ద్యుస్థాన విషయంలో ద్యౌస్, వరుణ, మిత్ర, సూర్య, సావిత్రి, పూషన్, విష్ణు, ఆదిత్య, ఉష, అశ్వినులు ప్రార్థన దేవతలుగా నుండిరి. విగ్రహపూజ లేకుండెను, ఇంద్ర ఆరాధనను శ్రీకృష్ణుడు ఆపిలేయించినట్లుగా భాగవతపురాణము తెలుపుచున్నది.

తరువాత యజ్ఞములు ప్రాధాన్యమునకు వచ్చెను. "నుతజలపూరితంబు లగు నూతులు నూరిటికంటె........ ఒక బావి మేలు. మరిబావులు నూరిటికంటె నొక్క సత్క్రతువది మేలు" అని భారతము చెప్పుచున్నది. అనగా ఒకనూయి త్రవ్వించినకలుగు ఒకపుణ్యముకంటె క్రతువొనరించినందువల్ల కలుగు పుణ్యము పదివేల పుణ్యములుగానుండునని భావము. అగ్న్యారాధనము ప్రబలెను. ప్రతిగృహమునందును. త్రేతాగ్నులు-ఆహవనీయము, గార్హపత్యము, దక్షిణాగ్ని ప్రజ్వరిల్లుచుండెను. హోమవేదికల నిర్మాణమునందును, హోమగుండముల నిర్మాణములందును పెక్కు నిబంధనలు ఏర్పడెను. ఈ అగ్న్యారాధనమే ఘనమైన పుణ్యకార్యముగా భావింప బడెను. శకుంతల అత్తవారింటికి వెడలునప్పుడామెను కణ్వమహర్షి హోమశాలకు గొంపోయి త్రేతాగ్నులకు ప్రదక్షిణము చేయించినట్లు మహాకవి కాళిదాసు వివరించియున్నాడు.

ఈ యజ్ఞశాలలే దేవాలయ నిర్మాణములకు దారితీసినట్లు తోచుచున్నది.

సగుణారాధన ప్రబలిన కొలదీ మూర్తిపూజ ఆవశ్యకమయ్యెను. ప్రారంభమున ఎట్టిమూర్తులను పూజించుచుండిరో కాని మొహంజోదారో త్రవ్వకములలో

మాతృదేవతా మూర్తులు, శివలింగములు కనబడినవి. మూడు ముఖములు, మూడు శృంగములు కలిగి మనుష్యాకృతిలో నున్న ఈశ్వర విగ్రహమొకటి లభ్యమైనది. అదిపశుపతిరూపమున నున్న శివప్రతిబింబమని అనుచున్నారు. మొహంజోదారో 5000 ల సంవత్సరములక్రిందట వెలసిన మహా పట్టణము గనుక ఆ కాలమున విగ్రహపూజ యుండెనని మనము భావింపవచ్చును.

సంసారలంపటుడయిన మానవునకు మనశ్శాంతి, చిత్తైకాగ్రత, భక్తి, వైరాగ్యము, ధార్మికచింతన–ఇత్యాదులు లభించుటకు విగ్రహారాధన ఆవశ్యకము విగ్రహమునకు ఒక మందిరముకూడ అవసరమయ్యెను. విగ్రహ నిర్మాణమున కును, దేవాలయ నిర్మాణమునకును, ఆరాధనా విషయమునకును ప్రత్యేక ఆగమ శాస్త్రములు వెలసినవి. ఈ నిర్మాణముల సందర్భమున శిల్పశాస్త్రముకూడ ప్రవృద్ధిచెందినది.

దేవాలయ నిర్మాణమున గర్భగుడి, అంతరాళభోగ మంటపము, నిత్య సూరి మంటపము, ఎత్తయిన గోపురములు, ప్రాకారకుడ్యములు, సరోవరము, పుష్పఫలోద్యానములు ఉండవలెనట. దేవాలయములలో పురాణ శ్రవణము, వేదపాఠశాల, భక్తి, జ్ఞాన, వైరాగ్యములను గూర్చిన ప్రబోధములు జరుగు చుండెను. లలితకళాభివృద్ధికిని దేవాలయము ప్రయోజనకారిగా నుండెను. ఇట్లు దేవాలయము, భుక్తి రక్తి, ముక్తిప్రదాయినియై వరలెను. సప్తసంతానములను పుణ్యకార్యము లేడింటిలో దేవాలయ నిర్మాణము ఒకటియై యున్నది.

శైవము, వైష్ణవము, శాక్తేయము-ఇత్యాది సంప్రదాయములు ప్రబలిన కాలది, తమ తమ ఇష్టదైవముల నామములతో అంకితములయిన దేవాయతన ములు వర్ధిల్లినవి. ఈ దేవతల పేర్లనుగూడ మనమిచ్చుట గమనించవలయును. నామిరెడ్డి అనే ఆయన తనకు పుణ్యంగాను తనపేరిట నామేశ్వర దేవరను, తన కొడుకు ప్రోలయపేరిట ప్రోలేశ్వర దేవరను ప్రతిష్ఠించినాడు. ఎఱుక సానమ్మ అనే స్త్రీ రత్నము తనపేరట ఎఱకేశ్వర దేవరను, తన భర్తఅయిన బేతిరెడ్డి పేరిట బేతేశ్వర దేవరను ప్రతిష్ఠించినది. ఇవన్నియు శివాలయములే. శ్రీరమణ మహర్షి మాతృశ్రీ మరణించినప్పుడు ఆ సమాధి స్థలముమీద ఒక దేవాలయము కట్టించి, అందు మాతృభూతేశ్వరస్వామి అను పేరుతో ఒక శివలింగమును ప్రతిష్ఠించినాడు.

తెలంగాణములో 641 దేవాలయములున్నట్లు రికార్డులవల్ల తెలియవచ్చుచున్నది. ఈ మధ్యకాలములో పురాతన దేవాలయములు కొన్ని శిథిలమయిపోయియుండును; క్రొత్త దేవాలయములు ప్రభవిల్లియుండును. ఆ పాత రికార్డునుబట్టియే దేవాలయముల సంఖ్య జిల్లాలవారిగా ఈ క్రింద వివరించుచున్నాము :—

| | | |
|---|---|---|
| 1. హైద్రాబాదుజిల్లా | .... | 42 |
| 2. వరంగల్—ఖమ్మం జిల్లా | .... | 66 |
| 3. కరింనగరు జిల్లా | .... | 62 |
| 4. ఆదిలాబాదు జిల్లా | .... | 62 |
| 5. నిజామాబాదు జిల్లా | .... | 96 |
| 6. మెదకు జిల్లా | .... | 92 |
| 7. మహబూబునగరు జిల్లా | .... | 134 |
| 8. నల్లగొండ జిల్లా | ... | 87 |
| మొత్తము దేవాలయములు. | | 641 |

ఈ 641 దేవాలయములలో 48 మాత్రమే ప్రసిద్ధ పుణ్య క్షేత్రాలు. హైద్రాబాదు జిల్లాలో 6, వరంగల్-ఖమ్మం జిల్లాలలో 7, కరీంనగరు జిల్లాలో 8, ఆదిలాబాదు జిల్లాలో 6, నిజామాబాదు జిల్లాలో 3, మహబూబునగరు జిల్లాలో 8 నల్లగొండ జిల్లాలో 6, మెదకు జిల్లాలో 4, ప్రసిద్ధమైయున్నవి.

వరంగల్‌జిల్లాలో అయినవోలు, కొరవి, పాలంపేట—ఖమ్మం జిల్లాలో భద్రాచలము, దమ్మపేట-కరీంనగరు జిల్లాలో ధర్మపురి, వేములవాడ, మంథెన బేర్పూరు-ఆదిలాబాదు జిల్లాలో సావరపూరు, రాడోరా, కేసలాపురము-మహబూబునగరు జిల్లాలో అమాపూరు, ఆత్మకూరు, శిరసనగండ్ల, గంగాపురము-నల్లగొండ జిల్లాలో పానుగల్లు, వాడపల్లి, జీడికల్లు, యాదగిరిగుట్ట ప్రఖ్యాతి చెందిన యాత్రా స్థలములు.

ఆదిలాబాదు జిల్లాలోని కేసలాపురము ముఖ్యముగా పేర్కొనదగినది. ఇచ్చట గోండుజాతి దైవమగు భీమదేవుని ఆలయము గలదు. ఇచ్చట గోండుల గొప్ప జాతర జరుగును. పుష్యమాసము తరువాత ప్రారంభమగును. 15 దిన

ములు జరుగును. వేలకొలది గోండులు గుమిగూడుదురు. గోండు కవులు, పాటగాండ్రు, ప్రధానులు, వాయిద్యములు వాయించుచు భక్తిగీతములు పాడుదురు. ఈ ఉత్సవములో క్రొత్తగా వివాహమయిన పెండ్లికూతుళ్లు ప్రధాన పాత్రలు వహించెదరు. విగ్రహముముందు రాత్రంతయు నాట్యము జరుగుచుండును. పూజా పురస్కారములతో ఆదిశేషునకు గొప్ప పూజ జరుగును.

హనుమకొండయందలి వేయిస్తంభాల గుడి, త్రికూటాలయము, పాలంపేటలోని రామప్పగుడి ఆలయ నిర్మాణము, చిత్రకౌశలము, శిల్పనైపుణ్యము అందచందములు వర్ణనాతీతము.

నల్లగొండ జిల్లాలోని ఛాయాసోమేశ్వరాలయ మొక అద్భుత మందిరము. ఈ ఆలయములోని లింగముపై దీర్ఘమగు నల్లనినీడ ఒకటి పగలంతయు నొక్కచోట కదలక కానవచ్చుచుండును. ఈ నీడ సూర్యోదయమునుండి సూర్యాస్తమయమువరకును ఎంతమాత్రము చలింపక ఒకచోటనే కానుపించుట ఒకవింతయయిన విషయము గదా!

నల్లగొండ జిల్లాలోని వాడపల్లి కృష్ణా, మూసీనదుల సంగమస్థానము. ఈ స్థానమున గుట్టమీద ఒక శివాలయము, ఒక లక్ష్మీనరసింహాలయము కలవు. ఈ రెండును మహత్తు కలవి. శివాలయములో శివలింగముమీది గుంటలో తోడినకొలది నీరూరుచుండును. లక్ష్మీనరసింహాలయములోని మూల విరాట్టునకు ఎదురుగా వ్రేలాడగట్టిన దీపము ఎప్పుడును రెపరెపలాడుచుండును. మిగత దీపములు ఎట్టి కదలికలేకుండ వెలుగుచుండును.

అలంపురము దక్షిణకాశీయనియు, ఉమామహేశ్వరము శ్రీశైలమునకు ఉత్తరద్వారమనియు ప్రసిద్ధి కలదు. ఈ రెండును మహబూబునగరు జిల్లాలోనున్నవి.

ఇప్పుడు దేవాలయములకు సంబంధించినంతవరకు శాసన లిఖితములను బట్టి కొంత మనవిచేసికొందును. దేవుళ్లకు నామేశ్వర, కాటేశ్వర, ఎఱకేశ్వరాది నామము లెట్లువచ్చినవో పైన వివరించియున్నాను. ఇక, శాసనములలో ప్రసన్నవల్లభ దేవర, నగరేశ్వర, సిద్ధేశ్వర, రాజాదిత్యేశ్వర, గంగేశ్వర, హరిహర, పున్నేశ్వర, వరుణ, భైరవ, త్రిపురదేవి, ఏకవీర, భోగనాథదేవర—ఇత్యాది దేవతల పేర్లు కనబడుచున్నవి. ఈ దేవత లిప్పుడు ప్రకాశమానులుగా లేరు.

శాసనములవల్ల దేవాలయ పూజా విధానములు, వృత్తి నిర్మాణములు తెలియనగుచున్నవి. పమ్మి గ్రామంలో ప్రతిష్ఠచేయబడిన ప్రసన్నవల్లభదేవర అంగ, రంగ, భోగాలకు భూములు తోటలు, దానము చేయబడినవి. వాటి ఆదాయమునుండి దేవర పూజా ప్రయోజనములకు, ఉత్సవాలకు, జయంతులకు, చాతుర్మాస్య ఆరాధనలకు వినియోగించవలసియుండును. మరియు ఆకులు, పోకలు. ఉపహారానికి పప్పు, పెసలు, చాతుర్మాస్య ఆరాధనలకు జాగరంకు బియ్యం, బ్రాహ్మణ దక్షిణలు; శ్రీ జయంతికి ఇప్పపువ్వు (ఎందుకో?), దీపావళికి భోగం, దీపకంబాలకు నెయ్యి, అభ్యంజనానికి పిండివంటకు నెయ్యి, నువ్వులు, చింతపండు, పిండికొమ్ములు, చందనం, మొదలగునవి ఏ యే ప్రమాణములలో వినియోగించవలెనో, కట్టడి చేయబడినవి. పిడిగంట, చాప గలంతులు, కంచుకరటతులు, జయగంట, గంట, పెద్దతాలాలు, పెద్దపళ్లెం, చిన్నపళ్లెం, వరపిడిన పడులు, మొదలగు దేవర ఉపకరణాలు సమర్పింపబడినవి.

దేవస్థానము పక్షమున వైదిక విద్యాభివృద్ధికి కార్యకలాపములు జరుపు ఏర్పాటుండెను. తెలంగాణమునకు సంబంధించిన విషయము గాకున్నను తమిళ దేశ శాసనస్థ విషయములు మనము తెలిసికొనుట అవసరమనుకొనుచున్నాను. దేవాలయ భూములమీద వచ్చు 12,000ల కలముల ధాన్యమును దేవరల హవిర్బల్యర్చనాదులకును, ఉత్సవాదులకును, శ్రీవైష్ణవ సంతర్పణములకును, తిరువాయిమొళి పఠనమునకును సంవత్సరమునకు 2475 కలముల ధాన్యమును వినియోగించవలెను. మిగత ధాన్యమును ఋగ్వేద అధ్యాపకులను, యజుర్వేద అధ్యాపకులకు, ఛందోగ సామాధ్యాపకులకు. తలవకార సామాధ్యాపకులకు, అపూర్వ, వాజసనేయ, బోధాయనయ, సత్యాసూత్రాధ్యాపకులకును, మొత్తము పంద్రెండుగురికి ఓనమునకు నాలుగు కలముల ధాన్యము నీయవలెను వేదాంతము, వ్యాకరణము, రూపావతారము, శ్రీ భారతము, రామాయణము, మను శాస్త్రము, వైఖానసశాస్త్రము - ఈ అధ్యాపకులకును, విద్యార్థులకును - మొత్తము 260 మందికి భోజనాదికములకై వినియోగింపబడిన ధాన్యము మొత్తము 9525 కలములు ఇదియొక చిన్న విశ్వవిద్యాలయము.

మరియొక శాసనమునను సరించి శ్రీవైష్ణవులకు, ఉత్సవమును చూచుట కేతెంచిన దాసులకును అన్నప్రదానము గావించుటకు ధాన్యము, బంగారము ఒసగబడుచుండెను.

ఇట్లే ఋగ్వేద, యజుర్వేద, సామవేద, అథర్వవేద అధ్యయన పరులును, బౌద్ధాయనీయ గృహ్యకల్ప, గణాధ్యయనపరులును అగు విద్యార్థులకు భోజనాది సౌకర్యములేర్పరుపబడెను. వీరందరు 270 మంది విద్యార్థులుండిరి. ప్రాభాకరా ధ్యాపకునికి పంద్రెండుకలంజుల బంగారముకూడ ఇచ్చుచుండిరి. ఈ విధముగా దేవస్థానములు విద్యాపీఠములై వరలినవి. ఇతర అధ్యాపకులకును ఇచ్చు చుండిరి.

ఇక దేవస్థానములు ప్రజారోగ్యముకొరకు వైద్యశాల లేర్పరచి నిర్వహించినవి. వైద్యాలయమునందు వ్యాధిగ్రస్తులుండుటకు మంచములుండెను. రోగగ్రస్తుల సౌఖ్య సౌకర్యములకొరకు బియ్యము, వైద్యుడు, శస్త్రచికిత్సకుడు నౌకరులు, దాసీలు, భోజనశాలల, వైద్యశాలలకొక సేవకుడు—ఏర్పాటు చేయబడెను.

సంవత్సరమునకు సరిపోవునట్లుగా వైద్యశాలయందు ఆశాహరీతికి, గోమూత్రహరీతికి, దశమూలహరీతికి, భల్లాతకహరీతికి, గండీరము, బలాకోదండతైలము. ఉత్తమకర్ణాది తైలము, ఘృతము, బిల్వాదిఘృతము, మండూకరవటకము, త్రివృత్తి, విమలై, తామ్రాది, వజ్రకల్పము, కల్యాణ లవణము, మొదలగు మందులు, మూలికలు పురాణసర్పి మొదలగునవి నిలువయుంచుచుండెడువారు.

ఈ విధముగా మానవుల శారీరక, మానసిక స్వస్థతకొరకు దేవస్థానములు మహా సంస్థలుగా విరాజిల్లినవి. ఒక చరిత్రకారుడు నుడివినట్లు దేవాలయము మతధర్మముల నుద్బోధించు గురుపీఠము, వేదచోదిత విద్యాప్రదానము గావించు విద్యానిలయము, మతబోధకులుపన్యాసముచేయు ఉపన్యాసవేదిక, శాస్త్రజ్ఞులు వాక్యార్థముగావించు సభాభవనము, పౌరాణికులు ఇతిహాసములు వినిపించు సత్రశాల, భాగవతోత్తములు పరమేశ్వరారాధనముగావించు పూజామండపము. సాధ్యమైనంతవరకు ప్రాచీనగ్రామజీవనము కలకబారకుండ జాగ్రత్తగ కాపాడుచు వచ్చిన మహాసంస్థ దేవాలయము.

ఆధునిక దేవాలయములిట్లే ఆదర్శవంతములై విరాజిల్లుగాక !



# సింహగిరి వచనములు

— డాక్టర్ ఎం. కులశేఖరరావు, M. A., Ph. D.
(*Reader, Osmania University.*)

ఆంధ్రభాషయందు శాంత రసమును పోషించిన భారతాది కావ్యకర్తల వలెను. శృంగార రసమునభిమానించిన ప్రబంధకర్తలవలెను భక్తిని పోషించిన కవులును, రచయితలును కలరు. భరతాది లాక్షణికులు భక్తిని రసముగా స్వీకరించకపోయినను, కొందఱు భక్తిని అభిమానించి తత్ప్రధానముగా గ్రంథరచన గావించిరి. వీరు, భక్తి, రసమగునా, కాదా, యను వివాదమును పరికించిన వారుకారు. భక్తిని రసస్థాయికితెచ్చి పరాకాష్ఠనందించిన పోతనామాత్యుని కావ్యము, ఆంధ్రులకు నిత్యపఠనీయమైనది. పోతనవంటి కావ్యకర్తలే కాక, తాళ్లపాక అన్నమాచార్యులు, రామదాసు, త్యాగరాజు మున్నగువారు భక్తిమార్గము నవలంబించి సంకీర్తనలను రచనలు గావించిరి. ఇట్లు భక్తి ఆంధ్రసాహిత్యమునకు దోహదకారి యైనది. కావ్యకర్తలను, సంకీర్తనాచార్యులను ప్రోత్సహించినట్లుగనే, భక్తి, వచనరచయితలకు కూడ కావ్యరచనాహేతువైనది. తమ యిష్టదైవముపైగల భక్తిభావముచే ప్రభావితులై, తన్మయులై పలువురాంధ్ర రచయితలు భక్తిప్రధానములైన రచనలు గావించిరి. సింహగిరి వచనములు, గంగాధరయ్య వచనములు. భవానీమనోహర వచనములు, శఠకోపవిన్నపము మున్నగు రచనములిట్లు వెలువడినవియే.

స్తుతి ప్రధానములైన యీ వచనములు రెండు విధములుగానున్నవి. విష్ణుమత ప్రతిపాదకములు మొదటివి. సింహగిరి వచనములు, వేంకటేశ్వర వచనములు, శఠకోప విన్నపములు, శేషగిరి నాధవచనములు, హృషీకేశ వచనములు, మున్నగునవి యీ కోవకుచెందినవి. భక్తిప్రేరితులై, రచయితలు, ఈ వచనములను రచించినను, దానికి పూర్వసంప్రదాయముకాని, మత ప్రభావముకాని, యేదైననున్నదాయను నంశము పరిశీలించవలసి యున్నది.

ఆంధ్రభాషకుచెందిన ఇతర సాహిత్యప్రక్రియలగు శతకము, కావ్యము సంస్కృత భాషాప్రభావమునకు లోనైనట్లుగనే, ఈవచన రచనముకూడ, సంస్కృత

మార్గమునే యనుగమించినట్లు కాన్పించును. ముఖ్యముగా వైష్ణవపరములైన యీ వచనము లిట్లున్నవి. దీనికి కొంత మతసంప్రదాయముకూడ ప్రోత్సాహమిచ్చి నది. వైష్ణవమతోద్ధారకుడు, వైష్ణవ మతాచార్యుడునగు, రామానుజాచార్యులు సంస్కృతమున విష్ణుభక్తి ప్రతిపాదకములైన గద్యములను రచించిరి. అవియే 'గద్యత్రయమను' పేరప్రఖ్యాతిని పొందినది. వీనికి శ్రీరఙ్గగద్యమ్, శరణాగతి గద్యమ్, శ్రీవైకుణ్ఠగద్యమ్ అని వ్యవహారము. వైష్ణవ మతానుయాయులలో గద్యత్రయమునకు చాల ప్రచారముకలదు. వీనిని ఆమతావలంబకులు కంఠస్థము చేయుట నేనుచూచితిని. ఇక ఆకాలమున, ఈ రచనలకు అధికప్రచారము ఉండి యుండును, తెలుగులోను, ఇట్టి నిశ్ఛందములైన రచనలు చేయవలెనని, వాని నాదర్శముగా గ్రహించిన కొందఱు రచయితలూహించియుందురు. వారు భక్తి యందును, వైష్ణవ సంప్రదాయమునందును, రచనా పద్ధతియందును రామానుజుని యడుగుజాడలలో నిట్టి రచనలు గావించిరి.

రచయితలందరికిని ఛందోబద్ధమగు పద్యరచనమీదనే యభిమానముండ వలెనను నియమమెచటను లేదు కొందఱికి పద్యమెంత సుందరముగా భాసించునో, మఱికొందఱికి వచనమంతటి యానందమును కలిగించును. ఇది రచయితలకుఁ గల వైయక్తికాభిమానముపైనాధార పడియుండును. వచనము నభిమానించిన భక్తి రచయితలు ఇట్టి స్తోత్ర వచనములను రచించిరి.

ఈ స్తుతివచనములలో, పద్యమయములగు శతకములను బోలిన కొన్ని లక్షణములున్నవి. దాదాపి వచనములందన్నిటను అంతమున సంబోధనతో కూడిన మకుటముండుట ఒకటి. శతకమునందలి పద్యములందు వలెనే, ఏవచనమున కావచనము, భావమునకు సంబంధించినంతవరకు స్వతంత్రముగా నుండుట రెండవది. శతకమునందు వలెనే, ఇందు ఒక కథకాని, వృత్తాంత మునుగాని కూర్చవలెనను నియమము లేకపోవుట మూడవది. శతకపద్యము లందలి భావముల వలెనే, మనోహర భావాన్వితముగా నీవచనములను గూడ కూర్చుట నాల్గవది. ఇట్టి విశేషములు శతకములకును, స్తుతివచనములకును సామాన్యమైనను, ఈ వచనములందు–ఒకదానిలోకూడ–సంఖ్యానియమములేదు. అందువలన వీనికి వచనశతకములను వ్యవహారములేదు. ఈ వచనములకును, శతకములకును ఇంకొక భేదముకూడ కలదు. శతకములు వైవిధ్యము కలిగినవి, శృంగారము, అధిక్షేపము, నీతి మున్నగునవి. యందుండును. కాని, యీ వచన ములు, అధికాంశములు భక్తి ప్రధానములుగానే యున్నవి. ఇట్లు కొద్దిభేదము లున్నను, వానికి సామ్యములే యధికముగానున్నవి.

ఇక రెండవ విభాగముగా చెప్పవలసినవి, శైవ ప్రధానములైన వచనములు గంగాధరయ్య వచనములు, భవానీ మనోహరవచనములు, మున్నగునవి యీ వరుసలో చేరును. ఇట్టి వచన రచనకు ఆద్యుడు వైష్ణవాగ్రేసరుడగు కృష్ణమాచార్యులు అనగా, తరువాతి స్తోత్ర వచన రచయితలకు ఇతడే మార్గదర్శకుడయ్యె ననవలసియున్నది. కాని, భిన్నమతావలంబి యగువాడు, శైవ మతాభిమానులకు మార్గదర్శకుడై నాడనుట సందేహాస్పదమే. కాని, దీనికి సమాధానము కలదు. వైష్ణవ మతాచార్యులగు రామానుజులు సంస్కృతిమున గద్య రచన చేసినట్లుగనే, దక్షిణభారతమున శైవమతప్రచారమును చేసిన బసవేశ్వరుడును వచన రచన గావించినాడు. ఇవి షట్‌స్థలవచన కాలజ్ఞాన వచన, అనుపేర ప్రఖ్యాతిని వహించినవి. షట్‌స్థల వచనము నుండి కొద్ది భాగముదాహరింతును.

"నరకెన్నెగె, తెరగల్లకె, శరీరగూడ పగదమున్న, హల్లుహోగి, చెన్నుదాగి, అన్యరిగె హంగాదమున్న; కాలుమేలె కయ్యనూరి కోలహడియదమున్న, ముప్పిందొప్పవళియదమున్న, మృత్యు ముట్టవ మున్న పూజసునమ్మ కూడలి సంగమదేవరా!"

పాల్కురికి సోమనాథాది శైవకవులు, శైవ సంప్రదాయమును పాటించి తెనుఁగున రచనలు చేసినట్లుగనే, వచనమును వ్రాయుటకు వచనకర్తలు బసవేశ్వరుని నాదర్శముగా గ్రహించియుందురు. రామానుజాచార్యుల సంస్కృత గద్యములు వైష్ణవులకు మార్గదర్శకములైనట్లే, బసవేశ్వరుని కన్నడవచనములు శైవులకు అనుగమ్యములైనవి. ఇట్టి వచన రచనము కన్నడమున అక్కమహాదేవియను కవయిత్రి చేసియున్నది. ఆమె రచనములును వారికి ప్రోత్సాహకారణములై యుండవచ్చును. ఇట్టివచనములను క్రమముగా నుల్లేఖింతును.

## సింహగిరి వచనములు

భక్తి ప్రధానములై, స్తోత్రరూపముగానుండి, సంకీర్తనాత్మకముగా నున్న వచనములలో కాలక్రమము ననుసరించి సింహగిరి వచనములు మొదటివి. నిజమునకు, స్వతంత్రమైన వచనైక రచనకు సింహగిరి వచనకర్తయే ఆద్యుడు ఈ వచనములే. కృష్ణమాచార్య సంకీర్తనములనియు. కృష్ణమాచార్య పదములనియు వ్యవహారమును పొందినవి. ఈ వచనములను రచించిన కృష్ణమాచార్యులకు వచన వాఙ్మయ ప్రథమాచార్యుడను గౌరవము కలదు. ఇంతకు ముందాంధ్ర భాషలో నిశ్ఛందములైన వచనకావ్యములు వెలువడక పోవుటయు, సంకీర్తన మార్గమున నీతడే ప్రథముడగుటయు దీనికి కారణములు.

కృష్ణమాచార్యులు వ్రాసిన సంకీర్తనములనఁబడు వచనములన్నియు లభించక పోయినను, అతడు నివసించిన కాలమును గురించియు, అతని జీవిత విశేషములను గురించియు, మనము విశ్వసించుటకు సాధ్యమైన విశేషములు తెలియుచున్నవి. కాకతీయ వంశమున చివరి చక్రవర్తియై ఓరుగంటిని రాజధానిగా జేసికొని యాంధ్రదేశమును పాలించిన ప్రతాపరుద్రుని కాలమున నీ మహనీయుడు జీవించి యుండినట్లు ప్రతాపచరిత్ర యను గ్రంథము వలన తెలియు చున్నది. తత్కర్త ఏకామ్రనాథుఁడు కృష్ణమాచార్యులకు సంబంధించిన యంశములను ఇట్లు లేఖించినాడు.

“ మఱియు నొక్కనాడు సంతూరను గ్రామంబునఁ గృష్ణమాచార్యుల తమ్ము డనంతాచార్యులు రజకస్త్రీతోఁ గూడెను. ఆరజకు డిద్దరిని బొడిచెను. అంత వారు మరణించిరి. ఆ పురి విప్రులిది శూద్రపీనుగతోఁ గూడియున్నది. గనుక మేము మొయ్యమనిరి. అదివిని కృష్ణమాచార్యులు తనమదిని విచారించి వాసుదేవమూర్తిని కీర్తన చేసెను. శవంబు తానంతటతానే కాష్టంబు వరకు జరిగిపోయెను. ఇదిగని సకల జనంబులేతెంచి కృష్ణమాచార్యుల పాదంబులకుం బ్రణమిల్లి మా యపరాధంబులు క్షమింపుమని వేడికొనిరి, ఆయయ్య నాకు రాగ ద్వేషంబులు లేవు. మీరు వెరువకుడని వచించెను. ఆవార్త ప్రతాపరుద్రుడు చారులచే విని కృష్ణమాచార్యుల రావించి పూజించి కనకగిరి సీమలో నాల్గవ భాగంబును, ౫౦ గ్రామంబుల కధికారంబును, నొక్కయూరగ్రహారంబుగ నొసంగి పంపెను.

కృష్ణమాచార్యులు సంతూరు ప్రవేశించి సకలధనంబులు పంచి పెట్టెను. కల్లూరను గ్రామంబు గట్టించెను. మూడువర్షంబు లధికారంబుచేసి గ్రామంబుల గలుగు పదార్థంబులు దెప్పించి తామ్రపత్రికలు చేయించెను. ఆ పత్రికలమీద తాను రచియించిన చాతుర్లక్ష గ్రంధంబుల చెక్కించెను. వాటిని శకటంబులపై నిడికొని శ్రీరంగంబునకు బో నుద్యోగించెను.

అంతఁ గొందఱు ధూర్తులుగూడి రాజు సముఖంబునకుఁ బోయి కృష్ణమాచార్యులు మీరలధికారంబులిచ్చిన గ్రామంబుల పదార్థంబులు దెప్పించి తామ్రపత్రంబుల జేయించి శ్రీరంగంబునకు గొనిపోవు చున్నాడని యెరింగించిరి, ప్రతాపరుద్రుండది విని యతడు మహాత్ముండు ఆతనికేమి యిష్టంబో నాకు నదే యిష్టంబని వచించి యూరకుండెను.

ఆవార్త యిష్టజనులచే నా కృష్ణమాచార్యులు విని తన మనంబున వాసు దేవుని నారాధించి యొక్క వచనంబు రచియించిన మెచ్చి యేకశిలానగరంబున గనక వృష్టిగురిపించెను. ఇదిగని ప్రతాపరుద్రుండచ్చటి జనంబులను గృష్ణమా చార్యులను బూజించి వారిచే పీడ్కొనెను. కృష్ణమాచార్యులు శ్రీరంగంబున కరిగిరి." (ప్రతాపచరిత్ర)

ఇందు కృష్ణమాచార్యులకు సంబంధించిన పెక్కు చారిత్రక విశేషము లున్నవి. శవవృత్తాంతము, కనకవర్షము అను రెండద్భుత సంఘటనముల వదలినచో, ఇతరములు చారిత్రక ప్రాముఖ్యము కలిగినట్టివే. ప్రతాపరుద్రుడు సోమనాథాదుల గౌరవించినట్లుగనే కృష్ణమాచార్యులను కూడ గౌరవించినాడు, అందుచేత నీతడు సంపన్నుడయ్యెను. అయినను ఇతని భక్తిభావమునకు లోపము రాలేదు. ఇతడు రాజకీయ ధనమును రాగిరేకులకు వ్యయించి యుండును. ఇందేమియు విచిత్రము లేదు. రామదాసు దేవాలయ నిర్మాణము చేయుట యిట్టిదే. కృష్ణమాచార్యులు రాగిరేకులపై తన వచనములను చెక్కించుటచేత ప్రేరితుడై కాబోలు, తరువాతివాడగు తాళ్ళపాక అన్నమాచార్యులు తన సంకీర్త నములనుగూడ తామ్రపత్రములపై చెక్కించెను. దీనివలన నీయంశము సత్య మనియే చెప్పుటకు సుసాధ్యముగానున్నది. మహాభక్తుడగు కృష్ణమాచార్యులు రాగద్వేషముల కతీతుడని శవవృత్తాంతము నిరూపించు చున్నది. ఇతని శ్రీరంగ ప్రయాణముననను అవిశ్వసనీయ విషయమేదియును లేదు. వైష్ణవ భక్తులందరును తమ జీవితమున నొకసారియైనను శ్రీరంగనాథుని దర్శించుట జన్మసార్థక్యమునకుఁ గారణమని భావింతురు. ఇంకొక విశేషము, ఇతడు రచించిన గ్రంథపరిమాణమునకు సంబంధించినది. ఇది 'చాతుర్లక్ష' గ్రంథము లట! గ్రంథమనగా ఒక వచనమని ప్రతాపచరిత్ర రచయిత యభిప్రాయము కాబోలు. గ్రంథమనగా ముప్పదిరెండు మాత్రలని ఒకయభిప్రాయమున్నది. ఇట్టి వచనములు, నాలుగులక్షలు ఇతడు రచించి యుండెనా యను సందేహము కలుగకపోదు. దినమునకొకటి రెండు వచనములు వ్రాసినను, కొన్నివేల వచనములనైన యీతడు రచించి యుండవచ్చును. అన్నమాచార్యులు, త్యాగరాజు, ఇట్లే అధిక సంఖ్యలో రచనములు చేయలేదా! కనకవర్షమునకు ముందు వాసుదేవు నారాధించుచు, ఈతడు 'ఒక్కవచనంబును' రచించినాడట. అనగా, ఒక వచనమున విష్ణుమూర్తిని స్తుతిచేసె ననవలసియున్నది. మిగిలిన వచనములను నిట్టివే యనుటలో సందేహము లేదు. ఈ వృత్తాంతము వలన కృష్ణమాచార్యులు తనజీవితకాలముననే గొప్పప్రఖ్యాతిని వహించి రాజగౌరవ మును కూడ పొందినాడని తెలియుచున్నది.

ఇఁక కృష్ణమాచార్యుల జీవిత కాలమును గురించి తెలిసి కొనవలసి యున్నది. ప్రతాపరుద్రుని కాలముతెలిసిన, యీతని కాలము తెలిసినట్లే. లభ్యమైన చారిత్రకాధారముల నన్నిటిని సేకరించి, విశేషముల నన్నింటిని చర్చించి, శ్రీఖండవల్లి లక్ష్మీరంజనంగారు, తామురచించిన సిద్దేశ్వరచరిత్ర పీఠికలో ప్రతాపరుద్రుని జీవితకాలమును నిర్ణయించిరి. దీని వలన ప్రతాపరుద్రుని జీవితకాలము క్రీ-శ 1254–1323 అని తెలియుచున్నది. దాదాపి దే కాలమున కృష్ణమాచార్యులును జీవించియుండును. కృష్ణమాచార్యులు ప్రతాపరుద్రుని చర్చించిన కథ సిద్దేశ్వర చరిత్రమునను కలదు. ఇది ప్రతాపచరిత్రలో నీవిషయమున భేదించుట లేదు. దీనివలన నీతడు ప్రతాపరుద్రుని కాలముననే జీవించియుండెననుట రూఢియగుచున్నది. ఈతడు క్రీ. శ. 1290 సంవత్సరమున జన్మించెనని శ్రీ నిడదవోలు వేంకటరావుగారు, కృష్ణమాచార్యులు–ఆంధ్రప్రదేశము, అను వ్యాసమున వ్రాసిరి. ఇదియు, ప్రతాపరుద్రుని సమకాలికు డీతడను నంశమును ధ్రువ పరచుచున్నది. ప్రతాపచరిత్ర వలనను, కృష్ణనామ సంకీర్తనఫలము అనుపేరితో తంజావూరు సరస్వతీమహలు గ్రంధాలయముననున్న వచన సంకలనమువలనను, ఈతఁడు 'సంతూరు' అనుగ్రామమున జన్మించినట్లు తెలియుచున్నది. ఇది దక్షిణ భారతదేశమున నున్నది. సంతూరను గ్రామము తిరునల్వేలి జిల్లాలో నొకటియున్నది. ఉత్తరార్కాడు కంగుండి డివిజనునందు కూడ నీగ్రామ మొకటికలదని తెలియుచున్నది. ఈ రెంటియందేదైనను ఈతని జన్మస్థలము కావచ్చును. ప్రతాప చరిత్రోదంతమును బట్టి, ఈ మహనీయుడాంధ్రదేశమునకు ప్రతాపరుద్రుని యాదరణమునకై వలసవచ్చి కొంతకాలము కనకగిరిసీమలో నివసించెనని తెలియుచున్నది. తిరిగి యీతడు శ్రీరంగమునకు వెడలువరకు ఇచటనే నివసించియుండునని యూహించవచ్చును.

తంజాపురియందున్న తాళపత్ర గ్రంథమందలి వచనములందు ఈతని స్వీయచరిత్ర కొంత వ్యక్తమగుచున్నది. దానిని సంగ్రహముగా వివరింతును. సంతూరను గ్రామమున నీతడు ఒక వైష్ణవ కుటుంబమున నవతరించెను. వ్యతీపాతయోగమున, పుట్టుకతోడనే అంధుడై జన్మించినాడను నెపమున జననీజనకులు దయమాలి యా బాలుని నొక పాడుకూపమున బడవేసిపోయిరి. అప్పుడు నృసింహస్వామియే కువ్వారుడను పేర సన్యాసిరూపమున వచ్చి వానిని కాపాడి యొక మఠముననుంచి, కొంతకాలము సంరక్షించెను. పిదప అతనిని సింహాచలమునకు చేర్పించెను. సింహాచలక్షేత్రము నందుండగా, నృసింహ

స్వామియే, యొక బాలునిరూపమును ధరించి, స్వామి నభిషేకించిన తీర్థమును కృష్ణమాచార్యులకిచ్చి వెడలెను. ఆ క్షీర తీర్థమును ఆరగించి కన్నులకద్దుకొనుట తోడనే, బాలుడగు కృష్ణమాచార్యులకు కన్నులు వచ్చినవి. ఆ రాత్రియే నర సింహస్వామి స్వప్నమున వరాహరూపమున నతనికి సాక్షాత్కరించి తనకు చాతుర్లక్షవాక్పూజలు కావింపుమని కోరెను. అప్పుడు కృష్ణమాచార్యులు తన పదునారవయేటనే వచన సంకీర్తనములను స్వామి యాదేశానుసారముగా రచింప బూనెను. ఈ ప్రారంభము పరాభవనామ సం॥ ఆషాఢ శుద్ధ ద్వాదశినాడు జరిగి నట్లున్నది. అనగా క్రీ. శ. 24—6—1306 తేది యగుచున్నది.

ఇట్లు కొంతికాలము జరుగగా నతనికి తన మేనమామ కుమార్తెతో వివాహము జరిగినది. ఈ దంపతులకు ఒక కుమారుడు కలిగెను. కాని యా బాలుడు ఏడవయేటనే మరణించెను. భక్తుడై, వచనములచేత భగవంతుని స్తుతిచేయు కృష్ణమాచార్యులు క్రమముగా వేశ్యాలోలుడుగా మారెను. ఇట్లుండగా పౌతకమూరు అను గ్రామమునకు చెందిన భాగవతులును, అహోబలేశుని నాట్య వినోదులునైన సోదరులాగ్గురు, కృష్ణమాచార్యులను దర్శించుటకు సింహాచల మునకు వచ్చిరి. నారాయూర కృష్ణమాచార్యుల తిరుమాళిగకొరకు వెదకి, వేశ్యా లోలుడై మోహనాంగి యను వారకాంతతో వినోదించుచుండిన, కృష్ణమాచార్యు లనే చూచి, గుర్తించలేక వివరము లడిగిరి. ఆ పుణ్యాత్ముడు పదునొకండవ యవతారమనియు, ఆతని దర్శింపవచ్చితిమనియు వారు విన్నవించిరి. పౌతక మూరి సోదరులు బహుప్రఖ్యాతులు. వారు 'పటము పన్నించి' పాడగా స్వామి వారానందించెడివారని కృష్ణమాచార్యులుకూడ వినియుండెను. కృష్ణమాచార్యులు తననుగూర్చియే వారి రాకయని తెలిసికొని, తన పరిస్థితిని పరిశీలించుకొని, పశ్చాత్తప్తుడై మనసు మార్చుకొని జ్ఞానమును బొందెను. అప్పుడు తన స్వరూప మును వారికి తెలియనీయక తిరుమాళిగ చూపింతునని తీసికొనివెడలి తాను మరియొకచోట తల, మీసములు తీయించుకొని, భక్తుడగు కృష్ణమాచార్యులుగా సాక్షాత్కరించెను. పౌతకమూరి సోదరులాయనకు నమస్కరించిరి. కాని, తామింతవరకు చూచిన శృంగారమూర్తి యాకృతి విశేషములే, యీతనియందును కానవచ్చుటచే, భయముచే చెంపలు వాయించుకొని తమ అపచారమును మన్నింప ప్రార్థించిరి. కృష్ణమాచార్యులు, వారే తమకు విరాగకారణమైరనియు, తానంతటి యోగ్యుడు కాడనియు విన్నవించుకొనెను. తరువాత నొకరినొకరు సంభావించు కొనిరి. పౌతకమూరి సోదరులు పటము పన్నించి నాట్యముచేయగా, కృషమా

చార్యులను సంకీర్తనముచేయగా, భాగవతులానందించిరి. వీరి యానందమును బాలునిరూపము నృసింహస్వామి పంచుకొనెనట. పిదప కృష్ణమాచార్యు లాలపింపగా, బాలుని రూపముననున్న స్వామి యానందతాండవ మొనరించెను. స్వామినిట్లు సాక్షాత్కరింప జేసికొనుటకు కారణము భాగవతులని కృష్ణమాచార్యులును, కృష్ణమాచార్యుల భక్తి ప్రభావముచే నాతడు ప్రత్యక్షమయ్యెనని సోదరులును పరస్పరము సంభావించుకొనిరి. తాను రచింపవలసిన చాతుర్లక్ష సంకీర్తనములలో లక్షయేబదివేలింకను వ్రాయవలసియున్నదని కృష్ణమాచార్యులు వారితో చెప్పెను. తరువాత నతడవికూడ వ్రాసియుండును. ప్రతాప చరిత్రమునందలి తామ్రపత్రి ప్రశంశనుబట్టి వానిని రాగిరేకులమీదకూడ చెక్కించెనని తెలియుచున్నది. ఈ నాలుగులక్షల సంకీర్తనములలో మనకు ఒక నూఱుకూడ లభించుటలేదు. ఇట్లు సంకీర్తనములందలి యాతని జీవిత విశేషములనుబట్టియు, ప్రతాపచరిత్రోదంతమును బట్టియు, నీ మహనీయుడు పంతూరున జన్మించి, సింహాచల క్షేత్రమున, ఓరుగంటియందును, నివసించి, చివరన శ్రీరంగము చేరెనని తెలియుచున్నది. తరువాత నాతడు తెలుఁగుదేశమునకు తిరిగివచ్చెనో లేక శ్రీరంగముననే పరమపదించెనో సరిగా తెలియదు.

ఇట్లు, ఈతని జీవితకాలమగు క్రీ. శ. పదునాల్గవ శతాబ్దమునాటికి ఆంధ్ర భాషలో వచనైకరచనలేవియు వెలుపడి యుండలేదు. అందువలననే వచనైక రచనలకు కృష్ణమాచార్యులే యాద్యుడగుచున్నాడు. వచనైక రచన చేయుట యందును, చంపూకావ్యములందిట్టి రచనలు చేయుటయందును, తరువాతివారికి కృష్ణమాచార్యులు మార్గదర్శకుడైనాడు.

కృష్ణమాచార్యులు రచించిన వచనములందు రచనాపద్ధతికి సంబంధించిన విశేషములు కొన్ని కాన్పించుచున్నవి. వచనప్రారంభమున, దేవా! అను సంబోధనముండుట యొకటి. వచనాంతములందు, ఓం నమోనారాయణా, నమోలక్ష్మీవల్లభా, అనాథపతి సింహగిరి నరహరి, నమోనమో దయానిధీ, మాయతి రామానుజముని పరందాతారు కృష్ణకు వ్వారుస్వామి సింహగిరి నరహరి నమోనమో దయానిధీ, పరబ్రహ్మ, సింహగిరి నరహరీ నమోనమో దయానిధీ, మున్నగు మకుటములు చివరనుండుట రెండవ విశేషము.

ఈ రచయిత రచించిన 'చాతుర్లక్ష' వచనములు లభించినచో అందలి విశేషములన్నియు తెలియ వచ్చెడివి. ఇంతటి సంఖ్యలో నున్న వచనములలో

నీతదనేక విషయములను చొప్పించియుండును. కాని, మనకు లభించిన పరిమిత సంఖ్యలోగల వచనములలోని వస్తువుకూడ పరిమితముగానే యున్నది. భక్తిప్రధానములైన యీవచనములను అందలి విషయమునుబట్టి యిట్లు విభజించు కొనవచ్చును. 1. వైష్ణవ మతసిద్ధాంత ప్రతిపాదకములు. 2. పురాణ సంబంధకములు. 3. వేదాంత పరములు. 4. నీతిబోధకములు. ఈ విభాగములకు సంబంధించిన వానిలో ముఖ్యమైన వానిని ఉదాహరింతును.

## 1 వైష్ణవమత ప్రతిపాదకములు

"శ్రీరామానుజ సిద్ధాంతంబునకు ఇతర దైవతాంతరమే హాని. చిత స్వరూపమునకు కావ్యమేహాని. పదభక్తికి మోహావిళంబమే హాని, మనస్సునకు చలనమే హాని. వితతన్నత్వమునకు స్వరకళంకమే హాని. స్వామి, సింహగిరి నరహరీ మీదాసులకు ఆచార్య కటాక్షము లేకుండుటే హాని. ప్రాణహాని సమయమందు భగవద్భక్తి మరవక విష్ణుపురాణములే హరికథలుగా దలంచి యితరము దలంచక సాంసారమోహభ్రాంతి సింహగిరి తలంచి పరమ పదానికేగుమా, చిత్తమా!"

"దేవా శమదమాది గుణంబులు గలిగిన బ్రాహ్మణుండుత్తముండు. శమదమాది గుణంబులు గలిగిన క్షత్రియుండుత్తముండు. శమదమాది గుణంబులు గలిగిన వైశ్యుండుత్తముండు. శమదమాది గుణంబులు గలిగిన శూద్రుండుత్తముండు. అతండే ముఖ్యుండు. (మంటి?) పురాణవాసనలు వినేము. సకల మెఱింగి ఎఱుగక మార్గమునందు సందుగలిగి యితరముగా నాచరించెడి జంతునకేదిగతి. అనాధిపతి సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ."

శ్రీ రామానుజులు ప్రతిపాదించిన వర్ణాశ్రమ ధర్మరహిత మతమునే కృష్ణమాచార్యులిందు నిరూపించియున్నాడు.

## 2. పౌరాణికములు.

"దేవా! పెద్దతనంబుసేసి మిమ్ము మెప్పించేనంటినా, జాంబవంతుండు మీ సన్నిధినేయున్నాడు దేవా. బుద్ధిననే మెప్పింతునంటినా, విభీషణుండు మీ సన్నిధినేయున్నాడు దేవా! బంటుతనంబుసేసి మిమ్ము మెప్పించేనంటినా, హనుమంతుండు మీ సన్నిధినేయున్నాడె దేవా! తీర్థంబులాడి మిమ్ము మెప్పించే

నంటినా, గంగాభవాని మీ యంగుష్ఠంబునందే యుద్భవించియున్నదే దేవా! గీత ప్రబంధములచేత మిమ్ము మెప్పించేనంటినా, కిన్నరకింపురుష గరుడ గంధర్వ సనకసనందన సనత్కుమార పరమ భాగవతులు మొదలైనవారు నార దాదులు మీ సన్నిధినేయున్నారె దేవా! ప్రదక్షిణలు తిరిగి మిమ్ము మెప్పించెద నంటినా, సూర్యచంద్రాదులు మీ సన్నిధినేయున్నారే దేవా! వేదవేద్యుండనై మిమ్ము మెప్పించేనంటినా, బ్రహ్మ మీ నాభి కమలమందుద్భవించియున్నాడె దేవా! పత్యంబులచేత మిము మెప్పించెదనంటినా, సత్యహరిశ్చంద్రుండు మీ సన్నిధినేయున్నాడె దేవా! ధనధాన్యంబుల మిమ్ము మెప్పించేనంటినా, శ్రీ మహాలక్ష్మి మీ యురమందేయున్నదే దేవా! శాంత శమదమాది గుణంబులచేత నొప్పు గలిగియుండెదనంటినా, భూదేవి మీ సన్నిధినేయున్నదే దేవా! విందులు పెట్టి మెప్పించెదనంటినా. విదుర భరద్వాజ శబరి మొదలైనవారు మీ సన్నిధినే యున్నారె దేవా! ఏకాదశీవ్రతాదుల మిమ్ము మెప్పించెదనంటినా, రుక్మాంగదుడు మీ సన్నిధినేయున్నాడె దేవా! భక్తి వైరాగ్యంబులజేసి మెప్పించెదనంటినా, ప్రహ్లాదుండు మీ సన్నిధినేయున్నాడె దేవా! వాహనారూపుడనై ధరింతినంటినా, గరుత్మంతుండు మీ సన్నిధినేయున్నాడె దేవా! మీ పాదపద్మంబులు నా కన్నులంజూచుకొని, మీ ద్వారంబు కాచుకొనియుండేనంటినా, ద్వారపాలకులు మీ సన్నిధినేయున్నారె దేవా! నేనా మిమ్ము నుతించువాడను! ఎనభైనాల్గు లక్షల కోట జీవజంతువులలో నేనొక్క నరజీవుండనే దేవా! మిమ్ము నుతింప వెయ్యి శిరస్సులు రెండువేళ జిహ్వలుగల శేషాహి నుతియించి కొనియాడుకోవలె నింతేగాక యతి రామానుజా!"

"దేవా! శ్రీమన్నారాయణ పరబ్రహ్మస్వరూప, అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకా, వేద వేదాంతవేద్యా. పురాణ పురుషోత్తమా, పురందరవంద్యా, దేవా, కపటనాటక సూత్రధారీ, మాయావినోదా, అగణిత మహిమావతారా, ఆశ్రితజన మందారా, సకల కల్యాణ గుణోన్నత, సకల జగదంతర్యామి, శ్రీమదయోధ్యా పుర వరాధీశ్వరా, దశరధ రాజనందనా, కౌసల్యాగర్భ శుక్తి ముక్తాఫలా, భరతా గ్రజా, సౌమిత్రమిత్ర, శత్రువశీకరా, శరణాగత వజ్రపంజరా, కారుణ్యవారాన్నిధీ, భక్తి ముక్తి ఫలప్రదాయకా, శంఖచక్రగదాధరా. కోదండదీక్షాగురూ, భక్త పరాధీనా, ఇక్ష్వాకు కులతిలకా, రాక్షసకుల సంహారకా, పక్షీంద్రవాహనా, దేవాది దేవా, తాటకీ ప్రాణాపహార, విశ్వామిత్ర యజ్ఞపాలకా, యజ్ఞరక్షకా, యజ్ఞ

స్వరూపా, యజ్ఞభోక్తా, సర్వవ్యాపకా, సురనికర సేవితా, అహల్యాశాప విమోచకా, పురహరచాపఖండనా, సీతాపతీ, పరశురామ బాహుబల పరాక్రమాపహరణా, పితృవాక్య సత్యపరిపాలకా, మారీచ మృగవేటకార, చిత్రకూటాద్రి నిలయా, కాకాసురవిదళనా, విరాధదైత్యహరణా, సుగ్రీవానుగ్రహా, వాలినిగ్రహా, మాల్యవంత ప్రవేశా, లవణాబ్ధి గర్వహల్లకల్లోలా, విభీషణ స్థాపనాచార్య, దక్షిణ సింధురాజ బంధన, దీనరక్షణ, ధూమ్రాక్ష విరూపాక్ష అతికాయ మహాకాయ, రావణ కుంభకర్ణాది రాక్షసకుల సంహారకా, ఇంద్రజిత్తు తలగుండుగండా, రావణగిరి వజ్రాయుధా, పంక్తికంధర శిరఃపంక్తిఖండన! విభీషణ స్థాపనాచార్య, జానకీప్రియా, పుష్పకారూఢ, అనుజసేవిత, మైథిలీసమేత, ఆనందమయ, జయ జయ రాఘవేశ్వరా, మాయతి రామానుజముని పరం దాతారు సింహగిరి నరహరీ, నమో నమో దయానిధీ."

సంబోధనాత్మకమైన యీవచనమున రామాయణ కథ సంగ్రహముగా వర్ణింపబడియున్నది.

## 3. వేదాంత భరితములు

"ద్వయమునకు అధికారి యంతటివాడు కోపము శాంతము, నిర్లజ్జ, యింద్రియ జయాపరుండు గావలెంగాక ద్వయాధికారికి అత్యంత తత్పరుల అంతఃకరణము, తానెఱుంగక దూషించు కపటాచారుండాంతిక పరుండు, ద్వయాధికారి యవును. వికారదూషణరహిత హృదయాభిమానపరుండు తాగాక, కీటకాంకుర జన్మంబుల హతుండుగాక, భాగవతాపచారంబునుం బొందక, అనాధిపతి స్వామీ, సింహగిరి నరిహరీ, నమోనమోదయానిధీ!"

## 4. నీతిబోధకములు.

"దేవా! తానుగాని దేహమందు తానని దుఃఖపడేది అవిద్యాక్లేశము. దేహాదులందు అభిమానమువలన దుఃఖపడేవి అస్మితాక్లేశము. విషయములకోరి దుఃఖపడేది రాగక్లేశము. ఈ పంచక్లేశముల జిక్కి చిక్కినాడను. ఈదుఃఖముల ద్రుంపవే పరబ్రహ్మ సింహగిరి నరహరీ, నమోనమో దయానిధీ!"

ఒక వచనమున ఫలశ్రుతి కూడకలదు.

"దేవా! ఇంద్రాది దీనంబులు (?) నూరున్ను, హిరణ్యగర్భంబులు ఇన్నూరున్ను, కాస్మిన్న (?) సిరులు మున్నూరున్ను, తిల ...నసిరులు

నన్నూరున్ను, ప్రతివ్రతలు ఏనూరున్ను, అగ్రహారంబులు ఆర్నూరున్ను, స్త్రీమూర్తులు ఏడునూర్లున్ను, ఉభయస్థోమకులు, ఎనబదినూర్నూరున్ను హేమస్త్రీ గర్భంబులు తొంబదినూర్నూరున్ను, కపిలధేనువులు వెయ్యిన్ని, కాలచక్రంబులు లక్షయున్ను, తులాపూరుషంబులు కోటియున్ను, కన్యాదానంబులు వేయికోట్లున్ను, ఇవి యన్నియుగూడా కూడిన యీ దివ్యనామ సంకీర్తన వినినందుకు వెయ్యి న్నొక్క భాగంబునకు సరిగావు. ఈ సంకీర్తనంబు ఎవ్వరువ్రాసిరి యెవ్వరు చదివిరి, యెవ్వరు వినిరి వారికి ఆయురారోగ్య ఐశ్వర్యంబులు కృపసేతువు. అటుమీద నాకిచ్చిన వైకుంఠంబు కృపసేతువు. మాయతిరామానుజముని పరం. దాతారు. అనాదిపతిస్వామీ, సింహగిరి నరహరీ, దయానిధీ!"

ఇట్లే వచనములు వేదాంతాది భావాన్వితమైనను, వీనియందు ప్రధానమైనది భక్తియే. దేవాంతర, మతాంత, సాధనాంతరముల వర్జించి వైకుంఠ వాసునే నమ్మి, 'నీపేతప్ప నితఃపరంబెరుగ'నని యర్చించుటయే యిందలి సందేశము. భాషయు చాలచోటులందు వ్యావహారిక ప్రయోగములను కలిగి యున్నది. 'ఆడుతా, పాడుతా, తిరుగుతా, మునుగుతా, లేస్తా, చదివిన్నేమి, ఆచరించిన్నేమి, వచ్చీని, కలిగీని,' మున్నగు పదములిందుకు నిదర్శనములు ఇట్టి వ్యావహారిక పదజాలము శైలీసౌలభ్యమును కలిగించి భావమును, సులభముగా, శ్రోతకు, పాఠకునికి అందించుటయందు సాయపడుచున్నవి.

వచనైక రచనలు చేయుటలో ప్రథముడైన కృష్ణమాచార్యుల ప్రభావము తరువాతి యాంధ్ర రచయితలపై స్పష్టముగా కాన్పించు చున్నది. రచనా పద్ధతియందును, భావమునందును, సంప్రదాయమునందును, ఈ ప్రభావ మితర రచయితలపై నున్నది. స్తుతివచనములు వ్రాయుటలో నీతడే యగ్రగామి యగుటవలన, ఈ సంప్రదాయమును పాటించి రచనలు చేసిన—వేంకటేశ్వర వచనములు, శఠకోప విన్నపములు, కాశికాధీశ్వర వచనములు, మొదలగునవి—రచయిత లందరును నీతని అనుయాయులే. కేవలము వచనైకరచయితలనే కాక, చంపూకావ్యకర్తలనుగూడ ప్రభావితులను చేసిన ఈతని రచనా పద్ధతి విశేషముగా ప్రాముఖ్యమును వహించు చున్నది. పోతనగారి మెంచనము కృష్ణమాచార్యుల వచనముల నెంత సన్నిహితముగా ననుసరించు చున్నదో పరిశీలించ దగియున్నది.

"దేవా! సకల పురుషాంతర్యామి రూపత్వంబువలనఁ బరమ పురుషుండ వయ్యును, నపరిచ్ఛిన్నత్వంబువలన భూత వాసుండవయ్యును, భూత మయ త్వంబువలన భూతశబ్ద వాచ్యుండ వయ్యును, జ్ఞాన విజ్ఞాన పూర్ణత్వంబుగలిగి నిర్గుణత్వ నిర్వికారత్వంబువలన బ్రహ్మంబవయ్యును, బ్రకృతి ప్రవర్తకత్వంబు వలన ననంత శక్తివై యప్రాకృతుండవయ్యును, గాలచక్రప్రవర్తకంబు వలనఁ గాలుండవయ్యును, గాలశక్తి సమాశ్రయత్వంబు వలన గాలనాథుండవయ్యును, సృష్టిజీవన సంహారాది దర్శిత్వంబు వలనం గాలావయవ సాక్షివయ్యును నొప్పు నీకు నమస్కరించెదము" (భాగ-దశమ-పూర్వ-680)

మొదట సంబోధన, తరువాత మహిమాభివర్ణనము, అంతమున శరణా గతి లేక నమస్కారము. ఇదేక్రమ మిచ్చటను పాటింపఁబడినది. కృష్ణమాచా ర్యుల వలె పోతనయు విష్ణుభక్తుడును, వైరాగ్యభావము గలవాడు నగుటవలన తనకు పూర్వుడైన కృష్ణమాచార్యుల ననుసరించె ననుటలో సందేహము లేదు. సమానగుణములు కలిగిన యాతడు అనుసరణీయుడు కూడ.

తాళ్ళపాక పెదతిరుమలాచార్యులు, కృష్ణమాచార్యుల రచనాపద్ధతిని, సంప్ర దాయమును పరిపూర్ణముగా అనుసరించె ననుటకు అతడు రచించిన వేంకటే శ్వర వచనములే సాక్ష్యములు. కొన్ని వచనములు-పెదతిరుమలయ్య రచించినవి- కృష్ణమాచార్య వచనములకు ప్రతిబింబభావమును వహించునంత దగ్గరగా నున్నవి. వచనముదాహరణీయము.

"శ్రీజనార్దనా! శ్రీభూనీళాసమేతా! శంఖచక్రగదాఖడ్గశార్‌ఙ్గ కాయుధ ధరా! చతుర్భుజా! శ్రీకౌస్తుభమణి శ్రీవత్సశోభితవక్షా! పీతాంబరధరా! మణికిరీట మకరకుండలాభరణా! వైజయంతీ వనమాలాభరణా! పుండరీకాక్షా! అనేక బాహూదరశిరః పాణి పాదోరుజంఘావయదా! విశ్వరూపా! అనంత గరుడ విష్వక్సేనాదినాయకా! సనకసనందన సనత్కుమార సనత్సుజాత సల్లాపా! నారదగానప్రియా! నీలమేఘశ్యామలా! చతురానన జనన నాభీసరోజా! గంగా నదీ కారణ శ్రీపాదపద్మా! భక్తవత్సలా! వేదోద్ధారకా! వైకుంఠపురవరాధీశ్వరా! అసుర శిక్షకా! అమర రక్షకా! జగన్నివాసా! జయ జయ, నీకు ననంత నమ స్కారంబులు సేసెద. అవధారు శ్రీవేంకటేశ్వరా!" (వేం. వ. 22)



అనన్యశిలా కళాప్రతిభతో నూతనముగా నిర్మించబడిన గర్భ దేవాలయము.



కళ్యాణ మంటపముయందు అతి ఆకర్షణీయంగా చెక్కబడిన
" జనకమహారాజు కన్యాదానము " శిల్పము.



కళ్యాణ మంటపము మరొదిశయందు మలచబడిన
“శ్రీరామ పట్టాభిషేకము.”



కళ్యాణ మంటపము మరొకదిశయందు అతినయనానందంగా చెక్కబడిన
“శ్రీ సీతారాముల పాణిగ్రహణము.”

రచనాపద్ధతియందు, కృష్ణమాచార్యులు రచించిన "దేవా! శ్రీమన్నారాయణ పరబ్రహ్మస్వరూప! అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకా! అను వచనమున కిది ప్రతిబింబముగా నున్నది.

తాళ్ళపాక అన్నమాచార్యుల సంకీర్తనములందును, కృష్ణమాచార్యులు ఉపయోగించిన భావములు స్పష్టముగా కాన్పించుచున్నవి. ఇవి తులనాత్మకముగా పరిశీలించ దగియున్నవి.

"శ్రీవైష్ణవులె పరమసాధకులు, శ్రీవైష్ణవులె బ్రాహ్మణులు. హరిభక్తి లేని విద్వాంసుని కంటెను, హరికీర్తనముసేయు గులజుండు శ్వపదైనన్నేమి? ఏవర్ణంబైనన్నేమి? దేవా! మీ చరణయుగళసేవకు ఏ కులజుండైన న్నేమి?"

ఈ భావములు అన్నమాచార్యుల పదములందిట్లు ప్రతిఫలించినవి.

"అణురేణు పరిపూర్ణుడైన శ్రీవల్లభుని
బ్రణుతించువారువో బ్రాహ్మలు"

"కొంచెమును ఘనముఁగను గొననేల హరిఁదలచు
పంచమహాపాతకుఁడె బ్రాహ్మణోత్తముఁడు॥

వేదములు చదివియును విముఖుఁడై హరికథలు
నాదరించని సోమయాజికంటె
ఏదియును లేని కులహీనుఁడైనను విష్ణు
పాదసేవకుఁడువో బ్రాహ్మణోత్తముఁడు॥

పరమమగు వేదాంత పఠన దొరికియు సదా
హరిఁదలచలేని సన్యాసికంటె
మఱిగి పసురము దినెడి మాలయైనను వాఁడె
పరమాత్ము గొలిచినను బ్రాహ్మణోత్తముఁడు"

ఇదివరకు నుదాహృతమైన "దేవా! పెద్దతనంబుచేసి మిమ్ము మెప్పించెద నంటినా జాంబవంతుండు మీ సన్నిధినే యున్నాడె దేవా!" అను వచనమందలి భావమీపదమున నెట్లు ప్రతిబింబించనదియో గమనింపఁ దగియున్నది.

" రామరామరామ కృష్ణరాజీవలోచన నీకు
దీమువంటి బంటన నే తేజమునాది ॥

వారిధిదాటి మెప్పించ వాయుజుండనేగాను
సారె జవుల మెప్పించ శబరి గాను
బిరాన సీతనిచ్చి మెప్పించ జనకుండగాను
యేరీతి మెప్పింతు నన్ను నెట్లుగాచేవో ॥

ఘనమైన మోచిమెప్పించ గరుడుండ నేగాను
కొనగాను సుఖమియ్య గోపికంగాను
వినుతించి మెప్పించ వెయినోళ్ళ భోగిగాను
.... .... .... .... .... .... .... .... .... .... .... ....
నవ్వుచు బాడి మెప్పించ నారదుడగాను
అవ్వల ప్రాణమియ్య జటాయువుంగాను.

అసంఖ్యాక వచనములు వ్రాసి, ఆంధ్రదేశమున వైష్ణవభక్తిని వ్యాపింపఁ జేసిన కృష్ణమాచార్యులు తరువాతి రచయితలను, ప్రభావితులను చేయుటలో వింతలేదు. ఈ ఉదాహరణము లన్నియు, కృష్ణమాచార్యుల యాధిక్యమును తరువాతి వారంగీకరించిరనియును, తన కాలముననుు అనంతరకాలమునను ఈతనికి, ఈతని రచనలకు విశేషప్రాచుర్యము ప్రజాదరణ నుండెడిననియు చాటు చున్నవి.

తాళ్ళపాక పెదతిరుమలాచార్యులవారికిఁ గుమారుఁడయిన చినతిరుమలాచార్యులు సంకీర్తన లక్షణము అను గ్రంథమును తెనుఁగు వ్రాసియున్నాడు. అందు కృష్ణమాచార్యుల వచనముల ప్రసంగమున్నది. " మఱియుఁ జూర్ణాఖ్య పదంబెట్టిదంటేని.

" ధర కృష్ణాచార్యాది పరికల్పితపదము తాళబంధచ్ఛందో
విరహితమై చూర్ణాఖ్యంబరగునది నిరుక్తనామ భాసితమగుచుకా.

" మఱియుందచ్చూర్ణవిధం బెట్టిదనిన :

ఛందోగణముల నియతింబొందక తాళప్రమాణమున గడుచెలువై
కొందఱిచేఁదచ్చూర్ణం బందముగాఁ దాళగంధియనఁ బొగడొందన్"

ఈ లక్షణము ననుసరించి కృష్ణమాచార్యులు రచించిన చూర్ణపదములు-అనగా వచనములు-నిరుక్తనామ భాసితమై, తాళబంధచ్ఛందో విరహితమై యుండును. ఇట్టివానికి చూర్ణములని పేరు. (భరతుడు=వచనమును చూర్ణమని వ్యవహరించియున్నాడు) ఇది వచన నిర్వచనమునకు సరిపోయినది. రెండవ పద్యమున వీనికి తాళగంధి యనుపేరును కలదని యీతడు తెల్పెను. ఇవి గేయములు మాత్రము కావు. ఇవి 'ఛందోగణములనియతిం' పొందకపోవుటయే దీనికి కారణము. దీనివలన కృష్ణమాచార్యుల వచనములు ఛందోబద్ధములు కావు కాని, కొన్ని తాళలయానుగుణముగా నుండునను భావమును గ్రహించవచ్చును. చంపూకావ్యములలం గలి వచనము ఛందోబద్ధములు కాకపోయినను, అచ్చటచ్చట కొన్ని వచనములు పద్యగంధులుగా కాన్పించుచుండును. అట్లే కృష్ణమాచార్య వచనములందు కొన్ని తాళమునకొదిగి పాడుకొనుట కనువుగానుండును. ఒకటి మాత్ర ముదాహరింతును.

"ఒకపరి మిమ్ము నెరుంగుదుమయ్యా
ఒకపరి మిమ్ము నెరుంగమయ్యా
జ్ఞానిని చేయుమయా—అ
జ్ఞానిని చేయకుమయా
పుణ్యంబిది పాపంబిది-స్వర్గంబిది నరకంబిది

అనాచారంబిది యాచారంబిది-నిషేధమిది యనిషేధమిది."

ఇది తాళమునకొదిగి గీతమువలె నున్నదికదా! ఇట్లెన్ని ప్రశస్త గుణములు కలిగిన కృష్ణమాచార్య వచనములు, కాలమునందేకాక, రచనా విశేషములందును అగ్రగాము లనిపించుకొనుచున్నవి. నిజముగా 'చాతుర్లక్ష' వచనములు మనకు లభించిన ఇంక నెన్నివిశేషములు తెలిసియుండునో!

కృష్ణమాచార్యులు, సింహగిరి వచనములనే కాక, విష్ణునామ సంకీర్తన, రామనామాలు, నృసింహనామాలు, రామాయణ కథాగేయాలు అను రచనలుకూడ చేసినట్లు తెలియుచున్నది. వానిని గురించి యింకను పరిశోధనము జరుగవలసి యున్నది.





# దేవాలయముల ప్రాశస్త్యము

★

ఇరివెంటి కృష్ణమూర్తి, ఎం., ఏ.
(ఆంధ్రోపన్యాసకుడు, హైదరాబాదు సాయంకళాశాల.)

దేవాలయములు పురాసంస్కృతీ నిలయములు. పురాణేతిహాసముల సచిత్ర వ్యాఖ్యానములు, శిల్పకళామతల్లీ వల్లరులు వ్రాసినపందిళ్లు. ప్రాచీనులు భగవద్దత్తములైన కళాప్రతిభలను దేవాలయములయందు ప్రదర్శించి, తరించి శాశ్వత కీర్తిని సముపార్జించుకొనిరి. నాటిజనుల దైనందిన జీవితసమస్యలు దేవాలయములతో పెనవేసికొనిపోయినవి. గుడియేబడి, గుడియేగడి. రాజులకు తమ కోటలకంటె దేవాలయములే భద్రమైనచోట్లు. ప్రాయికముగా ప్రజలు నిరక్షరాస్యులుగ నుండినను వారికి జీవితసాఫల్యమునకు కావలసిన చతుర్విధ పురుషార్థములగూర్చిన జ్ఞానమును ఆ దేవాలయములే ప్రసాదించుచుండినవి.

నృత్యము, సంగీతము, శిల్పము, కవిత్వము మున్నగు కళలకు దేవాలయములు పట్టుగొమ్మలై తేజరిల్లినవి. నాటి హిందువుల సర్వస్వము దేవాలయములు. వానిని సంరక్షించుకొనుటయే, తమను తమసంస్కృతిని తమ వ్యక్తిత్వమును సంరక్షించుకొనుటయేనని వారు విశ్వసించియుండిరి. గుళ్ళలోని దేవుళ్ళు, దేవేరుల నగ, నట్ర కేవలమలంకార ప్రాయములని వారు తలచియుండలేదు. తమ ప్రాణముకంటె అధికమైన మతముపై కత్తిగట్టి కయ్యానికి కాలు దువ్వి, దక్షిణాపథమును రక్తప్లావితము చేయుటకై దండెత్తివచ్చిన ఇస్లాము శక్తికి ఎదురొడ్డి నిలిచి విశాలమైన హైందవ సామ్రాజ్యమును స్థాపించిన విజయనగరాధీశులకు తొలుదొల్త అంగబలమును అర్థబలమును చేకూర్చినది హంపీ విరూపాక్షస్వామి దేవాలయ భాండాగారమే.

లోకహితమునకై సిరిగలవారు ఎన్నియో ధర్మకార్యములు చేయవలయును. ఆది నాటి ధనాఢ్యుల పరాకాష్ఠ. చెరువు త్రవ్వించుట, నిధిని నిక్షేపించుట, అగ్రహారములనిచ్చుట, దేవాలయప్రతిష్ఠాపనము వనమును వేయించుట కావ్యరచనము లేక కావ్య స్వీకారము, పుత్రసంతానము. ఈ యేడింటిని సప్త సంతానములందురు. ఒక మహోత్తరమైన ఆకాంక్ష ఈ సంతానములను గుర్తించుటలో నిమిడియున్నది. మహారాజులు దండనాథులు శత్రుంజయార్థమును, శత్రుదమనము తరువాతను, మరికొన్ని పవిత్ర సందర్భములందును దేవాలయములను కట్టించి ధూపదీప నైవేద్యములకు ఆచంద్రతారార్కము లోటు లేకుండ ఏర్పాట్లుచేసి శాసనములను వ్రాయించి తమ భక్తివిశ్వాసములను ప్రకటించుకొనిరి. ఆ శాసనములలో దేవాలయారాధనమునకు భంగము కలిగించినవారు కాశిలో గోహత్య చేసినవారగుదురనియు, ధర్మచ్యుతులగుదురనియు వ్రాయించిరి. దేవస్థానములు నాటి ప్రజలకు ప్రతిష్ఠాహేతువులు, ఆస్తికత్వమునకెత్తిన వైజయంతికలవి.

పవిత్రములైన నదీతీరములయందును మహోన్నతములైన గిరిశిఖరములయందును సాగరతీరములయందును ఎక్కువగా ఈ దేవాలయములు వెలసినవి. మానవుని సౌందర్యపిపాస యట్టిది. తన మనస్సు ఎచ్చట ఊహాలోకమునకు ఉవ్వెత్తుగా ఎగిరిపోవునో అచోటునతడు ప్రేమించెను. అచట గుడిని నెలకొల్పి తన దేవుని నిలిపి ఆ దేవునిలో తన్ను చూచుకొనెను. వేదర్షులకు ప్రకృతియే దేవాలయముగా భాసించినది. ఉషోరేఖలు, తటిల్లతలు, జలదమాలికలు, మహోన్నతాద్రికూటములు, మహావేగముతో పరువులెత్తెడు నదీనద సముదాయము మహాజలప్రపాతాల విద్యుత్సంగీతము వారి మనః ఫలకములపై చెరిగిపోని చిన్నెలై రూపొందినవి. ఈ ప్రకృతి లీలలలో వారు పరమాత్మను దర్శించి మంత్రములతో ప్రార్థించిరి. పిదప ఆ ప్రకృతి శక్తులకు రూపకల్పనచేసి ఆరాధించిరి. వారిదృష్టిలో జీవుడే ఒక దేవాలయముగ భాసించెను. పరహితాచరణముచేత, తపస్సుచేత, త్యాగముచేత, జ్ఞానముచేత ప్రకాశించుదేహము దేవతలకు స్థావరముకాదా? బాహ్యాభ్యంతర శుచిచేత మానవదేహము దర్శనీయమై పుణ్యప్రదమై, కల్యాణదాయకమై, కల్పవృక్షమై ప్రకాశించును. కనుక దేహమును స్వచ్ఛతమముగా ఉంచుకొనగలిగినప్పుడే అతనిలోని శక్తులు సర్వవిధముల వికాసమునుపొంది భాస్వంతమగును. దేహమెట్లో సంఘముకూడనట్లే; సామూహికమైన ప్రార్థనలకు ఆరాధనలకు యజ్ఞయాగాది మహాక్రతువులకు

దేవాలయము కేంద్రమై విలసిల్లినది. దేవాలయము సామాజిక సమైక్యతకు కేంద్రము. దేవాలయములపట్ల ప్రజాబాహుళ్యమునకు అనాదినుండి ప్రేమ, భక్తి గౌరవములు సహజముగా నేర్పడియుండుటచేత అది అందరికిని ఉపయుక్తమైన సంస్థగా రూపొందినది. సమాజమునకు కావలసిన వస్తు సముదాయము సమకూర్చుటకు దేవస్థానముల సాధనములయ్యెను.

ప్రాచీనులు దేవాలయ నిర్వహణమునకు కట్టుబాట్లను కొన్ని ఏర్పరచి లోకహిత దృక్పథము ననుసరించి ఆ దేవాలయము నొక సంస్థగా అవతరింపజేసిరి. ఈ దేవాలయ సంస్థాపనము, నిర్వహణమునకు ప్రత్యేకముగా శాస్త్ర మేర్పడెను. అదే ఆగమశాస్త్రము. జగత్కల్యాణ సంధాయకములగు దేవాలయములకు, దేవతా విగ్రహ నిర్మాణమునకు, వాని స్థాపనలకు దేవతాసాన్నిధ్యము రూపొంది పెంపొందుటకై చేయదగు పూజా ప్రకారములను తెలుపుశాస్త్రమే ఆగమశాస్త్రము. మరి ఈ శాస్త్రమునకు సంబంధించినట్టి కళలుగాని విద్యలుకాని లేవనుట పొసగని మాట. ఆగమశాస్త్ర విషయములు సర్వజనానుభవమునకు సంబంధించినవి. దనుక సాక్షాత్కార సంపాదనమునకై మార్గదర్శకములై వర్ధిల్లినవి. ఈ యాగమ శాస్త్రములు అనాదికాలమునుండియే ప్రకృతి శక్తులలో అంతర్నిహితములై, నిక్షిప్తములై యున్న దేవతాశక్తుల నాకర్షించి, ఆహ్వానించి పూర్ణకుంభములందును, ద్వారబంధములందును, యంత్రముల యందును దేవతా విగ్రహముల యందును నిక్షేపించి నిత్యారాధనలతో, శోడశోపచారములతో, జపతపాదులతో, ఆశక్తుల నుద్దేశింపజేసి సర్వజీవుల అభీష్టములనుతీర్చు నద్భుతశక్తిని ప్రదర్శించుచున్నవి. దేవాలయములా యద్భుతశక్తికి మనికిపట్టులు.

పాడిపంటలకును, దేవాలయ నిర్వహణమునకును విడదీయరాని సంబంధ మేర్పడి జనుల కౌటుంబిక, ఆర్థిక జీవనము దేవాలయాశ్రితమై జనులలో ధర్మభీతి, మతానురక్తి పెంపొంది ధర్మ పరిపాలనకు అనువైన వాతావరణము కల్పింపబడెను. తోటలు, గోశాలలు, మున్నగునవి నేరుగా దేవస్థానములకే అంకితమై యుండెడివి.

తిరునాళ్ల సందర్భమున, ఉత్సవముల సందర్భమున వాణిజ్య వ్యాపారములకవకాశములు కలుగుచుండును. వివిధ గ్రామములకు రహదారులేర్పడును ఆచార వ్యవహారములలోని వైవిధ్యములను, అనేక భాషావిన్యాసములను, విచిత్ర

వస్తు సందర్శన క్రయవిక్రయావకాశములను ఈ తిరునాళ్ల ప్రజలకందించినవి. యోగులు, సన్యాసులు ఎందరో ప్రజలలో ధర్మాభిరతిని ప్రచారము చేయుటకు అవకాశము కలుగుచుండెడిది.

దేవాలయములు విద్వాంసులకు నిలువనీడలై వర్ధిల్లినవి. విద్యార్థులు, గురువులు, దేవాలయములందు తమ విద్యా వ్యాసంగములను సాగించిరి. దక్షారామము, సింహాచలము, శ్రీకూర్మము, శ్రీశైలము, శ్రీకాకుళము, అహోబిలము, తిరుపతి, శృంగేరి, నాగార్జునకొండ, అమరావతి, అజంతా, కాశీ, నవద్వీపము, ద్వారక, మధుర, మున్నగు పుణ్యక్షేత్రములలో విద్యాసంస్థలవెలిసి సంప్రదాయ సిద్ధమైన ఆర్షవిద్యలకాలవాలములై పరిఢవిల్లినవి. బౌద్ధుల, జైనుల ఆరామములు, ఆశ్రమములు, విహారములు చైత్యములు దేవాయతనములు హిందువుల దేవాలయములవలెనే జాతీయ జీవనమునకు భక్తిని, ముక్తిని, రక్తిని ప్రసాదించి ఆత్మశక్తిని ఉద్బుద్ధముచేసినవి.

దేవాలయ శిఖరములు, గాలిగోపురములు, ఒకదానికంటె నొకటి ఉన్నతములై ఆకాశమును చుంబించు చున్నట్లగుపడుచుండును. ఊర్ధ్వలోకముల వైపు మానవుడు ముక్తినాశించి ప్రయత్నశీలుడగుచుండునను పరమసత్యము నీ గాలిగోపురములు ఎలుగెత్తి చాటుచున్నవి. శ్రీరంగ దేవాలయపు గాలిగోపురము నధిరోహించి శ్రీమద్రామానుజాచార్యులు విష్ణుపంచాక్షరీమంత్రమును ఎలుగెత్తి ఉచ్చరించి మానవజాతిని పూతమొనర్చియుండిరి. శ్రీశైల శిఖర దర్శన మాత్రముననే జన్మరాహిత్యము లభించునని హిందువుల విశ్వాసముకదా! ఈ శిఖరములపై కలశములు కళ్యాణప్రదములై విలసిల్లు చుండును. శిఖర వేదికలపై పురాణగాథలు, దేవతా ప్రతిమల దర్శనమిచ్చుచుండును. దేవాలయములకు సంబంధించిన క్షేత్రమాహాత్మ్యములు నవరసభరితములై, భక్తిభావబంధురములై భక్తుల హృదయములను పునీతమొనర్చి మోక్షప్రాప్తికి నర్హులచేయుచుండును. కాళహస్తికన్నడు, భద్రాద్రి గోపన్న, తిరుమల అన్నమాచార్యులు, మొవ్వ క్షేత్రయ్య, మున్నగువారు తమ భక్తిభావములను ఆయా దేవాలయకుడ్యములపై ముద్రించినారు. చెవులున్నవారు, కనులున్నవారు, హృదయమున్నవారు నేటికిని ఆ మహాభక్తుల అమృతవాణిని స్ఫటికాచ్ఛమైన జీవితమును దివ్యానుభూతిని కనగలరు, వినగలరు, అనుభవించగలరు. కనుకనే ఈ దేవాలయములు నేటికిని సంస్కృత హృదయములను ఆకర్షించుచునే యున్నవి. దివ్యక్షేత్ర

సందర్శనము మూఢవిశ్వాసమని నిరాదరించువాడు తన సంస్కృతిని తన సంప్రదాయమును, తన వ్యక్తిత్వమును, తన సామాజిక దృక్కోణమును తమ పరహిత చింతను తృణీకరించువాడని వేరుగ చెప్పవలసిన అగత్యము లేదుకదా ?

గృహస్థులేమి, బ్రహ్మచారులేమి, సన్యాసులేమి దివ్యక్షేత్ర సందర్శనము పవిత్రతీర్థసేవనమును ఆవశ్యాచరణముగ బెట్టుకొని ఈ నెపమున తమదేశము నెల్ల కన్నులారచూచి జ్ఞానసముపార్జనము చేసికొనిరి. జానపదగాథలలో ప్రాచీన కథా సాహిత్యములలో తీర్థయాత్రప్రసక్తి ఎంతో ప్రాముఖ్యమును వహించి యున్నవి. అవతారపురుషులైన రామకృష్ణాదులుకూడ తీర్థసేవనము గావించి ఆయా తీర్థక్షేత్రముల మాహాత్మ్యములని నుమడింపఁ జేసిరి.

దివ్యతీర్థ నామోచ్చారణముచేతనే సర్వపాపములు నశించును. తీర్థయాత్ర లెట్లు చేయవలయునో, యాత్రాస్థలములందు పాటింపవలసిన నియమము లెవ్వియో పురాణములందు ఘోషింప బడియున్నవి. మున్యాశ్రమములలో భవ్యపురుషుల దర్శనముచేయవలెను. కేవలము భౌగోళిక సౌందర్యము నాస్వాదించు తలపుతో యాత్రలు చేయుటవలన ఆత్మోన్నత్యము లభించదు. చతుర్వర్ణముల వారు నాల్గు ఆశ్రమములవారు అందరును తీర్థయాత్ర చేయదగిన వారే.

భారతదేశము పుణ్యభూమి, కర్మభూమి, స్వర్గమునందు ఒక కల్పము సుఖముగా నుండుటకంటె భారతదేశమున జన్మించి అల్పకాలముండినను చాలునని భాగవతము నంచున్నది. ఆ సేతుశీతనగము సహస్రసంఖ్యలలో నున్న దేవాలయములను పుణ్యనదులను సేవించి జాతికి జీవగర్రలై నాటి పౌరులు వెలసిరి.

నిన్నమొన్నటివరకు ప్రజలకు క్రమశిక్షణము, ధర్మ పరాయణత్వమును ప్రసాదించినవి దేవాలయములే కదా ! ప్రాచీనుల దృష్టిలో జ్ఞానము అనగా దేవుని స్వరూపమును తెలిసికొనుట. మరి కళయనగా ఆదేవుని ఆరాధించు ప్రయత్న విశేషము. వారును ఊహ్నేలిరి. ఊహాతీతములైన శిల్పమునకు రూపకల్పన చేసిరి. సౌఖ్యములనుభవించిరి. జీవిత పరమార్థమును కోల్పోవక బ్రతుకుబాటలను చక్కదిద్దుకొనిరి. ఇట్టి మహోన్నతాదర్శములు కలిగియున్న నాటి ప్రజల జీవిత దృక్పథమునకు, లక్ష్యమునకు ఆచరణమునకు ఈ దేవాలయముల ప్రతిబింబములనుటలో అతిశయోక్తియుండునా ?

జాతీయ పునరుజ్జీవనమును గూర్చి ప్రసంగములు సల్పువారు, దేవాలయ పునరుద్ధరణమునకు పూనుకొని జన సామాన్యమునందు ఆస్తికత్వమును సంపాదింపకపోయినచో భారతీయులు నేటివరకు నిలుపుకొనుచు వచ్చుచున్న పార్థక్యము, వైశిష్ట్యము నశించిపోగలవని చెప్పుట సాహసోక్తి కానేరదు. మనకిప్పుడేమి మిగిలినది? అన్ని రంగములలో పాశ్చాత్యులను గ్రుడ్డిగా అనుకరించుటలోనే మనకు ముక్తియున్నదని ఇప్పటి విద్యావంతులలో పలువురను కొనుటయేకాదు ప్రచారముకూడ చేయుచున్నారు. దీర్ఘకాల దాస్యమువలన మనకీ గతి సంప్రాప్తమైనదని పదిలముగ నాలోచించినవారికి అవగతము కాకపోదు.

మనకింకె మధురముగ, సుందరముగ, ప్రజాహితపరముగ స్వేచ్ఛామయముగా నిత్యజీవితము గడుపుటకు ప్రాచీనులకు మార్గదర్శకములైన దేవాలయ సంస్థల నిర్వహణా విధానములను పరిశీలించి నేటి పరిస్థితుల కనుగుణముగా మార్పులు చేర్పులుచేసి జాతిని జాగరితము చేయుటకు దక్షులైనవారు ప్రయత్నింతురని ఆశాభావమున వెల్లడించవచ్చును గదా!



ఓమ్

# శ్రీ భద్రాద్రి రామనామ మహిమ

— పండిత పెన్మెత్స సత్యనారాయణరాజు.

నేడు భారతవర్షము సర్వతోముఖ సంస్కరణముగోరి చిత్త సంక్షోభము పొందుచున్నది. పురాతన నవీన కాలములకు పోరాటము జరుగుచున్నది. దీని వల్ల కలుగుచున్న పరివర్తనములకు లెక్కలేదు. సంఘము కదల నారంభించి నది. ప్రాతపద్ధతులు పోయి క్రొత్త యాచారములు వచ్చుచున్నవి. చిత్తమున శాంతి లేదు. సంఘములో నైమిత్యము లేదు. సాధనసాధనములకు సామంజ స్యము లేదు. త్రోవలు పెక్కులైనవి. లక్ష్యములు వ్యత్యస్తములైనవి. మార్గ దర్శకు లనేకులు వచ్చుచున్నారు. కార్యకారులు వివిధ సానములు నిర్మించు చున్నారు. కాని మార్గదర్శకులు వచ్చినకొలదియు కర్మక్షేత్రము చీకాకు పడు చున్నది. ఏ కార్యమునకు స్థిరత్వము కుదరకున్నది. ప్రచండమారుతమున సంక్షుభితమగు జలధిభంగి, భారతవర్షమున పెక్కు మతములు, నానా సంప్రదా యములు, అనేక పరివర్తనలు, సభలు, మఠములు, మార్గములు, ఉపాసనలు, సంస్కరణములు, తరంగముల వలె లేచి పెరిగి విరిగి తిరిగి అవ్యాకృతమగు హిందూమత సాగరములో పడుచున్నవి. హిందువనగా అహింసానిరతుడని అర్థము. [హింసయాదూయతే తస్యత ఇతి హిందుః=అహింసానిరత ఇత్యర్థః]

భారతవర్షమును కదలించుచున్న సర్వసంస్కరణములను తిరిగి నూతన దృష్టితో పరిశీలించవలసిన తరుణమాసన్నమైనది. సర్వోద్యమములకును సామ రస్యము కలిగింపవలసియున్నది భారతవర్షముయొక్క సాంఘిక ఆర్థిక రాజ కీయ, పారిశ్రామిక పారిజ్ఞానిక ఆధ్యాత్మిక లక్షణములను గ్రహించి విశాల విశ్వ మానవజాతికి ప్రత్యేకమైన పరిజ్ఞానమును ఆధ్యాత్మిక సంపత్తిని అర్పించ వలయును.

ఈశ్వరు డెట్లు నిత్య శుద్ధముక్త బుద్ధస్వరూపుడై యున్నాడో అట్లే ప్రతి మానవుడును స్వతంత్రుడై ముక్తుడగు స్వభావము కలిగియున్నాడు. స్వాధీనత

మనుజుని 'జన్మహక్కు' అది యీశ్వర ప్రసాదితమైనది. మనుజుడు దేవుని ఛాయ కాదు. బ్రహ్మపదార్థము. దైవము నిత్యముక్త స్వతంత్రుడైనట్లు మనుజుడు స్వతంత్రుడు నిత్యుడు.

స్వాతంత్ర్యమనగా నిగ్రహము లేకపోవుట కాదు, ఆత్మ నిగ్రహము స్వాతంత్ర్యమనగా నియంతృత్వవిహీనము కాదు. స్వయం నియంతృత్వము. స్వాతంత్ర్యమనగా ఆత్మనిశ్చయవిహీనత లేదు స్వాత్మనిశ్చయము.

భూలోకమునందలి నాగరికజాతులన్నియు బలమందును, ఐశ్వర్యమందును, ముందంజవేయుచు అశాంతవిశ్రాంతములగు పేరు ప్రతిష్ఠలను వహించియుండగా మనమేమియు చేతకానివారివలె కాళ్లుచాచుకొని దిగాలుపడి ఆకాశమువంక చూచుచున్నాము, మనపూర్వుల వేదాంతమును, ఆముష్మిక పరత్వమును దీనికి కారణమని ఆధునికులు కొందఱందురు. ఇది కేవలము పొరపాటు.

సర్వాంతర్యామియైన సర్వేశ్వరుని చిద్విలాసంబులు మహానుభావుల జీవితంబులయందు ప్రతిబింబితంబులగు చుండును.

సకల దేశములందును వీరులు, శూరులు, కవులు, పండితులు, మతస్థాపకులు, సంస్కర్తలు, భక్తులు పుట్టి దేశము నుద్ధరించి, ప్రజావబోధమును గావించిన విధము ఇతిహాస ప్రసిద్ధము. శ్రీరామాది శూరాగ్రేసరుల పవిత్ర చరిత్రము లార్య సాహసధైర్యములకు నిదర్శనములు కాళిదాసాది కవి శేఖరుల మహాకావ్యములు మనోజ్ఞభావములకాకరములు. శాయనాచార్యాది పండితవర్యుల మేధాసంపద బుద్ధావైభవమునకు దోహదము. బౌద్ధ మతస్థాపకుల తత్త్వోపదేశము తరుణోపాయమునకు మూలము. రామానుజాచార్యాద సంస్కర్తల శ్రేష్ఠాచరణములు సౌహార్ద్రమునకు ప్రమాణములు శివాజీ మున్నగు దేశభక్తుల మహాత్యాగము దేశభక్తికి పవిత్ర నిదర్శనము. పోతరాజు రామదాసు మున్నగు భగవద్భక్తుల భాగవత కథనములు పరమానందకరములు.

కందమూలములను మాత్రమే ఆహారించి 'కృషితోనాస్తి దుర్భిక్షమ్మని' చాటిన పోతన ఎంతటి మహాత్ముడో మనమెఱిగినదే కర్ణాట కిరాట కీచకులకు తన భాగవత మీతలంచినప్పుడతనికి సరస్వతి కాటుకకంటినీటితో ప్రత్యక్షమైనది. భక్తవరుడైన పోతన తల్లీ! ఓ హాటక గర్భురాణీ! బాలరసాలసాల నవపల్లవ కోమల కావ్యకన్యకను మనుజాధములకిచ్చి పురములు వాహనములు పుచ్చుకొని

కాలుచే సమ్మెటపోటులు పడను త్రిశుద్ధిగ నమ్ము భారతీ అని ప్రతిజ్ఞ చేసినాడు. పవిత్ర జీవనము గడపినాడు. 'పలికెడిది భాగవతమట, పలికించెడు వాడు రామభద్రుండట, నే పలికిన భవహరమగునట—పలికెద వేరొండుగాథ పలుకగ నేలా? అని పరమాత్మునియందు తాదాత్మ్యము పొందినాడు. బోయీలు లేకుండ గనే పల్లకీని నడపిన పరమభాగవతోత్తము డాతడు. పోతనను మించిన మహా భక్తుడు రామదాసు. త్యాగరాజాదులకు పదకవిత్వమున మార్గదర్శకుడైన రామదాసు శ్రీరామ కైంకర్యమున రాజద్రవ్యమునంతా వెచ్చినాడు. రాజద్రోహమును నేరానికి గురియైనాడు. భక్తిభావముచే బందిఖానానుండి విడుదల యైనాడు.

రామదాసు శరణాగత పోషకుడు, దయాంతరంగుడు పరాంగనా విముఖుడు. సత్యభాషణుడు, అగు భద్రగిరి రాముని శరణాగతి చెంది

'ముప్పున కాలకింకరులు ముంగిటవచ్చినవేళ, రోగముల్
గొప్పరమైనచో, గఫము కుత్తుకనిండినవేళ, బాంధవుల్
కప్పినవేళ మీస్మరణ కల్గునొ కల్గదొ నాటికిప్పుడే
తప్పక చేతుమీ భజన దాశరథీ; కరుణాపయోనిధీ !

అని శ్రీరామచంద్రుని ప్రార్థించినాడు, తరించినాడు-రామదాసు దాశరథీ ! కరుణాపయోనిధీ ! అని ఒక్కొక్క పద్యమువ్రాసి గానముచేయగా ప్రతి పద్యమునకు భద్రగిరి రాముడు 'ఓ' అని పలికినాడు. విని రామదాసు బాహ్య ప్రపంచమును మఱచిపోయి తన్మయుడై హాలికునకున్ హలాగ్రమున అర్థము సేకురిన రీతిగా బ్రహ్మానందముచెంది

కంటి నదీతటంబు, పొడగంటిని భద్రనగాధివాసమున్
కంటి ఇలాతనూజ, ఉరుకార్ముక మార్గణ శంఖచక్రముల్
కంటిని మిమ్ము లక్ష్మణుని కృతార్థుడనైతి ఓ జగ
త్కంటక దైత్యనిర్దళన దాశరథీ! కరుణాపయోనిధీ!

అని గానముచేసి తరించినాడు 'రామమూర్తికి' రెండవసాటి దైవమికలేదని గడ కట్టి భేరికా దాండ దదాండదాండ నినదంబుల జాండమునిండ మత్త వేదండము నెక్కి సాటినాడు. తన సర్వస్వము శ్రీరామార్పణము చేసినాడు. భక్తులకు నిరంతరాన్నదానము చేసినాడు. అతనికి అనుకూలవతియగు అర్ధాంగి లభించి

నది. భర్త దీక్షకు, భక్తికి అంతరాయము రానీని మహాపతివ్రతామతల్లి ఆ తల్లి. ఒకనాడు అన్నసంతర్పణ జరుగుచున్నది. రామదాసు ప్రియనందనుడు ఉడుకు గంజిలోపడి మరణించినాడు. అది తల్లిమాత్రమే ఎఱుగును. సంతర్పణ పూర్తియగువఱకు ఆ సాధ్వి అంతటి దుఃఖవార్తనుకూడ భర్తకు తెలుపలేదు. పిమ్మట తెలిసినది రామదాసు చలింపలేదు తన భక్తిభావమును రేకెత్తించినాడు శ్రీరామచంద్రుని తన కొడుకును బ్రతికించుమని

కోదండరామ కోదండరామ కోదండరామ కోదండరామ !
నీదండ నాకు నీవెందుపోకు వాదేలనీకు వద్దుపరాకు
......ఏబుద్ధివీడు ఎఱుగనివాడు పాపడువీడు బడలియున్నాడు
పాపనులేపి ప్రజలనుగల్పి ఆపద బాపి అటు ప్రీతిచూపి
నమ్మిన చిన్నవాడెందునున్న మమ్ములగన్న మాయన్నవన్న
పుట్టింపనీవే పోషింపనీవే ఫలమియ్యనీవే భాగ్యమునీవే
శరణన్నచోట క్షమచేయుమాట బిరుదు నీదేట ఎఱిగినమాట
రావయ్యా వీని రక్షింతుగాని సేవచేసెడివాని సుతుడగుగాని
వందనమయ్యా వాదేలనయ్యా దండనసేయ తగదుమీకయ్యా

భద్రాద్రిరామ ! అని ప్రార్థించినాడు. భక్తిసాధించనిదేమున్నది. రామచంద్రుడు రామదాసు పుత్రుని బ్రతికించినాడు 'పొమ్మేటపప్పుడు వెంటరాదుగా పుచ్చినవకైక్షన' అని రామదాసు నిఖిలసంతర్పియైనాడు. నిత్యసంతర్పణలు, సమారాధనలు-చేయుచు భద్రగిరి రామునికి ఆలయ ప్రాకారాదులు కట్టించినాడు. కళ్యాణములు చేయించినాడు. నగలు వాహనాదులు చేయించినాడు తానొక సర్కారు నౌకరుననుమాట మఱచిపోయినాడు. ఆఱులక్షలు తానీషా ధనమును రామకైంకర్యమునకై వెచ్చము చేసినాడు. తుదకు బందిఖానాలో పడినాడు. అచ్చట రామదాసు యమభటులబోనిరాజభటులచే నానా హింసలుపడినాడు. ఆబాధలన్నియు అతనిని రామభక్తినుండి విముఖుని చేయలేదు సరిగదా అధిక భక్తిని రేకెత్తించినవి.

పోకన్ మానదు దేహమేవిధమునన్ పోషించి రక్షించినన్ రాకన్ మానవు హానివృద్ధులు మహారణ్యంబులో దాగినన్ ! అని విశ్వసించినాడు.

'నమ్మిన నిన్నెనమ్మవలె జానకీపతీ ! అన్నాడు. 'కడుపునొప్పికి మిక్కిలి తాళ నంటిగా' అని వేడినాడు అది, రామనామ కీర్తన మహిమచే శమించినది.

జైలులో అతని కటికి కూటిని పెట్టినారు. రామదాసు 'తినగలనే ఈ అన్నము ముదిమి నే మార్గము నాకికరామా ! అని వాపోయినాడు. 'ఏలాగు తాళుదు-ఏమిసేతురామా ! దీనజనులకెల్ల దిక్కు-నీవేరామా ! యమదండనలు లేక యెదవాపురామా ! రామదాసుమీద దయయుంచుమమా ! రామా ! అని స్తుతించినాడు-ఆ యన్నము దివ్యాన్నమైనది. ఆదిరాదని సర్కారువారు కొరడాదెబ్బలు కొట్టినారు. రామదాసు జంకలేదు. 'అబ్బబ్బ దెబ్బలకు తాళలేర రామప్ప గొబ్బున వన్నేలుకోరా' రక్షించేవారెవని నమ్మితిని నన్ను శిక్షింప తప్పేమిచేసితి ! రక్షించు రక్షింప మీకంటె రక్షకు లెవరున్నారు.

అని మొఱ పెట్టుకున్నాడు. వెంటనే అతని కా బాధ తొలగినది అది కనిపెట్టిన రాజ భటులు రామదాసుని ముండ్లకంపలపై నడిపింప దొడగిరి రామ దయజూడవే భద్రాచలరామా నను బ్రోవవే అని కీర్తించి ఆ బాధనుండి తొలగి నాడు. మరల రాజభటులు రామదాసు చేతులనుకట్టి కోలలువేసి కొట్టగా 'అబ్బబ్బా దెబ్బలకు నోర్వలేరా' జబ్బుచేయకరారా తబ్బిబ్బాయెరా, పరులకొక్క కాసు నేనివ్వలేదురా అంతానీకే అర్పించాసురా అని గానము చేసినాడు ఆబాధ తొలగి నాడు. మరల ఒకనాడు రాజభటులు అతని వీపుపై పెద్దబండనెత్తి గోల్కొండ వీధులలో త్రిప్పుచుండగా ఆభారము మోయలేక రామదాసు భారము లన్నిటికీ నీవే యనుచు నిర్భయుడనై యున్నానురా అని కీర్తించి బాధా విముక్తుడైనాడు. ఒక నాడు రామదాసు మొగము కడుగుకొనుటకై జైలువద్ద నూతిలోని నీరు తోడుకొన బోవగా తేలుకుట్టింది. వెంటనే రామదాసు షేలైన చిటికెనవ్రేలు ప్రాతఃకాల మందు గుట్టె మ్రొక్కెద నాస్వామి ! ఓర్వగజాలను భద్రగిరి రామదాసుని పద నీక కాపాడుతండ్రివీవె అని మొఱపెట్టి గట్టెక్కినాడు. కొన్నాళ్ళకు రామదాసు నకు శూలనొప్పివచ్చినది. ఆ బాధకోర్వలేక పాహిమాం రామా యంటె పలుక వైతివి, నీ స్నేహమట్టివని నేచెప్ప నోహోహోహోహోహో' అని సర్వంబు రామార్పణముచేసి ఆ నొప్పి బాధతొలగి సుఖించినాడు. ఒకనాడు రాజభటులు పట్టాకత్తులను రామదాసుపై విసరినారు.-అప్పుడు రామదాసు 'చరణములే నమ్మితి, నీదివ్య చరణములేనమ్మితి' అని కీర్తించి తరించినాడు.

ఈ రీతిగా రామదాసు తాను అనేక బాధలుపడుచు సీతారామస్వామి నే జేసిన నేరమేమో! అని మొదలుపెట్టి తాను భద్రగిరి రామునకు పెట్టిన వస్తు జాలమునకై తనకా జైలుబాధ కలిగెనని రాముని దృష్టికి తెచ్చువాడై

"ఇక్ష్వాకు కులతిలక ఇకనైన పలుకవే రామచంద్రా!
నన్ను రక్షింపకున్నను రక్షకు లెవరింక రామచంద్రా!
చుట్టు ప్రాకారములు సొంపుతో కట్టితి రామచంద్రా!
ఆ ప్రాకారమునకు బట్టె పదివేల వరహాలు రామచంద్రా!
గోపుర మంటపాల్కు దురుగకట్టితి రామచంద్రా!
నన్ను క్రొత్తగజూడక నిత్తరిబ్రోవుము రామచంద్రా!
భరతునకుచేసితి పచ్చల పతకము రామచంద్రా!
ఆ పతకమునకు బట్టె పదివేల వరహాలు రామచంద్రా!
శత్రుఘ్నునకు నే చేసితి మొలత్రాడు రామచంద్రా!
ఆ మొలత్రాటికి పట్టె మొహరీలు పదివేలు రామచంద్రా!
లక్ష్మణునకు జేయిస్తి ముత్యాలపతకము రామచంద్రా!
ఆ పతకమునకు పట్టె పదివేల వరహాలు రామచంద్రా!
సీతమ్మకు జేయిస్తి చింతాకు పతకము రామచంద్రా!
ఆ పతకమునకు పట్టె పదివేల వరహాలు రామచంద్రా!
వాహనములు మీకు వరుసతోచేయిస్తి రామచంద్రా!"
'కలికి తురాయిని పొలుపుగచేయిస్తి రామచంద్రా'
ఇన్ని చేయించిన నాకు( కాళ్ళకు సంకెళ్ళువేయించి
'నీవు కులుకుచు తిరిగెదవెవరబ్బ సొమ్మని రామచంద్రా!

అనిమొగమాటమిలేక తన మానసవీధిలో పొడకట్టిన రామచంద్రమూర్తిని నిల బెట్టి నిగ్గతీసి అడిగినాడు. రామ 'అడుగుదాటికదలనివ్వను-నాకభయమివ్వక నిన్నువిడువను' అన్నాడు 'రామచంద్రా! నిన్నునమ్మి రవ్వపాలైనానన్నాడు' ప్రతిమాలినాడు బామాలినాడు పరాకాష్ఠచెందిన రామదాసుభక్తికి-భద్రగిరిరాముడు లొంగిపోయినాడు. రామదాసీయవలసిన ఆఱులక్షలుబాకీ తానీషాకు చెల్లించినాడు. రామదాసు చెఱసాలనుండి విముక్తి గాంచినాడు.

'పాహిరామప్రభో పాహిరామప్రభో పాహిభద్రాద్రి రామప్రభో' అని రాముని లీలామానుష విగ్రహుని స్తోత్రంచేసినాడు. మోక్షమందినాడు.

భక్తి ఎంతటి ప్రభావముగలది. శ్రవణము, కీర్తనము, స్మరణము, పాదసేవ, అర్చనము, వందనము, దాస్యము, సఖ్యము ఆత్మనివేదనము అను నవవిధ రీతులచే ఎవడు భగవంతుని సేవించునో వాడు ప్రతికార్యమునందును తరించును. నానాజాతులతో కూడిన యీ అఖండ భారతవర్షమునకు స్వరాజ్యము తెచ్చియిచ్చిన గాంధిమహాత్ముడు మహాభక్తుడు "రఘుపతి రాఘవరాజారామ్" కీర్తన కీర్తించే మహాత్ముడు అశేష ప్రజానీకమును ఏకసూత్రమున నడపెను. పరదాస్య శృంఖలములను రామనామ మహిమచే ఛేదించెను. మనకు స్వాతంత్ర్యము చేకూర్చెను రామదాసు రామనామ స్మరణచే కలకు తురకయగు తానీషాకు కూడ మోక్షమిప్పించి తాను మోక్షముగాంచినట్లే గాంధిమహాత్ముడు ఆంగ్లేయుల దాస్యోపమె మోక్షమిప్పించి మనల తరింపజేసినాడు. హంతకునిచే కొట్టబడి ప్రాణములు 'హేరామా' యని వీడెను మోక్షసిద్ధినిపొందెను.

ఒకప్పుడు కొందఱు కిరాతులు "వనేచరామః, వసుచాహరామః, నదీస్తరామః నభయం స్మరామః ఇతర యంతోపివనే కిరాతాః దివంగతాః రామపదానుషంగాత్ అనితమలో తానిట భాషించుకొనుచు, రామపదమును ఉచ్చరించుటచే మోక్షమునుగాంచిరి. రామనామ మహిమ అట్టిది. నిజమునకు ఆ కిరాతులు రామనామ మహిమ యెఱుగరు. తాము మాట్లాడు సంస్కృతభాషలో 'వనమున సంచరింపగలము. ధనమును హరింపగలము, నదులను దాటగలము, భయమును స్మరింపము. అనుచు కాఱడవిలో బయలుదేఱినారు. వారు అను కొను ప్రతి మాటయందు రామ రామ రామరామ అను పదముకూడియుండుటచే వారికి స్వర్గము లభించినది. రామనామ మహిమ అట్టిది.





మార్చి 31-వ తేది శ్రీరామనవమినాడు అతి వైభవంగా జరిగిన
కళ్యాణ మహోత్సవము సందర్భములో తీసిన చిత్రం.



శ్రీ సీతారామ కళ్యాణమహోత్సవం సందర్భంలో రాష్ట్ర దేవాదాయ శాఖామాత్యులు
శ్రీ పి. వి. నరసింహారావు తలంబ్రాలు పోస్తున్న దృశ్యం.



కళ్యాణోత్సవమును ఏకధ్యానంగా తిలకిస్తున్న అశేష భక్తకోటి.



కళ్యాణోత్సవము సందర్భములో
లక్షలాది భక్తులు పారవశ్యం జెందుతున్న మరోదృశ్యం.

# శ్రీ భద్రాద్రి సీతారామస్వామి వైభవము

రామోవిగ్రహవాన్ ధర్మః-ధారణాద్ధర్మమిత్యాహుః

శరీరమును దాల్చిన ధర్మమే రామచంద్రమూర్తి స్వరూపము. జగద్భారమును ధరించుటచే ధర్మమనంబడియెను. కావున జగత్తుయొక్క భారమంతయును తనపైన వైచికొని భరించుటచే భర్తయనియు, జగద్భర్తయనియు ననంబడును. " ప్రభవత్యస్మాదితి ప్రభుః " అస్మాత్ = ఈనివలన, జగత్తు, ప్రభవతి = కలుగుచున్నందున ప్రభుః అనబడును. కాన జగత్తునకు కారణభూతుడగుటచే జగత్ప్రభుః అనియు ననంబడును. రముక్రీడాయాం అనుధాతువుచేతను, రంజింపజేయువాడు కాన రాముడయ్యెను. ప్రజలను రంజింపజేయుచు పాలించువాడు కాన రాముడనంబడును." రమంతే యోగినోఽనంతే-నిత్యానందే చిదాత్మని। ఇతి రామపదే నాసౌ-పరం బ్రహ్మాభిధీయతే " అని రామ తాపిన్యుపనిషత్ పలుకుచున్నది. అనంత నిత్యానంద చిదాత్మయగు ఏ పరబ్రహ్మస్వరూప తేజమునందు యోగులు నిరంతరము రమింతురో ఆ పరబ్రహ్మమే శ్రీరామ పద వాచ్యుడై యుండెను.

శ్రీ శంకరా భగవత్పూజ్యపాదులు వైదిక మతావలంబుల కందరికిని పంచాయతన పూజను విధించియుండిరి. 1. విష్ణువు – 2. ఆదిత్యుడు – 3. గణనాధుడు – 4. అంబికా – 5. శంకరుడు అను నైదుగురు దేవతల నొకచోచేర్చి పూజించిన ఏ మానిసికి ఏ ఇష్టదైవమున్నను వారందరును తరింతురని వచియించిరి. చూచుటకు ఐదుగానున్నను ఇవి యైదును ఒకేతత్వము నెఱింగించును. కాన పంచాయతన దేవతలందరును ఒకే మూర్తియని భావము.

పరబ్రహ్మము శ్రీరామచంద్రమూర్తి యేసుమా - అన్యముకాదు.

రామఏవ పరంబ్రహ్మ - రామఏవ పరంతపః
రామఏవ పరంతత్త్వం - శ్రీరామో బ్రహ్మతారకం ॥

శ్రీరాముడే పరబ్రహ్మ స్వరూపము. శ్రీ రా ము డే గొప్పతపము. శ్రీరాముడే పరతత్త్వము. శ్రీరాముడే తారకము – అనగా ప్రణవ స్వరూపము. "నమస్తారాయ" అని శ్రుతికలదు. ప్రణవోవై తారః తారః=అనగా ప్రవణ స్వరూపమే.

1. శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం - శశివర్ణం చతుర్భుజం।
ప్రసన్నవదనంధ్యాయేత్ - సర్వవిఘ్నోపశాంతయే॥

సమస్త విఘ్నముల పోనడంచుటకై చంద్రునివలె చల్లనై, ఆహ్లాదకరమై ప్రసన్నముఖము కలిగిన తెల్లనివస్త్రమును దాల్చిన విష్ణువు, రామ - కృష్ణ - మున్నగు నామంబులతో విశేషముగా పిలువబడుచు ధ్యానింపబడుచుండెను.

2. శ్లో॥ రాచేతిలక్ష్మీ వచనః –. మశ్చాపీశ్వరవా చకః
లక్ష్మీ గణపతిం వందే – ప్రవదంతిమ నీషిణః

(బ్రహ్మవైవర్త పురాణము.)

రాయన లక్ష్మీవాచకము. మః అనగా ఈశ్వరవాచకము. సంపదలు బహుళములుగ నుండును. ధాన్యసంపద-పుత్రసంపద-పశుసంపద-ధనసంపద-గృహసంపద-భూసంపద-ఈ సర్వవిధసంపద్గణములకును ప్రభువు. కాన లక్ష్మీగణపతి యను పేరుగలుగుటచే గణపతి శ్రీరామచంద్రమూర్తియే యని భావము.

3. శ్లో॥ అహంమానుషగూపేణ—రామోభూత్వాహరామితం
రామోదాశరధిశ్చాహం—కౌసల్యా నందవర్ధనః॥

(పద్మపురాణము)

శ్లో॥ రామోమమాంశసంభూతః—సీతాచగిరిజాంశజా।

శ్లో॥ శివం మాం ప్రతిజానీధ—నావయోరంతరం ద్విజాః
ఆవయోరంతరం జ్ఞానం—తదేవ అజ్ఞానమిష్యతః॥

శ్లో॥ రామఏవ హరోజ్ఞేయః—శివఏవరఘూత్తమః
ఉభయోర్నాం తరం జ్ఞేయం—భేదకృన్నార కీనరః॥

శ్లో॥ రామశంకర యోర్మధ్యే—భిన్నత్వం యేనసూచితం
అజాగళ స్తనమివ—తస్యజన్మనరర్ధకః (దుర్వాసరామాయణం)

శ్లో॥ శివ విష్ణ్వాత్మకః పాయాత్ – శ్రీరామోభక్తవత్సలః ।
శివరూపేణ సంహారం–విష్ణురూపేణపాలనం–

(స్కాందపురాణము)

దేవతలందరు రాక్షసరాజగు రావణుని బాధలకోర్వజాలక శివునితో మొఱ్ఱపెట్టుకొనగా శివుడు దేవతలకిట్లనియెను. నేను మనుష్యాకృతినిదాల్చి రాముడను పేరున నవతరించి ఆ రావణుని సంహరింతును. నేనే దశరథాత్మజుడనగు రాముడను. నాయర్ధాంగి యగు హిమశైల తనయయే, సీత యగును సుమా యనెను.

రాముడు నాఅంశచేతనే సంభవించును. సీత పార్వత్యంశచే సుస్ఫవిల్లును నన్ను శివునిగా గుర్తించుము. నాకును శివునకును భేదములేదు. మా యిరువుర నడుమగల భేద జ్ఞానమే అజ్ఞాన మనంబడును. అని శ్రీరామ వచనము.

రాముడే హరుడనియు, శివుడే రఘుకుల సంభవుడనియు, మా ఉభయుల నడుమ భేదదృష్టికలిగిన మానిసి నరకమునకు బోవ నర్హుడగు జీవుడుసుమా ! రామ శంకరులమధ్య భేదభావమును తలంచిన వాని జన్మము, మేక మెడయందు వ్రేలాడుచున్న స్తనమువలె ప్రయోజనములేనిదగును. అని దుర్వాసరామాయణ వచనము. శివ విష్ణుస్వరూపుడగు రాముడు భక్తవాత్సల్యము. కరుణాసముద్రము అగును. శివునిరూపమున సంహారము. విష్ణురూపమున పాలనమునుచేయును. కాని రెండుగా తలచక, ఒక మూర్తిగానే భావించవలయును. అని స్కాంద వచనము.

4. శ్లో॥ ఆదిత్యాదిగ్రహాస్సర్వే-త్వమేవరఘునందన-

ఓ రఘుకులానంద కరుడవగునోరామా-సూర్యుడు మున్నగు నవగ్రహములును నక్షత్రములును నీ స్వరూపమే కాన సూర్యుడును శ్రీరామచంద్రమూర్తియే

5. శ్లో॥ శ్రీకృష్ణ శ్శ్యామలాదేవీ-శ్రీరామోలలితాంబికా-

(దేవీమంత్ర రహస్యే ఉక్తం)

శ్రీకృష్ణుని స్వరూపమే శ్యామలాదేవియనియు, శ్రీరాముని స్వరూపమే లలితాదేవి. త్రిపురసుందరీయనియు దేవీమంత్ర రహస్యమున చెప్పబడుటచే లలితోపాసనచేయు శ్రీవిద్యా ధురంధరులందరును లలితను రామునిగా సేవించు

చుందురు. కాన లలితకును సీతకును అభేదముగా త్యాగరాజస్వామివారు గాన మొనరించిరి సీతకును రామునకు అభేదముగా హనుమంతునకుపదేశింపబడెను. కాన అంబికయగు శక్తి రాముని స్వరూపమే సుమా!

శ్లో॥ సంసారార్ణవసంమగ్నం-నరంయస్తారయేన్మనుః
స ఏవ తారక స్త్వత్ర-రామమంత్రః ప్రకథ్యతే॥
రామనామాత్పరోమంత్రోన భూతోనభవిష్యతి॥

శ్లో॥ సకామోభుక్తిమాప్నోతి-నిష్కామోముక్తిమేవచ
రామమంత్రాస్తు విప్రేంద్ర-శీఘ్రంముక్తిప్రదాశ్శృణు
వినైవదీక్షాం విప్రేంద్ర-పురశ్చర్యాం వినైవ హి।
వినైవ న్యాసవిధినా-జపమాత్రేణ సిద్ధిదా॥
స్త్రియః పతివ్రతాశ్చాన్యే-ప్రతిలోమానులోమజాః
లోకే చండాల పర్యంతం-సర్వేప్యత్రాధికారిణః॥

సంసార సముద్రమున దరిగానక గ్రుంకు లిడుచు మునింగియున్న మానవుని తరింపచేయు మంత్రము. కాన ఆ రామనామ మంత్రమునకు తారకమని ప్రసిద్ధము. రామమంత్రముకంటె భూత భవిష్యత్కాలములలో వేరొక మంత్రము లేదని యెఱుంగవలెను. కోర్కెలతో జపించినచో ఐహిక సుఖ భోగభాగ్యములును, నిష్కామముగ నుపాసించినచో ముక్తియు కలుగును. రామమంత్రములలో ద్వ్యక్షరాద్యష్టోత్తర శతాక్షరములుగల మంత్రములుకలవు. అవియన్నియు శీఘ్రకాలమున ముక్తినొసంగును. శైవదీక్ష-శాక్త దీక్ష, వైష్ణవ దీక్ష, దీక్షలవలె దీక్షితులు కానక్కరపట్టదు. పునశ్చరణములుగాని, అంగన్యాసకరన్యాస, దేహన్యాస వర్ణన్యాసములతో పనిలేదు. జపమాత్రము చేతనే మోక్ష సిద్ధికలుగును.

పతివ్రతలుగాని, సామాన్యస్త్రీలుగాని, అనులోమవిలోమ జాతులుగాని, తుదకు చండాలురుగాని జపించవచ్చును. తరించుటకుగాని. రామ మంత్రానుష్ఠానమునకుగాని సర్వజనులు అధికారులనుట మరువరాని విషయము. ఇట్లు అగస్త్యసంహితలో చెప్పబడెను.

శ్లో॥ రామస్మరణాదన్యోపాయం - నహిపశ్యామో భవతరణే -
జనన మరణరూప సంసారమును తరింపవలెననిన రామనామ స్మరణమునకన్న వేరొండు ఉపాయము కానరాదు.

శ్లో॥ మంత్రే తీర్థే ద్విజే దైవే-దైవజ్ఞే భేషజేగురౌ
యాదృశీభావనాయత్ర సిద్ధిర్భవతి తాదృశీ॥

మనము జపించు మంత్రమునందుగాని, మనముచేయు తీర్థసేవనమునందుగాని మనము నమస్కరించు బ్రాహ్మణునియందుగాని, మనము పూజించు దేవుని యందుగాని, మనము ప్రార్థించు జ్యోతిష్కునియందుగాని, మనము విశ్వసించిన వైద్యునియందుగాని, మనము వరియించి వెదకుకొనిన గురునియందునుగాని ఎటువంటి భావమును (అభిప్రాయమును) నిలుపుదుమో మనకట్టి సిద్ధియే కలుగును. సుమా. కాన ఏ పటమును, ఏ పండుగనందు, పూజించినను అంతయు రామ మయముగానెంచి ధ్యానించినచో ముక్తికరతలామలక మగునని విశ్వసింపుడు.

1, 'ర' అనువర్ణము అగ్నిబీజము. అజ్ఞానమను నంధకారమును పోగొట్టెడి ప్రకాశ స్వరూపమగు చిత్స్వరూపము - కాన తేజమే అగ్ని. 'మ' యను వర్ణము శివపంచాక్షరీ మంత్రబీజము. మాయాబీజము ఇది సకల చరాచర సృష్టికిని ఆధారమగు ప్రకృతి స్వరూపము అని భావము. ఈ రెండు వర్ణ ములుచేరి "రామ" అను పదమేర్పడెను. ఎట్లు రామ అయ్యెను అనగా రమ ఏమరామః అని స్వార్థేఽణ్ ప్రత్యయమువలన ఏర్పడెను. ఇట్లు రామపదము ఏర్పడెను.

2, 'శివమంత్రమునకు' "మ" జీవము-'మాధవ మంత్రమునకు' "రా" జీవము ఈ వివరము తెలిసిన ఘనులకు మ్రొక్కెదనని త్యాగరాజస్వామివారు గాన మొనరించిరి. శివమంత్రమగు పంచాక్షరీ మంత్రమునగల 'మ' యను వర్ణము శక్తిబీజము (మాయాబీజము). అదియే ఆ మంత్రమునకు ప్రాణము. విష్ణు మంత్రమగు అష్టాక్షరీ మహామంత్రమునకు 'ర' అను వర్ణము అగ్ని బీజము అదియే ఆ మంత్రమునకు ప్రాణము. ఈ రెంటిని సంధాన మొన ర్చుటచేతను శైవమతమునకు, వైష్ణవ మతమునకు, నడుమ చెలరేగిన ద్వేషములను పోనణంచుటకుగాను భగవానుడు సామరస్యమును కలిగించు టకు "రామ" తత్త్వమును, రామ మంత్రమును ఏర్పఱచి బోధించెను.

ఈ వివరము తెలిసిన మహామహులకు ముక్కిదనని త్యాగరాజస్వామివారు గానము చేసిరి. రమ ఏవరామః అని స్వార్థే అణ్ ప్రత్యయమువలన నేర్పడెను.

3. పరమ పురుషుడు హరుడు. వానిని సంబోధించుట 'హర' యనియు జగన్మాతయగు ఉమాదేవిని పిలచుట 'ఉమా' యనియు పలుకవలయును. హర + ఉమా"యని అతివేగముగ వచియించినచో ఆరెండు పదములందలి హకారము, ఉకారములు, రెండును లోపించి (పలుకుబడివలన గలుగు ధ్వని వినిపింపక=Silent అయి) తుదకు రెండుపదములలోని రెండవ అక్షరములగు "రామ" యను వర్ణములు నిలచి రామపద మేర్పడును. అయితే తుదివర్ణములవలన "రమా" అనుపదము కావలసిన దానికి "రామ" ఎట్లయ్యెను ? అనవచ్చును. అందుకు నాకుతోచిన సమాధానమును మనవి చేయుచుంటిని. పార్వతీ పరమేశ్వరులు అనాది (సనాతన=పురాణ) దంపతులు. కాన 1. వధువుయొక్క చేతిని వరుడు చేతగొని నడచుట లోకమున వైవాహిక ప్రక్రియలోను, యజ్ఞ సందర్భమునను, జరుగుచుండును. 2. పార్వతీమ తల్లి మహా పతి వ్రతా శిరోమణి. పతివ్రతయగు స్త్రీ తన ప్రాణమును అర్ధమును, తన సర్వస్వమును, భర్తకర్పించుటవిధి. 3. పార్వతి శిష్యురాలు, పరమేశ్వరుడు ఆచార్యుడు. శిష్యులు ఆచార్యునిపై ఆధారపడియుండుటయు, తాను గొనివచ్చిన భైక్ష్యమును ఆచార్యున కర్పించుటయునువిధి. 4. "మాయాంతు ప్రకృతింవింద్యాత్-మాయినంతు మహేశ్వరం" అనుటచే పార్వతీదేవి ప్రకృతి. (మాయ) మాయి=మాయను స్వాధీనము చేసికొనిన వాడు (పరమేశుడు) పరమపురుషుడు. "ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మ మాయయా" స్వకీయమగు ప్రకృతిని అధిష్ఠించి (మాయనుగైకొని) తన మాయాశక్తి ప్రభావమున అవతరించుచున్నట్లు గీతలలో పరమాత్మ వచియించెను. కావున పైనాలుగు ఉదాహరణముల వలనను 'మా' యను (లక్ష్మీబీజము)=మాయాబీజమునందు గల ప్రాణము (అచ్చు) అగు "ఆకారమును" ప్రకాశ స్వరూపమును, ఇనుమును అతివేగమున ఆకర్షించు అయస్కాంతము (సూదంటురాయి) వలె మాయాశక్తిని తనయందు ఆకర్షించి యుంచుకొనగలిగిన,="అనగా పరమభక్తుని తనలో చేర్చుకొనునట్టి పరమాత్మ స్వరూపమును"అగు అగ్ని

బీజము అగు 'ర' అను వర్ణము గ్రహించి 'రా' యగును. 'మా' అను వర్ణములోని ఆకారము రకారమున చేరునప్పటికి మకారోపరి=మకారము పైగల దీర్ఘమగు ఆకారము లోపించి హ్రస్వముగ మారి 'మ' అయినది ఇట్లు "రామ" అను పదమేర్పడెనని గ్రహింపవలెను. కాన జగత్పితరు లగు హర ఉమా అనునామముల నుండి శక్తి పురుష బీజములేర్పడి "రామ" తత్త్వ మేర్పడెను.

"బుద్ధిలతకు౯ మారాకుహత్తించి నిక్షేపబ్రహ్మపదావలంబనగతి౯ గ్రీడించు యోగీంద్రుమర్యాద౯" అని భక్తబమ్మెర పోతన భాగవతమున గలదు. పాదద్వంద్వమును నేలమోపి పంచేంద్రియజన్య జ్ఞానమును ప్రాణాయామ సాధనంబున ఇంద్రియోన్మాదమును పోనణంచి లతవలె మృదువైనట్టియు పాదరసమువలె ప్రాకిపోయెడి స్వభావముగల సూక్ష్మగ్రాహియగు బుద్ధికి, 'రా' కు అనగా 'రా' యను అక్షరమునకు 'మా' ను హత్తించి, యనగా 'మ' యను అక్షరమును జతగగూర్చి భేదరహితమై నిత్య సుఖ స్వరూప మైన బ్రహ్మపదమును అనగా పరబ్రహ్మమగు పరమాత్మయొక్క స్థాన మును, లేక [బ్రహ్మ యను పదమునగల బకారము హకారములు లోపించి నచో 'రమా' అను పద మేర్పడినదై కాయవ్యూహమనియెడి యోగవిద్యా శక్తిచే పరకాయప్రవేశ మొనరించిన చందంబున మకారోపరి ఆకారమని యెడి ప్రాణము (అచ్చు) రకారమునకువచ్చి చేరినచో "రామ" అయి మార్పుచెందును, రామపదమును (శ్రీరామపాదమును) అవలంబించిన యోగీశ్వరుని మాడ్కి అవక్రగతిని నక్రము కరిపాదమును గ్రహించెనని పోతన పలుకు చెప్పుచుండెను. దీనినిబట్టి యోగీంద్రులకు అవశ్యావలంబన మొనర్పదగినది. "రామపద" మనియు, అది "బ్రహ్మ" యను పదము నుండి యుద్భవించెననియు, బోధయగుచుండెను. రామతత్త్వము=బ్రహ్మ తత్త్వము అగు పరమతత్త్వము = పరతత్త్వము = పరత్వము = పరమును వ్యక్తపఱచును.

పూర్వమొకడు కొందఱపాంథులతో బయలుదేరి వెడలుచు నొక యరణ్య ముసన పయనించుచుండ నొకఘాతుక మృగమునుచూచి వారు చెదరి పోయిరి. ఈ మన ప్రకృతపుమానిసి ఒక అడవికి పట్లైచేరి అచట నొక ఆటవిక కాంతను పెండ్లియై సంతానవంతుడై జీవనము గడుపక చోరవృత్తి నవలంబించి జీవించుచుండెను. ఇతడు పుట్టుకచే విప్రకుటుంబమున జనించినను, చోరవృత్తి నవలంబించుటచేతను, బోయస్త్రీని పరిణయం బగుటచేతను, బోయగా పిలువబడుచు మార్పుచెందెను. వాని పూర్వజన్మ సంస్కారవశంబున నొకదినమున సప్తమహర్షులా మార్గమున తటస్థించిరి. వీని చర్యలనుచూచి జాలిగొని వానికి నాయనా! నీవీ పనులచే నార్జించిన ధన మెవరికిచ్చెదవు? దీనివలన గలుగు పాపమునుగూడ వారు అనుభ వింతురా? ఈ విషయమును అడిగి తెలిసికొనుము. అనగా నేనీ చోర వృత్తిచే నార్జించిన సొమ్మును నా భార్య కొసంగుచుంటిని. దీనివలన సంభ వించు పాపమును ధరించెదవా యని భార్యనడుగగా ఆమె నీవు దారులను కొట్టుచుంటివో, పాంథులను గొట్టుచుంటివో, సేద్యమును చేయుచుంటివో నే నెరుంగను. నీవు తెచ్చిన ధనమునుమాత్రము నేనును, నా బిడ్డలము అనుభవించుచుంటిమి.

కాని నీ వార్జించిన పాపమును మాత్రము నేను పరిగ్రహింపను. అని పలుకెను. అంతట వాడు ఋషుల కడ కరుగుదెంచి భార్యపలికిన మాట లను తెలిపి, తనకు వారియెడల కలిగిన విరక్తి భావమునెరింగించెను. ఋషులు వానిపై జాలిగలిగి వానికి తపశ్చర్యను నేర్పిరి. మంత్రోపదేశమును చేయవీలులేక వ్యత్యస్తముగ మరాయని పలుకమనిరి. సప్తఋషులు వెడలి పోయిరి. ఈ బోయ మరా జపముతో ఆకలిదప్పులను, కష్టసుఖములను, శీతోష్ణములను సహించి శరీరపతన పర్యంతము జపించెను తనువును వదలెను. తజ్జప ప్రభావమునను, తపశ్చర్యా మహిమంబునను, బ్రహ్మ మానసపుత్రుడై నారదనామంబున తరువాత జన్మమున జనియించెను.

నారదునకు సప్తతంత్రి యగు మహతీయను వీణ యను బ్రహ్మ అనుగ్ర హించెను. ఆవీణ హరే—రామ—గోవింద—నారాయణ—ముకుంద—శౌరే మురారే—యనుచు ఏడుతీగెలును ఏడునామములను మీట నక్కరలేక యే ధ్వనించుచుండును. ఆ వీణా నాదమును వినుచు నానందపరవశుడై ప్రతి దినము ముల్లోకములకేగి మమ్మూర్తులను సేవించుచు, దేవర్షియను ఖ్యాతిచే త్రిదశులలో కలసి అమరుడై, భక్తుడై, నేటికిని మెలంగుచుండె నని ప్రతీతి, ఇది రామనామ మంత్రజప ప్రభావము గదా.

* అల్లే పూర్వ మొక విప్రకుమారుడు కొందరు సార్థవాహులతో కలిసి యొక యరణ్యమధ్యమున పయనించుచుండ నొక మత్తగజము ఎదురై వారి వెంటబడి తరుమనారంభించెను. ఆమత్తేభము త్రొక్కి చంపునను ప్రాణభీతిచే వారు ఒకరి కొకరు సంబంధములేక చెల్లా చెదరై పారిపోయి ప్రాణము లను దక్కించుకొనిరి. ఈ విప్రకుల సంజాతుడత్తరి పారిపోయి ఒక బోయపల్లియను చేరుకొనెను. కొంతకాలమట నివసించి యొక బోయ వనితను పెండ్లాడి బహుళ సంతానవంతుడై జీవయాత్రగడువక కొందర బోయవాండ్రను చేర్చుకొని నాయకుడై పిట్టల జంతువులను వేటాడి మాంసా హారమును భుజింపుచు వస్త్రాది ఇతరవ్యయములకుగాను మార్గములను కాచి పాంథులకొట్టి ధనమును సంపాదించుచు తన ఆలుబిడ్డలను పోషింపుచు, బోయలలో తన వెంట తిరుగు చోర కుటుంబములకు నాయకుడై అరణ్యమునకు ప్రభువై, క్రూరకార్యములచేయుచు, చూడ భయంకరుడై మెలంగుచు దయయనునది వానిపట్ల కానరాక మెలంగు చుండెను. కొంతకాలమిట్లు గడచుచుండ భగవంతుడు వీనికి తరణో పాయమును తెలుపుటకు తాను తన ఇల్లాలు బ్రాహ్మణదంపతుల వేష ధారులై పెద్దకుమారుడగు గణపతిని కుమారునిగను, చిన్నకుమారుడగు కుమారస్వామిని శిష్యునిగను నిర్ణయించి పార్వతీ పరమేశ్వరులు వాని యరణ్యమార్గమున పయనించుచు బోయవాని సహచరుల కంటబడిరి. ఆ చోరసమూహము ఆ బ్రాహ్మణ కుటుంబమును కొట్టి తన యజమాని

వద్దకు గైకొనిపోయిరి. అతడు వాని పెట్టెను. తెరిపించి చూచిన ధనము గాని బంగారముగాని దొరకనందున ఒరే బ్రాహ్మణా నీపెట్టెలో ఏమియు ధనములేదేమి? యని చోరరాజు అడిగెను. ప్రభోవ్యాధపుంగవ నా పేటిక యందు ధనములేకేమి? ఉన్నదనెను. ఉన్నచో కనుపరచుమని చోర ప్రభువు అడుగ స్వామి ఇదిగో ఇవి దర్భలు-వీనితో పవిత్రముచేసి ఉంగ రముగ ధరింతును. ఇదియేనా ఆభరణము. ఈ అంగుళీయకమును ధరించి జీవనదులందు స్నానమొనర్చి ఈ పవిత్ర తిలలతో దేవతలకును, ఋషుల కును, పితరులకు తర్పణ మొనర్తును. ఈ తిలలే నాధనము, చిల్లిపడిన రాగిచెంబుకలదు. దీనితో త్రికాలములందును సంధ్యావందనము చేయు దును. ఇది నా ధనము. ప్రాతకొల్లాయ పంచలురెండు నేను కట్టుకొంటిని మిగిలిన మూడు కొల్లాయగుడ్డలు (చిన్నపంచలు) అతిథులకు మడుగు దోవతులనుగా ఇచ్చెదను. చినిగిపోయిన చీరగలదు. ఇది నాభార్య ధరించి వంటచేయును. వలసినచో పాతచీరయు, కొల్లాయలను తమకు సమర్పిం తునుగాని తిలలను, దర్భలను, రాగిపాత్రను. ఇవ్వజాలను. అనిపలుకగా ఒరే బ్రాహ్మణా ఇవి ఆకలిని తీర్చునా. దరిద్రమును పోగొట్టునా. ఎందు కివి నాకు? నీ భార్య మెడలో మాంగల్యము లేదాయని పలికి తనసహచరు లచే ఆమె మెడలోని మాంగల్యములాగి తెప్పించగా దానికి పసుపుకొమ్ము ఉండెను. ఇదేమి బంగారపుముక్క అయినను లేకయే నీకు పెండ్లి చేసి రాయని చోరరాజు పలికెను. ఇంతలో సూర్యుడస్తాద్రికేగెను. అచటనున్న తటాకమునకేగి బ్రాహ్మణుడు సంధ్యావందనము చేసెను. అదికార్తీక మాసము, శుక్లపక్షము ఏకాదశి రాత్రివెండి పరచినట్లు శారదచంద్రిక వచ్చెను. బాలుడు హరేరామ హరేరామ రామరామ హరేహరే హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే యని కొంతసేపును; హరశ్శివో శివహరో హరోహర శ్శివశ్శివః శివశ్శంభు శ్శివశ్శంభుః శంభుశ్శంభుః శ్శివశ్శివః అని కొంత తడవును, రామ-రామ-రామ-రామ-రామ-రామ- రామ-సీతా-రామరామ-రామరామరామ సీతా-యని కొంతసేపును పాడుచు నాట్యము చేయుచును. శిష్యుడు తాళమువేయుచు, చలిలో కూరుచుండి దైవధ్యానముచేసిరి. పిమ్మట కుమారుడు ప్రహ్లాద చరిత్రను చదువుట

గురువు అర్థముచెప్పుట శిష్యుడు, భార్య, విని ఆనందించుట జరుగు చుండెను. ఈ బ్రాహ్మణుడేమి చేయుచుండెనోయని ఒక పొదచాటునచేరి నక్కి ఇతరులకు కానరానివిధమున దాగి తెల్లవారులు యీ చోరరాజు పాటను, ఆటను, నృత్యమును, పురాణమునూవిని, ఆశ్చర్యసంతోషము లతో సుప్పొంగిపోయెను.

చోరరాజు తన సహచరునితో ఇట్లనెను. ఆరే మనము గొంగళిని కప్పు కొనినను చలిగానున్నది. మూడుసార్లు తినినను ఆకలిగానున్నది. వీనికి, వీని భార్యాబిడ్డలకు చిన్న చినిగిన వస్త్రములతోనున్నను చలిబాధలేదేమి? తినకున్నను ఆకలిబాధ లేదేమి యని ఆశ్చర్యముగా పలికి మరునాడు వానికి ద్వాదశీపారణకు సామగ్రి ఈయవలెననితోచి తన సహచరునితో సామగ్రిని పంపెను. ఆ బ్రాహ్మణపత్ని వంటచేసి దేవతారాధనలు నివేదనలు భోజనములు అయినపిమ్మట చోరరాజునకు భుజింపచేసిరి. బ్రాహ్మణోచ్ఛిష్ఠ భోజన మహిమంబునను, రాత్రి నిద్దురయే లేక పురాణ శ్రవణమొనర్చి ఏకాదశీ తిథిని గడపుటచేతను, వాని హృదయము మారినది. ఇట్లు కొంతకాలము మూడు ఋతువులకాలము బ్రాహ్మణోచ్ఛిష్ఠ మును భుజించిన హేతువుచే భార్యాబిడ్డల యందనురాగము తగ్గిపోయి తనకు తరణోపాయమును బోధింపమనికోరెను. బ్రాహ్మణుడు 'మరా' యని వ్యత్యస్తముగ (తలక్రిందుగ) రామమంత్రమును ఉపదేశించెను. పట్టువలతో ఆకలిదప్పి ఇల్లు వాకిలిని మరచి జపించుచుండెను. బ్రాహ్మ ణునిపైకి చోరపత్ని తగవునకువచ్చి నీవు వచ్చినదిమొదలు ఇల్లు అనడు. వాకిలి యనడు, భార్యాయనడు, బిడ్డలనడు, కూరయనడు, నారయనడు, చౌర్యవృత్తిని వదలినాడు, ధనార్జనములేదు ఏమి ఇది? దీనికి కారణము నీవు అని పలుకగా నాయనా వ్యాధరాజ! నీవింటికిపోయి భార్యను సంతోష పరచుమనిచెప్పి బ్రాహ్మణుడు పంపెను. ఈ బ్రాహ్మణుడు కుటుంబ సహితముగ కాశికిపోయి శివుడుగ అంతర్హితుడయ్యెను. భార్య అన్నపూర్ణ అయ్యెను. కుమారుడు ఢుండివినాయకుడయ్యెను. శిష్యుడు సుబ్రహ్మణ్యు

దయ్యెను. భగవంతుడిట్లు దీనులను కాపాడును సుమా. ఆ చోరరాజు తదేకధ్యానతత్పరుడై మరా; మరా; యని జపము చేయజొచ్చెను. మరా యనగా మరణించుమా యనియు నర్థము. నాకు బంధహేతువు నీవు. నీ మూలమున బిడ్డలు జనించిరి. వారి పోషణమునకై చోరవృత్తి నవలం బించితిని. అనేక సజ్జనులను, పాంథులను తలలు పగులగొట్టితిని. వారిని క్షోభింపజేసి వారి ధన ద్రవ్యములను అపహరించితిని. ఈ బంధమునకు కారణమెవరో, ఈ ప్రేమబంధమునకు కారణమెవరో, వారు మరణింప వలయును అని జపించుటచే భార్య కొలదికాలమునకు మృతినొందెను. నా అహంకారము మరణించుగాక, మమకారము మరణించుగాక, సంసార బంధము తెగిపోవుగాక యనుచు జపించగా, జపింపగా, మరా మరా యనుటలో మొదటి చివర అక్షరములుపోను నడిమి రెండక్షరముల కల యికచే 'రామ' యను పదమేర్పడెను. దాని యర్థము నా దేహమున గల దేహియగు జీవుడు పరమాత్మయందు రమింపచేయుమా యను భావ మున జపించగా తన దేహముపై పుట్టలు పెరిగెను. ఆకలిదప్పి శీతోష్ణ ములు, సుఖదుఃఖములు, పోయి దేహాభిమానము, అహంకార మమకార ములుపోయి దేహాభిమాన శూన్యుడయ్యెను. తత్పుణ్య ప్రభావమున నారదు డేగుదెంచి వల్మీకములోని బోయవానికి "కూజంతం రామ రామేతి మధురం మధురాక్షరం" అని ఉపదేశించి రామ చరితమును బోధించి వ్రాయమని ప్రేరేపించుటను సూచించెను.

"ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేచ్ఛ్రి యమిచ్ఛేద్ధుతాశనాత్। జ్ఞానమ్మహేశ్వరా దిచ్ఛే న్మోక్షమిచ్ఛేజ్జనార్దనాత్" అనుటచే సూర్యదేవుని యనుగ్రహమున ఆరోగ్యమును, అగ్నిహోత్రుని సేవవలన కాంతి పుంజమును, ఈశ్వరుని వలన జ్ఞానోదయమును, జనార్దనుని కరుణచే ముక్తియు కలుగునని చెప్ప బడుటచే ఈ బోయడు ప్రచేతస పుత్రుడు. ఉపనయన సంస్కారమును పొందెను. కాలక్రమమున బోయలలో కలిసి, చెడి, ఈశ్వరానుగ్రహ మునుజ్ఞానోదయమై, నారదోపదేశమున రామచరిత్రమునువ్రాయ ప్రేరేపింప బడెను. ఎట్లు వ్రాయగలనాయని చింతతో రామనామ జపమును చేయు

చుండ తత్ప్రభావమున బ్రహ్మ అనుగ్రహించి నాయనా నీవు వ్రాయతలంచిన రామచరిత్రమునకు ఆద్యంతపర్యంతము నాపట్టమహిషి యగు వాగ్దేవి నీరస నేంద్రియమున నుండునట్లు వరంబొసంగుచు నామె కాజ్ఞ నొసంగు దును. ధైర్యముతో తపమును ముగించి రామ చరితమును వ్రాయమని బ్రహ్మ యంతర్హితుడయ్యెను.

ఆ "బ్రహ్మ" యను పదమునుండియే రామపద మేర్పడెను. కటప యాద్యక్షర సంజ్ఞచే రా + మ = 2 + 5 = 7 సప్తకాండములనుగా రామచరిత్రమును వల్మీకమునుండి బయల్పడుటచే వాల్మీకి యను పేరునను, ప్రచేతసుని కుమారుడగుటచే ప్రాచేతసుడను ఖ్యాతితోను, స్నానార్థము వెళ్లినవానికి "మానిషాద ప్రతిష్ఠాంతమ గమశ్శాశ్వతీస్సమాః। అను ఛందోనిబద్ధమైన శ్లోకరూపమున శోకముకలిగెను. కాన అందు సప్తకాండల అర్థము. స్ఫురించుటచే వ్రాయగలిగెను।। రామాయ–రామభద్రాయ–రామచంద్రాయ వేధసే–రఘునాథాయ–నాథాయసీతాయాః–పతయే అని ఏడు కాండలుగా రామచరిత్రమును వ్రాయగలిగెను. ర్ + ఆ + మ = 2 + 2 + 5 = 9. దీనిని సంస్కృతభాషయందు 'నవ' యందురు. ఇది అంకములలో మిక్కిలి గొప్పది. కాన ప్ర + నవ = ప్రణవ అయినది ఇందలి నకారము ణకారముగ వ్యాకరణశాస్త్ర మర్యాదచే నేర్పడెను.

ప్రణవమనగా అకారము, ఉకారము, మకారము అను మాత్రాత్రయముచే ఓం అను ధ్వని జనించెను. ఓమిత్యేకాక్షరం బ్రహ్మ, కాన ప్రణవమే బ్రహ్మ. బ్రహ్మమునుంచియే 'రామ' యను పద ముద్భవిల్లినది. కావున రామపదము బ్రహ్మకారము ఆనందో బ్రహ్మేతివ్యజానాత్ అను శ్రుతి కలదు. ఆనందమనినను, రంజించుట యనినను, రమించుటయనినను, క్రీడించుటయనినను, ఒకేభావము. రంజింపజేయుటచే రామపదముగా మారెను. సీత, జనకుడు, అశ్వపతి, వశిష్ఠుడు, వాల్మీకి, నారదుడు, ఆంజనేయుడు, అంగదుడు, సుగ్రీవుడు, విభీషణుడు, జాంబవంతుడు

కబీరు, రామదాసు, తానీషా, కీరంపరును రామపదముచే ముక్తిని పొంద గలిగిరి. "మోక్షమిచ్ఛేజ్జనార్దనాత్" అనుటవలన ఈ మంత్రము ముక్తికి తావలము. రామపదమే శరణ్యము-ప్రాప్యము-ప్రాపకము-గమ్యము-ప్రాప ణీయము, భోగ్యము, అనుభవము అయియున్నది.

* శ్లో॥ అగ్రతః ప్రయయౌ రామః-సీతామధ్యే సుమధ్యమా-
పృష్ఠతస్తు ధనుష్పాణి-ర్లక్ష్మణోఽనుజగామహ

తండ్రి ఆనతినను సరించి రాముడరణ్యమున బోవుచుండ మొదట అగ్రభాగ మున రాముడును, మధ్యభాగమున సుమధ్యమయగు సీతయు, వెనుక లక్ష్మణుడును నడచును పోవుచుండిరి, యని దశరథాజ్ఞయును, వాల్మీకి రచన యును, అందలి రహస్యమును పరికింపుడు. ధైర్యముగలరాముడు ముందు గను, సీత స్త్రీగనుక మధ్యగనుంచి వెనుకలక్ష్మణుడును జాగ్రత్తగా సీతను రక్షించుట కట్లు నడువమని దశరథుని ఆజ్ఞ. వాల్మీకి అగ్రతఃలోని అ సుమధ్య మాలోని సకారముపైగల ఉకారము అను జగామ అనుక్రియలోని చివర గలమ యీమూడువర్ణముల చేరిక అకార ఉకార మకారములు కలసి ప్రణవమయ్యెను. కాన ప్రణవస్వరూపముగ రాముని వర్ణించెను. వాల్మీకి

రామ-లక్ష్మణ-భరత-శత్రుఘ్నులు. రాముడు పరాత్పరుడు-లక్ష్మణుడు కైంకర్యమొనర్చువాడు-భరతుడు-భక్తికలవాడు. శత్రుఘ్నుడు భక్తులకు అధీనముగానుండి భాగవతసేవయే తరణోపాయమని జీవులకు తెలుపుట కట్లవతరించిరి.

రాముడు జీవులను రక్షించువాడు. సీత జీవులను రక్షింపుమని పురుష కారమును (రికమెండేషన్ చేయుమధ్యవర్తి) చేయును. లక్ష్మణుడు ధను ర్ధారియై నిరంతర కైంకర్యమునుచేయుచు లక్ష్మణో లక్ష్మివర్ధనః అని కైంకర్యలక్ష్మినిచేయువాడు.

* రామ-లక్ష్మణ-భరత-శత్రుఘ్నులు - ధర్మ - అర్ధ - కామ - మోక్షములనియెడి పురుషార్థములను మరువక చేయుడని జీవుల కెఱింగించుట కవతరించిన
* మూర్తిచతుష్టయము. రాముడు సర్వవ్యాపకుడగు పరమాత్మ-లక్ష్మణుడు శేషుని అవతారము భరతుడు విష్ణుని శంఖమగు పాంచజన్యము శత్రుఘ్నుడు, సుదర్శన చక్రముయొక్క అవతారము. అని అవతారరహస్యము ఇట్లు పురాణములందు పేర్కొనబడెను.

* శ్లో॥ వనేచరామో వసుచాహరామః
నదీంస్తరామో నభయంస్మరామః
ఇతరయంతో విపినే కిరాతాః
ముక్తింగతాః రామ పదానుషంగాః ॥

ప్రకటార్థము:-వనే=వనమునందు సంచరించుచున్నారము. దారులుగొట్టి పాంథుల ధన ద్రవ్యములను బంగారమును దొంగిలించు చున్నారము-రెండు ఒడ్డులు పూసి పారుచున్న పెంపు నదులను అవలీలగా ఈదుకొని అవలి ఒడ్డునకు చేరుకున్నాము. పాములవలనగాని, పులులు మున్నగు జంతువులవలనగాని, రాజువలనగాని, భయము లేకయే తిరుగాడుచున్నాము. ఇట్లు చరామః హరామః—తరామః—స్మరామః అను క్రియలలోని రామపదమును మాటి మాటికిని, దైవమను నర్థముతో స్మరింపకున్నను, వారి నిత్యజీవితములోని క్రియాపదములలో చివరగల రామపద స్మరణమువలన ముక్తిని పొంద గలుగుచుండిరి. అరణ్యమునగల కిరాతపురుషులు.

* గుప్తార్థము — చరామఃలోని రామః, హరామఃలోని రామః, తరామఃలోని రామః, స్మరామఃలోని రామః, నాలుగు క్రియలలో నాలుగు రామనామము లను తలవని తలంపుగా వ్యావహారికముగా తలంచుచున్నను, పరమార్థ మును తెలిసికొనజాలకున్నను, అరణ్యమునగల ఆటవికజనులగు బోయలు, ఎఱుకలు, ఏనాది, లంబాడీ, చెంచులు, కోయలు, మున్నగు దుష్ట జనులు స్మరించినను వారికి ముక్తి నొసంగుచుండెను దైవము.

* అప్పట్టున తెలిసి, హృదయపూర్వకముగా రామనామ స్మరణము చేసినచో ముక్తి కలుగునని చెప్పవలయునా? తప్పక నామస్మరణ మొనరించి రాముని యందు మనస్సుచేర్చి ముక్తిని పొందుటకు పీరు వారనక సర్వులును అర్హులే. శతకోటి ప్రవిస్తరమగు రాముని చరిత్రమును వ్రాయుటకు నాశక్తిజాలునా? గాయత్రీ మంత్రాక్షర పరిమితితో ఇరువదినాలుగువేలు శ్లోకములతో వాల్మీకి రామచరిత్రమును వ్రాసి తరించి మనలను తరింపచేసెను.

స్వస్తిప్రజాభ్యః పరిపాలయంతాం,
లోకాస్సమస్తా స్సుఖినోభవంతు,
స్వస్తి సర్వేషాం సన్మంగళాని భవంతు.

ఇట్లు

రచయిత:

ప్రాగ్గౌతమీమండలాంతర్గత మొసలపల్లి నివాసులగు సాహిత్య చక్రవర్తి బ్ర.శ్రీ. వేదుల సోమనాథశాస్త్రిగారి కుమారులగు పౌరాణిక చక్రవర్తి-తర్కశాస్త్ర పారంగతులు, బ్ర.శ్రీ. వేదుల లక్ష్మీనారాయణశాస్త్రి యను అచ్చన శాస్త్ర్య పరనామధేయులకు ప్రియశిష్యులగు, సమన్వయ చక్రవర్తి, దారతౌచార్య - తైత్తిరీయ సంధ్యాభాష్యకర్త - అనర్గళవాచస్పతి - గాయత్రీ పదారవింద సేవక - బిరుదాంచితులు - అనసూయాదేవికి ప్రియ వల్లభుండగు సూరవరపు లక్ష్మీపతిశాస్త్రి.

మైలవరము — 27—4—1966.
పరాభవ వైశాఖ శుద్ధ సప్తమీ బుధవారము
మైలవరము, కృష్ణా జిల్లా.





భక్తుల సౌకర్యార్థమై దాదాపు రెండుకోట్ల వ్యయముతో
గోదావరీనదిపై నిర్మించబడిన రహదారి వంతెన.



గోదావరీ పవిత్రజలాలలో శ్రీరామనవమినాడు
భక్తులు స్నానమాచరించుతున్న దృశ్యం.



శ్రీరామనవమినాడు A. I. R. గాయకబృందం
రామనామ సంకీర్తనలను గానముచేస్తున్న దృశ్యం.



శ్రీరామ కళ్యాణోత్సవమునాడు
రెండు లక్షల ప్రజలు కూర్చుండుటకు నిర్మించబడిన విశాలమైన పందిళ్లు.

# దేవాలయము లెందుకు?

— శ్రీ కంచర్ల సూర్యనారాయణరావు.

సృష్టిప్రారంభము నుండియు మన భరతఖండము కర్మభూమి యనుట జగత్ప్రసిద్ధము. యీనాటి ప్రపంచానికి నవజనతకు, సాంఘిక, రాజకీయ, ఆర్థికాది సంస్కరణల కంటె ఆధ్యాత్మిక పునరుజ్జీవనమే. అత్యవసరంగా కనిపిస్తుంది. ఇందుకు మేధానిధులు, మహనీయులు, రాజకీయ దురంధరులు, కవిపండితులు, ప్రభుత్వము, ప్రజలు, యెవరి మట్టుకు వారు ప్రగతిపథంలోకి నడవాలి–తన సాటివారిని–త్రోవ తప్పిన వారిని నడిపించ ప్రవర్తించాలి – ఇలాంటి సమయ సందర్భాల్లో, సంధి యుగాల్లోనే ఉద్యములు, విప్లవాలు, ఉద్భవిస్తుంటాయి. పరస్పరవిరుద్ధాలతో, ద్వేషభావాలతో, ఎదిరివారిని సాధించాలని తలంచటం అవివేక మనిపించుకొంటుందే గాని, వివేకమనిపించుకోదు. నాగరితాపరిజ్ఞానం పెరుగుతున్నకొలది, వివేకం, వివేచనం, అలవరచుకోవాలి, శాస్త్ర వేత్తలు తమ కృషిని, తత్ఫలితాన్ని, మానవ మారణహోమానికి కాకుండ మానవకల్యాణానికి వినియోగించాలి. దీనిని సాధించటానికి ఒకే ఒక మార్గముంది. అది శాస్త్రపరిజ్ఞానముతోపాటు ఆధ్యాత్మికచింతన మిక్కిలి అవసరం. మతవిశ్వాసాలు సడలినకొలది, ప్రపంచంలో శాంతిభద్రతలు సన్నగిలుతూ వుంటవి. దీనిని దృష్టిలో నిడుకొనే మన పూర్వులు ఆధ్యాత్మచింతనాప్రాచుర్యం కొఱకు, సాకారాధన వలన నిరాకారాధన గుర్తించుట సులభోపాయమని యోచించి, దేవాలయాలు నిర్మించారు. మానవహృదయాలను, దేవాలయాల ద్వారా దైవలగ్నం, దైవాంకితము చేయుటకు మార్గాలను తీర్చారు.

ఈ దేవాలయాలు దేవునిగురించి చెప్పే అన్ని మతాలలోను సాక్షాత్కరించాయి. విగ్రహారాధన మొల్లని అనేక పాశ్చాత్యమతాలు, దేవాలయాలను నిర్మించాయి. వారినే నిర్గుణారాధకులు అంటారు.

విగ్రహారాధకులు, సగుణారాధకులు. వీరుభయులు, మానవహృదయాలను దైవమువైపునకు త్రిప్పుటకే ప్రయత్నం చేశారు. దానితో పురాణేతిహాసాలుగా కార్యరూపం ధరించి రంగస్థల మలంకరించాయి.

దేవాలయము అంటే ఏమిటి? అని మనం విచారించాలి? (దేవ-ఆలయము-దేవునియొక్క ఉనికి) అని అర్థం చెప్పుతారు కొందరు. దేవుని ఉనికిని తెలుసుకోవటానికి అది వక ఆలంబనము మాత్రమే? దేవాలయాలకు పోయిన పోవుచున్న ప్రతిభక్తుడు, సాక్షాత్కారం పొందుతున్నాడా? అని చొరవతో అడిగేవాళ్లు లేకపోలేదు. అందరు పొందని మాట వాస్తవమే. అయినా అందరు కొద్దియో గొప్పయో చిత్తశాంతిని పశ్చాత్తాపమును పొందుతున్నా రన్నది మాత్రము సత్యదూరము కానేరదు.

దేవాలయమంటె మన సంప్రదాయపరంగా దేవుని ఉనికిని తెలియజేయునది అని, నిర్వచనం చేసుకొన్నాం. అలాగె క్రైస్తవులు దేవాలయాలను నిర్మించుకొన్నారు. వారును దేవుని ఉనికినే కనుగొనే ప్రయత్నం చేస్తున్నారు. వారు తమ గుడిని "చర్చి" అంటారు. People search for the God in the church అంటారు-కొందరు. ఇక్కడ నాకొకటి తోస్తుంది. Search అనగా వెతకుట అని. దేనిని గురించి? భగవంతునిగురించి. అదే మన ఆర్షసంప్రదాయములో దేవాలయాలు దేవుని ఉనికిని కనుగొనటానికి ఉపకరిస్తున్నాయి. అన్ని మతాలు అన్ని సంప్రదాయాలు దేవాలయాలను నిర్మించుకొన్నాయి.

అయితే మతావలంబకులు కొందరు దేవాలయాలలో విగ్రహారాధన నిషేధించారు కాని హిందూమతస్థులు విగ్రహారాధన స్వీకరించారు. ఇక్కడే మతాలు భేదించినట్లుగా స్థూలదృష్టికి గోచరిస్తుంది.

మహామేధావులైన మన మహర్షులు విగ్రహారాధనము నంగీకరించిరి. ఏలయన, "ప్రతిమా స్వల్పబుద్ధీనాం" అని యుండుటచేతను, "అణోరణీయాన్ మహతో మహీయాన్" అను గీతాచార్యమతము చేతను సర్వసాధారణమానవులకు (పామరులకు) సర్వవ్యాపియు, నిర్వికారుడును, సచ్చిదానందమూర్తియు నగు భగవంతుని నిరామయ మార్గమునపూజించుట నాతిసులభమని యెంచి మహర్షులు భగవంతునకు సాలగ్రామాది ప్రతిమారూపములను కల్పించి విగ్రహారాధనకు నంగీకరించిరి.

కేవలం విగ్రహారాధనమే భగవదారాధన మగునా? బ్రహ్మాండ పురాణమున,

విష్ణోరర్చావతారేషు లోహభావం కరోతియః
యో గురౌ మానుషం భావం ఉభౌ నరకపాతినౌ ॥

విగ్రహమునందు లోహభావము చేయువాడును, గురువునందు మానుష భావము చేయువాడును, వీరిద్దరు నరకమున బడుదురని యున్నది.

మన మహర్షులు మన సంప్రదాయములు విగ్రహారాధనము భగవత్పరముగా జరిపించిరి. విగ్రహమునందు భగవత్తత్త్వమును, ఆవాహనముచేయుట, ఆసనము, పాద్యము, అర్ఘ్యము, ఆచమనీయము, స్నానము, యజ్ఞోపవీతము, గంధము, పుష్పము, ధూప దీప నైవేద్య తాంబూలహారతులు, నమస్కారాది విధులు, ఉద్వాసనము అను షోడశోపచార పూజలు చేయుటకు నియమించిరి.

భగవత్తత్త్వము విగ్రహమునందే నిక్షేపింపబడినదా యను సందేహము కలుగవచ్చును, మన సంప్రదాయము దానికి ఒక పరిధిని నియమించలేదు. పిపీలికాది బ్రహ్మపర్యంతము నిండి నిబిడీకృతమై యున్నదనిరి.

కం॥ ఇందుగలడందులేడని
సందేహమువలదు చక్రి-సర్వోపగతుం
డెందెందు వెదకిచూచిన
అందందే గలడు దానవాగ్రణి వింటే=(భాగవతము)

యను ప్రహ్లాదవాక్యము బట్టబయ లొనర్చినది. అట్లే మహాభాగవతోత్తము లనేకమంది సేవించి తరించిరి. పరమ భక్తాగ్రేసరుడైన శ్రీ కంచర్ల గోపన్న (భద్రాచల రామదాసు) 'అంతా రామమయం జగమంతా రామమయము'గా భావించి, పూజించి తరించినాడు. అంతకు పూర్వము బీదరాలగు తమ్మల దమ్మక్క యను నొక భక్తురాలికి శ్రీ రామచంద్రమూర్తి స్వప్నమున సాక్షాత్కరించి భద్రగిరియందు, తాను సీతాలక్ష్మణ సమేతుడై విగ్రహముల రూపమున వెలసియున్నట్లు కలవిచ్చి నదృశ్యమైరి. మరునా డా భక్తురాలు గ్రామ పెద్దల సహాయముతో భద్రగిరి

శోధించి శ్రీ సీతా రామ లక్ష్మణ శిలావిగ్రహములను నొక పొదలో దర్శించి పులకాంకురితశరీరియై నొక చిన్న కుటీరమును నిర్మించి నందు రామాది విగ్రహముల నిల్పి, ఆమె జీవితాంతరము శ్రీరామకైంకర్య మొనర్చి కృతార్థురాలయ్యెను. తదుపరి క్రీ.శ. 1658, 1687, గోల్కొండ రాజ్యమును అబూ హసన్, కుతుబ్‌షాహీ అను తానీషా పరిపాలించు కాలమున నెలకొండపల్లె నివాసియగు శుక్ల యజుర్వేదాంతర్గత కణ్వశా ఖీయ ఆత్రేయసగోత్ర పవిత్రుం డగు కంచర్ల లింగన్నగారి పుత్రరత్న మగు గోపన్న భద్రాచలం తాలూకాకు తహసీల్‌దారు పదవిలో నుండి సర్కారు ధనమును వెచ్చించి, శ్రీరామాలయమును దేదీప్యమానముగా కట్టించి, సీతారామ లక్ష్మణులకు ముత్యాలపతకాదులను చేయించి నిత్య నైవేద్య దీపారాధన లాది సమస్త భోగములను కల్పించి నందుల కా భక్తాగ్రేసరుని ప్రభువగు తానీషా సర్కారుధనమును వ్రయపఱచి నందు లకు నా ధనము చెల్లించుదనుక చెరసాలయందుంచెను. భగవదారాధకు డగు గోపన్న పంద్రెండు సంవత్సరములు శ్రీరామధ్యానపరాయణుడై, చనువున అడిగి బెదరించి, సర్కారు ధనమును శ్రీరామమూర్తిచే తానిషా ఖజానాకు చెల్లింపచేసి "తాను ఖైదున కేగి-తానీషద్రవ్యంబు-శ్రీరాముచే గట్టజేసె నెవడు"అను సూక్తిని స్థిరపఱచిన మహాభక్తశిఖామణి శ్రీరామ భక్తిలో తదాత్మ్యము చెందిన మహాపురుషుడు గోపన్న.

ఆయన కట్టించిన దేవాలయము జీర్ణము కాగా దానిని ఉద్ధరింప సమకట్టిన అధికార అనధికారుల అభినందించక తప్పదు. అయితే ప్రభుత్వస్వీకృతకార్యాలు సర్వత్రా సర్వేపి ఆలస్యమైనట్లే దేవాలయాల విషయమైకాకుండా జాతురని విశ్వసించవలసియున్నది. ఈ విధముగా శ్రీ రామదాసుపై కృతజ్ఞతను శ్రీరామునిపై గల భక్తిని ప్రభుత్వము నిరూపణ చేసికొనుట ముదావహము: యిక ముందును యిట్టి భగవ త్కైంకర్యములందు నిమగ్నులై దేశకల్యాణ మొనర్చు సంకల్పము ప్రభుత్వమునకు కలుగునట్లు శ్రీరామచంద్రమూర్తి అనుగ్రహించుగాత.

—: సర్వేజనాః సుఖినోభవంతు :—



# మన సంస్కృతికి ప్రతిబింబాలే

# * దేవాలయములు

శ్రీ తెన్నేటి విశ్వనాథం.

వ్యక్తమైనటువంటి ఈ ప్రపంచం ఎప్పుడు ఆరంభమైనదో అది చెప్పుటకు ఎవరితరం కాదు. ఋగ్వేదంలో సత్ అసత్ కానటువంటి ఇంతకు పూర్వం ఉన్నటువంటి ఒక వ్యవస్థవిషయమై ఒక సూక్తంలో చెప్పబడియున్నది. ఆ సమయంలో అసలు సమయబేదమన్నటువంటిది లేని స్థితి అది. వెలుతురు గాని చీకటిగాని లేని స్థితి అనిన్ని, ఏదైతే అంతకు పరమమైనటువంటి ఆత్మ అని అందురో అదిమాత్రం ఊపిరి తీయుచున్నట్టుగా ఆ సూక్తంలో ఉన్నది. అయితే అది శ్వేతవరాహ కల్పమునకు ఆరంభస్థితియైనదో లేక అంతకుపూర్వము పేర్కొనబడిన ఏబది కల్పములకు పూర్వమున్న స్థితియే కాక కల్పాంతమందు మహా ప్రళయము వచ్చిన పిమ్మట సర్వం ఆత్మవిలీనమైనట్టి స్థితియో చెప్ప లేము. ఏదైనను దానికి పూర్వంకూడా ఏదో సృష్టి ఏదో కల్పమునందు ఉండి ఉండేననే ఊహించవలయును.

నూతన కల్పమందు సృష్టి ఏ విధముగా జరిగేనని ప్రశ్న ఉద్భ వించినప్పుడు 'యదాః పూర్వం మకల్పయత్' అని సూక్తి ప్రత్యుత్తర మిచ్చుచున్నది. అందుచేత సృష్టి అనాదియై ఆదియందు ఎట్లు ఉండి ఉండెనో ఊహించుట శుష్కయత్నము. సృష్టియైన తర్వాత పంచ భూతాత్మకమైన సకల ప్రపంచము ఏ నిబంధనల వలన ఒక వరసక్రమ ములో పరిణామము పొంది ఒక వస్తుధర్మం కలిగి కాలక్రమేణా వచ్చు

చున్నదో ఆ విషయము గ్రహించినయెడల హెచ్చు ఉపయోగకరముగా ఉండగలదు. సృష్టి అంతయు ఒక కార్యకారణధర్మముతో కూడుకొని ఉన్నదని మనకు అనుభవవేద్యము. ప్రతి విషయమునకు ఒక కారణ ముండియే తీరవలయును, ప్రతి కారణము వలన ఒక కార్యము జరిగి తీరవలయును. కార్యకారణత్వములో పంచభూతము లేనాడు సృష్టి యైనవో ఆనాడే అవి ఉద్భవించినవి. మొదట ఉండినది ఒక ఆత్మ తత్వమే అయినయెడల ప్రపంచమంతయు దానియొక్క పరిణామమో లేక ఆభాసమో అయిన యెడల అంతట యందును ఆత్మతత్వము ఉండియే తీరవలయును. అంతయూ ఒకటే అయిన యెడల కంటికి భిన్నముగా ప్రకృతి కన్పించినను ప్రకృతిలో భిన్న భిన్నమగు నామ, రూప క్రియానుభవములు కన్పించినను అంతయూ మూలమునఒకటియే అయినది. ఏకమైనదే అని మనము గ్రహించగలము. అందుచేతనే మన ఋషులు ఆత్మయునలెనే సర్వభూతములును ఉన్నవని గ్రహించిన వాడే నిజమైన జ్ఞాని అని, అట్టి ఏకత్వము గ్రహించేవాడికి శోకమోహ ములు లేవనిన్ని చెప్పియున్నారు. అట్టి ధర్మముతోనే ఈలోకమంతయు కల్ప కల్పాంతరముల నుండియు నడిచివచ్చుచున్నది. ఈ ధర్మమును గ్రహించినవాడు త్యాగబుద్ధితో పరులసంపదను ఆశించక, సత్యవ్రతుడై, సత్యసంకల్పుడై, పరోపకారప్రావీణతకలవాడై పరపీడనాసక్తిలేనివాడై ఉండగలడు. వాడనుసరించునదే ధర్మము. ఆ ధర్మము స్వయంజ్యోతి యై పరులకు వెలుగు నిచ్చి సరియైన బాటయందు పెట్టుచున్నది. ఇట్టి ధర్మము బోధించుటకై ధర్మసంస్థలు కాలము, అవసరములను బట్టి పుట్టుచున్నవి.

ధర్మమందు బుద్ధి నిలుపుటకు యత్నము కావలెను. మానవ చిత్తము చాంచల్యము గలది. అట్టి చాంచల్యమును నిరోధించుటకు అనేకములైన ఉపాయములు మన పెద్దలు కనిపెట్టి యుండిరి. అట్టి ఉపాయములలో ముఖ్యమైనది దేవాలయసంస్థ. ప్రపంచఘోషకు దూర

మై కొంచముకాలమైనను అంతర్ముఖుడై ఆత్మవిలీను డగుటకు, బుద్ధిని కేంద్రీకరించుకొనుటకు వీలుగా దేవాలయనిర్మాణపద్ధతిని మనపూర్వులు దేహమే దేవాలయములని నిర్వచనము చేసినారు. గర్భాలయము హృదయమునకు సమానమైనదైతే ఆ గర్భాలయము యొక్క నిర్మాణ ప్రమాణ వివరముల యొక్క రహస్యము మనకు అర్థము కాగలదు. ఇప్పటివలె నున్న దేవాలయములు ఏ యుగములో ఆరంభమైనవో చెప్పుట కష్టము. ఆత్మకు ఒక స్వరూపమిచ్చి, నామధేయ మిచ్చి, ధ్యానము కుదురుటకు అర్చనావిధానమును మన పెద్దలు ఏర్పాటు చేసి యున్నారు.

అర్చకశబ్దము - ఋకశబ్దము ఒకేదాతువునుండి పుట్టినవి. మొదటిలో అర్చనావిధానమంతయు ఋగ్వేదమంత్రములతో కూడియుండినదేమో యని మనం ఊహించవచ్చును. ఋగ్వేదమందే ఒకచోటవున్న 'అర్చత ప్రార్చత ప్రేయమేధాసోః' అన్న సూక్తభాగము విశ్వవిదితమైనదే. దీనిని బట్టి మనము మరి యొక విషయము గ్రహించవచ్చు. పదిమంది సాముదాయకముగాగూడి అర్చించుటగూడా కలదని గ్రహించగలము. అర్చన ఎవరింటిలో వారే చేసుకొనెడివారా లేక పదిమందికి ఉపయోగపడేలా అర్చనాలయమును సాముదాయకంగా ఏర్పాటు చేసుకొనెడివారా అన్నదే చర్చనీయాంశము.

'ప్రజాపతి చ రతిగర్భే అంతః' అని వేదంలో నిరూపింపబడ్డ ఆ విశ్వ ఆత్మను చూచుటకు అందరికి వీలుకాదుగదా! "ఆత్మైవా ఉపాసితవ్యం" ఆత్మనే ఉపాసించవలెనని సుతి చెప్పినప్పుడు (ఆత్మను)చూచుటకు వీలుకాని ఆత్మను రూపములేనటువంటి ఆత్మను ఊహించు టెట్లో చూచు టెట్లో అన్న బాధ ఎప్పుడు సామాన్యప్రజలకు కలగెనో అప్పుడే నామరూపబేధములతో మూర్తులను ఉపాసనార్థము సృష్టించవలసిన అగత్యము కనబడెను. 'విశ్వతః షషుభఉతః విశ్వతోముఖః'అన్న వేదాధికారాన్ని పుచ్చుకొనే అనేకవిధములైనటువంటి రూపకల్పన సాగించిరి".

వారణ్యబాహో, వారణ్యస్మ్రస్రూ, అని ఋషి సంభోదించిననాడే అనగా ఋగ్వేద సూక్తమునకు పూర్వమునుండియే విగ్రహవిధానము ఉండి యున్నదని ఊహించినచో తప్పులేదు. రామాయణకాలం నాటికి దేవాయతనములు రూఢియైయున్నట్లు నిస్సందేహము. ఆగమశాస్త్రము పుట్టిన నాటికి దేవాలయములు స్థిరమై ప్రత్యేకశిల్పనావిధానములతో దేశమంతా నిండినవి. శైవా ఆగమములు, పాంచరాత్ర ఆగమములు, వైఖానస ఆగమములు, ముఖ్యముగా పేరు పొందినవి. ఇవి గాక జైనులు, బౌద్ధులు. జైనులు దేవాలయసంబంధములోను, బౌద్ధులు చైత్యవిహరములవిషయములపైన్నె ప్రత్యేక సూత్రగ్రంథములను నిర్మించిరి.

గర్భాలయ-ముఖమండప-గోపుర ప్రాకారాదులయొక్క ప్రమాణ వివరములు ఆగమబేధమునుబట్టి మార్పులు ఉన్నవి. ఒక ఆగమము అనుసరించువారికి మరియొక ఆగమసిద్ధాంతములు, నిషేధములు. ఒకే ఆగమమందు నిర్మాణసౌకర్యమునకై మూడు నాలుగు పద్ధతులను వివరించుట కూడా కలదు. అయితే ప్రథమనిర్మాత గర్భాలయఖింభ సందర్భములందు ఏప్రమాణమును అనుసరించెనో ఆ ప్రమాణమునే తర్వాత వారు తప్పక పాటించవలెనన్న ప్రధాన నియమము కలదు. జీర్ణదేవాలయ ఉద్ధరణకై అనేకులు ఉత్సాహముతో నడుముకట్టుతున్న ఈ రోజుల్లో ఈ ముఖ్య సిద్ధాంతము తప్పక అవగాహనము చేసుకొనవలసి ఉన్నది. "యద్ మానం యద్ రూపం, యద్ వస్తు" అన్న సూత్రం అన్ని ఆగమములకుకూడా మూలసూత్రమే.

భారతదేశమునకు పర్యటనార్థము వచ్చే యాత్రికులకు మన దేశములో ఉన్న ఈ పెద్దదేవాలయములు ఒక ప్రత్యేకతతో కన్పడుచున్నవి. ఆ ప్రత్యేకత అనునది ఆగమసిద్ధాంతపూర్వక నిర్మాణజనితమైనది. ఇది వేల సంవత్సరములనుండియు వచ్చుచున్నది. నిర్మాణమునకై వాడిన వస్తువుయందున్ను, గోపురమంటప ప్రాకారనిర్మాణ విధానమందున్ను, నిర్మాణమందు గల శాశ్వత గుణమందున్ను, ఆ ప్రత్యేకత కన్పించు

చున్నది. అట్టి ప్రత్యేకతను మార్చుటకై మనము ఎవరమూ పూను కొనరాదు. సనాతనమైన మన సంస్కృతి దేవాలయములందు శిల్ప రూపములో సజీవమై ఉన్నది. అందుచేతనే ప్రజాకోటియొక్క ఆస్తిక విశ్వాస శ్రద్ధాభక్తులకు ఈ దేవాలయములు ఆశ్రయములై మహత్కార్య ములకు ప్రేరకము లగుచున్నవి. సహస్రాబ్దములుగ గడచినను పావన గంగాస్రవంతి వలె కాలప్రవాహముతో పాటు మన సంస్కృతిక ప్రవా హముకూడా ప్రవహించుచునే ఉన్నది. ఆధునికవిజ్ఞానము ఎంత కలిగి నను-ఏరూపముతోనున్నను ఉండవలసినదే. అయినను మన సంస్కృతి యొక్క పునాదులపైనే అది పెంపొందవలయును. చరిత్రలేని మనుషుడు ఎట్టివాడో, చరిత్రలేనిదేశంకూడా అట్టిదే అగును. మన చరిత్ర అర్థము తెలియని గ్రంథములందు ఉన్నదని అనెడి వారికి ఈ దేవాలయములు, దేవాలయములందు గల శిల్పములు దర్శనానుగుణ్యమగు అర్చనావిధాన ములు కంటికి కన్పడేలాగు విప్పియున్నట్టి శాశ్వతగ్రంథములు. కనుక పరిస్థితుల్లో ఆలోచించినా, దేవాలయాల సముద్ధరణ జరగటం అత్యంతా వశ్యకమని చెప్పక తప్పదు.



# మందారమాల

— మధురాంతకం రాజారాం.

ఏది నీ దేశమనిన
స్నేహితులైనను అడిగిచూడుడు
నాది రాముని దేశమందును
నేను రాముని దాసుడందును.

రాముడనగా నెవ్వడని నే
నాత్మలో భావించిచూచితి
ఉదధిలో అలలట్లు మనసున
ఊహలిట్టుల సాగిపోయెను.

రాముడనగా దశరథుని, గా
రాల పట్టిగ నాకుదోచెను
వెంటనే కౌసల్యయొడిలో
చంటిబిడ్డగ నతడు మారెను.

శుక్లపక్ష సుధాకరుండై
బాలరాముడు పెరుగసాగెను
చూచుచుండగ నతడు ముద్దుల
సుదతి సీతకు నాథుడాయెను.

మాటయొకటై, బాణమొకటై
మానవోత్తముడతడు వెలసెను
మనిషిగా జన్మించి యాతడు
మరి హిమాద్రులమించి పెరిగెను.

ధరణి నేలుటకొరకు పుట్టిన
ధర్మవీరుడు తపసియాయెను
కనకచేలమ్ములకు బదులుగ
కావివలువల తాను గట్టెను.

అన్నగా నతడనుగు తమ్ముని
అవని నేలగనను మతించెను
మిత్రుడై తనవైరి తమ్ముని
కే ధరావలయమ్ము నిచ్చెను.

అతివ సీత కిరమ్ము పట్టెను
ఆమెకోసమె తాను బ్రతికెను
రాజధర్మము నిలుపుకొరకై
ప్రాణసఖిని పరిత్యజించెను.

ఏమి రాముడు, ఏమి రాముడు
ఏమి లోకైకాభిరాముడు
ఎవడు రాముడు, ఎవడు రాముడు
ఎట్టి పుణ్యశ్లోకుడాతడు !

ఎవనిపద ముద్రాంకితంబై
భరతభూమి పవిత్రమాయెను,
ఎవని గుణ సంకీర్తనమ్మున
దేవభాషకు వన్నెహెచ్చెను ?

ఎవని నామోచ్చారణమ్మున
బోయవాడు మహర్షియాయెను,
పుట్టగానే కవిత ఎవ్వని
పుట్టువును కీర్తింపదొడగెను.

అట్టి రాముడు తెలుగువారల
నట్టింటవెలసిన దైవమాయెను,
అల్లది.గొ భద్రాద్రిపై, నత
డానందకరముగ కొలువుదీరెను.

రాముడితడే, నీలమేఘ
శ్యాముడితడే, గోపరాజుకు
స్వామియితడే, నమ్మికొలిచిన
వమ్ముచేయని దైవమితడే!

పూత గౌతమిపొంత వెలసిన
పూజ్యుడీ రఘురామచంద్రుడు,
కాననేర్చిన నేత్రములలో
కంటిపాపగనుండు దేవుడు!

గోపరాజు మహానుభావుడు
గుడినికట్టెను స్వామికోసము,
నిర్ధనుండగు కవి కుమారుడు
స్వామిసన్నిధి కేమితెచ్చును?

పూలవంటివి తెలుగు పలుకులు
మాలకట్టును, స్వామికిచ్చును
తల్లినవ్వును, తండ్రి నవ్వును
నవ్వులే దిశలెల్ల వెలుగును!



# ఆదర్శ చక్రవర్తి

'హిమభద్ర'

చరితం రఘునాథస్య శతకోటి ప్రవిస్తరం
ఏకైకమక్షరం ప్రోక్తం మహాపాతకనాశనమ్
రామాయ రామభద్రాయ రామచన్ద్రాయ వేధసే
రఘునాథాయ నాథాయ సీతాయః పతయే నమః ॥

సామజవైరిభీముడు, సర్వసుగుణాభిరాముడు, సీతారాముడు ఈ దేశంలో తెలియనివాడు లేడు. ఆయనను మనిషిగా గౌరవించినవాళ్లూ ఉన్నారు. ఆదర్శచక్రవర్తిగా గౌరవించినవాళ్లూ ఉన్నారు. దేవుడుగా భావించినవాళ్లూ ఉన్నారు. పరికిస్తే వీళ్లసంఖ్యే ఎక్కువ! "పరిత్రాణాయ...సంభవామి యుగే యుగే" అని శ్రీకృష్ణపరమాత్ముడు చెప్పనే చెప్పాడు. శిష్టులను దుష్టజనులనుంచి రక్షించడానికిగాను ప్రతి యుగం లోనూ పరమాత్ముడు ఒక్కొక్క అవతారం ఎత్తుతాడు. రావణాది రాక్షసులనుంచి మహామునులను, భక్తులను రక్షించడానికి పరమాత్ముడు రామావతారం దాల్చాడు. కాని ఈ రామచరితం చరిత్రలో లేదేమంటే చరిత్ర పుట్టి ఎన్నాళ్లయిందని ప్రశ్న వేసుకోవలసివస్తుంది. ఋగ్వేద కాలం నిర్ణయించలేని ఆధునికయుగంలో గ్రథితమైన చరిత్ర బహు సంకుచితమైనది. రెండువేల సంవత్సరాల్ని మించి వెనక్కి వెళ్లడానికి సరిపడే భూతకాలదృష్టి దానికి లేదు. గతంలోకి చూడ్డానికి సందేహ విశ్వాసాలు దాన్ని అడ్డుకొంటున్నవి. కావ్యాన్ని నమ్మడంలేదు చరిత్ర. ఒక కావ్యంలోని నదుల వివరం, సముద్రాల వివరాలు తప్పుగా వ్రాసి కవి అపఖ్యాతి సంపాదించుకొంటాడా ? ఈ కాలపు ఏ నవలాకారుడైనా హైదరాబాద్‌లో సముద్రపుటొడ్డు ఉన్నదని వ్రాశాడా ? వ్రాస్తే అది చెల్లుతుందా ? ఈ కావ్యాల్లో కూడా రమ్యతకోసం కొన్ని అతిశయోక్తు లుండవచ్చును. అంతమాత్రాన మూలకథని నమ్మలేకపోవడం మన అజ్ఞానాన్నీ, సంకుచితదృష్టినీ తెలుపుతుంది.

గోదావరీనది, దండకారణ్యం, పర్ణశాల ఇవన్నీ కూడా నేటి భద్రాచలంచేరువనే ఉన్నవి. సీతారాములరణ్యవాసం చేసినట్లుగా రామాయణం తెలుపుతోంది. గోదావరి, దండకారణ్య భూములు - ఇవన్నీ దాన్లో ఎడనెడా కవి వర్ణించిందే. మనుష్యలోకంలో మానవులుగా జన్మనెత్తిన భగవంతునిగూర్చి వ్రాస్తున్నకథ. వాళ్లు సంచరించిన ప్రాంతాలు ఈనాటికీ నమ్మదగినట్లుగా మనకు కనబడుతున్నవి. భగవదవతారమైన వాళ్లు కాబట్టి జనం వాళ్లమెట్టిన ప్రతిచోటా పుణ్యస్థలిగా భావించి గుళ్లు కట్టి ఆరాధించుకొంటున్నారు. ఈ విధంగా ఈనాటి భద్రాచలం చాలా ముఖ్యమైంది.

సీతాపహరణమైన పిదప రాముడు సీతావియోగదుఃఖాతిశయంతో వివశుడై ఉన్నాడు. తన భార్యని అపహరించిన రావణాసురుని సంహరించుటకు ఏదైనా ఉపాయాన్ని చెప్పమని దండకారణ్యంలో అగస్త్యుని కోరాడు. శ్రీరామున కాయన పాశుపతవ్రతమును చేయవలసిందిగా ఉపదేశించాడు. శ్రీరాముడలాగే చేశాడు. నాలుగునెలల పిదప ప్రళయ కాలభయంకర మేఘధ్వని ఒకటి ఆకాశంనుంచి వినబడింది. ఏ రాక్షసుడో అనుకొని రాముడనేక అస్త్రప్రయోగాలు చేశాడు.

తస్మిం తేజసి శస్త్రాణి చాస్త్రాణ్యస్య మహీపతేః
విలీనాని మహాభ్రస్య కరకాణవ నీరథౌ ॥

మహామేఘంనుంచి జారిపడ్డ వడగండ్లు సముద్రంలో లయమయ్యేరీతిగా ఆ మహాతేజంలో శ్రీరామచంద్రుని బాణాలు లీనమైనవి. చివరకు శివుడు అఖిలదేవతలతోగూడి శ్రీరామునికి ప్రత్యక్షమయి పాశుపతాస్త్రాన్నిచ్చాడు తక్కిన దేవతలు గూడా అలాగే అస్త్రాలెన్నో ఆయనకిచ్చారు. సీతావియోగంతో బాధపడే రామునికి తనభార్యను అపహరించినవాడి నాయన సంహరించడానికి శివుడలా అస్త్రాన్నిచ్చాడా ? లేక మరేదైనా కారణముందా ?

అధర్మైస్తు ప్రవృత్తాస్తే దేవబ్రాహ్మణపీడనైః
తస్మాదాయుః క్షయోజాతః తేషాం శ్రీరపిసువ్రత
రాజస్త్రీలంఘనాసక్తం రావణం నిహనిష్యసి ॥

దేవబ్రాహ్మణుల హింసిస్తూ పాపకార్యాలు చేస్తున్నారు. ఆ రావణాది రాక్షసులు అందువల్ల వారికీ ఆయుక్షయం కల్గుతోంది – (కాన) రాజస్త్రీ అపహర్తలైన రావణుని నీవు చంపగలవు. అందువల్ల ఆ మహాకార్యాని కొక సాధనంగా పరమశివుడిలా పాశుపతాస్త్రాన్నిచ్చాడు. ఒక మహాకార్యంకోసం అవతరించినవాడు శ్రీరాముడు. ఈ లోకంలో ఈనాటికీ ఆయనని జనం మర్చిపోలేదంటే ఆయన ఎంత ఆదర్శ పురుషుడో గ్రహించవచ్చును. ఈ నాటికీ 'రామరాజ్య' మనే పదం చావలేదు. ఏనాటికీ చావదు. నిరంకుశప్రభువుకా దాయన, మనుష్యప్రభువాయన. మానవధర్మం కాపాడడమే ఆయన పరమవ్రతం. వ్యక్తిగత సుఖం నశించినా ఆ అవతారమూర్తి మూలసూత్రమదే. అరణ్యవాసం చేస్తున్నప్పుడు శూర్పణఖవచ్చి ఓ రామా! నీవింత అందమైనవాడివి, ప్రపంచములో ఇంతటి సుందరమూర్తిని ఒక్క సీతమాత్రమే అనుభవించాలా? అనుభవిస్తే అదేంన్యాయం? అని ఈనాటికీ ఒకవర్గంవారు అనుసరించే శక్తిమంతమైన తర్కాన్ని అవలంబించి మాట్లాడుతుంది. వెంటనే సీతాదేవికూడా దానికి లొంగిపోయి శూర్పణఖను అంగీకరించవలసిందిగా రాముని కోరుతుంది. ఆనాడు ఆ తర్కానికి రాముడు లొంగిపోయిఉంటే ఆయన పేరున ఇన్ని గుళ్లూ, ఇన్ని కావ్యాలూ వెలిసేవేకావు—

ఆమెయెరిగిన కామంబు నది యెఱుంగ
ఈమె యెరిగిన వేదాంత మిది యెఱుంగ
మనుజుడను నేను మనుజధర్మంబు నెఱుగుదు
ఇల నధర్మంబుచాయ సహించు టెఱుగ—

శూర్పణఖ రావణాసురులు కాముకులు. ఆ కామాన్ని చప్పుకొని వాళ్లు తర్కం ఏర్పఱుచుకొన్నారు. దానికి లొంగిపోయింది సీతవంటివాళ్ల హృదయం. వ్యక్తికి అలాచేస్తే సౌఖ్యమే కల్గుతుంది. కాని మానవ సంఘానికది మనుగడవౌతుందా? ఆ సంఘ నాశానికీ పద్ధతి దోహదం కాదూ? అందుకే మానవసంఘానికి పరమాదర్శం చూపాడు శ్రీరాముడు శూర్పణఖ నంగీకరించనివాడు కాబట్టే సీత నపహరించిన రావణుని సంహరించడానికి యోగ్యుడైనాడు. ఏకపత్నీవ్రతాన్ని మనసా వాచాకర్మణా చూపించిన మహాపురుషుడాయన. అందుకే ఈ భువిమీద అధర్మంయొక్క ఛాయనైనా సహించనన్నాడు. ఎవరో నీచుని మాటలు విని సీతాదేవిని అడవులకు పంపినాడాయన. నిజంగా సీత ధర్మంతప్పి ప్రవర్తించిందా? లేదు. వ్యక్తిగా తన ప్రయోజనాలు సుఖాలు నాశనమైపోతున్నాకూడా మానవసంఘానికి రాజుగా ఇంతచక్కని ఆదర్శాన్ని చూపి అవతారం చాలించినవాడు శ్రీరామచంద్రుడు. అందుకే ఆయన పేరున ఇన్ని కావ్యాలు, ఇన్ని గేయాలు, ఇన్నిగుళ్లు. రామాయణాన్ని కుశలవులు మొదటగా గానం చేశారు. వాల్మీకి ఆశ్రమంలో సీతాదేవి కుశలవులను కన్నది. ఆ కుశలవులకే వాల్మీకి రామాయణగానం నేర్పాడు. ఐనా రామాయణం మిత్ (Myth) భారతం ఫాక్టు (Fact) అనే వాళ్లీనాడు లేకపోలేదు. భారతంలోనే రామాయణం కథ ఉన్న సంగతి మర్చిపోయారు వాళ్లు. కొన్నివేల సంవత్సరాలక్రితం ఆ కథ జరిగినంత మాత్రాన, ఈ నాడు మనం ఆచరించలేనివి వారాచరించినంతమాత్రాన ఆ కథ చారిత్రకం కాకుండాపోదు. ఇది చారిత్రకమా? కాదా? అని భద్రాచల రామదాసు, త్యాగరాజులవంటి భక్తులేనాడూ ఆలోచించలేదు. ఆలోచించేఉంటే

ఎన్నగాను-రామభజనకన్న మిక్కిలున్నదా?
సన్నుతించు శ్రీరామచంద్రు దలచవే మనస



శిల్పాచార్యుడు గణపతి స్తపతి తన బృందముతో.



తిరుమల తిరుపతి దేవస్థానంవారు
కొండమీద అన్ని సౌకర్యములతో నిర్మించిన సత్రము.



కొండపై నిర్మించబడిన చంద్రమౌళి సదన్ అతిథి గృహము.



రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డిగారికి
శిల్పాచార్య గణపతి స్థపతి బహూకరించిన సీతారాముల విగ్రహములు.

కన్నపిన్నవారి వేడుకొన్న నేమి ఫలము మనస
రామచిలుక నొకతెపెంచి ప్రేమమాటలాడనేర్పి
'రామ రామ' యనుచు రమణియొక్కతె ప్రేమమీర
భద్రాద్రిధాముడైన రామవిభుడు కామితార్థ
ఫలమునిచ్చి కైవల్యమొసగలేదా?
ఎన్నగాను-రామభజనకన్న మిక్కిలున్నదా?

ఇంత ఆవేశంతో రామదాసుగారు ఈ కీర్తనని వ్రాసేవారేకాదు. త్యాగయ్య అంతే. రాముని ఆదర్శాన్ని, మహిమనీ మరచిఉంటే త్యాగయ్యగారు తన్నాహ్వానించిన రాజుగారిని కీర్తించి అందరు కవులలాగే ధనం సంపాదించి ఉండేవాడు. కాని ఈదేశానికి ఇంకా రాముడు ప్రాణం పోస్తునే ఉన్నాడు. అందుకే ఆ రాజుగారి ఆస్థానంలోనే త్యాగబ్రహ్మ.

నిధి చాల సుఖమా
రాముని సన్నిధిసేవ సుఖమా
నిజముగబల్కు మనస ॥
దధినవనీత క్షీరములు రుచియో
దాశరథిధ్యానభజన సుధారసము రుచియో ॥
దమశమను గంగాస్నానము సుఖమా
కర్దనుదుర్విషయ కూపస్నానము సుఖమా ॥
మమతబంధన యుత నరస్తుతిసుఖమా
సుమతి త్యాగరాజనుతిని కీర్తన సుఖమా ॥

అని పాడాడు. అంత ధనాన్నికూడా కాదని రామకీర్తనచేశాడు. ఆశలని పించే విషయసుఖాలని కాలదన్ని శాశ్వత సుఖానికి లక్ష్యంగా నిలిచిన వాడు శ్రీరామచంద్రుడు. ఆయన ఆలయమే భద్రాద్రిపైని గుడి. గోదావరీతల్లి చల్లగా నెమ్మదిగా విశాలంగా పారుతుంటే ఆ ప్రక్కన ఈ భూమికి అభయహస్తమిచ్చి, తన చూపుల వెల్గునిచ్చి, తన ఆదర్శపు జీవనమిచ్చి మనకోసం శాశ్వతంగా అక్కడ నిలిచాడు.

అప్ప ! రామభక్తి యెంతో గొప్పరా ;
మా త్రిప్పుటలను దీర్చి—కంటి రెప్పవలెను గాచు
మా లక్ష్మీదేవి వలచునా ? లక్ష్మణుండు గొలుచునా ?
సూక్ష్మబుద్ధిగల భరతుడు జూచిచూచి సొలసునా ?
మాశబరి యెంగిలి నిచ్చునా ? చంద్రధరుడు మెచ్చునా ?
అబలస్వయం ప్రభకు దైవమచల పదవినిచ్చునా ?
మా కపి వారధి దాటునా ? కలికి రోటగట్టునా ?
అపరాధి త్యాగరాజు కానందము హెచ్చునా ? మా
అప్ప ? రామభక్తి యెంతో గొప్పరా.



" కాఫీ "

# సమర్థవచనము

సంసారములో । మునకలు వేయుచు
సతమతమౌచుం । టిని నే సతతము ॥
అపరాధము మ । న్నించి దీనుయెడ
కృప జూపర రఘురామ । స్వామి ॥

ప్రారంభించితి । సుఖవగు రీతిని
బాయదు కనుకనే । ఓ రామా యిక
నీవు లేనిదే । నే కడదేరను
నిక్కంబిది న । మ్మమ్ము నమ్మాటికి ॥

మనసు వికారి । నిలుకడలేనిది
మతి భ్రమణము । కలిగించు యోగులకె
వింత గొలిపి చే । యని కార్యంబుల
చెంత జేర్చు వి । సుగొందదు ఒకపరి ॥ ప్రార ॥

మాయప్రపంచము । లో బడి చిక్కితి
కాయము తీరని । వ్యాదుల కొసగితి
కాయము వ్యాధి । గ్రస్తము నాదను
మోహము పోద, । భిమానము చావదు. ॥ ప్రార ॥

లేమి యిడుముల । బడి మిడికితిని
లేని మాయలో । బడి చితికితిని
నా సంచితమని । నేనే ఎరుగక
నానా అగచా । ట్లకు లోనైతిని. ॥ ప్రార ॥

లచ్చివిలాసము । హా యనిపించును
రామనామ మన । వెగటనిపించును
విషయంబుల । విసుగెత్తదు మనసు
విషమును । అమృత మనుకొంటిని. ॥ ప్రార ॥

అయ్యయ్యో యీ నా మనుగడకు
అహోరాత్రములు చాలవు చాలవు
చాకిరి తప్పదు గడచిన బ్రతుకుల
భాకీ తీరని । భవదుఃఖము మరి. ॥ ప్రార ॥

దేహిని విషయాదులు అతి యిష్టము
తీర్థయాత్ర ప్రయాసము కష్టము
నా మే లేదో నేనే ఎరుగను
నా మేనే నా కిల సర్వస్వము. ॥ ప్రార ॥

నేను అనాథుడను పతితుడను
నీవు నాథుడవు దయగల దాతవు
నేను మూర్ఖుడను ఈయది నా స్థితి
నీ వెరుగుము నను మరువకుము. ॥ ప్రార ॥

దాసుడను మనసార భజింతును
త్రోసిపుచ్చకుము ప్రభు నీవాడను
నేను వీడను విడజాలను నీవును
నను వీడక దయ జూడుము చాలును. ॥ ప్రార ॥

లేమిని కలిమిని బికచో నెంచెడు
రామభక్తుడు పరమపవిత్రుడు
కోరిన కోరిక దీరగ తెనుగున
తీరిచి దిద్దిన సమర్థవచనము.

రామదాసు మొర రామదాసు విన
రఘువీరుడు పలికించెను పలికెను. ॥ ప్రార ॥



# సామాన్యుని దృష్టిలో ... ...
# దేవాలయాలు

— శ్రీ కొంపెల్ల సోమేశ్వరశర్మ.

పూజామందిరాలకూ దేవాలయాలకూ మనదేశంలో అత్యున్నతస్థానం ఉంది. నాకు కొన్ని సందేహాలుండేవి. ఈ దేవాలయము లెందుకు? ఇవి లేకపోతే జరగదా? పోనీ 'మతం' అనేది, ఆ సిద్ధాంతాలను ఆచరణలో పెట్టడానికేకదా? మంచినడతతో ఉండి అవసరమని తోచినప్పుడు ఒక్కసారి ధ్యానిస్తే చాలదా? అసలు దేవాలయాలంటే ఏమిటి? ఇత్యాది కొద్దో గొప్పో ఈ విషయంలో శ్రద్ధతీసికొని చదివి ఆలోచించినా సూటిగా దీనికి జబాబు చెప్పలేను. కనుక సాదృశ్య బలంతో చెప్పడానికి యత్నిస్తాను.

'మనం మాటలాడుతున్నాం - అంటే వెనుక మన ఆలోచన భావంగాఉంది. ఆ భావాన్ని మనం మాటలతోనో సంజ్ఞలతోనో చెప్పడానికి యత్నిస్తాం - చెప్పగలుగుతున్నాం - ఇక్కడమన మాటలు మన ఆలోచనలకుఁ ప్రతీకములు (Symbols) ఈ ప్రతీకములు భావాలు కావుకదా! అల్లాగే ఆలయాలలో మనంచూస్తున్న భద్రాద్రిరాముడు ఆంజనేయస్వామి మొదలగు మూర్తులు ప్రతీకములు-ఎట్లా అయితే మనం సాటి వారిమాటల్ని అర్థం చేసుకుంటున్నామో అల్లాగే ఈ ప్రతీకముల ద్వారా (Symbols) పరతత్వాన్ని అర్థంచేసుకోగలుగుతాము, అను భూతుల్ని పొందగలుగుతాము' ఫల స్వరూపమేమంటే—దేవాలయాలలో పూజార్చనాదికములలో పాల్గొనడం, దర్శించడం--పరతత్వంతో క్షణమాత్ర సంభాషణ సాగించడమన్న మాట.

కొందరు దేవాలయాలు పామరులకు భక్తిమార్గాన్ని ప్రబోధించే సంస్థలనీ, విజ్ఞులకు వీటితో ప్రమేయం అక్కరలేదనీ వాదిస్తారు. శ్రీ శంకర భగవత్పాదులు మహాజ్ఞాని అనీ, అత్యుత్తమదార్శనికుడనీ అంగీకరించవలసినదేకదా ! అయితే ఆయన శివకేశవాది దేవతలను గూర్చి పెక్కుస్తోత్రములను వ్రాసేరు. ఆయన దేవాలయాలలో మూర్తుల ఎదుట సాష్టాంగ ప్రణామములు చేయడం చూస్తే, ఆయన విజ్ఞానానికీ (పామరజనోద్దిష్టమైన) ఆలయాలలో ఉన్న మూర్తుల యెదుట మోకరిల్లడానికీ ఎట్లాసమన్వయం? అని మాక్సుముల్లర్ వంటి మహామేధావి దిగ్భ్రమను ప్రకటించేడు. 'అహంబ్రహ్మాస్మి' అనగల్గిన మహనీయుడు రాతికి మ్రొక్కడం విడ్డూరంగా తోచిందాయనకు. ఇక్కడ మనం గ్రహించవలసినది ఒకటి. శ్రీ శంకరాచార్యులకు ఒక ఉపాధి (Form) ఉంది. దానికి భావాలున్నాయి. ఆయన దృష్టిలో పరబ్రహ్మ స్వరూపానికీ, ఆ పరిపూర్ణ బ్రహ్మ యొక్క దివ్యవిభూతులకూ భేదంలేదు. ఆ దివ్య విభూతులు, శివకేశవాది రూపములు బ్రహ్మ సాక్షాత్కారానికి అవి ప్రత్యక్షసాధనాలు పైగా ఇందొకటి సాదృశ్యం ప్రకారం పరతత్వంతో సంభాషించడం, దివ్యానుభూతికదా బహుశ మాక్సుముల్లర్‌కు శంకరాచార్యుని దార్శనికత అర్థమైనంతగా అనుభూతి అర్థం కాకపోయి ఉండవచ్చును. అందుకే ఆయన అంతటివాడు గుళ్ళో రాతిబొమ్మలకు మ్రొక్కుట ఏమిటీ? అని విస్తుపోయి ఉంటాడు.

దేవాలయములలో జరిగే ప్రతీకపూజ సగుణారాధన అనవచ్చును. మనం కరచరణాద్యవయవములతో ప్రణామం చేస్తాం ఫల పత్ర పుష్ప తోయాలను భక్తితో అర్పిస్తాము. ఇట్లాంటిమూర్తి పూజ మూఢవిశ్వాస ఫలితమని కొందరూ పాపం అని కొందరూ అంటారు. "సర్వేశ్వరుణ్ణి ఒక ఆకారంలో బంధించి పూజ చేయబూనడం హాస్యాస్పదంకాదా ? అని ఒకాయన (చదువులేని) ఒక బీద హరిజనుణ్ణి ప్రశ్నించిన ఉదంతం నేనెరుగుదును." దానికి ఆ హరిజనుడిచ్చిన సమాధానంగా అయ్యా మరి దేవుణ్ణి ఎల్లాప్రార్థించాలి అని తిరుగు ప్రశ్న వేసేడు.

"నిశ్చలంగా నిలబడి మనసారా ప్రార్థించాలి !" అయితే దృశ్యమాన శరీరంతోచేసే ఆరాధన అపరాధమైతే కనిపించని మనస్సుతో

చేసే పూజ పవిత్రమౌతుందా ? బాబూ ! ఒకటి కనుపించే శరీరం రెండోది కన్పించని శరీరం మనస్సు మాత్రం ఇంద్రియంకాదా ప్రభూ ! కన్ను తాను చూస్తూ నడిచేశక్తిగల కాళ్ళను మీరు కదలడం తప్పంటే ఎల్లాగ ? ఆస్తికత్వాన్ని ఒప్పుకుంటే 'ఆరాధన'ను వ్యతిరేకించక్కర లేదు. అందులో సూక్ష్మశరీర భాగం చేసే ఆరాధనను మెచ్చేవారు పూజాదికములను వ్యతిరేకించనక్కరలేదు."

పై సంభాషణను నేనుచదువుకునే రోజులలోవిన్నాను. ఈ పద జాలం చదువులేని ఆ వృద్ధ హరిజనుడిదికాదు. కాదు, కాని అతని విజ్ఞానం మనలోని విద్వాంసుల మనుకొనేవారి తెలివికి తీసిపోదు. ఆ తర్వాత, దేవాలయాన్ని ఆక్షేపించినవ్యక్తి తప్పుకున్నాడు. ఆ బీద వాడు మాలపల్లిలో రామాలయందగ్గర చెప్పులువిడిచి లోనికిపోయేడు ఆ ఉదంతాన్ని మాత్రం నేను మరచిపోలేను. అతన్ని ఎగతాళిచేయా లనుకున్న సంస్కర్త కూడా మరచిపోయి ఉండడేమో !

నిన్ననే నారదభక్తి సూత్రాలలో ఇలాటిదానికి వివరణమును చదివేను. మనము ప్రతీకము (మూర్తి) నకు నమస్కరించినా, ఆరా ధన చేసినా అందులో మనస్సులగ్నం అయే ఉంటుంది. మనం చేసే ప్రతిచర్యకూ ముందు ఆజ్ఞలభించేది. మనస్సునుండి మాత్రమేకదా ! కనుక ఆలయములలో జరిగే ప్రణామ పూజాదికములలో మనస్సు, వాక్కూ, కాయ కర్మమూ ఏకమౌతూనే ఉంటాయి. కావున దేవా లయం త్రికరణశుద్ధికి సాధనా నిలయంవంటిది.

ఒకస్నేహితుడు ఇల్లా అంటాడు. "దైవభక్తి నశించిపోతోంది. గుడికిపోయేవాళ్ళసంఖ్య రోజు రోజుకీ పెరిగిపోతోంది. కాని వీళ్ళంతా ఎందుకు వెడుతున్నారు ? జీ భగవాన్ ! నీకు మొక్కుతాం! ముడు పులు చెల్లిస్తాం! మమ్మల్ని రక్షించు లేదా మాకు లాభంకల్గించు ఇదీ భక్తులవరుస. వీళ్ళకుఉన్నది వినియమకాంక్ష. (Exchange motive) కానిభక్తికాదు! కనుక నిజమైనభక్తి అలవడాలంటే దేవాలయం అనే సంస్థను రద్దుచేయడం మంచిది.........ఇత్యాది."

అప్పుడు మనం ఇల్లా అనాల్సివస్తుంది. మొదటిది గుడికి పోయే వారు అందరూ లాభాపేక్ష (Profit కు Exchange motive) తో ఉన్నారనడానికి మనకుహక్కు ఎక్కడిది? ఎంతమంది అలవాటు ప్రకారం వెడతారు? ఎంతమంది చిత్తశాంతికోసం స్వామిదర్శనం చేస్తారు? ఇలాంటి వివరాలతో లెక్కలు తయారు చేయగలమా? ఈ దినం కోరికతో మొక్కుతున్నా రేపు మన కోరికలు ఏరూపాన్ని ధరిస్తాయో చెప్పగలమా? ఆ కోర్కెలు తీరకపోయేసరికి ఆ వరమీయని వేలుపులు - వారి స్థానాలూ మూలపడవలసిందే కదా? కాని అల్లా ఎందుకు జరగడంలేదు? కనుక భౌతికమైన లాభాపేక్ష లతో ఆస్తికత్వమూ, ఆస్తికతా ప్రచారకేంద్రాలయిన ఆలయాలు నడుస్తున్నాయనడం శుష్కవాదం ప్రజాసామాన్యం తమ నైతిక స్థాయిని కోల్పోలేదు.

ఈ వ్యాసం వ్రాస్తుంటే ఒక మిత్రుడువచ్చి మంచిది; దేవా లయాలు వృద్ధిపొందాలనే నా గాఢవాంఛ ఎందుకంటే అవి పబ్లిక్ సెక్టార్ విజయానికి చిహ్నం అన్నాడు. అతని "బఫూనరీ"లో ఒక మహత్తర సత్యం ఇమిడి ఉంది. దేవుడి పెండ్లికి అంతా పెద్దలేకదా? అది అందరిపండుగాను. అది సమాజంయొక్క సమిష్టి ఆధ్యాత్మిక సంపదకు భౌతిక రూపం కనుకనే దేవాలయాలను ఉద్ధరించాలి.

ఆంధ్రదేశంలో బహుపురాతన దేవాలయములున్నాయి. విభిన్న శిల్పరీతులను గురించి కంటె ఆ శిల్పకారుల 'ఆత్మ'ను తెలుసుకోనడం సులభం. ఒక్కసారి శ్రీ భద్రాద్రి రామాలయాన్నో, ఓరుగల్లు వేయి స్థంభాల గుడినో చూడండి. అత్యాధునిక నిర్మాణ కౌశలంతో మనం కట్టే భవనాలు మూడోనాడు బీటలువారుతున్నాయి. వేయిస్థంభాల గుడి అట్లానే ఉంటోంది. దీనికి కారణం భగవద్భక్తి ప్రేరితులైన శిల్పుల నిష్కామ యోగం — ఇందాకటి మిత్రుడే ఈ సందర్భంలో అంటాడు. ఆ నిర్మాతలకు లాభాపేక్ష యేఉంటే-వాళ్లు కట్టిన గుడులు కూలిపోయి ఉండేవి. గుత్తకు తీసికొనిన వారి సొంతభవనాలు

మాత్రమే "మాన్యుమెంట్సు"గా ఉండేవి అంటాడు. ఇవి పేలవమైన మాటకాదు. దీని తాత్పర్యం, ఈ ఆలయాల నిర్మాణమూ, ఉనికీ, సంగ్రహణా సమిష్టి సృష్టి అని,

తెలుగునాట ఊరూరా దేవాలయాలున్నాయి. యావద్భారత ప్రసిద్ధిగల తిరుపతి, భద్రాద్రి అన్నవరం మొదలగు క్షేత్రాలు ఆంధ్రభూమిలోనివే — స్కంధపురాణాంతర్గతమైన శైవక్షేత్రాలు అధికంగా ఆంధ్రభూమిలోనే ఉన్నాయి. పెద్ద పెద్ద క్షేత్రాలలో ముముక్షువులు సమర్పించే నిధులను, చిన్న చిన్న దేవాలయాల అభివృద్ధికి వినియోగించే ఏర్పాట్లు జరుగుతున్నాయని వింటున్నాం. ఇది చాలాసంతోషకరమైన విషయం.

దేవాలయముల నిర్వహణను గురించి కొన్ని మాటలు "ఆధునిక యుగంలో రేడియో-సినిమా పత్రికలను మౌనంగా చదవటం మొదలైనవి, సాంఘిక చైతన్యాన్ని (Soul conscience) అరికడుతున్నాయి. పురాతన గ్రీకునాటకాలలో ప్రేక్షకుల బృందగానం వారికి భాగస్వామ్యాన్నిచ్చేవి. ఇప్పుడు అధిక సంఖ్యాకులు ఎదుటివారు చెప్పింది వినుటతప్ప, దేనిలోనూ భాగస్వాములుకారు." అని ఒక ఆంగ్లరచయిత వాపోయేడు. కొన్నిదశాబ్దాల క్రిందటి వరకూ, మన దేవాలయాలలో భజన సమాజాలు ఉండేవి. ఇది అధిక సంఖ్యాకుల సమిష్టి భక్తిసాధనకై ఏర్పడిన కళారంగం. తర్వాత ఇవి వృత్తి సంఘాలుగా మారి క్షీణించినవని కొందరంటారు.

దేవాలయాధికారులూ, ధర్మకర్తలూ ఇట్టి కార్యకలాపములలో శ్రద్ధవహించాలి. పూజావిధానం పూర్తి ఐనాక మంత్రపుష్ప నీరాజనాల వేళలో ఆలయం ఎంత శోభావంతంగా ఉంటుంది? వ్యక్తిగతంగా పూజలు జరిపి, ధ్యానాదులతో ఆరాధించే భక్తులతోపాటు భజన సంఘాలలోనూ, చర్చావేదికలలోనూ ఉపన్యాసాదులలోనూ, అధిక సంఖ్యాకులగు ప్రజలు పాలుగొనేలాగ చూచేబాధ్యత అధికారులదీ, ధర్మకర్తలదీని.



# శ్రీ వాణీ గిరిజాశ్చిరాయ ........

— శ్రీ మాదిరాజు రంగారావు.

"శ్రీవాణీ గిరిజాశ్చిరాయ దధతో వక్షోముఖాంగేషుయే
లోకానాం స్థితిమావహన్త్యవిహతామ్ స్త్రీపుంస యోగోద్భవామ్
తే వేదత్రయ మూర్తయస్త్రి పురుషాస్సం పూజితావస్సురై
ర్భూయాసుః పురుషోత్తమాంబుజ భవశ్రీ కంధరాశ్శ్రేయసే"

అన్న శ్లోకంతో నన్నయ భారతావతారిక ప్రారంభమవుతూన్నది. ఇది త్రిమూర్తి స్తుతి. స్తుతియే గాక ఆశీఃపద్యంగాకూడా ఉంది మరి సంస్కృతనాటకాలలోని నాందీశ్లోకాన్ని తలపిస్తూంది. ఇందులో వర్ణింపబడిన త్రిమూర్తులు, పరబ్రహ్మంయొక్క సగుణరూపాలు, లోక సృష్టి-స్థితి-లయకారకులు. బ్రహ్మ సృష్టికర్త, విష్ణువు స్థితికర్త-శివుడు లయకర్త. సృష్టి-స్థితిలయాల సమిష్టిస్వరూపమే దృశ్యమానప్రపంచం. వీరు ముగ్గురూ సత్త్వరజస్తమోగుణాలకు ప్రతీకలు. జ్ఞానకారణం సత్త్వం, దుఃఖకారణం రజస్సు, మోహకారణం తమస్సు. యథార్థంగా ఎరుగబడేది సత్తు. దానియొక్క భావం సత్త్వం. అది జ్ఞాన హేతువు. రాగయుక్తమైనట్టేది రజస్సు. అది దుఃఖహేతువు, గ్లాని పొందింపజేసేది తమస్సు. అది మోహహేతువు. ఈ మూడు గుణాల కలయిక, మార్పు - వీటిరూపమే నిత్యజీవితప్రపంచం. ఇందేది లోపించినా లోపమే - అంటే పూర్ణత్వం సిద్ధించదు. లోకస్థితి, వ్యవహార గమనం ఉండదు.

ఇది మంగళశ్లోకం : ఆశీస్సు, నమస్క్రియ, వస్తునిర్దేశం అని మంగళం మూడు విధాలు. త్రిమూర్తులు శుభాలు కలిగింతురు గాక అనడంలో ఆశీర్వాదం, త్రిమూర్తుల స్తుతి గర్భితమవడం నమస్క్రియ;

వారు లోక స్థితినిర్వహణ కార్యతత్పరులుగా వర్ణింపబడడంలో లోక స్థితికి ప్రతిబింబం అనదగిన భారతంలోని ప్రతిపాద్యవస్తువును స్ఫురింప జేయడంచే వస్తునిర్దేశం —

ఈ విధంగా మూడు విధాలైనవి ఈ శ్లోకంలో నిక్షేపింపబడ్డాయి.

భారతం ధర్మాధర్మాలకు మధ్య జరిగిన తీవ్ర సంఘర్షణం. బహువిధ దశలు, పరిణామం, తత్ఫలితాలస్వరూపం ఆవిష్కరిస్తుంది. ధర్మాన్ని సర్వదా పరిరక్షించడం త్రిమూర్తుల కర్తవ్యం. "వేదోఽఖిల ధర్మమూలమ్" ( మనువు ) అని చెప్పబడింది. వారు వేదత్రయ మూర్తులు. కాబట్టి ఈ కర్తవ్యం వారి సహజలక్షణం. ఈ విధంగా వారియందీ విధి సహజత్వం పొందింపజేయబడింది.

పరమాత్మయొక్క అంశ జీవునియందూ ఉంది. అవిద్యచేత కప్పబడ్డ చైతన్యమే జీవుడు. జీవుడు ప్రాక్ గత బహుజన్మ సంస్కారాల సంపుటి. జీవునికి అవిద్య ఆవరణగా ఉంది. ఈ ఆవరణ ఉన్నంత వరకూ ముక్తి కలుగదు. అవిద్యవల్ల లౌకికంగా భోగశబలిత చిత్తవృత్తియై జీవుడు సంచరిస్తూ ఉంటాడు. కాబట్టి ముక్తికి మొట్ట మొదట లౌకికజీవనంలో ధర్మాచరణం ప్రథమ సోపానం. "ధరతి వా లోకాన్ ఇతి ధర్మః" లోకాలను ధరించేది ధర్మం. ఈ ధర్మం యొక్క పరిణతస్వరూపం వేదనిగదితమై ఉంది. తద్ధర్మస్వరూపులు త్రిమూర్తులు. నిత్యచైతన్యస్వరూపులైన త్రిమూర్తులకూ, దాని వికృతిరూపమైన, పంచభూతాత్మక ప్రపంచం, దానియందు మాయచే ఆవరింపబడిన జీవునకూ గల పరస్పరస్వరూప సంబంధం ఇందులో చెప్ప బడింది.

ఈ బహుజీవ సంకలితసృష్టి మిథునానురాగ మూలం. కాబట్టి ఈ విషయం ఈ శ్లోకంలో బీజప్రాయంగా నిక్షేపింపబడింది. ఇందు స్త్రీ పురుషసంయోగంవల్ల ఉద్భవించిన, అప్రతిహతస్థితి నిర్వహణానికి

కారణభూతులైన వేదమూర్తులను భార్యాసహితులుగా అందు అనాది నుండి అని వర్ణించడంలో ఔచిత్యం ఉంది. మిథునానురాగసృష్టి లక్షణం ఇందు స్ఫురింపజేయబడింది.

లోకాలకు, స్త్రీపురుషసంయోగం చేత కలిగే అప్రతిహతస్థితి నిర్వహణానికి మూడు వేదాలు ఆకారాలు దాల్చిన వారు శుభాలు కలిగింతురు గాక ! అనడంలో అలౌకికమూర్తులకు లౌకిక జగత్తుతో సంబంధం స్థాపింపబడింది. ఈ సంబంధం దేనికి ? లోకశ్రేయస్సుకొరకు అని సమాధానం. ఈ లోక శ్రేయస్సు ఎట్లా సిద్ధిస్తుంది ? ధర్మ సంరక్షణం వల్ల. అట్లు సిద్ధింపజేయడం త్రిమూర్తుల విధినిర్వహణంలోని భాగం. కాబట్టి వీరు నిఖిలధర్మాలకు నిలయమైన వేదమయస్వరూపులుగా వర్ణింపబడ్డారు. మహాభారతం పంచమవేదం. అందీ ధర్మం ప్రపంచింపబడుతుందని, అది జగన్నిర్వహణశీలురైన త్రిమూర్త్యాత్మకమైంది. విశ్వశ్రేయోహేతువైందని సంభావించవచ్చు.

మహాభారతంలోని పరమార్థాన్ని, నన్నయ ఈ విధంగా గ్రంథావతారికగా రచించిన మొదటి శ్లోకంలో స్థాపించాడు.

# పుణ్యక్షేత్రం - భద్రాద్రి

— శ్రీ హీరాలాల్ మోరియా.

విశ్వసాహిత్యానికీ ఆదికావ్యం రామాయణం .... పుడమిలో ప్రప్రథమంగా కవిత్వం మానుషార్తిలో పుట్టింది. కవి చక్రవర్తి శోకం శ్లోకమై మహాకావ్యమయింది. శ్రీరామచంద్రమూర్తి పవిత్రనామస్మరణ తోనే కవిత్వావిర్భావం జరిగింది. శ్రీరామచంద్రమూర్తి తెలుగువారల ఆరాధ్యదైవం – ఆదర్శమూర్తి భారతీయసంస్కృతీసర్వస్వానికి ప్రతీక. భారతీయ స్త్రీత్వానిక్ని మూర్తీభవింప చేసుకున్న-మహామాత సీత. అటువంటి మహానుభావులైన పుణ్యదంపతుల చరణధూళిలో పవిత్ర మయింది గనుకనే భద్రాద్రికి అంతటి ప్రాధాన్యం. గౌతమీనది పవిత్ర తరంగాలు అజస్రమూ భద్రాచలక్షేత్రమహాత్మ్యాన్ని గానం చేస్తుంటాయి.

రామదాసు-అవ్యాజమైన, అద్వితీయమైన, అద్భుతమైన భక్తి పారవశ్యంలో తనను తాను భగవదర్పణం కావించుకోగలిగిన మహా భక్తుడు. ఆయన ఏనాడు నిర్మించాడో ఆ ఆలయాన్ని-వందల సంవత్స రాలు కాలగర్భంలో కలిసిపోయాయి-మార్పులు వచ్చాయి, పరిసరాలు మారాయి, ప్రభుత్వాలు పోయాయి. కాని ఈ నాటికీ మహాభక్తుడు రామదాసు భక్తిగీతాలు భద్రాద్రిలో ప్రతిధ్వనిస్తున్నాయి. ఆయన తంబూరానాదాల ఝుంకృతులు ఇప్పటికి మందమందంగా మధురంగా శ్రుతిపేయంగా వినిపిస్తుంటాయి-వినగలిగినవారికి.

భగవద్భక్తి, అనురాగంలేని బ్రతుకు తోలుతిత్తితో సమానమని మహాత్ముడు కబీరుదాస్ పేర్కొన్నాడు-శ్వాసించడమొకటే మనిషి జీవించిఉండడానికి నిదర్శనంకాదు. అదే అనుకుంటే కమ్మరివాని తిత్తి సైతం విశ్వసించగలుగుతుంది గదా అన్నాడు కబీర్. భక్తితత్వాన్ని క్షుణ్ణంగా అవగాహనచేసుకొని తరించిన మహాభక్తుడు గోపన్న-అంతటి

భక్తాగ్రణి నిర్మించాడు గనుకనే క్షేత్రమహిమ నానాటికి ద్విగుణీకృత మవుతోంది. భగవంతునివల్ల భక్తునికేకాదు, భక్తునివల్ల భగవంతునికి కూడా ప్రశస్తి.

ఖుతుబ్‌షాహీ వంశస్థులు, ఆశిఫ్‌జాహీ రాజులు, ఆ యా వైభవాల ఛాయల భద్రాద్రిలో కనిపిస్తాయి. మరీ శ్రీ రామచంద్రమూర్తి సందర్శనంలో పునీతుడైన తానీషా - ధర్మచింతన పరమత సహిష్ణుత ప్రబలంగా ప్రతిబింబిస్తుంది కూడా.

మనిషి ఈనాటి వైజ్ఞానికయుగంలో ఎన్నో ఘనకార్యాలు చేస్తున్నాడు. మరేమిటేమిటో సాధిస్తున్నాడు, బుద్ధి వికసిస్తోంది. కాని, హృదయం కుచించుకుపోయింది. అది భక్తిలోపంవల్ల సంభవిస్తున్న ఘోరవిపత్తు, సౌహార్దం కరువైన మనిషి సృష్టిస్తున్న శక్తి యావత్తు తిరిగి మనిషి కహితమయ్యేదిగా తయారవుతూ వుండడం వింత కాదు. కేవలం భౌతికశక్తుల పదార్థాల రసాయనిక పరిణామం మాత్రమే కాదు. మనిషి అతగాడికొక అంతస్సుంది. బాహ్యజగత్తుకి భిన్నమైన మరొక ఆంతరిక ఆధ్యాత్మిక అంశమేదో వుంటేనేకాని మానవుడికి సంపూర్ణత్వం లేదు. ఆ అంతరిక అంశానికి సాధనక్రియ భక్తి - భద్రాద్రి దేవాలయం, పరిసరాలు గౌతమీ ప్రవాహం మనలోని భక్తిభావాన్ని పెంచిస్తాయి - భగవంతునిపాదధూళితో పవిత్రమైన పుణ్యభూమి గనుక అక్కడ ఎంతో శాంతిని ఆధ్యాత్మికపారవశ్యాన్ని అనుభవిస్తాము.

భద్రాచలక్షేత్ర ప్రాధాన్యతను ప్రభుత్వం గుర్తించి దేవాలయోద్ధరణకు సమర్థవంతమైన కృషి జరుగుతూవుండడం హర్షణీయం.

మహానుభావుడు, మహాభక్తుడైన భద్రునికి భగవంతుడు ప్రత్యక్షమై :

"వసామిశిఖరే భద్రే తవ యావద్దిరిష్యతి
భూమిర్భూతాని కల్పాంతే మత్సాయుజ్య మవాప్స్యసి"

అన్నాడు.

నిజంగానే కల్పాంతాలవరకు భద్రాచలక్షేత్రం నిలిచివుండి మోక్షదాయక మవుతూందనడంలో ఎట్టి సందేహమూ లేదు.



# శ్రీ భద్రాద్రిరాముడు

— శ్రీ పాలావజ్ఝల శ్రీరామశర్మ.

సీ॥ శ్రీ భద్రగిరిరాజ శృంగాగ్రతలమున
భూపుత్త్రి, సౌమిత్రి పూని కొలువ,
శ్రీ రఘువంశాబ్ధి శీతమయూఖుండు
శ్రీరామదైవంబు చిత్తమలర.
శ్రీల ముక్తి నొసంగ శ్రితభక్తజనులకు
వేంచేసియున్నాడు వేదమయుడు,
శ్రీ గౌతమీనదీ శిష్టతీరంబున
భారతీయుల మహాభాగ్యగరిమఁ

తే॥ జూచివత్తము రా! రండు చూడ్కులలర
సకలసౌభాగ్యదాయకుఁ జారుమూర్తిఁ
బరమపావననామునిఁ బాప విపిన
వీతిహోత్రుని శ్రీరాము, విపులయశుని.

సీ॥ శ్రీరామచంద్ర సుశ్రీయశోవిభవంబు
లీల రచించె వాల్మీకిమౌని,
భవభూతిముఖ్యులు భవ్యవచస్సుల
వెలయించినారు దిగ్వీథులందు;
భాస్కర మొల్లలు పద్యగద్యంబుల
కీర్తించినారు తత్కీర్తి శోభ;
పోతన గోపన ముఖ్యులు భక్తిసం
భరితులై పొగడిరి భద్రముగను;

తే॥ త్యాగరాజు సంగీతసుధాంబు నిధిని
కృతుల రచియించి, తాఁ గృత కృత్యుడయ్యె,
తూము నరసింహ దాసుండు కోమలమగు
కీర్తనల్ వ్రాసినాడు, తత్కీర్తి వెలయ

ఉ॥ ఎప్పుడు నిన్నుఁ గాంతు మఱి యెప్పుడు నిన్ను నుతింతు భక్తి నిం
కెప్పుడు నీదుభద్రగిరి నింపుగ జూతును గుళ్లుగోపురా
లెప్పుడు గౌతమిన్ మునుగు దెప్పుడు నీశిఖరంబుఁ జూతు నే
నెప్పుడొ యెప్పుడోయనుచు నెప్పుడుఁ గోరుచునుందు. రాఘవా!

ఉ॥ తారకనామ ! నీ స్మరణ తప్పక సేయుచునుందు నెప్పుడున్
వారని కష్టసంచయ నివారణమౌ టది గానరాదె; "సం
సారము వే తరింపగను శక్తునిజేయుదు; శోకమోహ సం
హారక !" యంచుఁ గొల్తు నిను; హాయిగ దర్శనమిమ్ము; రాఘవా!

తే॥ రామనామంబు తారక బ్రహ్మమగుట,
గాశి మరణించు జీవికిఁ గామవైరి
దాని నుపదేశమిచ్చు సంతరణ మంద;
నాస్తి సమ మెద్దియును రామ నామమునకు.



రామో రామో రామ యితి రామమయం
జగదభూత్ రామే రాజ్యం ప్రశాసతి ॥

భద్రాద్రిదేవుడు భారతదేశమును పరిపాలించినపుడు రామనామముతో ప్రపంచమంతయు ప్రతిధ్వనించుచుండెడిది. రామకార్యమును నెరవేర్చుటకు దేవతలు, నరులు, వానరులు, ఉడుతలుకూడ సహకరించినవి. సముద్రము దే పాయలగుటయు పర్వతములు బెండులగుటయు జరిగినవి. మేఘమండలమున యుద్ధతంత్రము నడిచి రావణసంతతి నాశముచెందెను. వేలకొలది సైన్యము సముద్రమును తరించి లంకావిజయముచేసి కామ, క్రోధ, ద్వేషపూరితమైన రాజ్యపాలన నంతమొదింపచేసి రామరాజ్యమును స్థాపించెను.

ఇది జరిగి యెన్నివేల సంవత్సరములైనదో నేటి చరిత్ర యూహింప జాలదు. తదాది భారతదేశమున రామరాజ్యము మహదాశయమై వాల్మీకి కోకిలచే గానము చేయబడి గిరిగహ్వరములు నదీనద ప్రాంతములు రోదోంతరాళమునిండి సమస్తభూత ప్రపంచమును పావన మొనర్చెను. ఇట్టి రామచరిత్రలో గల ప్రతి పాత్ర ఆదర్శప్రాయమై భూతభవిష్యద్వర్తమాన కాలములలో నే ఖండములో నే వ్యక్తియైనను ఆచరింపదగినవనుట కెంతమాత్రము సంశయములేదు.

రామరాజ్యము, రామచరిత్ర యనగా జీవితమును, మానవుని దివ్యపథము నకు గొంపోవు పరిపూర్ణ దివ్యతంత్రము కాని జీవితమును ముక్కలుముక్కలుగా విడగొట్టు దౌర్భాగ్య సూత్రములు కావు. భారతీయుల జీవితవిధానమును, జీవితా దర్శములను యేనాడో స్వీకరించి తాము తరించి, సంఘమును దేశమును తరింప గోరి యీ ధ్యేయమును జేరుటకే పండితులకు, పామరులకు, విజ్ఞులకు, అవిజ్ఞు లకు మానవలోకమున నడుగుస్థాయిలో నున్నవారిని, పై స్థాయిలో నున్నవారిని కూడ సమన్వయపరచు మూర్తి, అమూర్త్యాది పూజావిధానముల నేర్పరచి తలచి నంతమాత్రమున శరీరజ్ఞానమును విస్మరించి యాత్మారామానందము ననుభవింప గలందులకే యీ దేవాలయాదులు నిర్మింపబడినవి. మూర్తి యారాధనలో ప్రతి వ్యక్తియొక్క ధర్మనిర్వహణము యిమిడియున్నదను విషయము గ్రహింపనిచో నెన్నియేండ్లు తల్లక్రిందులు తపస్సుచేసినను లాభములేదను విషయము రామ చరిత్రలోని ప్రతి పాత్ర రామభక్తులుగా తరించిన ప్రతి భక్తుని చరిత్ర విదితము చేయుచున్నది. కనుక భక్తులు యీ దృష్టితోనే భద్రాచల దేవుని సేవించి తాము తరించి తమ దేశమును తరింపచేయుదురుగాక యని యాశించుచున్నాను.

— శ్రీ ముదిగంటి జగ్గన్నశాస్త్రి, బి. ఏ.,

# శ్రీశైల మల్లికార్జునస్వామి

— రచన: పబ్బరాజు ఇందిరాదేవి.

భారతదేశంలో శ్రీశైల మల్లికార్జునస్వామినిగురించి వినని వారుండరు. ఆయన మహిమలు వర్ణనాతీతం, ఆ స్వామిని పూజించి తరించిన భక్తులు ఎందరోవున్నారు. ఇదివరకటిలాగా నడిచిపొయ్యే శ్రమలేకుండా బస్సులు నడవటం ముదావహం.

శ్రీశైలానికి వెళ్ళేరోడ్డు ఇంచుమించు తిరుపతికివెళ్ళే రోడ్డు లాగానే మెలికలు తిరిగివుంటుంది. ఒత్తుగా పెరిగినచెట్లూ-గుట్టలూ, బస్సుమీద పోతూంటే చూడటానికి కన్నులపండువగా వుంటుందీ. మనస్సులకు హాయిగాకూడా వుంటుంది.

శ్రీశైలంలో సత్రాలు హోటళ్ళుకూడా వెలిసినయ్. కొన్నేళ్ళ క్రితం భోజనమేదొరకని శ్రీశైలంలో ఈనాడు ఆహారం కొరతలేకుండా భక్తులకు భోజన సౌకర్యం సమకూరడం నిజంగా ఎంతో హర్షించదగ్గ విషయం.

దేవాలయానికివెళ్ళే దోవకిరుప్రక్కలా దుకాణాలు వుంటాయి. భక్తులకు కావాల్సిన పూజాసామాగ్రి, స్వామిపటములు మున్నగునవి అక్కడ లభ్యమవుతాయి.

ఆకాశాన్ని అంటినట్లుండే శ్రీ మల్లికార్జునస్వామి దేవాలయపు శిఖరం చూడగానే, ఎంతటి నాస్తికుడికైనా భక్తిభావం వుద్భవిస్తుంది. శ్రీ స్వామి లింగాకారము సుమారు గజం గజంన్నర ఎత్తులోవుంటుంది. ఎందరో భక్తులు శివరాత్రినాడేకాక, వుట్టిరోజుల్లోకూడా స్వామిని దర్శించుకోవడానికి వస్తారు.

దేవాలయంలో పకప్రక్కగా లోయలోవుంది కోనేరు, అక్కడికి మెట్లుదిగి వెళ్ళాలి, కొంచెం చీకటిగావుంటుంది. అక్కడ ఆ నీరుత్రాగితే పాపాలన్నీ హరిస్తాయంటారు.

మల్లికార్జునుని గురించి వాడుకలో వక కథవుంది.

చంద్రగుప్త మహారాజు దండయాత్రకువెళ్ళే సమయానికి ఆయన భార్య గర్భవతిగావుంది. ఆ మహారాజు వెళ్ళింతర్వాత ఆ సాధ్వి ప్రసవిస్తుంది, ఆడపిల్లపుట్టింది. పదిహేడు, పద్దెనిమిది సంవత్సరాలకు చంద్రగుప్త మహారాజు తన దండయాత్రను ముగించుకొని రాజధానికి వస్తాడు.

తన తండ్రియైన చంద్రగుప్త మహారాజు దండయాత్రను ముగించుకొని తిరిగివచ్చాడనే వార్త వింటుంది. యుక్తవయస్కురాలైన మల్లికాంబ తండ్రిని వెంటనే చూడాలనే తహతహతో పొంగి పరవళ్ళు త్రొక్కుతున్న పితృప్రేమను అణుచుకోలేక అందరితోపాటు తనూ ఆయనకు స్వాగతం ఇవ్వటానికి వెళ్తుంది.

మల్లికాంబ తన కన్నకూతురని తెలియని చంద్రగుప్తుడు ఆమెను చూడగానే మోహపరవశుడవుతాడు, ఆమెవెంట పడతాడు. ఊహించని ఈవుపద్రవానికి తల్లిడిల్లిపోతుంది మల్లికాంబ. కన్నతండ్రి కామాంధుడై తన్నుకోరినందుకు అమితంగా దుఃఖిస్తుంది. ఏం చేయడానికీతోచక తన్ను తాను రక్షించుకోవడానికి ఇహ గత్యంతరంలేక పరిగెత్తుతుంది, చంద్రగుప్తుడుకూడా ఆమెను అనుసరిస్తాడు.

పరువెత్తిపోతున్న మల్లికాంబకు గంగానది అడ్డమొస్తుంది. ముందు వెళ్ళడానికి వీల్లేకపోతుంది, వెనుక తండ్రి తరుముకవస్తున్నాడు.

ఆపన్నులపాలిటి ఆదిదేవుడయిన భగవానుడ్ని తనకు దారి ఇవ్వమని ప్రార్థిస్తుంది ఆ శివభక్తురాలు. భగవంతుడు ఆమె మొర ఆలకిస్తాడు. నది పాయలుగాచీలి ఆమెకు బాట కల్పిస్తుంది. మల్లికాంబ నదిని దాటగానే నది ఎప్పటిలా మారిపోతుంది. పరిగెత్తివచ్చిన చంద్రగుప్తుడు నదిలో చిక్కుకుంటాడు.

మల్లికాంబ తను ఆయన కూతురుననిచెప్పి, కన్నకూతురును కోరినందుకుగాను నదిలో 'పచ్చబండ' వయిపొమ్మని శపిస్తుంది. అందుకే నీరంతా పచ్చగావుంటుంది. అదే పాతాళగంగ, దానిలోతు ఎంతవుందో తెలియదు.

నిజం తెలుసుకున్న చంద్రగుప్తుడు విలపిస్తాడు. తన శాపానికి విమోచన కల్పించమంటాడు పశ్చాత్తాపపడ్డ తండ్రి శాపవిముక్తికోసం దేవుని ప్రార్థిస్తుంది మల్లికాంబ స్వామి ప్రత్యక్షమవుతాడు. చంద్రగుప్తుడికి కలియుగంలో శాపవిమోచన లభిస్తుందంటాడు. ఇంకా ఆయనకు శాపవిమోచన కల్గలేదని అంటారు మరి.

తరువాత, మల్లికాంబను ఏదైనా వరంకొమ్మని అంటాడు స్వామి. స్వామికి తనయందున్న అనుగ్రహానికి పొంగిపోతుంది ఆమె, తనకు ప్రపంచ సౌఖ్యాలపట్ల కోరికలేదనీ, తన పేరుమీద స్వామిని అక్కడ వెలవమనీ, స్వామి పాదసన్నిధివద్దనే తన జీవితశేషాన్ని గడిపివేస్తానని అంటుందామె.

ఆమె కోరికను మన్నించి, మల్లికార్జునుడై వెలుస్తాడు స్వామి. ఇదీ వాడుకలోని కథ. నిజం ఎంతవుందో తెలియదుగాని, కొంతమటుకు నిజం. ఇలాగే స్వామినిగురించి కొన్ని కథలున్నయ్.

మహాశివరాత్రినాడు శ్రీశైలస్వామి భ్రమరాంబల వైభవంచూసి తీరవలిసిందే! ఆరోజు ఎక్కడెక్కడి జనం తండోపతండాలుగా స్వామిని దర్శించుకోవడానికి వస్తారు. ప్రతి శివరాత్రికీ స్వామికి వక తలపాగా అలంకరిస్తారు.

శ్రీశైలానికి రెండుమైళ్ళదూరానవుంది పాతాళగంగ, శ్రీశైలం నుండి పాతాళగంగవరకూ మెట్లున్నాయి....మధ్య మధ్య హోటళ్ళుకూడా వున్నాయి. వృద్ధులు, నడవలేనివారు పాతాళగంగవరకు వెళ్ళడానికి డోలీల సదుపాయంకూడా వుంది.

చతుస్రాకారంగావుండే (నాలుగు) కొండలమధ్య పెద్ద కోనేరులా గుండ్రముగా ఉంది పాతాళగంగ. ఉరవడిలేకుండా ప్రశాంతంగా గంగ అక్కడ విశ్రాంతి తీసుకుంటున్నట్లుగా వుంటుంది. మెట్లు దిగగానే సుమారు మైలుదాకావున్న ఖాళీస్థలము, తెల్లటి ఇసుకతో కప్పబడి వుంటుంది. మరోవిచిత్రం, ఏవైనా (మన) బట్టలు ఆ నీటిలో ఉతికితే సబ్బు అక్కర్లేకుండానే తెల్లగా అవుతాయి బట్టలు. పవిత్ర పాతాళగంగ పరిసరాల్ని తనివిదీరాచూస్తూ ఎంతసేపు కూర్చున్నా, ఇంకా కొంతసేపు కూర్చోవాలనిపిస్తుంది. ఆ పరిసరాల ప్రభావం అటువంటిది మరి! జంటలు జంటలుగా భార్యాభర్తలు స్నానంచేస్తుంటే, మంత్రాలు చదువుతున్న బ్రాహ్మణులను చూస్తుంటే చూడ ముచ్చటవేస్తుంది.

ఇంతేగాక—

నేటి అత్యవసర పరిస్థితుల్లో ఆహారంకొరత తీరటానికి, పంట భూముల సాగుకొరకు, శ్రీశైలం ప్రాజెక్టును కట్టటానికి, మనప్రభుత్వం పథకంవేసింది. ఈ ప్రాజెక్టు నిర్మాణానికి, మన ప్రధానమంత్రి, మన ప్రియతమ నాయకుడైన శ్రీ జవహర్‌లాల్‌నెహ్రూ 1963జులై 24-గవ తేదీన ప్రారంభోత్సవం చేసారు.

మానవునికి, ముక్తి-శక్తి-శాంతీ ప్రసాదించేది దైవం. ఈ కలియుగంలో అందరిలోనూ, ఏ కొంతమందికో తప్ప అందరికీ దైవ భక్తి అంతగా ఉన్నట్లవుపించదు. నాగరికత ప్రబలిపోయి, తమకు తామే అధికులమని విర్రవీగేవారు, భగవంతుని దృష్టి యందుంచుకొనక పోవడం మిక్కిలి శోచనీయం.

దేవాలయ పునరుద్ధరణకు ముందంజవేసేవారికి అందరూ సహకరించాలి. ఉడుతాభక్తిగా సేవజేయాలి, ఆ స్వామి కటాక్షంవల్లనే మన దేశం....మనమందరమూ సుఖంగా వుంటాం!

[ఈ వ్యాసంలో ఎన్నో లోటుపాట్లు వుండవచ్చు కనుక మన్నించ ప్రార్థన.]



# విశ్వవిద్యాలయాలలో
# వ్యావహారిక భాష

— జి. వి. రామమూర్తి

విశ్వ విద్యాలయాలలో వ్యావహారిక భాష నిషిద్ధ మంటూ ఈ మధ్య ఒక విశ్వవిద్యాలయ అధ్యాపకులు ఒక వ్యాసం వ్రాశారు. నేటి వ్యవహారిక భాషకు ఏకత (Standardiazation) అవసరమని ఒక రచయిత వ్రాశారు. సార్వకాలీన ప్రతిపత్తిని ఆశించే కావ్యం సలక్షణ మైన భాషలో ఉండాలన్నారు కావ్యభాషావిచారము చేసిన మరొక రచయిత.

నేటి మన తెలుగు వ్యావహారిక భాష ఏదో దుస్థితికి లోనయి నట్లు అది విశ్వవిద్యాలయాలలో బోధనకు పనికి రాని దయినట్లు భావించి, పూర్వకాలపు వ్యావహారిక భాషఅంటే నేటి గ్రాంధిక భాష మాత్రమే విశ్వవిద్యాలయాలలో బోధనకు అనువైనదన్న అభిప్రా యాన్ని వెలిబుచ్చారు ఆ అధ్యాపకులు.

సార్వకాలీన ప్రతి పత్తిని ఆశించే అందరూ తమ కావ్యాలను రచిస్తారు. మన పూర్వులు అంటే చిన్నయసూరికి పూర్వము రచించిన వారంతా ఆయా కాలాలనాటి వ్యావహారిక భాషలోనే రచనలు సాగించారు సలక్షణాలతోపాటు జీవంగల భాష వ్యావహారిక భాష. సంకెళ్లు లేకుండా హాయిగా అందరి నాలుకలమీద నాట్యమాడే భాష వ్యావహారిక భాష. అందుకనే చిన్నయసూరికి పూర్వం వ్యావహారిక భాషలో అందరూ రచిస్తూ ఉండేవారు.

ఇంగ్లీషు భాషకు ఉన్నట్టే నేటి తెలుగు వ్యావహారిక భాషకు ఏకత అంటే Standardization కావాలని ఆశించినవారు ఇదివరకు లేకపోలేదు. ముప్పై సంవత్సరాలకు పూర్వమే మండపాక పార్వతీశ్వర

శాస్త్రిగారు, వేకుమళ్ల కామేశ్వరరావుగారు మొదలయినవారు కీ.శే రామమూర్తి పంతులుగారితో చర్చించడం జరిగింది. వ్యావహారిక భాషను అనుశాసించమని శాస్త్రిగారు పంతులుగార్ని కోరారుకూడ. వారికి పంతులుగారు ఇచ్చిన సమాధానం ఆ పనికి నేను పూనుకొనగలనా ? శాస్త్రులుగారివంటి వారు నూరుగురు సహాయులు అన్ని మండలములలోను పది సంవత్సరాలు శ్రద్ధతో పని చేస్తే కొంతమట్టుకు ఆంధ్రభాషను అనుశాసించవచ్చును. సంస్కృతమనే భాషకు అనుశాసనము చేసినవారు పాణినికి పూర్వులు అనేకులున్నారు. వారు చేసిన పని తాను స్వీకరించి కొంతపని పాణిని చేస్తే కాత్యాయనుడు మొదలయినవారు దానిలో పదివేల 'లోపాలు' 'దోషాలు' కనిపెట్టి దిద్దినారు. ఇంకా లోపాలుంటే పతంజలి మహర్షి మరికొన్ని సవరణలు చేసినారు. ఈ వ్యాకరణములో ధాతు పాఠాలు, గుణపాఠాలుఉన్నవి. ఎన్నో భాష్యాలు వాటికి టీకలు ఉన్నవి. ఇవిఉన్నాగొప్ప వైయాకరణులు తగవులాడుతూనే ఉంటారు. సంస్కృతమువాడుక భాషగా ఉన్నప్పుడే దానికి అనుశాసనము పుట్టినది. అనుశాసించిన వారు ప్రమాణముగా స్వీకరించినది గ్రంథస్థ భాషకాదు, శిష్టవ్యవహారమందుండిన భాష. ఆ భాషకు పేరు 'లౌకిక భాష' గ్రంథస్థభాషకు 'వైదిక భాష' అనిపేరు అనుశాసనములో ఉన్నది. ఏ శబ్దము ఏలాగున శిష్టులు ఉచ్చరిస్తారో ఆలాగుననే ఎత్తుకొని ప్రకృతి ప్రత్యయ విభాగములు చేసి సంస్కరించినారు - పాణిన్యాదులు. 'సంస్కారము' అనగా దిద్దడముకాదు. లోపాగమవ్యత్యయాదులు నిరూపించడమే-సంస్కారమనిపించుకొంటుంది ఒక పొల్లయినా లోకులవాడుకలో ఉన్నది తీసివేయకూడదు. లేనిది చేర్చకూడదు. వైవిధ్యము ఎంతఉన్న ఉపేక్షింపకూడదు. అంతేకాదు వారు ఇంకా ఇలాఅన్నారు షేక్స్పియరు కాలములో ఇంగ్లీషుభాష అశ్రుత పూర్వంగా విజృంభించినట్లు ఈ కాలములో తెలుగుభాష విజృంభిస్తున్నది. ఇంగ్లీషు భాషకు అప్పుడు కట్లూ గట్లూ ఉండాలని ఎవ్వరూ అభిలషించలేదు. . అప్పుడు కావలసి

నది స్వేచ్ఛగాని నిర్బంధము కాదు. వెల్లువవలె భాష ప్రవహించినది. వరదతో బురదా చెత్తా వచ్చి పడ్డది. అదిఅంతా క్రమంగా అడుగంటి నది. స్వచ్ఛమయిన భాష తేరినది. అప్పటినుండి ఇప్పటివరకూ ఇంగ్లీషు భాషావాహిని గట్టు లేకుండానే 'థేమ్జ్' నదివలె నిర్మల ముగా ఉన్నది. ఏటిలోనికి కొత్తనీరు రాకుండాగట్టుకట్టితే ఏరు ఎండి పోతుంది. నీరు నిలవఉంటే మురిగిపోతుంది. భాషా స్వభావమును అనుసరించి, భాషలో భావబోధమునకు కావలసిన మార్పులు కలుగుతూ ఉంటవి."

నేటి తెలుగు భాషకు ఏకత కావలెనని కోరేవారికి పై వాక్యాలు మార్గదర్శికములు కాగలవు.

చిన్నయసూరిగారి ప్రభావం ఇంకా విశ్వవిద్యాలయాలలో ఉంది. నేటి వ్యావహారిక భాషను విశ్వవిద్యాలయాలలో ప్రవేశ పెడితే పండితులకు వారి ప్రత్యేకత పోతుందని భయం. ఈ భయం ఈనాటిది కాదు 1909 నుండి ఉంది. వారు భయపడవలసిన పనిలేదు. విద్యాలయాలలో సంస్కృతభాషను గాని, గ్రాంధిక భాషను గాని నేర్పవద్దనిగాని పంతులుగారుగాని ఋతర వ్యావహారిక భాషావాదులు గాని అనలేదు. సమాధాన పత్రాలను గ్రాంథికభాషలోనే వ్రాయాలని విద్యార్థులను నిర్బంధించవద్దని, విద్యార్థులకు ఏ విషయమైనా సులభంగా అర్థమవడానికి వ్యావహారిక భాషలోనే విద్యాబోధన జరగాలని వ్యావహారిక భాషావాదుల కోరిక. కనీసం పూర్వకవి ప్రయోగాలనైనా అంగీకరించమని వారు ప్రస్తుతం అడుగుతున్నారు. విద్యార్థులు వ్రాసే సమాధానాలకు శాశ్వత ప్రయోజన ముంటుందను కొంటే అది ఏ విధమైన ప్రయోజనం? ఒక్క భాషావిషయంలోనేనా ఆ ప్రయోజనం? విద్యార్థి నేర్చుకొనే విజ్ఞాన విషయాలు సుబోధకము కానక్కరలేదా? విషయాన్ని వదిలిపెట్టి విద్యార్థి తన దృష్టిని భాష మీదనేనా కేంద్రీకరించ వలసింది? సైన్సుపేపరు వ్రాసే విద్యార్థి

మార్కులు ఏం చూసి ఇవ్వాలి? విషయాన్ని చూశా? భాషను చూశా? తెలుగు బి. ఏ., ఎమ్. ఏ. పరీక్షలకు వెళ్లే విద్యార్థుల గ్రాంధిక భాషాపాండిత్యాన్ని పరీక్షచేసేటప్పుడు వారిని సమాధానాలు గ్రాంధిక భాషలో వ్రాయమంటే కాస్త సమంజసమే మోగాని ఇతరత్రా శాశ్వత ప్రయోజనం శూన్యం.

నేటి మన తెలుగు విద్యార్థుల్లాగే 50 ఏళ్ళక్రితం బెంగాలీ విద్యార్థులు బాధపడుతూ ఉండేవారు. కాని వారిప్పుడు బంధ విముక్తులు. మన తెలుగు విద్యార్థులకు చిన్నయసూరిగారు తగిలించిన సంకెళ్లనుండి ఎప్పుడు విముక్తి పొందుతారో తెలియదు

ఆధునిక విజ్ఞానయుగంలో అన్ని దేశాలలోని విద్యార్థులు వైజ్ఞానిక విద్యలో పురోగమిస్తూంటే ఒక్క మన తెలుగు విద్యార్థులకుమాత్రం గ్రాంథిక భాషా నియమాలతో సంకెళ్లు తగిలించి వెనక్కు నెట్టడం ఎంత సమంజసమో విశ్వవిద్యాలయ పెద్దలు విచారించి తర్వాత కావ్యభాషావిచారము చేస్తే మంచిది.

విశ్వవిద్యాలయ పెద్దలు తెలుగుభాషా విషయంలో నియంతలుగా వ్యవహరించి భాషను వ్యాకరణసూత్రాలతో బంధిస్తే భాషకు జీవం ఉండదు. ఈ సందర్భంలో Vendrey పండితుడు ఫ్రెంచి భాషా విషయమై చెప్పినది మన పండితులకు కనువిప్పు కాగలదు.

"In any case, it can be foreseen that the fate of this, literary French will be that of Latin. It will be preserved as a dead language, with its rules and vocabulanice fixed once for all. The living language will continue to develop independently of it.

1747లో డాక్టర్ జాన్సన్, మనతెలుగుపండితులు లాగే ఇంగ్లీషు భాషను బంధించాలనుకొన్నాడు. కాని ఆ పని అసాధ్యమని తర్వాత తెలిసికొన్నాడు.

మన తెలుగు పండితులు విద్యాలయాల్లో నేర్పిన తెలుగు భాషనే వరవడిగా తీసికొని విద్యార్థులు పెద్దవారైన తర్వాత ఆ శైలిలో అంటే కావ్యభాషలో లేక గ్రాంధిక భాషలో గ్రంధాలు వ్రాస్తే ఎవరికీ ఉపకరించవు. విద్యార్థి దశనుండీ వ్యావహారిక భాషలో ఒక శైలిని విద్యార్థులు అలవరచుకొంటే వారికి విశిష్టతకలుగుతుంది. లేకపోతే వారు పరీక్షలో ఉత్తీర్ణం పొందే తాత్కాలిక ప్రయోజనాన్నే సాధించ గలుగుతారు గాని రచయితలుగా శాశ్వతమైన ప్రయోజనాన్ని పొందలేరు.

అప్పకవి వంటివాడు తన గ్రంధానికి శాశ్వతమైన ప్రయోజనం కలగాలన్న భావంతోనే టీకను వ్యావహారిక భాషలో రచించాడు. ఆ విధంగానే విశ్వవిద్యాలయాలలో పండితుల బోధనకు శాశ్వత ప్రయోజనం కలగాలంటే వ్యావహారిక భాషే శరణ్యం. ఈ విషయం చాలామంది తెలుగుపండితులకు తెలుసు. అందుకనే వారు విద్యాలయాలలో గ్రాంధిక భాషలో బోధించినా పత్రికలకు వారు వ్యావహారిక భాషలో తను రచనలను పంపుతున్నారు. సార్వకాలీన ప్రతిపత్తిని ఆశించే కావ్యం సలక్షణమైన భాషలో ఉండాలని కోరుకొనే పెద్దలు కూడా తను వ్యాసాలను, కథలను, నవలలను వ్యావహారిక భాషలోనే వ్రాస్తున్నారు. అయితే వారి పత్రికా రచనలు విలక్షణమైనభాషలో ఉంటున్నాయంటే వారు అంగీకరించరు గదా? గ్రాంధికభాష ఒక్క సలక్షణమైనదే కాని వ్యావహారిక భాష సలక్షణాలతోపాటు జీవంగలది.

నేటి ప్రజాస్వామ్య పరిపాలనలో రాజులనాటి భాషలో కాకుండా ప్రజల భాషలో విద్యాబోధన జరిగితే దేశంబాగుపడుతుంది.



# ఆంధ్రుల ఆరాధ్యదైవం

# భద్రగిరి రామభద్రుడు

— రచన: అయ్యదేవర పురుషోత్తమరావు

ఆంధ్రదేశంలో పురాణ ప్రసిద్ధాలైన పుణ్యక్షేత్రాలు కోకొల్లలుగా ఉన్నవి. అందులో శైలక్షేత్రాలు, నదీ తటాలు అయిన వాటికి ద్విగుణీకృత శోభకలిగి యాత్రికులకు ఉభయతారకం కావటానికి అవకాశం అధికంగా ఉంది.

శేషాద్రి, భద్రాద్రి, గౌరాద్రి, సింహాద్రి మొదలైన ఎన్నో పుణ్యక్షేత్రాలు శైలాగ్రాలమీదనే ఉన్నవి.

ఆంధ్రదేశంలోనేగాక యావద్భారత దేశంలో ఖ్యాతివహించిన ఆంధ్రుల పుణ్యక్షేత్రాలు శేషాద్రి భద్రాద్రి అని నిరాఘాటంగా చెప్పవచ్చు.

దాక్షిణాత్యులు తమ అధిక భక్తి యుక్తులతో శ్రీనివాసుడు అంటూ ఔత్తరాహులు 'బాలాజీ' అంటూ ఏడుకొండలవానిని సేవిస్తూ ఉంటారు.

ఔత్తరాహులు బాలాజీని దర్శించే ముందుముందుగా భద్రాద్రిని దర్శిస్తారు. శ్రీరామచంద్రుడు ఆ శేతు శీతాచలం దేముడు అందులో ఔత్తరాహులకు రామభద్రునిమీద ఎనలేనిభక్తి శ్రీరాముని దేవాలయాలలో భద్రాద్రికి భారతాంతర ఖ్యాతిఉంది అందుకనే శ్రీరాముడు ఆరాధ్యదైవంగా గల ఔత్తరాహులు భద్రగిరికి ప్రాధాన్యం యిస్తు ఉంటారు.

యావద్భారతానికి తమ కీర్తి కాంతులను విరజిమ్మి యీ రెండు పుణ్యక్షేత్రాలు ఒకటి తెలంగాణాలోను రెండవది రాయలసీమలోను ఉండటమే కాకుండా ఆంధ్రదేశానికి భద్రగిరి ఉత్తరపు కొనను తిరుమల దక్షిణపు కొనను మణులవలె ప్రకాశిస్తూ తమకాంతులను తమ దేశానికి పొరుగుదేశానికి ప్రసరింపజేస్తున్నవి. ఇక సర్కారుజిల్లాలలో ప్రవహిస్తున్న కృష్ణా గోదావరి తటాలలో శివ విష్ణు క్షేత్రాలకు లెక్కలేదు. కాగా ఆంధ్రప్రదేశమంతా ప్రసిద్ధ పుణ్యక్షేత్రాలకు ఆలవాలం అనటంలో ఆశ్చర్యంలేదు.

భద్రాద్రి గౌతమీ తటాన ఉంది. ఆంధ్రుల ఆరాధ్యదైవమైన శ్రీరామచంద్రుడు అక్కడి దేముడు. శ్రీరాముని గురించి, రామశబ్దం గురించి వేరే చెప్పనక్కరలేదు. రామనామం చెవిసోకగానే భక్తి భావం పొటమరిస్తుంది. తన్మయత్వం తాండవమాడుతుంది. పల్లెనుండి పట్నందాకా రామాలయం గాని రామమందిరంగాని ప్రదేశం ఉండదు. జోలపాటనుండి భజనకీర్తనదాకా ఆబాలవృద్ధులు రామనామమును రామచరిత్రమును నింపుతారు.

రాముడు అనే పదం తెలుగువారికి దేముడు అనే పదానికి పర్యాయపదంగా గోచరిస్తుంది. అందుకనే తెలుగువారిలో ఏ విషయాలలో భేదాభిప్రాయాలున్నా దేముడుగా రాముడ్ని, గ్రంథంగా రామాయణాన్ని, కవిగా వాల్మీకిని ప్రథమంగానే ఎన్నుతారు. సుందరాకాండ తెలుగువారి పూజామందిరాలలో స్థానం కల్పించుకుంది. రామనామంలో వ్రాయబడిన ఆంజనేయచిత్రాలు పూజామందిరాలు అలంకరించినవి. ఏకారణం చేతనైతేనేం రామనామం తెలుగువారి నరనరాలలో ప్రాకి ఉంది.

అటువంటి శ్రీరామచంద్రునికి ఆటపట్టు భద్రాద్రి. దీని పుట్టుపూర్వోత్తరాలు బ్రహ్మాండ పురాణంలో ఉన్నవి. రామాయణకాలంలో యిపుడు భద్రాద్రిఉన్న ప్రదేశం దండకారణ్యంగా చెప్పబడింది. త్రేతా

యుగంలో రఘువంశ దీపకుడై శ్రీరామచంద్రుడు అయోధ్యా నగరంలో దశరథమహారాజు పట్టమహిషి కౌసల్యామహాసాధ్వికి పుత్ర కామేష్ఠి యాగఫలమై ఉద్భవించాడు. ఆతడు విశ్వామిత్రశిష్యుడై ఆయన యాగమును రక్షించి శివధనుర్భంగముగావించి సీతను వివాహ మాడి పినతల్లి కైకమ్మ వర ప్రభావంచేత పితృవాక్పరిపాలనార్థం అరణ్య ప్రవేశంచేశాడు. ఆయన దండకారణ్యంలో ప్రవేసించి ఒక శిలపై సేదతీర్చుకొన్నాడు. కరుణార్ద్ర హృదయుడైన ఆ మహా భాగుడు కృతజ్ఞతా పూర్వకంగా తానధివసించిన శిల మేనకా మేరు వుల తపఃఫలమై వారికుద్భవించి భద్రుడనే పేరుతో పర్వత శ్రేష్టమై భాసించకలడని అనుగ్రహించాడు.

గంగను భగీరథుడువలె గోదావరిని గౌతముడు అక్కడకు తీసుకురాగలడనీ ఆ ప్రదేశముగొప్ప పుణ్యక్షేత్రము కాగలదనీకూడా ఆయన ఆశీర్వదించాడు.

ఆ ఆశీః ప్రభావంచేతనా అన్నట్టు మేనకా మేరువులు పరమే శ్వరునిగూర్చి పుత్రసంతానార్థమై అమోఘ తపమాచరించి భద్రుని పుత్రునిగాపొందారు. ఆ భద్రుడు గుణభద్రుడై రామభద్రుని గూర్చి తపస్సుచేసి ఆదివ్యమంగళ విగ్రహుని నీలమేఘశ్యాముని కోదండ పాణిని సీత లక్ష్మణాన్వితుని ప్రసన్నునిగావించుకొని శ్రీ రామ చంద్రుడు సూర్యచంద్ర గ్రహతారకాదు లున్నంతవరకు తన శిరః ప్రదేశమందధివసించి యుండునట్లుగా వరాన్నిపొందాడు, తదాది సీతాలక్ష్మణ సమేత శ్రీరామచంద్రమూర్తికి భద్రగిరి ఆవాసమైంది.

ఈ భద్రాద్రికి నాల్గుమైళ్ల దూరాన ఆగ్నేయంగా గోదావరీ గర్భంలో 'శేషతీర్థం' ఉంది.

పూర్వం నాగాధీశుడైన శేషునికి తనపై దండెత్తివచ్చిన దైత్యు లను జయించ శక్తి చాలక యీ ప్రదేశానికివచ్చి పరబ్రహ్మ ఆదేశాను సారం కార్యసిద్ధికై శివప్రతిష్ఠగావించి ఒక అగ్నిగుండమును నిర్మించి

అందభిచార హోమం సాగించాడు. శేషుని తపస్సు ఫలించి పరమే శ్వరుడు ప్రత్యక్షమై శత్రునిగ్రహార్థమొక శూలాన్ని ప్రసాదించాడు. శేషుడు పాతాళమునుండి భూలోకమునకువచ్చి నిజాభీష్ట సిద్ధి గాంచాడు. అక్కడ భూలోకమునుండి నాగలోకానికి పోయిన బిల ద్వారమున వచ్చిన భోగవతీ నదీజలం గంగాజలంలో కలిసింది. అందు వలన ఆతీర్థం 'రసాతలగంగాసంగమ' మని ప్రసిద్ధి పొందింది. శేషప్రతిష్ఠ నందిన ఆ శివక్షేత్రము 'శేషేశ్వర స్థానమని శేషుడభిచార హోమ మొనర్చిన గుండము'ఉష్ణగుండము'లను ఖ్యాతి పొందినవి. ఇట్టి క్షేత్రము శివ కేశవుల కావాసమై మహాతీర్థమై భక్తులపాలిటి కొంగు బంగారమై వెలసిల్లింది.

భద్రగిరివాస్తవ్యుడైన రామచంద్రుడు తొలుతగా సమీప గ్రామము నందున్న తమ్మల దమ్మక్కకు కలలో కనిపించి తన ఉనికి నెరిగిం చాడు. ఆమె ఉదయాననే ఆవార్తను కొందరి కెరిగించి వారి సహా యంతో భద్రగిరిపై పొదలమాటున భద్రగుడై ఉన్న రామభద్రుని సీతాలక్ష్మణ సమేతంగా వెలికితీసి శక్త్యానుసారంగా మందిర నిర్మాణం గావించి ప్రతిష్ఠ జరిపించింది.

నేలకొండపల్లి వాస్తవ్యుడైన కంచెర్ల గోపన్నకు రామచంద్రుడు కలలో కనిపించి మేనమామల ప్రాపకంతో అధికారాన్ని సంపా దించి తనకు దేవళాన్ని కట్టించమని ఆదేశించాడు. గోపన్న మహా భక్తుడై కబీరుదాసు కృపవల్ల తారక మంత్రోపదేశాన్నిపొంది రామ దాసై రామచంద్రునికి తన జీవితాన్ని అంకితం చేశాడు.

దేవాలయ నిర్మాణానికి సర్కారుసొమ్ము ఖర్చు చేయగా కొందరి కుతంత్రాలవల్ల గోలుకొండ నవాబు అబుల్ హసన్ తానీషా ప్రభువు ఏడుదినముల గడువులోపల తన సర్కారు శిస్తును వసూలు పెట్టకపోయిన రామదాసును ఉరితీయవలసిందిగా ఆదేశించాడు.

పూర్వజన్మమందు యీ తానీషా రామదాసులు సోదరులు, తానీషా గంగానదీ తీరంలో తీవ్రంగా తపస్సుచేసి ఎంతకూ శివ సాక్షా త్కారం జరుగకపోగా మహావేశంతో శివలింగంపై ఒకకుండను విసిరాడు.

శివుడు ప్రత్యక్షమై 'తామసివైన రాజువుగా జన్మనెత్తు'మని శపించాడు. రామదాసు శాపావిష్టుడైన ఒక ముని చిలుకకాగా ఆచిలుకను పంజరంలో పదురోజులు బంధించి రామనామం అనిపించి ఆనందించిన నేరానికి కారాగార బద్ధుడై రామనామంతో తరించాడు. గరుత్మంతుడు వీరినుద్ధరించటానికి కబీరురూపంలో అవతరించాడు.

కారణజన్ములైన యీ మహనీయుల కారణంగా భద్రగిరి, భద్రగిరి కారణంగా వారు చరిత్ర ప్రసిద్ధిగాంచారు.

తదాది మతాంతరులైన గోలుకొండ నవాబులనుండి తలంబ్రాలకు ముత్యాలు ప్రతి శ్రీరామనవమికి కళ్యాణ సందర్భంలో రావటం ఆచారంగా ఉంది. రామభక్తుడైన రామదాసు చరిత్రకు యీ ఆచారమొక ప్రత్యక్ష నిదర్శనం.

భద్రాద్రి సీతారామకళ్యాణం లోకప్రసిద్ధం. ఈ లోకమేకాక ఈ క్షేత్రం త్రైలోక్యప్రసిద్ధి కాంచింది అనటానికి నిదర్శనంగా పరమేష్ఠిచే విని నారదుడు యిక్కడ మూడురోజులుండి రామ కథాలాపం చేసి ధన్యుడైనాడని కూడా లేకపోలేదు. అందుకనే అక్కడ మూడు రోజులుండి భక్తి ప్రపత్తులతో ఉన్నవారు కైవల్యాని పొందుతారని లోకప్రసిద్ధి. తిరుపతి, భద్రాద్రివలెనె త్యాగరాజు, రామదాసు. ఒకరు తెలుగుదేశానికీ చివర రెండవవారు ఆ చివర (వెలుపల) రామనామ కీర్తనచేసి తెలుగుసాహిత్యంలో పండిత పామరులకు, ఆబాల వృద్ధులకు పేయూసాన్ని అందించారు. రామదాసు కీర్తనలు, దాశరథీశతకం తెలుగువారిలో సంగీతసాహిత్యాలలో అంతగా ప్రకాశంలేకపోయినా కనీసం కూనిరాగమైనా తీస్తూనే వుంటాడు. రామదాసు చరిత్ర, భద్రగిరిమహిమగా కథలుగా గీతాలుగా, నాటకాలుగా తెలుగు దేశంలో ప్రచారంలోఉంది.





(కళ్యాణ మంటపమువద్ద సిమెంటుతో) అందంగా నిర్మించి
ఉంచబడిన భక్తరామదాసు ప్రతిమ.

పిన్నటనుండి దుష్టులను బీచమడంచుట - భ్రాతృరాగసం
పన్నత - తండ్రియాజ్ఞపరిపాలన — ఏకసతీవ్రతంబు - ఆ
పన్నజనావనమ్మునను భవ్యగుణుండు, నరోత్తముండు నా
నెన్నికగన్న రాముకథ నెన్నిచరింతె? సతంబు మానవా!

— శ్రీ పల్లా రామకోటార్య.

# ఆంధ్రుల అభిమానదేవుడు! ...

# శ్రీ రా ము డు

— శ్రీ ఎన్. యస్. ప్రకాశరావు.

ఆధునిక నవనాగరిక ప్రపంచంలోని ఆకర్షణలు మానవుని ఆధ్యాత్మిక చింతనను అణగద్రొక్కేవిగా ఉన్నాయి. ఈకాలపుకృత్రిమత్వానికి అలవాటు పడ్డమనిషి, తానెవరో మరచి, తనెందుకు జన్మించాడో, తనకున్న అల్పాయుర్దాయాన్ని ఎలా సద్వినియోగం చేయాలో మఱచి, ముక్తిమార్గాల్ని విస్మరించి, పాపభూయిష్టమయిన పనులలో తమకాలాన్ని దుర్వినియోగం చేస్తూంటారు. కొందరు తమకున్న అల్పకాలాన్ని దైవచింతతో గడపి, జన్మరాహిత్యానికై కృషి చేయాలి.

భారతదేశంలో ఎన్నో ప్రదేశాల్లో ఎన్నో దేవాలయాలున్నాయి! అంతే, ప్రతీ పల్లెదగ్గర నుంచీ దేవాలయంలేని గ్రామం ఉండదు — ఉండకూడదని పెద్దలసూక్తికూడా! — అయినా, వాటిలో ఏకొన్నిటికో మాత్రమే ప్రత్యేకమైన పేరుప్రఖ్యాతులు, ప్రసిద్ధీ లభిస్తాయి! - వాటిలో ఏదోప్రత్యేకత, ప్రభావం, ఆకర్షణ మొదలగు శక్తులుండి ఉండాలి! —

మన ఆంధ్రదేశంలో అలాటి దేవాలయాల్లో తిరుపతి శ్రీ వేంకటేశ్వరస్వామి దేవాలయము, అన్నవరం శ్రీ వీరవేంకట సత్యనారాయణ దేవాలయమూ, భద్రాచలం శ్రీ సీతారాముల దేవాలయములు ప్రఖ్యాతములు. ఆ దైవాలు అశేష ఆంధ్రప్రజానీకం చేత ప్రత్యక్షదైవాలుగా కొలువబడుతున్నారు.

భగవంతుడు తనను నమ్మినవారిని చల్లగాచూస్తాడు. నమ్మని మూర్ఖులకు భక్తికలిగించేందుకు, ముక్తిమార్గం ప్రసాదించేందుకూ తన ప్రయత్నంగా ఈ లోకాన తనమూర్తిని నిలిపి, ఆమూర్తిపై మనసు లగ్నపరచి యితర పాపచింతలనుంచి దూరమవడానికి అవకాశాలు కల్పించాడు! అయినా — ఆ అవకాశాల్ని సద్వినియోగం చేసికోలేక, అజ్ఞానంలో ఆ విగ్రహాల్ని కేవలం రాతిబొమ్మలుగా భావించి, అలక్ష్య భావంతో వ్యవహరిస్తున్నారు చాలామంది. నాస్తికత్వానికి నాందియా అన్నట్లు మనదేవాలయాల జీర్ణరూపాలు మన తెలివితక్కువ తనానికి, అన్యాయకత్వానికీ నిదర్శనాలుగా నిలుస్తున్నాయి! కేవలం ఆపద సమయంలోనే భగవంతునిస్మరించి, మొక్కి, ఓ కొబ్బరికాయకొట్టడం ఒక ఫేషనులా తయారయింది. దేవుడు మనకు మన హీనస్థితిలో జ్ఞప్తికి వస్తాడు; మొక్కులుగొంటాడు; ఆపద తీరుస్తాడు. కాని, — ఆ భగవంతుని నిలయాలు, దేవాలయాలు ఎంత హీనస్థితిలోనున్నా మనం పట్టించుకోం! దానికి కారణం, ఆదేవుడు అడగడుకదా! 'నా గుడి బాగు చేస్తేనే కాని, నీ ఆపద తీర్చను, అని ఆధునిక లంచ మార్తాండుల మార్గంలో మాట్లాడటానికి దేవుడికి నోరులేదుకదా (మన దృష్టిలో) పాపం!

'నరత్నమన్విష్యతి మృగ్యతేహితతు' అన్నాడు కాళిదాసు! విలువయిన రత్నాన్ని వెతుక్కుంటూ మనం పోవాలిగాని, రత్నం మనలను వెతుక్కుంటూరాదు! విలువయిన దేదయినాసరే ఉన్నదంటే దాన్ని వెలికితీసి, దానిని సరైన ఉపయోగానికి తెచ్చుకోవాల్సిన బాధ్యత మనది.

అయోధ్యలో పుట్టిన శ్రీరాముడు లంకకుపోతూ ఆంధ్ర దేశంలో భద్రాచలంలో వెలిశాడంటే, ఆహా! ఆంధ్రుడెంత భాగ్యశాలి!

భద్రాద్రి పుణ్యక్షేత్రానికి పోవటానికి పూర్వం కొంచెం ఇబ్బందిగానూ, ప్రమాదంగానూకూడా వుండేది. గోదావరిలో పడవప్రమాదం అందుకుదాహరణ. కాని, ఈమధ్య ప్రభుత్వంవారు దృష్టిని ఈ జీర్ణాలయంపై పడటం, దాని పునరుద్ధరణ కార్యక్రమం చురుకుగా సాగడంతో, ఎక్కువప్రచారం లభించడంతో భక్తుల, యాత్రీకుల సంఖ్య పెరుగజొచ్చింది!— ప్రస్తుతం ఒక వంతెన ఏర్పడిన మూలంగా, యాత్రీకులసంఖ్య మఱింత పెరుగుతోంది! యాత్రీకుల సంఖ్య పెరిగితే సౌకర్యాలు పెరగాలి!- సౌకర్యాలు పెరిగితే యాత్రీకుల సంఖ్య పెరుగుతుంది. ఈ రెండిటికీ అవినాభావసంబంధంఉంది!— యాత్రీకుల సంఖ్య పెరుగుతూంది కనుక, ప్రభుత్వం సౌకర్యాలు పెంపు చేయాలి! భద్రాద్రికి రైలుమార్గం త్వరలో ఏర్పడేటట్లు కృషి చేయాలి!

భద్రాద్రి శ్రీసీతారాములవారి ఆలయ పునరుద్ధరణయజ్ఞంలో ప్రతీ ఆంధ్రుడూ యావచ్ఛక్తిని సహకరించి, శ్రీసీతారాముల కరుణాకటాక్షాలకు పాత్రులగుదురుగాక!

'భద్రాద్రి' ప్రత్యేకసంచికను ప్రచురించిన 'కాంగ్రెస్' పత్రికను శ్రీసీతారాములు దీవింతురుగాక!



# భద్రాద్రి దేవాలయం

— డా॥ శ్రీ డి. సూర్యభగవానులు.

భగవల్లీలలు అనంతాలు.

ఆయనను గూర్చి ఏవిషయమైనా చెప్పడానికేకాదు మనసులో అనుకోడానికి యింకా మానసికావస్థను దాటిన అనుభూతిద్వారా నైనా ఆయనను సమీపించడానికి అర్హత ఏమహాత్ముల కుంటుందో చెప్పలేము.

"యతోవాచోనివర్తంతే అప్రాప్య మనసాసహః — "

మాటలన్నియుపోయి ఎక్కడ నిలబడునో మనసుతోనైనను దరిజేర డానికి లభ్యుడుగాని, ఆ పరాత్పరుడు ఎలాంటివాడో— ఎవడో — అన్న ఋషీశ్వరవాణి సర్వదాసత్యం ఆ పరాత్పరుణ్ణి— ఆ జగన్నాటక సూత్రధారుణ్ణి తెలిసికొని — కన్నారచూసి — మనసారా ఆయనలో కలసిపోవడమే మానవుని లక్ష్యం జగత్గురువులు అందరూ - ప్రవక్త లందరూ — ఋషీశ్వరులందరూ చెప్పింది యీ సత్యాన్నే.

ఈ సత్యాన్ని చెప్పినవాళ్లు, నిజంగా — ఆ దేవదేవుణ్ణి నోరార కీర్తించి కన్నారా చూసి - మనసారా ధ్యానించి ఆయనలో లీనమై పోయినవారే — నిష్కామకర్మయోగులే !

తాము చింతించి చూసి అనుభవించిన ఆ భగవల్లీలను, ఆ మహా నందాన్ని తోడిప్రజానీకానికి అందించడమేవారి ఆశయం ! అందుకే వారు ఎన్నో పురాణాలు, శాస్త్రాలు, స్మృతులు, ఉపనిషత్తులు యింకా అవీయివీ ప్రపంచంలో ప్రచారంజేసారు. ఆ శాస్త్రాలు, పురాణాలుము న్నగునవి తెలియజేసే మార్గాన్ని అనుసరించేవాళ్ళు కొంతకుకొంత అయినా ఆ పరాత్పరుడికి దగ్గరౌతారు. ఆ మార్గాలలో సామాన్యులకి- అల్పబుద్ధికి అంటే ఏమీ తెలియనిపామరునికి విధించబడిన నియమం ప్రతిమారాధన. "ప్రతిమా అల్పబుద్ధీనాం" అన్నప్రాచీన వాణియిదే !

పామరు జనాంగాన్ని భగవంతుని పాదాల దగ్గరకు తీసుకొని రావడానికి భక్తాగ్రేసరులు అనుగ్రహించిన మహోపాయమది. వారి ఆశయాన్ననుసరించి లోకంలో దేవాలయాలు బయలుదేరాయి.

"ఎందరో మహానుభావులన్నాడు త్యాగయ్య! ఆమహాను భావులను ఎందరినో కలుసుకున్నాడు. తన భక్తిద్వారా భగవంతునితో ముఖాముఖి మాట్లాడినాడు.

"తెరతీయగరాదా!" అన్నకీర్తన ఆంధ్రుల కందరకు అనుభవైకవేద్యమేకదా! అట్టి మహాభక్తులకోవకు చెందినవాడే మన గోపన్న.

గోపన్న చిన్నప్పటినుండే రామభక్తుడే! ఆ రామచంద్రుని పాదాలు హృదయానికి హత్తుకున్నవాడే! రామభక్తిలోమునిగి తేలినవాడే!

"తస్య తస్యా చలాంశ్రద్ధామ్

మామేవవిధధామ్యహాః!" అన్నజగద్గురువు శ్రీకృష్ణ పరమాత్ముడు శ్రీరామచంద్రుని రూపంలో మనగోపన్నను ఆకర్షించాడు.

"దుర్మలిన మనోవికారినగు మర్త్యుని నన్నొడగూర్చి నీపయిం దలఁపుఘటింపఁ జేసితివి దాశరధీ కరుణాపయోనిధీ" అన్న గోపన్న పద్యం యీ మహా సత్యాన్ని నిరూపిస్తూంది. శ్రద్ధగలిగినతర్వాత ఏ మహాభక్తుడు భగవంతుని చూడాలని తలంపకుండా వుండగలుగుతాడు! శ్రీరామచంద్రుణ్ణి కండ్లారచూసితీరాలని పండ్లూ పూండ్లూ చింతించాడు — పూజించాడు — ధ్యానించాడు.

భక్తునిపూజ లంగీకరించాడు పరమాత్ముడు భద్రాచలంలో తాను ఏరూపంలో ఏస్థాయిలో - వెలసి భక్తులందరినీ అనుగ్రహించాలని అనుకున్నాడో ఆరూపంలో - అస్థాయిలో దర్శనమిచ్చాడు! గోపన్న రామదాసయ్యాడు!.

"కంటి నదీతటంబుఁ బోడఁగంటిని భద్రనగాధివాసముం
గంటినిలాతనూ జనురుకార్ముక మార్గణశంఖ చక్రముల్,
గంటినిమిమ్ములక్ష్మణునిఁగంటిఁగృతార్థుడ నైతినో
జగత్కంటక దైత్య నిర్దళన దాశరథీ కరుణాపయోనిధీ"

అన్న పద్యంలో యీ సత్యాన్ని వెలువరించాడు రామదాసు.

ఇక దేవాలయంలో ప్రవేశించగానే ఆ ప్రాతకట్టడము, రోత అనిపించింది ఆయనకు. ఏరూపంలో తనకు దర్శనమిచ్చాడో — అదే స్థాయిలో దేవాలయాన్ని తీర్చిదిద్దాలని అనుకున్నాడు. కానీ డబ్బేది. భక్తునికోరిక భగవంతుడు మన్నించడూ? వెంటనే రామదాసు తహసిల్దారయాడు. తనపనితాను చేసుకోడానికి ఆ జగన్నాటకసూత్రధారి ఎత్తిన ఎత్తుయిది. ఆరులక్షల వరహాలు ఖజానానుండి ఖర్చయిపోయాయి. దేవాలయందేదీప్యమానమయింది. ఆ భగవానుని అలంకరణార్థం నగనట్రవాహనాలు, అన్నీ చేయించాడు. ఉత్సవం చేయించి తన ఊహాగానాన్ని సత్యంజేసాడు. జీవితాన్ని సార్థకం జేసికొన్నాడు. భద్రాచలం కలియుగ వైకుంఠమయింది. ఆవలి కథ అందరూ ఎరిగిందే. తానీషాకు ఎక్కడనుండి తెచ్చియిచ్చాడు ఆ ధనం రామదాసు. రామచంద్రుడే యిచ్చుకున్నాడుగా!

ఈ దేవాలయాన్ని కట్టించినవాడెవ్వడు — కట్టించుకున్నవాడెవ్వడు? ఎందుకా ప్రతిష్ఠాపన! భక్తులను అనుగ్రహించడానికే ఆ శ్రీరామచంద్రుడు యీ దేవాలయాన్ని కట్టించుకున్నాడు. ఈ ప్రతిష్ఠాపనకు మనసార సేవచేసినవాడు రామదాసు ఆయనసేవా మూలంగా ఎందరు తరించారో ఎవరికెరుక.

"జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చపరం తప"

అన్న గీతావాణి యిందుకే కాబోలు. శ్రీరామచంద్రుణ్ణి మనసార తెలుసుకున్నాడు కన్నారచూసాడు. ఆయనలో సాయుజ్యం పొందాడు రామదాసు. అందుకు చిహ్నంగా వెలసిందే ఆ దేవాలయం.



# భద్ర ప్రే



రాచగుండ్ల
చెంచలరావు.

౧

అది వేదాంత వినూత్న మార్గపు పిశి
ష్టాద్వైత గమ్యంబు; మో
క్షదమౌ శ్రీపతి పుణ్యమూర్తి చరియం
గానేగు సాదర్శజీ
వదశాంతర్గత సప్తమాకృతి; ధరా
పాలాళి తేజంబు; నా
యెద క్రొందమ్మిని లే తధీదితుల సొం
పేపాఱ నూయించుతన్

౨

జనకుని, రత్నసానుపతి
శక్తిని, రామపదాబ్జభక్తిలో
జొనిపియు; తల్లి మేనక వి
శోభలు సర్వసమత్వబుద్ధిలో
దనరెడి నిశ్చలాత్మ నిజ
దాసుని భద్రుని ముక్తుఁ జేయగా
పొనరిన రామదేవపద
పుణ్యరజస్సు జగంబులో మెదున్

౩

నానాశాస్త్రకళామహీధ్రతక నం
తంబైన శిల్పాగమ
జ్ఞానాంభోధికగస్త్యుఁడైన యొకని
సార్ధ్వంపు శిల్పీంద్రుచే
నేనాడో జనకాత్మజేశ్వరుల రూ
పేబొందె పాషాణమూ
హా! నేడేనియు భక్తకోటికిడు తా
నాధ్యాత్మికౌన్నత్యమున్

౪

వెలుచఁ గాపురపు బాధలక్రుంగు తమ్మల
దమ్మక్క కింతపుణ్యమ్మొసంగె.
తన యీవినమ్మి భూపుని లెక్కసేయని
గోపన్న పలుకు నిక్కువముచేసె,
ధన మిచ్చునా? నిరంజనమూర్తియని గేలి
చేసిన తానీష సిగ్గుదీసె.
కులమత భేదబుద్ధులుదాటి "రహిమె"రా
ముడను కబీరుని ముక్తుఁజేసె.
గేస్తులకు నింటి వేల్పో? అగ్గింపదగిన
భక్తులకు కల్పతరువో? పెన్ పదవి విఱ్ఱ
వీగువారికి ముకుత్రాడో? యోగినుతుడో?
ప్రేమమయమూర్తి భద్రాద్రిరామమూర్తి

౫

పితృవాక్యపాలనా వివశమోదమున
సతితోడ తమ్ముతో సామాన్యుఁబోలి
పరతత్త్వవేది పావనవీరమూర్తి
చిరతరాభ్యుదయుండు శ్రీరామమూర్తి
దండకారణ్యా నూతన రమ్యతటుల
ఉండి పోయిన చోటు లుజ్జ్వలంబగుచు
బంగారు నేలలై పావనత్వంబు.
చెంగలించెడి మహా క్షేత్రంబులైన
దండకవన శాంతి ధరణీధ్రమహిమ.
నిండుగోదావరి నెగడించు చెలిమి
భద్రునిఁజేరి శాశ్వతవాసమున్న
భద్రాద్రి సిరిపెంపు వర్ణింపనగునె ?

౬

సగుణ నిర్గుణమార్గ సమ్మేళనోపేత
భారత వేదాంత పరిళమంబు
రేచుకుక్కలపైకి రేగేడు కుందేళ్ల
గన్న ఆంధ్రావని గట్టితనము
సంస్కృతంబును మించు సరసంపు బిగి ముద్దు
టంచాల జాను తెన్గుందనంబు
ఊగూగు టలలతో యుగ కథాళివెలార్చు
గోదావరమ్మ నిగూఢభక్తి.

ఆత్మకింపొనరింపగా ననుగుదమ్ము
దుష్ట శిక్షార్థము నాత్మతోయజాక్షి
శిష్ట రక్షణకు విధించి చింతలుడిగి
ఆదమఱచి కూర్చుండు కల్యాణమూర్తి

౭

గంగదాటించిన కర్మిష్ఠిగుహుఁ భక్తు
పిలిచి బ్రోచిన కర్మఫలదమూర్తి
తను నమ్ముకొన్న పోతన నాల్కఁదుదినున్న
యెనలేని దివ్యసాహిత్యమూర్తి
కరుణాత్యాగయ్య తంబుఱ బంగరుపాట
పాడిన తొలినాటి పాటగాడు
శరణన్న ఆ విభీషణు ఱేని జేసిన
మితిలేని రాజ్యలక్ష్మీ ప్రదాత

వానరులగూడి పనిగొన్న మానధనుడు
దశముఖుని జంపినట్టి కోదండ ధరుడు
ధన్యభక్తాళికభయ హస్తమ్మొసంగు
సొగసు చిఱునవ్వు జాబిల్లి మొగమువాడు

౮

శాంతశమదమాది సర్వసద్గుణమూర్తి,
ఉజ్జ్వలుండు, పూరుషోత్తముండు,
కలిమిబలిమి ఎలమి కనలేని తేజస్వి
చిరతరాత్మభోగి, చిన్మయుండు.

౯

వనవాసాగమ వేళ శాంతి పథముల్ వ్రాకుఁచ్చు కెమ్మోవి; పావని వేదాంత సుధామయాత్మునిగ దీర్పంజాలు ఓష్ఠంబు; చక్కనిసీతాసతి ముద్దు ముచ్చటలను కొఁడించు కెమ్మోవి; నన్నును దీవించుత జన్మధన్యతకు తెన్నుల్ పల్కఁ వాదోడుగాన్



ఓం

## అముద్రితమై అజ్ఞాతంగా అడుగున పడివున్న

# రామచంద్ర శతకము


శతక కర్త: పైడిపాటి వేంకటనృసింహాకవి * సేకరణ కర్త: ఆర్. యం. ఆంజనేయులు


ఈ కవి రచించినవి రెండు శతకములు కనబడుచున్నవి. ఒకటి రామచంద్ర శతకము, రెండు మన్నారు కృష్ణశతకము. యీతడు యీ రెండు శతకములను రచించి నెల్లూరుజిల్లా సూళ్లూరుపేట తాలూకాలోని మన్నారు పోలూరు అను గ్రామములో వెలసియున్న శ్రీ అశోఘుమల్లార కృష్ణస్వామి, మరియు సీతా లక్ష్మణసహితుడై వెలసియున్న శ్రీ కోదండరామస్వామివార్లకు అంకితమొనర్చి నట్లు తెలియుచున్నది. ఈ ప్రాచీనదేవాలయములో వెలసియున్న స్వామివార్లను గురించియున్ను, చారిత్రాత్మకమైన, "మణిమంటప" మను పేర పురాణ ప్రసిద్ధి చెందిన యీ పవిత్రక్షేత్రమహాత్మ్యమును గురించియు, సవివరముగా మరియొక పరి వివరించగలను!

ప్రస్తుతము పై కవిచే రచింపబడి, అజ్ఞాతంగా అముద్రితములై, అడుగున పడి కాలగర్భంలోకలిసి జీర్ణించిపోతున్న భక్తిరసపూరిత ముక్తిపదప్రస్థ సీసములతోను మత్తేభ విక్రీడితములతోను వున్న శతకద్వయమును గురించియు, ముఖ్యముగా యిది భద్రాద్రిరామాలయ ప్రత్యేకసంచిక కాబట్టి ప్రస్తుతము రామచంద్ర శతకమునుండిమాత్రం (నాకు లభించియున్న అముద్రితగ్రంథమునుండి) కొన్ని పద్యములను మచ్చుకు ఆంధ్ర పాఠక మహాశయుల ముందు వుంచుతున్నాను....యీ కవినిగురించిగాని వారి రచనలనుగురించిగాని పరిచయమున్న విజ్ఞులైన పెద్దలు వారికిలభించిన అమూల్యవివరాలను సలహాలను దయతో నాకు అందజేసిన సర్వదా కృతజ్ఞుడను.

కవి పరిచయము:

ఈ కవి నృసింహవిలాసమను ప్రబంధమును వ్రాసి యున్నట్లు కవుల చరిత్రయందు ప్రచురించియున్నది. యీతడు ఆరువేల నియోగి బ్రాహ్మణుడు, ఆపస్తంబ సూత్రుడు, శఠమర్షణ గోత్రమువాడు, లక్ష్మీపతికి, వేంకమాంబకును పుత్రుడు. యితడు నెల్లూరు మండలమునందలి పైడిపాడు కరణముల వంశము లోనివాడని తెలుపుటయేగాక, కరిణీకములు గోపరాజు రామప్రధాని యిప్పించెనను కథను గ్రంథస్థ మొనరించుచున్నాడు:

సీ॥ క్షితితలంబున నొప్పు కృష్ణా పినాకినీ,
దివ్యనదీమధ్య దేశభూమిఁ
గడు బూర్వవార్థికిఁ బడమట యోజన
దూరమై తగుఁ గందుకూరు మరియు
నదియె సీమానామమై యొప్పు కందు
కూరికిఁ దసరు వాయువ్యదిశను
బాలేరు దానికిఁ బౌలస్త్యదిశఁ బైడి
పాడొప్పు దానికి బశ్చిమమున

గీ॥ నెగడు, జతకు పాడు నిబుతి వేం
పాడుఁ జెలగు గాడ్పుమూల నిలవరయన
నమరు పురచతుష్టయం బివి తృణకాష్ఠ,
జలసమృద్ధి సిరుల నలరుచుండు॥

గీ॥ గ్రహణవేళ గోపరాజు రామన గో॥
కొండ ప్రభువుచేత గొనినదాన
మహిమ దుష్టమతుల మడియించి
స్థావరజీవనములు ద్విజుల జేర్చె మున్ను॥

"తదీయానుగ్రహలబ్ధంబైన యేతద్గ్రామ చతుష్టయ స్థాపన జీవితులయిన మదీయ వంశజులు"

ఇతని మేనల్లుడగు అయ్యలరాజు నారాయణ కవి, హంసవింశతి వ్రాసెను. యీ నారాయణకవి క్రీ॥శ॥ 1800 ప్రాంతములవాడని కవుల చరిత్రమనుచున్నది. కాని, పండిత వంగూరు సుబ్బారావుగారిచే రచింపబడిన శతక కవుల చరిత్ర క్రీ॥శ॥ 1660 ప్రాంతమువాడు కావచ్చునని తెలుపుచున్నది. కావున, మేనమామ యగు యీ నృసింహకవి 1650 ప్రాంతములవాడనవచ్చునని తోచుచున్నది .... ఇది సిద్ధాంతము కాదు! ఈ నృసింహకవి రచించిన రెండు శతకములును దశక విభాగము నొందియున్నవి.

స్తుతిదశకము, వాక్యోన్నతి దశకము, దాసనంగతి, మనోవృత్తి, సంసార దశకము, ఆఖేద, దీనత్రాణ అవతార, నీతి, దశకములను పేర్లతో-స్తుతి దశకము మొదలగు విషయములు విభాగించి వ్రాసెను. అందు రామచంద్రశతకమునుండి మచ్చునకు కొన్ని మత్తేభవిక్రీడితములు.

శా॥ శ్రీ సీతాహృదయాబ్జ భాస్కర దారారిప్రస్ఫురద్బాణ బా
ణాసోపేత లసచ్చతుష్కర శరీరాశ్లిష్ట గోదార్ఘురో
చ్ఛ్వాసప్రోల్లలదంబు శీకర నిజస్థానైక భద్రాద్రియు
గ్వాస శ్రీకర నన్నుఁ గైకొను ముపేంద్రా! రామచంద్రా హరీ॥

*　　*　　*　　*

మ॥ క్షితినేకాదశ సంఖ్యచే దశకముల్ జెన్నొంద మాణిక్య వ
జ్రతతిం గూర్చిన హారపంక్తిగతి గీర్వాణాంధ్ర శబ్దంబులన్
శతక గ్రంథ మొనర్చి నీ కొసఁగెదన్ సర్వేశయస్మత్కవి
త్వతపస్సిద్ధికి నన్నుఁ గైకొనుము పేంద్రా! రామచంద్రా! హరీ॥

*　　*　　*　　*

మ॥ సుగుణాత్ముండయి పైడిపాటికులదత్తుండై మనుప్రోస్తి నా
దు గురుండై శఠమర్షణాఖ్య మునిగోత్రుండై యజుర్వేది నా
దగు లక్ష్మీపతి సత్కవీంద్రునకుఁ బుత్రజ్యేష్ఠుఁడన్ నా వశం
బగు నర్లించితి నిన్ను వేంకటనృసింహాఖ్యుండ నీ వాఁడ భ
ద్రగిరీంద్ర స్థిత నన్నుఁ గైకొను ముపేంద్రా! రామచంద్రా! హరీ॥

మ॥ స్తుతికావ్యోన్నతి, దాససంగతి, మనోదుర్వృత్తి, సంసార ప
ద్ధతి, మాయాకృతి, తత్వసంతతి, యభేదఖ్యాతి దీనావన
స్థితి సర్వేశ, దశావతారమతి, కించిన్నీతి నా నొప్పు న
ద్భుతరీతిం గృతి రుద్రసంఖ్యాదశకంబుల్ సమ్మతిం జాని నా
యతకారుణ్యాత నన్నుఁ గైకొనుము పేంద్రా! రామచంద్రా! హరీ॥

* * * *

మ॥ కృపణుం గొల్చెడువాడె కష్టి, శరణార్థింద్రోచు ధర్మిష్టి. కా
నిపనుల్ గోరమితుష్టి, యేలినవిభుఁ నిందించు పాపిష్టిఁ తు
చ్ఛపు చాపల్యములందె నష్టి, వెసనేచ్ఛల్ బాయు సద్గోష్టి నో
తపనీయాంశుక నన్నుఁ గైకొనుము పేంద్రా! రామచంద్రా! హరీ॥

* * * *

మ॥ భవదుద్యద్గతమూర్తులఁ జోరని యప్రత్యక్షతాకార్యముల్
భువిగావింపనో రాక్షసీవ్రతఫలంబుం దత్పురోన్మత్త దా
నవులం గాల్పనో బుద్ధరూపమును బాణత్వంబు సాధించి ఋ
ష్యావనింబోల్చుటనన్నుఁ గైకొనుము పేంద్రా! రామచంద్రా! హరీ॥



| మూలం : | అనువాదం : |
|---|---|
| శ్రీ రామకృష్ణపరమహంస. | యన్. వి. సుబ్బారావు. |

శా॥ శ్రీరామా! తవదివ్యనామ భజనల్ సేయంగనేరన్, కృపా
పారావార! భవత్పదాబ్జ వరసేవా సాధనాలేశ మిం
పారం జేయగనేర, భక్తి నెఱుగన్, అజ్ఞానుడన్. కోరి నిన్
జేరంగా శరణాగతుండ నయితిన్; శ్రీరామచంద్ర ప్రభో!

ఉ॥ కోరను లోకమాన్యతను, కోరను భోగము లష్టసిద్ధులన్
కోరను సౌఖ్యముల్, మదిని కోరనుగా శతసిద్ధులేనియున్
కోరను కాంచనంబయిన. కోరను భౌతిక వాంఛలేవియున్
నీరజనేత్ర! కోరుదును; నీ శరణాగతి, జానకీపతీ!

చ॥ గురుతుగ నీ పదాబ్జముల గొల్వగ కోరినవారికెట్టి సు
స్థిరతర భక్తిభావము మదిం సమకూర్తువొ; నాకు నట్టి నీ
చరణములందు సుస్థిరత సన్నుత శాశ్వత భక్తినిమ్ము; వే
మరు శరణందు; నీ ప్రకృతిమాయల గూర్పకుమయ్య; రాఘవా!





గోదావరిగట్టున (పర్ణశాలలో సీతారామాలయ గోపురం)

ఆ నా డు !

# ఖమ్మం మెట్టు చారిత్రిక సమీక్ష

— కొదమసింహ్వాం సత్యనారాయణాచార్యులు.

కృష్ణా, గోదావరి నదీతీరాలలో ప్రాచీన కాలంనుంచి నాగులు, యక్షులు మొదలగు తెగలవారు నివసిస్తూవుండేవారని మన చరిత్రకారులు చెప్పుచున్నారు. క్రీస్తుకు పూర్వము 700 ప్రాంతాలలో ఆంధ్రులలో ఒక తెగ యమునానదీ తీరంలో నివసించినట్టు ఆపస్తంబుడను ఒక ఋషి వారికి గురువుగా వున్నట్లు చరిత్రకారులు చెప్పుచున్నారు.

మహాభారతయుద్ధకాలంలో ఆంధ్రులు. కౌరవులపక్షాన పోరాడినట్టు భారత కథలలో తెలుస్తున్నది. మహాభారత యుద్ధానంతరం ఉత్తరహిందూస్థానములో అనేక చిన్నరాజ్యాలు ఏర్పడినవి. అప్పుడు గంగా, యమునా ప్రదేశాలలో వుంటున్న అనేక తెగలు దక్షిణ దిశగా వలస వెళ్ళినవి. అందులో ఆంధ్రుల తెగకూడా వుంది. వీరు మొట్టమొదట వింధ్యకు దక్షిణ ప్రాంతమున నివాసము చేసిరి. నగరాలుకట్టి, రాజ్యాలు స్థాపించారు. వీరి నగరాలు దక్షిణ మహారాష్ట్రం నుంచి తెలంగాణా వరకు వ్యాపించినవి. ఈ వలసలకు నగరాల నిర్మాణానికి నాయకత్వము వహించిన రాజులు శాతవాహనులు. కాబట్టి, ఆంధ్రదేశాన్ని మొట్టమొదటగా పరిపాలించిన రాజులు శాతవాహనులు. వీరు స్థాపించిన రాజ్యమే శాతవాహన రాజ్యం. వీరి రాజధాని ప్రతిష్ఠానపురం, స్థానికంగా యున్న నాగ, యక్షతెగలతో కలసిపోయి స్థిరనివాస మేర్పరుచుకొని, ఆంధ్రులు ఒక జాతిగా రూపొందడం శాతవాహన కాలంలోనే జరిగింది. క్రీస్తుశకం 250 నాటి పల్లవశాసనంలో ప్రప్రథమంగా "ఆంధ్రపథము" అనేమాట వాడబడినది. శాతవాహన రాజులు క్రీస్తుకు పూర్వము 220 నుంచి క్రీస్తుశకము 218 వరకూ అంటే 400 సం॥లకు పైగా ఆంధ్రదేశాన్ని పాలించారు. ఈ వంశప్రారంభకుని పేరు శ్రీముఖుడు. మహారాష్ట్రంలో ప్రారంభమైన వీరి రాజ్యం హైద్రాబాద్,

కృష్ణ, గోదావరి తీరం వరకు వుండేవి. ఈవిధముగా ఆంధ్రసామ్రాజ్యము క్రమక్రమముగా సరిహద్దులు పెరుగును అనేక సంస్కృతులకు నిలయమై మిక్కిలి ప్రసిద్ధిగాంచినది.

ఆంధ్రరాజుల కాలము భారతీయ చరిత్రయందు సువర్ణయుగ మనుటకు పెక్కు కారణములు గలవు. చక్కని రాజ్యాంగ విధానము ప్రవర్ధిల్లెను. ఆర్థికముగా ప్రజలు సుఖముగా యుండిరి. దేశవిదేశీయులతో వర్తక వ్యాపారములు మిగుల అభివృద్ధి గాంచినది. దేశము భోగభాగ్యములతో తులతూగుచుండెను వైజ్ఞానికముగా ఆంధ్రదేశము ముందంజ వేసెను. గ్రంథములు. శాస్త్రములు మిగుల అభివృద్ధిగాంచినది. కళలు, సారస్వతము మిక్కిలి విశిష్టత వహించినవి. ఈ ఆంధ్రప్రాంతము రాజకీయముగా, సంస్కృతముగా, కళాదృష్టితో భారత దేశ చరిత్రలోనేగాక ప్రపంచ చరిత్రలో ఉజ్వలస్థానమున్నది. శాతవాహన, చాళుక్య, కాకతీయ, విజయనగర, గోల్కొండ, ప్రతాపరుద్రునితో పతనమైన ఆంధ్రమహాసామ్రాజ్యమును, ఖమ్మంమెట్టును రాజధానిగా చేసుకొని మరల నొక్కమారు వెలిగించిన సీతాపతి (ఇతనికే చక్రవర్తి షితాబ్‌ఖాన్ బిరుద ముండెను.) కీర్తి అఖిలాంధ్ర చరిత్రయందేగాక అఖండభారతావని చరిత్రలో అతని యంతస్థు సాటిలేనిది. స్తంభాద్రి దుర్గము (Khammam Fort) విస్మృత రాజ్యవైభవమునకు చిహ్నము. ఈవిధముగా మన తెలంగాణము ఆంధ్రుల చరిత్రకు పట్టుకొమ్మై విరాజిల్లినది. ఇట్టి అఖిలాంధ్ర ప్రాంతమును వివిధరాజ వంశములు విజయవంతముగా నేలినవి.

దేశవాసుల జీవితమును ప్రతిబింబింపజేయునదియే దేశచరిత్ర. ఆదేశపు నైసర్గికస్థితిపై ప్రజాజీవనము వారి సభ్యతా సంస్కృతులు. సాంఘిక, రాజకీయ. ఆర్థికపరిస్థితులు ఆధారపడియున్నవి. కనుక మనము మన ప్రాచీనకాలమునాటి స్తంభాద్రి చరిత్ర (History of Khammam) వైపు దృష్టి మరల్చుదము.

ఖమ్మంమెట్టు పట్టణము సుమారు 1000 సంవత్సరముల పూర్వ చరిత్ర గలది. దీని చరిత్రను గురించి నేటివరకు నిశ్చయముగా ఎటువంటి నిశ్చితమైన చరిత్ర తెలియటములేదు. కనుకనే యీ పట్టణ ప్రశస్తిని గురించి చారిత్రికులు సంపూర్ణముగా నేటి వరకు వ్రాయలేకపోయిరి. కాని కొంతమంది చారిత్రికులు తమకు తెలిసిన విషయములను అచ్చటచ్చట కొంతవరకు ఈ పట్టణ ప్రశస్తిని వర్ణించుచునే వచ్చిరి. అట్టి ఆధారములందుగల చరిత్ర క్లుప్తముగానే నిందు ఉదహరించుచున్నాను.

అందువలన మొదట నీ నగరప్రాచీనతను గురించి విచారింతము. ఈనగరము గూర్చిన "స్తంభాద్రి చరిత్ర" మను పేర స్థలపురాణముండినట్లు ఒక జనశృతిగలదు. (అందలి శ్లోకము)

కృతేతుసాలగ్రామాద్రి। త్రేతాయాం నృహరేర్గిరిః।
ద్వాపరే స్తంభ శిఖరి। కలౌ వేత్రిభిః పదవీః ॥

దీనివలన ఈ నగరమునకు కృతయుగమందు సాలగ్రామాద్రి యనియు, త్రేతా యుగమందు నృహరేర్గిరిః యనియు, ద్వాపరయుగమందు స్తంభశిఖరి యనియు, కలియుగమునందు పూర్వోక్తములైన మూడు నామంబులచేతను వ్యవహరింప బడుచుండినట్లు తెలియుచున్నది. ఈ పట్టణమున నీశాన్యదిశను కొండపై శ్రీ నృసింహక్షేత్రము గలదు. ఇది దర్శనీయ ప్రసిద్ధస్థానము. అలనాడు స్తంబ మునుజీల్చి ప్రత్యక్షమైన స్వామియే ఈ మూర్తియని ప్రజల విశ్వాసము. ఈ స్వామియందు నీ పట్టణవాసులకు మంచి భక్తి విశ్వాసములు గలవు. ఈ స్వామి కొండలోన వెలసిన కారణమున దీనికి 'స్తంభగిరి' యనుపేరు వచ్చెను. దీనికి తెనుగు రూపాంతరమే కంబంమెట్టు. అది క్రమముగా ఖమ్మంమెట్టుగా మారెను.

హరిభట్టు కవి తన వరాహపురాణములో నొక పద్యమున నీ పట్టణ ప్రశస్థి మరియు నీ పట్టణమునకు పశ్చిమదిశను ప్రవహించుచున్న 'మునేరు' నామాంతరముగల 'మున్న'ను గుంటి మల్లేశ్వరాలయమును, స్తంభగిరి నృసింహ స్వామిని వర్ణించెను. ఈ మునేరు వరంగల్లు జిల్లాలోని పాఖాల చెఱువునుండి బయలుదేరి ఖమ్మంపట్టణ పశ్చిమదిశగుండా ప్రవహించి కృష్ణానదిలో చేరు చున్నది. కావున ఈ హరి భట్టారకుడు ఏ ప్రాంతీయుడో, అతని చరిత్ర, కవిత్వము, కాలమునుగూర్చి మనము యోచింపవలసియున్నది. యీ క్రింది పద్యమువలన అతని ప్రశస్థి, గోత్రాదులు తెలియుచున్నది.

మ॥ అమృతప్రాయ నిశేష కావ్యరచనా హంభావ పుంభావ వా
గ్రమణీమూర్తివి; వేదశాస్త్ర వివిధగ్రంథార్థనిర్ణేతివే
కముఖ బ్రహ్మవు; యాజుషప్రకటశాఖా ధర్మధుర్యుండవ
ర్యమ తేజుండవు రాఘువార్య హరిభట్టా! సత్కవిగ్రామణీ

(వరాహ పురాణము)

శా॥ భారద్వాజసగోత్ర సంభవుఁడ నాపస్తంబుఁడన్ దిమ్మమాం
బారాజద్వర గర్భసంభవుఁడ రామజ్మాసుదానేకజ
న్మార్యాధాధిక పుణ్యాలబ్ధ హరినామాంకాప్త సత్పుత్రుఁడన్
శ్రీ రామానుజ పాద పద్మయుగళీ చింతా సమాయుక్తుఁడన్.

ఇతఁడు వైదిక బ్రాహ్మణుడు, యజుర్వేది, ఆపస్తంబ సూత్రుఁడు; భారద్వాజస గోత్రుడు; రామపండితునకును దిమ్మమాంబకును గుమారుడు. ఈ కవి శిరోమణి కృతీయములగు వరాహపురాణము, మత్స్యపురాణము, భాగవతషష్ఠైకాదశ ద్వాదశ స్కంధములు, నరసింహ పురాణములను మున్నగు గ్రంథములను రచియించెను. ఇందు మత్స్యపురాణమును, నరసింహ పురాణమును మాత్రము ముద్రితములైనవి. తక్కిన పుస్తకముల యముద్రిత ప్రతులు మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమందును, ఆంధ్ర పరిషత్పుస్తక భాండాగారమునను గలవు. వరాహపురాణమై దాశ్వాసములు గలది. దీనిని గవి ఖమ్మంమెట్టు గ్రామమునకు గరణమైన కొలిపాక ఎఱ్ఱయామాత్యున కంకితము చేసియున్నాడు. మరియు నీతడు ఖమ్మంమెట్టుపురము నతిశయముగా వర్ణించుట వలనను, ఆ గ్రామకరణమునకు వరాహపురాణమును గృతి యొసంగుటవలనను, గవి నివాసము ఖమ్మంమెట్టుయనియే యూహింపదగియున్నది ఆంధ్ర కవుల చరిత్రములో నీతని నివాసము ఖమ్మంమెట్టుయనియే వ్రాసియున్నారు.

ఖమ్మంమెట్టును సంస్కృతీకరించి స్తంభాచలమని కవి యిందు వాడియున్నాడు. కృతిపతిని బ్రభువనియు, నమాత్యశేఖరుడనియు గవి వర్ణించియున్నను, షష్ట్యంతముల యందలి యీక్రింది పద్యమువలన నీతడు గ్రామకరణమైనట్లు స్పష్టమగుచున్నది.

కం॥ శ్రీమహిత స్తంభాచల
నామ సముద్ధామ పట్టణస్థలగణక
గ్రామణికి బంధుహితర
జామణికిఁ గవీంద్ర పంకజన భోమణికిన్.

ఇంతను వరాహపురాణమువలన నీతఁడష్టఘంటావధాని బిరుదము గలవాడనియు హనుమత్ప్రసాదలబ్ధ వరప్రసాద సహజసారస్వతుఁడనియుఁ దెలియుచున్నది.

మనకు దెలిసినంతవఱకు వరాహపురాణముయొక్కటియే యీతడు నరాంకితము చేసి యుండెను. తక్కిన గ్రంథములు దేవాంకితములు.

ఇక హరిభట్టు కాలమునుగూర్చి యోచింపవలసియున్నది. వీరేశలింగం పంతులుగారు తమ యాంధ్రకవుల చరిత్రలో హరిభట్టు కవి క్రీ. శ. 1660 సం॥ర ప్రాంతమువాడని వ్రాసినారు. పిమ్మట కొంతకాలమున నరసింహ పురాణమును ముద్రింపించిరి. ముద్రితప్రతికి బిఠాపుర సంస్థాన కవియగు ఓలేటి వెంకటరామ శాస్త్రిగారు పీఠికవ్రాయుచు నందు హరిభట్టుయొక్క కాలమునుగూర్చి విమర్శించి యాతడు క్రీ. శ. 15 వ శతాబ్ది యందుత్తరభాగమునందున్న వాడనుటకు సందేహ ముండదని నిశ్చయించెను. ఈ విధముగా ననేకులు యనేక విధములుగా హరి భట్టు కాలమునుగూర్చి వ్రాసియున్నారు. హరిభట్టు సంస్కృత భాషలో రతి రహస్యమును రచియించెనని చెప్పుదురు. సంస్కృత రతి రహస్యము స్థోమ ఛాపాలుని యాంధ్ర పద్యములతోగూడ ముద్రితమైనది. ఆ ప్రకాశకులు హరి భట్టే సంస్కృత రతి రహస్యకృతికి కర్తయనియు జర్మన్ పండితుడగు "స్మిత్" అను నాతడు సంస్కృత రతి రహస్యమును క్రీ.శ. 1846 లో జర్మన్ దేశమున బ్రకటించెనని వ్రాసియున్నారు. కావున సర్వవిధముల కవి పుంగవుడైన "హరి భట్టారకుడు" పూజనీయుడు. ఇమ్మహాకవి మహాభక్తుడు. ఆంధ్ర ప్రపంచమున పోతనాది మహాకవులతోబాటు ప్రాతస్స్మరణీయుడై యున్నాడు. ఇట్టి మహా కవి ఖమ్మం మెట్టు పట్టణమున నొక కాలమున నుండెనని చెప్పుకొనుట మన పూర్వ పుణ్యవిశేషమని నొక్కిచెప్పవలసియున్నది.

## స్తంభాద్రి దుర్గనిర్మాణము (Fortification of Khammam) :

6-వ శతాబ్దములో ఓరుగల్లును రాజధానిగా చేసుకొని మహాదేవ సుశర్మ రాజ్యమేలుచుండెను. పిమ్మట మహాదేవరాజు పాలకుడయ్యెను. ఈతని కాల మున ఓరుగల్లునందు (Worangal) రెడ్ల కృషికులు కొందరు భూములను దున్నుచుండగా వారికొక ధననిక్షేపము లభించెను. వారు ధననిక్షేపమును గైకొనక రాజదర్బారునకు తీసుకొనివచ్చిరి. రాజు వారి యోగ్యతకు యానంద భరితుడై మెచ్చుకొని నా ద్రవ్యమును వారికొసంగెను. అంతట వారీ ఖమ్మం మెట్టుకువచ్చి యా ద్రవ్యమును వెచ్చించి అద్భుతమైన దుర్గమును మరియు కొన్ని తటాకములను నిర్మించిరి. స్థానికములో నొకగాధ, క్రీ.శ. 950 సం॥ర ప్రాంత మున పై నుదహరించిన రెడ్ల కృషికుల సంతతివారైన రంగారెడ్డి, లక్ష్మారెడ్డి,

వెల్మారెడ్డి యను ముగ్గురన్నదమ్ములు వరంగల్‌లో వారికి దొరికిన ధననిక్షేప ముతో ఖమ్మంమెట్టునకు వచ్చి యొక దుర్గమును, పట్టణప్రాగ్ధిశ నొక తటాక మును నిర్మించిరని తెలియుచున్నది. కావున నా సోదరులలో నొకరగు లక్నారెడ్డి పేరున లక్నారంచెఱువు అని యీ తటాకము వ్యవహరింపబడుచున్నది. రెడ్లు కృషికులు నిచ్చట కొంతకాలము తమ యధికారము నడుపుకొని ఖమ్మంమెట్టును ప్రత్యేక రాజ్యపరిపాలనగా పరిగణింపజేసిరి.

పూర్వ గ్రామాధికారులు వ్రాసియుంచిన ఆధారములబట్టి యింకొక గాథ తెలియనున్నది

మిక్కిలి ధనవంతులై అన్నదమ్ములైన, అక్కిరెడ్డి, అంకమ్మరెడ్డి ఖమ్మంమెట్టు దుర్గ నిర్మాణాధిపతులై, క్రీ. శ. 997 లో దుర్గ నిర్మాణమును ప్రారంభించి 1006 లో చేసిరి. మరియు వెలుగుమెట్ల వీరికి ముఖ్యగ్రామమని, గొల్లగూడెం, రాజన్నపేట, పుట్టకోట, రుద్రమకోట, గోపాలపురం యను ఈ 6 గ్రామములు వీరి పాలనలో నుండెనని తెలియుచున్నది. (ఈ 6 గ్రామములు ఖమ్మంమెట్టు సమీపములో నేటికిని నిలచియున్నవి). బహుశా పై రెడ్లకే యీ నామములు కల్గియుండవచ్చునని నా దృష్టిలో తేటపడుచున్నది కాని ఈ దుర్గ మును 'ఒరుగలు' నిర్మించిరని కొందరు ముస్లిం చారిత్రికులు వ్రాస్తున్నారు. మరి కొంతమంది 11-వ శతాబ్దమందు హిందూరాజులచే యీ దుర్గము నిర్మించ బడినదని, ఇది నాటి హిందూరాజుల ప్రతిభా పౌరుషమును నిదర్శనముగా చూపు చున్నదని మరియు 900 సం॥ల పైగా గొప్ప ఫ్రెంచ్ ఇంజనీర్లచే గట్టి పునా దులు వేయబడినవని వ్రాస్తున్నారు. వీటి యన్నింటినిబట్టి చూడగా నా దృష్టిలో నొక యుద్దేశము కల్గినది. ఈ దుర్గము ఓరుగల్లు కాకతీయులకు పూర్వమే, 11-వ శతాబ్దమునకు పైగా రెడ్లదొరలచే నిర్మాణమైనదని తెలుస్తున్నది. ఏది యెట్లున్నప్పటికి ఈ దుర్గము నేటికిని చెక్కుచెదరక నిలచియున్నది. ఈ కోట లోనికి ప్రవేశించుటకు 10 ద్వారములు గలవు చుట్టుప్రాకారము కోటగోడ చాల బలిష్టమై పొడవైనది. దీని నిడివి తాటిచెట్టు ప్రమాణములో నున్నది. కోట పై భాగములో ప్రవేశించునప్పుడు ఒక రాతి సింహద్వారము కనిపించును. దీనిని దాటిన పిమ్మట ఖిల్లా (Fort) యొక్క శిఖరమునకు చేరుకొందుము. ఈ శిఖ రముపైన తోపులు (Guns) వేయు స్థలముగలదు. ఆనాటి రెడ్లు, హిందూ మహమ్మదీయరాజు లుపయోగించిన బలిష్టమైన తోపులు నేటికిని గొన్ని కన్పించు

చున్నవి. ఈ దుర్గముచుట్టు సైన్యము నిలుపుటకొరకై అర్థచంద్రాకారములో నున్న కోట బురుజులు ఆరు గలవు. మరియు చతురస్రాకారములో నున్న కోట బురుజులు తొమ్మిది గలవు. దీనినిబట్టి చూచిన యానాడు ఈ దుర్గములో యెంత సైన్యముండెడిదో యూహించుకొనవచ్చును. దుర్గము లోపల గోడలపైన సూర్య చంద్రాదుల బొమ్మలు, రథ, గజ, తురగ చక్కడములు మరియుకొన్ని శాసనములు కాన్పించును (ఈ శాసనములు మనకు గోచరములుకావు). మహమ్మదీయ అపవిత్ర దేవాలయములు, యనేక కోనేరులు, గృహాలుకూడా నేటికిని కనిపించు చున్నవి. నిజముగా మనదేశములో రెడ్డినాయకులు గావించిన దుర్గ నిర్మాణ మద్వితీయమైనది. వారి ప్రయత్నమంతయు సఫలమై వారి చరిత్రలు నేటికి మహోన్నతస్థితికి వచ్చినవనుట అతిశయోక్తిగాదు. రెడ్ల అనంతరము ఈ దుర్గము దేశముఖులు, జమీందారులు, వెలమ వంశీయులు పాలించినట్లు దెలియుచున్నది.

కాలక్రమేణా చాళుక్యులు తరువాత మరల దక్షిణాపథము విచ్ఛిన్న మయ్యెను. దానినుండి ఓరుగంటి కాకతీయ రాజ్యము, ద్వారసముద్రపు హోయసల రాజ్యములు ప్రబలములై ఆంధ్ర మహారాష్ట్ర కర్ణాటకములకు పునాదులు వైచెను.

మొట్టమొదట వేంగి చాళుక్యులకు ఈ కాకతీయులు సామంతులుగా యుండిరి. ఈ కాకతీయ వంశానికి మూలపురుషుడు 'కాకర్త్య గుండ్యనార్యుడు' క్రీస్తుశకం 934-945 మధ్య 'నతవాటిసీమ' (మధిర) పాలించినట్లు తెలుస్తున్నది. కాబట్టి ప్రప్రథమమున కాకతీయ సామ్రాజ్యబీజము ఖమ్మంమెట్టు మండలములో అంకురించి వేంగి చాళుక్యులు వారసత్వపు తగాదాలలో మునిగి తేలుచుండగా కాకతి బేతరాజు స్వాతంత్రము ప్రకటించి హనుమకొండ రాజధానిగా కాకతీయ రాజ్యమును స్థాపించెను. కాలక్రమమున వీరు బలపడి ప్రస్తుతము వరంగల్లు అనబడు ఓరుగల్లు పట్టణమును రాజధానిగా చేసుకొని ప్రస్తుతపు తెలంగాణా రాజ్యమును పరిపాలించ మొదలిడిరి. కాన మన ఖమ్మంమెట్టు మండలము కాకతీయాంధ్రుల చరిత్రకు పట్టుకొమ్మయై వికసించినదని చెప్పవచ్చును. ఒక వేపు కాకతీయ సామ్రాజ్యము మహావైభవముగా నడుచుచున్నను, ఖమ్మంమెట్టు మాత్రము రాజకీయముగా స్వతంత్ర మాండలిక రాజ్యముగా వికసించెను. ఎప్పుడైతే ఢిల్లీ మహమ్మదీయ సుల్తానుల ప్రాబల్యము అధికమాయెనో దక్కన్‌లో

గూడా ప్రభుత్వము నెలకొల్ప ప్రయత్నించుచుండిరి. చివరకు తురుష్కులు ఘోరముగా యుద్ధములు సల్పి ప్రతాపరుద్రుని పట్టి ఢిల్లీకి గొనిపోయిరి. ఇంతటితో కాకతీయ సామ్రాజ్యవైభవము అస్తమించెను. ఇందులకు మహమ్మదీయుల యుద్ధ కౌశల్యము మరియు ఆంధ్రులయందలి అంతఃకలహములుకూడా కారణమయ్యెను. కొంతకాలమైన పిమ్మట మహమ్మదీయుల పరిపాలన ప్రజలకు సహింపరానిదై పోయెను. అందువలన ఖమ్మంమెట్టుకు సమీపమైన గోదావరీ మండల వాసుడగు సీతాపతి మరియు కాకతీయులకు సామంతులైన రాచవారు, కమ్మవారు, రెడ్డినాయకులు, బలిజనాయకులు, పద్మనాయకులు మొదలగు ఆంధ్ర నాయకులు స్వాతంత్ర్యోద్యమమును లేవదీయుచుండిరి. ఇట్టి సమయములో గోల్కొండనుండి రాజమహేంద్రవరమున కొక రాజోద్యోగి వచ్చెను. ఆయన పేరు "సర్‌లష్కర్" సీతాపతి యాతని దృష్టి నాకర్షించెను. "సర్‌లష్కర్" యాతని జేరదీసి తన కొలువులో జేర్చెను. నిరువదిమందికి నాయకుడుగానున్న సీతాపతి 200 మంది సిపాయిలకు సర్దారయ్యెను. ఆ రోజులలో జగ్గంపేట, పొదిలి మున్నగు కొండప్రాంతముల కోయవాండ్రు తిరుగుబాటుచేసిరి. సీతాపతి 500 మంది సైనికులతో మన్నెప్రాంతపు ఠాణాకు ముఖ్య పాలకుడుగా నియోగింపబడెను. అప్పుడు సీతాపతి యరణ్యప్రాంతముల నన్నింటిని స్వాధీనము చేసుకొనెను. రాజపూడియొద్ద ఖాతికోట గట్టించి బందోబస్తులు చేసెను. బహమనీరాజ్యమును హుమాయూన్‌షా పాలించుచుండెను. సీతాపతి విజయ వార్తలు ధైర్య స్థైర్యములకు సుల్తాన్ మెచ్చుకొని సీతాపతికి "షితాబుఖాన్" బిరుద మొసంగి గౌరవించి వరంగల్లుకు రాజప్రతినిధిగా నియమించెను. తన పెంపుడు దండ్రియగు బ్రాహ్మణుడైన పెద్దిరాజును బిలిపించుకొని, యమాత్యపదవి నొసంగెను. పిమ్మట వీరిరువురు జేదోడువాదోడుగానుండి శత్రువులను చెండాడ్చి తెలంగాణమును విముక్తమును గావించెను. తెలుగువారు సగర్వముతో తలలెత్తి తిరుగాడ దొడంగిరి. బహమనీ రాజ్యము, విచ్ఛిన్నమై బెరారు, బీదరు, బీజాపూర్, అహమద్‌నగర్, గోల్కొండ అను రాజ్య పంచకముగా విడిపోయెను. తెలంగాణా భాగము గోల్కొండ నవాబగు కులీకుతుబ్‌షా వంతునకు వచ్చెను. సీతాపతి యప్పటికే తగిన కట్టుదిట్టములు చేసుకొని సామ్రాజ్యము స్థాపించెను. వరంగల్లు, ఖమ్మంమెట్టు, బెల్లంకొండ మున్నగు బలిష్టమైన దుర్గములు కలిగి కృష్ణానది కివ్వంకుల గుంటూరుసీమవరకు వ్యాప్తి జెందించెను. ఈ సామ్రాజ్యమంతటికి ఖమ్మంమెట్టు రాజధాని కేంద్రముగాబూని 'తెలుగుభూమి' తేజస్సును దిక్కుల వెలయించెను. ఇతని పరిపాలన 5 సం॥ మాత్రమే జరిగినది.

ఇట్టి స్వల్పకాలములో సీతాపతి ఖండైకాధిపత్యము వహించి తెలుగు జండా నెగురవైచెను. శిథిలమైన దేవాలయముల నెన్నిటినో బాగుచేయించి పూజాదికములు ఏర్పాట్లు గావించెను. ఇతడు గొప్ప ధార్మికుడు. ప్రతి సంవత్సరము నృగమహారాజువలె వేయిగోవులను బ్రాహ్మణోత్తములకు దానము చేయుచుండెనట! దేశములో శాంతి భద్రతలు నెలకొల్పి ధర్మముగా న్యాయపరిపాలన జేయుచు కవి పండితులను గౌరవించి కగ్రహారము లొసంగెను. ఇతని కళాభిరుచికి చిహ్నముగా ఓరుగల్లు దుర్గములో షితాబుఖాన్ మహల్ నేటికిని మన దృష్టి నాకర్షించుచున్నది.

అదను కనిపెట్టి కులీకుతుబ్‌షా గొప్ప సైన్యమును తీసుకొని ఓరుగల్లు దుర్గమును ముట్టడించెను. సీతాపతి ముప్పది దినములవరకెట్లో కోటను కాపాడుకొనగల్గెను. కాని తురకు శత్రువులు ఘోరముగా పోరాడుచుండిరి. పిమ్మట ఈ విధముగా క్రీ. శ. 1516 లో గోల్కొండ సైన్యము నంతటితో వదలక ఖమ్మంమెట్టు కోటలో ఘోరముగా యుద్ధముచేసి ఆక్రమించి రాణివాసపు స్త్రీలను హింసించి అక్కసు తీర్చుకొనిరి. సీతాపతి అఖండ ధనరాసులన్నియు ఖమ్మం దుర్గమునుండి గోల్కొండ ఖజానాకు జేరెను. ఈ విధముగా కుతుబ్‌షా ఘనపురము, కోవిలకొండ, బెజవాడ, ఏలూరు ప్రాంతమువరకు కైవసము చేసుకొనెను. పిమ్మట విజయనగరాధీశ్వరుడగు శ్రీకృష్ణదేవరాయలు తన దిగ్విజయ యాత్రలో ఖమ్మంను జయించినట్లు ఆధారములు గలవు. ఈ విషయమును గురించి నందితిమ్మన తన పారిజాతాపహరణములో నుటంకించెను.

'కినుక మీరననంతగరి క్రిందుపడజెసె
కంబమ్మమెట్టు గ్రక్కున గదల్చె'

నని యాతడు వ్రాసెను. అప్పటికి ఖమ్మంమెట్టు, వరంగల్లు సీతాపతి స్వాధీనము నుండి తప్పిపోయి కులీకుతుబ్‌షా స్వాధీనమునందుండియుండెను. అతని నుండియే రాయలు (Khammam) ను గైకొనియుండును. Khammam కులీకుతుబ్‌షా వశము కాగానే చిలూఫ్‌ఖాను గజపతుల సామంతుడై రాజపూడికోట యందుండి రాయలను యెదిరించెను. క్రీ. శ. 1520 ప్రాంతమున రాజమహేంద్రవరము సమీపమున తన 70 వ యేట మరణించెను. మనము ఈ సీతాపతి చక్రవర్తి సంపూర్ణ చరిత్ర యెఱుంగుటకు ఇచ్చట వీలులేనందున కావున నేను యిందు క్లుప్తములో తెల్పనైనది. క్రీ. శ. 1767 ప్రాంతమున నీ దుర్గమున కధిపతిగా

జాఫర్ బేగను నాతడుండెను. పిమ్మట నవాబు నిజామలీఖాను కాలమున జఫరుద్దౌలా యనునతడీ ప్రదేశమునకు తహసిల్దారుగానుండెను. యీతని కాలమున ఖమ్మం మెట్టు పట్టణము మహోన్నతదశలోనుండెను. ఇతని యనంతరము క్రీ. శ. 1768 ప్రాంతములో రెండవ జఫరుద్దౌలాయను నతడు యీ ఖమ్మం ప్రాంతమునకు తహ్సీల్దారుగా నియమింపబడెను. ఈతడు జఫరుద్దౌలా ధ్వంసియను పేరుతో ప్రసిద్ధి కెక్కెను. ఖమ్మంమెట్టుకు కొద్ది దూరములోనే గల ధ్వంసలాపురమాతని పేరుతోనే వెలసినదని ప్రతీతి. పిమ్మట నిజామురాష్ట్ర పాలనలో నీ దుర్గముపై జాగీరుదారుని అధికారములోనికి వచ్చెను. కాని క్రీ. శ. 1937 లో నీదుర్గము మరల ప్రభుత్వముయొక్క యధికారులుగైకొనిరి. ఈ విధముగా ఖమ్మంమెట్టు నాటినుండి నేటివరకు దినదినాభివృద్ధి నొందుచు తెలంగాణములోని పట్టణములలో మకుటాయమానమై ప్రకాశించుచున్నది.

## ఖమ్మంమండల చరిత్ర (History of Khammam Dist):

ఈపట్టణము క్రీ. శ. 1889 కి పూర్వము జిల్లా ప్రధానస్థానముగా నుండెను. అప్పుడు దీనికి 'సర్కారె ఖమ్మం' అనే నామమున్నట్లు తెలుస్తున్నది. కాలక్రమేణా రాజకీయ కారణములచేత వరంగల్లుజిల్లాకు చేర్చిరి. మరల నీమధ్య రాజకీయ కారణములచేత పరిపాలనా సౌలభ్యమునకు హైద్రాబాద్ ప్రభుత్వము వారిచే ఖమ్మంమెట్టును 1953 లో నొక ప్రత్యేకజిల్లా ప్రధానస్థానముగా జేయబడెను. ఈజిల్లాకు ఉత్తర, తూర్పు, దక్షిణ ఆంధ్రరాష్ట్రము. పడమట వరంగల్లు. నల్లగొండ జిల్లాలు ఎల్లలుగానున్నవి. గోదావరినది ఉపనది 'కిన్నెరసాని', కృష్ణా ఉపనది మునేరు, పాలేరులు యీ జిల్లాలో పారుచున్నవి. రాజకీయముగా యీ జిల్లాను ఖమ్మంమెట్టు, మధిర, ఇల్లెందు, పాల్వంచ, బూర్గంపాడ్ యను 5 తాలూకాలుగా విభజించిరి. ఈ 5 తాలూకాల మొత్తం గ్రామములు (676). జిల్లా విస్తీర్ణము 3982.45 చదరపుమైళ్ళు. జిల్లా జనాబా 7½ లక్షలు. నైసర్గిక స్వరూపమునుబట్టి ఈ జిల్లాను చూచిన ఎత్తుపల్లములుగల రాతిప్రదేశముగా నున్నది ఎచ్చట చూచినను గుట్టలు కనపడును. నిర్మల్ గుట్టలు మూడు వరుసలుగా బయలుదేరి అందులో ఒకవరుస వరంగల్, ఖమ్మంజిల్లాల గుండా వ్యాపించినది. దీనినే సించికల్ గుట్టలనుచున్నారు. పాల్వంచ బూర్గంపాడ్ తాలుకాలలో గొప్పయడవులు గలవు. ఇదియే దండకారణ్యప్రాంత భాగము. తెలంగాణా దక్కనుపీఠభూమిలోని భాగము. కాబట్టి సముద్రమట్టమునుండి దీని

నరాసరి ఎత్తు సుమారు 1,200 అడుగులు వాయువ్యం నుంచి ఆగ్నేయ దిశకు వంగి యుండుటచేత నీటిపారుదల, నదుల ప్రవాహము కూడా నట్లేయుండును, ఈ జిల్లాలోని నదులన్నియు వడిగా పారును. వర్షాకాలమున వీనిలో వెల్లువలు కల్గి వేసవిలో చాలవరకు ఎండిపోవును. అందుచే నివి నౌకాయానమునకు పనికిరావు. నదులలో 10% నీరు మాత్రము కాలువలద్వారా ఉపయోగించబడి మిగిలినది వ్యర్థముగా పోవుచున్నది. పంచవర్ష ప్రణాళికల ద్వారా ప్రభుత్వము ఉపయోగములోనికి ప్రయత్నించుచున్నారు. శీతోష్ణస్థితినిబట్టి ఈజిల్లాలో సం॥లో చాలవరకు ఉష్ణముగాని, చలిగాని విశేషముగా నుండదు. వర్షము 30″—40″ మాత్రమే యుండును. నిచ్చట యడవులలో తుమ్మ, మామిడి, టేకు, మద్ది, తాడి, ఈత, సాలు, నల్లమద్ది, వెదురు మొదలగుచెట్లు పెరుగును. పెద్దపులులు చిఱుతపులులు, ఎలుగుబంట్లు, దుప్పులు, లేళ్ళు, కోతులు మొదలగు జంతువు లుండును.

కోతులు ఖమ్మంపట్టణములో ఎచ్చట చూచినను నివియేకాన్పించును. ఇంకా అనేక విధములైన పిట్టలు ఎన్నియో ఈ జిల్లాలో కాననగును. ఈ జిల్లా చెలకభూమి కనుక యిందు చెఱువులును, బావులును చాలకలవు. అందుచే వరి బాగుగా పండును. పాలేరు, వైరా చెఱువులనుండి కాలువలుత్రవ్వబడి ఖమ్మం జిల్లాలో 19,650 యకరముల భూమి సాగుచేయుట కుపయోగించుచున్నారు. జిల్లాలో ప్రధాన పంటలు వరి, జొన్న, నూనెగింజలు, సెనగలు, పెసలు, కందులు, మినుములు, కొద్దిగాను పొగాకు అచ్చటచ్చట పండును.

బావులక్రింద తోటలనువేసి పండ్లు, కూరగాయలు, పుష్పములు పెంచు దురు. సీతాఫలములు జిల్లాయంతటను దొరుకును.

ఖమ్మంజిల్లాలో ఉన్న కొత్తగూడెం మరియు ఖమ్మంమెట్టు సుమారు లక్ష జనాభాగల పట్టణములు. ఖమ్మం. జిల్లాకుముఖ్యస్థానము. ఇచ్చట చారిత్రక మగు గిరిదుర్గము గలదు. ఇది గొప్ప వర్తకస్థానము. రహదారులప్రైగల పట్టణము (Nodal town) నూలుబట్టలు, పట్టుబట్టలు, వేరుసెనగనూనె తయారుజేయుదురు. విస్తళ్లుకూడా ఎక్కువ యుత్పత్తి జేసి ఎగుమతి చేయుదురు. ఇచ్చట నొక కళాశాల కలదు. ఇచ్చటి ప్రజలు ఆంధ్రభాష చక్కగా మాట్లాడు దురు, దీని పూర్వనామము స్తంభాద్రి. పట్టణములో 1 మైలు దూరమున కొండ మీద నరసింహస్వామి ఆలయముగలదు. ఇది దర్శనీయప్రసిద్ధస్థానము. యా

పట్టణమునకు 20 మైళ్ళ దూరములో కూసుమంచి గ్రామముగలదు. ఇచ్చట ఓరుగల్లులోని వేయిస్తంభాల దేవాలయముతో సమానమైన శివాలయముగలదు. కాని వేయిస్తంభములులేవు. మరియు యీ పట్టణమునకు 16 మైళ్ళ దూరమున నేలకొండపల్లె గ్రామము కలదు. ఇది భద్రాచల రామదాసు జన్మస్థలము. గోలుకొండ నవాబైనగు తానీషా కాలములో మాదన్న మంత్రిగను, అక్కన్న దండనాథుడుగను యుండిరి. ఈ అమాత్యశేఖరులు "గోపన్న"కు మేనమామ లవుతారు. యిందువలన గోపన్నను భద్రాచల ప్రాంతమునకు తాసిల్దార్‌గా నియమించిరి. గోపన్న ఆ యడవిప్రాంతాననున్న రామ విగ్రహమును గాంచి ముగ్ధుడై రామభక్తుడయ్యెను. వెంటనే గోలుకొండ నవాబుల రాజధనమును వెచ్చించి గౌతమీతటమున యద్భుత దేవాలయము నిర్మించెను. అందులకు నవాబు కోపించి యాతనిని జైలునందుంచగా. శ్రీరామలక్ష్మణులు స్వయముగా వచ్చి నవాబునకు ధనముచెల్లించి యాతనిని విడిపించిరి. ఈ భక్తాగ్రేసరుడు రచించిన "దాశరథీ శతక" యాంధ్రులలో చదువనివారుండరు. నేటికినిగూడా యీ దేవాలయము నిజాంరాష్ట్రములోనున్న ఖమ్మంజిల్లాలోయున్నది. (ఇటీవల రాజకీయకారణములవలన మార్పుజరిగినది.) హిందూదేశములోగల పుణ్యక్షేత్రములలో నిదియొకటి. ప్రతి సంవత్సరము "శ్రీరామనవమి" అత్యద్భుతముగా జరుగును. దేశదేశములనుండి ఈ ఉత్సవములను చూచుటకు జనులు వత్తురు. నేలకొండపల్లె సమీపమునందు ఎఱ్ఱదిబ్బ యను మిట్టకలదు. ఇది విరాటునిగదె యని చెప్పుదురు. పూర్వము పాండవులు అజ్ఞాతవాస సమయమున నిచ్చటనే గడిపిరని కూడా చెప్పుదురు. ఈప్రాంతమున ప్రాచీన శిథిలములనేకములు నేటికిని గానవచ్చుచున్నవి. కనుక ఇటువంటి చారిత్రిక గ్రామము యాత్రికులకు దర్శనీయస్థానము.

ఖనిజ సంపద:

సింగరేణి. కొత్తగూడెం యీ రెండును నేలబొగ్గుగల ప్రదేశములు ఎక్కను పీఠభూమి యుత్తర హిందూస్థానము ఏర్పడుటకు పూర్వమేర్పడిన భూభాగమని భూగోళశాస్త్రజ్ఞులు స్పష్టముగా తెలియజేసిరి. కావున ఇచ్చట ఖనిజ సంపద మెండు. బొగ్గు, ఇనుము, బంగారము, వెండి, రాగి, సీసము, తుత్తు నాగము ఇవిగాక వజ్రములు, వైడూర్యములు స్ఫటిక శిలా ప్రాంతములలో లభ్యమగును. ఇట్టి అఖండ ఖనిజ ప్రాంతమును మన పూర్వీకులు "సువర్ణగిరి"అని

యాచంద్రార్క కీర్తినుండునట్లు యద్భుతముగా వర్ణించిరి. ఇట్టి ప్రాంతములలో నున్న ఖమ్మం మండలము అఖండ ఖనిజసంపత్తి నిలయమైనది. ఎల్లాందు తాలూకాలో పాలురాయి, సున్నపు రాతిగనులు యున్నట్లు ఇటీవల భూగర్భశాస్త్ర నిపుణులు భావిస్తున్నారు. మధిర తాలూకాలో కల్లూరువద్ద అభ్రకము దొరుకును. మరియు వజ్రపు గనులు గలవని తెలుస్తున్నది గార్ల సమీపములో కాకిరాయి (ఇనుపరాయి) విరివిగా లభించుచున్నది.

స్టడైట్. గ్రాఫైట్ యీ జిల్లాలో స్వల్పముగా లభించుచున్నది. ఖమ్మం పట్టణమునకు 3 మైళ్లదూరమున "కుంద్రవోడు" వద్ద ముగ్గురాతి గనులు (Borytes mines) విజయవాడ జస్వంత్ మినరల్సుకు జెందిన శ్రీ బి. జె. యస్. సింగ్ ఈ గనులను కనిపెట్టెను. తెలంగాణాలో త్రవ్వకం ప్రారంభమైన మొట్టమొదటి ముగ్గురాతి గని ఇదే ఇక బొగ్గు పరిశ్రమనుగురించి తెలుసుకొన వలసియున్నది. ఇంత పెద్ద ఒకే ఒక పరిశ్రమ ఆంధ్రప్రదేశ్‌కంతకీ సింగరేణి బొగ్గు గనులేనని చెప్పాలి. మొత్తం దక్షిణదేశానికంతకీ యున్న ఒకే ఒక బొగ్గు పరిశ్రమ సింగరేణి కాలరీలే. ముందు వీటిపుట్టుపూర్వోత్తరముల తెలుసుకొందాం. ఖమ్మం జిల్లాలో ఇల్లెందు సమీపమున 1841 సం॥లో కొంతమంది భూమి త్రవ్వుతుండగా బొగ్గు బయటపడింది. ఈ వార్తను తెలుసుకొని ఇండియా ప్రభుత్వమువారు పరిశోధనలు సాగించారు. ఇది శ్రేష్టమైనదిగా కనపడలేదు. అందువల్ల వారు మానుకొన్నారు. పిమ్మట ఈ ప్రయత్నాలను ఆధారంచేసుకొని 1871 సం॥లో "డాక్టర్‌కింగ్" అనే మరో భూగర్భ ఖనిజ పరిశోధకుడు ఇల్లెందు గ్రామ పరిసరాలలోనే బోరింగులు వేశారు. చక్కటి బొగ్గు ఉన్నదని ఋజు వయింది. 1886 లో హైద్రాబాద్ దక్కన్ కంపెనీ లిమిటెడ్‌వారు ఇల్లెందువద్ద గని త్రవ్వకానికి పూనుకొన్నారు. యుత్పత్తి అవుతున్న యీ బొగ్గును రవాణా చేయడానికి బెజవాడ—ఖాజీపేట రైల్వే లైనుమీద నున్న డోర్నకల్లునుండి రైల్వే లైను వేయబడింది. ఆ రైల్వేస్టేషన్‌కు సింగరేణి కాలరీస్ అని పేరుపెట్టబడింది. యీ కంపెనీ మేనేజిమెంటు హైద్రాబాద్ దక్కన్ కంపెనీనుండి సింగరేణి కాలరీస్ కంపెనీ లిమిటెడ్ హస్తగతమయింది (1921). అప్పటినుండి దీనికి మేనేజిమెంటులు మారినా పేరు మారలేదు. 1921 నుండి 1946 వరకు యీ గనులను బెస్ట్ అండ్ కంపెనీవారు మేనేజింగ్ ఏజంట్లుగా యున్నారు. ఇందు లోని అధికభాగం వాటాలు బ్రిటీష్ పెట్టుబడిదారులవి. 1946 నుండి 1949

వరకు వీటిని హైద్రాబ్ కన్‌స్ట్రక్షన్ (Hydrab construction) కంపెనీ ఆధిపత్యము వహించింది. దీనిలో మాజీ హైద్రాబాద్ మంత్రి లాయికాలీకి ప్రాబల్యం ఉండేది. పోలీసు చర్య (1949) తరువాత హైద్రాబాద్ ప్రభుత్వము తాయాతా ఇండస్ట్రియల్ ట్రస్టుఫండుకు యీ కంపెనీ అప్పగించబడింది. అప్పుడు ఈ కంపెనీ వాటాలలో నూటికి 88 ప్రభుత్వం కొనివేసింది. ఈ గనులను జాతీయంచేయడంలో ఇది ప్రధానమైన ఘట్టం. అప్పటినుండి సింగరేణి కంపెనీ మహోజ్వలముగా పురోగమిస్తున్నది. యీ విధముగా సింగరేణి కాలరీస్ ఆధ్వర్యాన తెలంగాణాలోని మూడు ప్రదేశాలలో ఈ బొగ్గుగని త్రవ్వకం జరుగుచున్నది. యీ మూడింటి లోనూ ప్రధానమైన ఉత్పత్తి కేంద్రము కొత్తగూడెం, రెండవది తాండూరు బొగ్గు గనులు. మూడవస్థానాన్ని ఇల్లెందు బొగ్గుగనులు ఆక్రమిస్తున్నాయి. ఈ మూడు ప్రదేశాల్లోను మొత్తం 14 బొగ్గుగనులున్నాయి.

ఈ విధముగా ఖమ్మంజిల్లా ప్రాంతము ఆంధ్ర మరియు తెలంగాణములకు కేంద్ర (Centre) మై పారిశ్రామిక, రాజకీయ, సాంఘిక, సంస్కృతుల యందు మిన్నయై ఆదినుండి అత్యధిక ప్రాముఖ్యత గల ప్రదేశముగా పరిగణింప బడుచున్నది.



శ్రీః

# భద్రాద్రిరామ

కవికోకిల, కవితిలక, కవిభూషణ,
నందివెలుఁగు శ్రీ వేంకటేశ్వరశర్మ.

తే. గీ॥ శ్రీరఘుకులాంబుధి శశాంక ! శిష్టరక్ష !
దుష్టశిక్షణ ధుర్యుండ ! దురితదూర !
జానకీప్రియ । మమ్మేలు సత్ప్రకాశ !
ప్రథితదాక్షిణ్యధామ ! భద్రాద్రిరామ ! 1

తే. గీ॥ శ్రీరమానిలయుండ ! సుశ్రీయుతుండ !
భక్తరక్షణాన్విత కళాప్రాభవుండ !
నీలవర్ణ । శుభాంగ । మమ్మేలుచుండు !
భద్రగిరిధామ । శ్రీరామ । భవ్యనామ ! 2

తే. గీ॥ కంధరసమగాత్ర । విశాలకనకచేల !
అబ్జసంభవ సంపూజితాబ్జ పాద ।
విమలవికసిత శతపత్ర కమలనేత్ర !
భద్రగిరివాస ! శ్రీరామ ! భవ్యతేజ ! 3

తే. గీ॥ రామచంద్ర ! లోకారాధ్య ! ప్రముఖవినుత
సాధుజనపోష ! [illegible] । శేషశయన । హరి ।
భవ్యగుణధామ । శ్రీరామ ! దివ్యనామ !
ప్రథిత దాక్షిణ్యధామ ! భద్రాద్రిరామ ! 4

తే. గీ॥ ఆర్తజనబంధు । సముదారకీర్తనీయ !
కౌస్తుభమణివిభూష । శృంగార రామ ।
కావుమో జగన్నాథ । యిక్ష్వాకుతిలక ।
ప్రథితదాక్షిణ్యధామ ! భద్రాద్రిరామ ! 5

తే. గీ॥ సుభగచారిత్ర । జలజవిస్ఫురితవదన ।
లోకనుత । యోగివంద్య । సీతాకళత్ర !
దశరథ కుమార ! చారుపద్మాయతాక్ష !
ప్రథిత దాక్షిణ్య ధామ । భద్రాద్రిరామ !

తే. గీ॥ అర్కకులజుండ । ముగ్ధమోహనహనుండ !
యజ్ఞరక్షణదక్ష । ప్రభాన్వితుండ ।
జాతి నాతిగఁ జేసిన ప్రబలయశుఁడ ।
ప్రథిత దాక్షిణ్యధామ ! భద్రాద్రిరామ !

తే. గీ॥ ఏకపత్నీవ్రతప్రౌఢి నీకపోలె
రాజ్యతంత్ర రమాదీప్తి రమ్యరక్ష !
అన్నిఁటికిసాక్ష్య మొక్కరామాయణమ్ము ।
ప్రథితదాక్షిణ్యధామ ! భద్రాద్రిరామ !

తే. గీ॥ రామబాణమనిన రామరాజ్యమనిన.
ప్రతిభనేఁటికిఁ లోకానప్రబలియున్నె
రామచంద్రమహాప్రభూ ! ప్రస్తుతింతు.
ప్రథిత దాక్షిణ్యధామ ! భద్రాద్రిరామ !



# భద్రాద్రి శ్రీరామకల్యాణమహోత్సవము

# భద్రగిరి చరితము

శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు, శ్రీరామనవమినాడు శ్రీరామకల్యాణ మహోత్సవంలో ఆకాశవాణిద్వారా చేసిన ప్రత్యక్ష వ్యాఖ్యానం వ్యాసరూపంలో యిక్కడ ప్రచురిస్తున్నాము.

సంపాదకుడు :

శ్లో॥ "ఆపదామపహర్తారం దాతారం సర్వసంపదాం
లోకాభిరామం శ్రీరామం భూయోభూయోనమామ్యహం
రామాయ రామభద్రాయ రామచంద్రాయవేధసే
రఘునాథాయ నాథాయసీతాయాః పతయేనమః."

ఇదుగో ఇదే భద్రాద్రి. ఇదే భద్రనగరం-ఆ కన్పడుచున్నదే పవిత్ర సీతా రామాలయం. గౌతమమహర్షి తపఃఫలంగా ఈ పవిత్ర గోదావరి ఎక్కడో మహారాష్ట్రంలో త్రియంబక క్షేత్రంలో జన్మించి పరవళ్లుత్రొక్కుతూ, జలజలపారుతూ వచ్చి భద్రగిరికి పాదాభిషేకంచేస్తూ గంభీరనిర్ఘోషతో ప్రవహిస్తూంది. ఇక్కడి ఈ గోదావరీ ప్రవాహాన్ని భవభూతి మహాకవి యెంతో గంభీరంగా వర్ణిస్తాడు.

శ్లో॥ ఏతేతేకుహరేషుగద్గదనదద్గోదావరీ నారయః
మేఘాలంభిత మౌళినీలశిఖరాః క్షోణీభృతో దక్షిణాః.

శ్లో॥ కండూలద్విప గండపిండకషణోత్కంపేన సంపాతిభిః
ఘర్మస్రంసితబంధనైః స్వకుసుమైరర్చంతి గోదావరీం।
ఛాయాపస్కిర్యమాణ విష్కిరముఖవ్యాకృష్ట కీటత్వచః
కూజత్క్లాంత కపోతకుక్కుటకులాః కూలేకులాయద్రుమాః॥

అని భారతీయులకు రామాయణగాథే మహా పర్వగ్రంథము. భద్రగిరిలో శ్రీరాముని కళ్యాణోత్సవం జరిగే శ్రీరామనవమి మహా పుణ్యదినము. ఈనాడు భక్తుల భక్తిపారవశ్యము చూచితీరవలసినదేగాని వర్ణించనలవికాదు.

శ్లో॥ "సంప్రాప్య రామనవమీ తులసీదళాద్యైః
సంపూజ్యభద్రగిరివాసి నమాదిదేవం
కృత్వోపవాస మథజాగరణంచకృత్వా
సాక్షాత్పదం రఘుపతేః పరమంప్రయాతి ॥"

అని బ్రహ్మాండ పురాణమున చెప్పబడినట్లు కళ్యాణోత్సవము భక్తులకతి సేవ్యమైనది. గోదావరీ తీర్థము, భద్రగిరిక్షేత్రము, భద్రగిరీశుని దివ్యమంగళ విగ్రహము. ఈ మూడును భక్తులను తరింపచేస్తూ, భక్తులకు ముక్తిని కొంగు బంగారముగా చేస్తున్నది.

పూర్వము ఉత్తుంగ గోదావరీ తరంగాలగుండాను, కీకారణ్యాలగుండాను, ప్రయాణము సాగించే భక్తులకు నేడు ప్రయాణసౌకర్యా లేర్పడటంవల్ల భగవంతుడు సులభసేవ్యుడైనాడు.

తపోయోగములు సాధించి సిద్ధులై, శీతాతపబాధలు, అసురబాధలు, తమ్ము అంటకుండా నిలుచున్న మహాత్ములే కదా శ్రీశైలాది మహాపర్వతాలు. వాటిలో మేటికదా యీ భద్రగిరి.

శ్రీరామచంద్రమూర్తి సతీసోదర సమేతంగా సంచరించిన దండకారణ్యం కృష్ణా, గోదావరీ నదుల మధ్యప్రాంతం. సీతా రామ లక్ష్మణులు ఈ ప్రాంతంలోని పెక్కు ఆశ్రమాలను సందర్శించి, దానవుల దుష్కృత్యాలను పోకార్చి శాంతి సౌఖ్యాలను నెలకొల్పారు. దుష్టశిక్షణ, శిష్టరక్షణకు కంకణం కట్టుకున్న శ్రీరామచంద్రమూర్తి భక్తుల కోరికపై, దండకారణ్యంలో అనేక ప్రాంతాలలో సంచరించారు. దండకారణ్య సంచారకాలంలో శ్రీరాముడు సంచరించిన దివ్య క్షేత్రాలలో భద్రాచలంకూడా ఒకటి. ఈ క్షేత్రానికి సంబంధించిన గాథను తెలుసుకుందాము.

భక్తహృదయేశ్వరుడు శ్రీరామచంద్రుడు దశరథ తనయుడు, భక్తుల ఇలువేల్పు. కోదండరాముని కొలవని వారుండరు. జీవితాన్ని ఆవరించే నిస్పృహ, నిరాశ, ఈతి బాధలు అన్నింటిని పోకార్చడానికి ఆ నీలమేఘ శ్యాముని పై భారంమోపి ఆ స్వామి కరుణాకటాక్షాలను కోరడం పరిపాటి.

భద్రాచలం అసలు పౌరాణికి గాథ ఇలా తెల్పుతుంది. శ్రీరాముడు దండ కారణ్యవాస కాలంలో సీతాలక్ష్మణ సమేతంగా భద్రాచలంపై గల ఒక శిలమీద విశ్రమించాడు. ఆ శిలా విశ్రామము అతనికి ఆనందం కల్గించింది. కనుక, ఆయన ఆ శిలను ఉద్దేశించి నీవు మేరువునకు కుమారుడవై నాకు భక్తుడవై పావన గౌతమీతీరంలో ఉద్భవించుమన్నాడు. అంతకుపూర్వంనుండే మేరువు రామభక్తుడై పుత్రునికొరకు బ్రహ్మదేవునికూర్చి తపస్సుచేసి వరం పొందాడు. వరానుగ్రహంవలన భద్రుడీ పవిత్రమైన గోదావరీతీరంలో పుట్టి పెరిగాడు. భగవంతుని సాక్షాత్కారానికై తపస్సు చేశాడు.

శ్లో॥ భవిష్యసి మహాత్మాత్వం భక్తోనిగిరి రూపధృత్
రామభద్ర పదాంకత్వాత్, భద్రాద్రిరితి విశ్రుతః ॥

భద్రుడు పూర్వజ్ఞాన సంపన్నుడు. ఎల్లప్పుడు శ్రీరాముని పాదాలు తన హృదయ పద్మమందుంచుకొని కఠోరమైన తపస్సు చేసేవాడు. ఈయన తపోగ్నిజ్వాలలు కొంతకాలానికి దేవతలు భరించలేకపోయారు. చివరకు మూడు లోకాలలోనూ అగ్నిజ్వాలలు వ్యాపించేకాలం సమీపించింది. ఆ సమయంలో పాలసముద్రము నందు లక్ష్మీదేవితో ఆదిశేషునిపై శయనించియున్న శ్రీ మహావిష్ణువువద్దకు దేవేంద్రాదులు వెళ్ళి భద్రుని తపస్సుయొక్క వేడిమిని తెలుపుకొని దాని నుపశమింపజేయు విధానమునకై అనేకవిధాల స్తోత్రములుచేశారు. అలా ఘోర తపమాచరించుచున్న భద్రునికి వరమిచ్చేదానికి శ్రీమన్నారాయణుడు శీఘ్ర గమనుడై తొందరచే శంఖ చక్రములు కుడియెడమలుగా ధరించి బయలుదేరాడు. ఈ విషయం ఆలయంలోని విగ్రహాలను చూచినట్లయితే స్పష్టమవుతుంది.

భద్రుని తపస్సుకు భగవంతుడు సంతసించి "ఓయీ భద్రా నీవు కోరు వరమేమియో తెలియజేయుమని పలికెను. భద్రుడప్పుడు తన తపస్సు ఫలించి నందుకు మిక్కిలి సంతోషించి "స్వామీ! కల్పవృక్షము సమీపించియుండ కసుగాయలను అపేక్షించుట యుక్తమా! కావున మీరిప్పుడు ఏ దివ్యమంగళ విగ్రహాలై నాకు కన్పించుచున్నారో ఆ స్వరూపముతో నా శిరముపై నివసించవలెనని నా ప్రార్థన అని విన్నవించెను. దానికి భగవానుడు అంగీకరించి భక్తాగ్రేసరా ప్రళయకాలము వరకు నేను నీ శిరముపై నివసించెదను. కల్పాంతమున నీవు వైకుంఠమును చేరగలవు. ఇప్పుడు నీవు నాతో నైక్యము పొందితివి. కాబట్టి నీ దర్శనము నెవరాచరింతురో వారు సకల పాపములనుండి విముక్తి బొందెదరనెను.

"వసామిశిఖరేభద్ర తవ, యావద్ధరిష్యతి।
భూమిర్భూతాని, కల్పాంతే మత్సాయుజ్యమవాప్స్యసి॥"

గౌతమ మహర్షిచే కొనిరాబడిన గంగ గోదావరీ నామమున నా యెదుటనే ప్రవహిస్తున్నది. అది నా పాదాలను స్పృశించి ఉండుటచేత మూడులోకాలను పవిత్రం చేయగలదు అని చెప్పి భగవంతుడు ఈ గిరిపై నివసించి యున్నాడు.

ఇక్కడ వామాంకంలో సీతను ధరించి, శరచాపధారియైన లక్ష్మణుని పార్శ్వమున నిలుపుకొన్న శ్రీరామచంద్రునికి చతుర్భుజము లుండుట విశేషం; రెండు చేతులలో ధనుర్బాణములు, మఱి రెండు చేతులలో శంఖచక్రములు ఉన్నాయి. విశేషమేమంటే ఇక్కడ దక్షిణకరంలో శంఖం, వామకరంలో చక్రం ఉండుటయే. దానికి కారణం అసుర సంహార కార్యం ముగిసింది కనుక చక్రానికంతగా ప్రాముఖ్యంలేదని అలా ధరించాడని ప్రసిద్ధి. కాబట్టి ఈ దేవునికి వైకుంఠరాముడనీ, రామనారాయణుడనీ ప్రసిద్ధి.

ఓం అనే ప్రణవంలో తొలి అకారవాచ్యుడు రాముడు. చివరి మకారవాచ్యుడు లక్ష్మణుడు. వీనికి నడుమ ఉకార వాచ్యయైన సీతాదేవి ఉన్నది. ఈ మూడు మూర్తులూ ఓంకార స్వరూపము, కాబట్టి ఈ దేవునికి ఓంకార రాముడని పేరు.

రామదాసు 'దాశరధి' పేర పిలిచాడు కాబట్టి ఈ స్వామికి దాశరధి రాముడని కూడ పేరు. లక్ష్మణుడు కుడివైపున ఉండటంతో ఈ రాముడు భోగమోక్ష ప్రదాయకుడని శాస్త్రమర్యాద.

ఈ క్షేత్రంలో ఆదివారం గిరి ప్రదక్షిణం చేయడం పుణ్యప్రదమని ప్రసిద్ధి దీనికి ప్రమాణం

" స్నాతః ప్రాతస్సుబోధే దినకరదివసే గౌతమస్వాఘునాశే
ధ్యాత్వా సీతా సమేతం రఘుకుల తిలకం భద్రమద్రింప్రణమ్య
గత్వా సంపూజరామం గిరివరశిఖరే సీతమా సన్ని విష్టం
భుక్త్వా భోగా నభీష్టాన్ అమరవరసుఖమ్
భుక్తి మంతే ప్రయాతి "—అని ప్రమాణముంది.

శివావతారులగు ఆదిశంకర భగవత్పాదాచార్యులు తమ శ్రీరామ కర్ణామృత గ్రంథంలో

"వామాం కస్థిత జానకీ పరిలసత్కోదండంకరే,
చక్రం చోర్ధ్వకరేణ బాహుయుగళే శంఖం వరం దక్షిణే,
బిభ్రాణం జలజాత పత్రనయనం భద్రాద్రిమూర్ధ్ని స్థితం
కేయూరాదివి భూషితం రఘుపతిం సౌమిత్రి యుక్తం భజే"

వామాంకస్థిత అని భద్రగిరీశ్వరుని స్వరూపం వర్ణించడంచేత వారీ క్షేత్రాన్ని దర్శించారని స్పష్టమౌతున్నది. ఆదిశంకరుల ఈ శ్లోకమే ప్రతిదినమూ ఈ క్షేత్రంలో అనుసంధింప బడుతున్నది.

త్యాగరాజు యాత్రగా ఇక్కడికివచ్చి "గిరిపై నెలకొన్న" "ఎన్నగాను రామభజన" "క్షీరసాగర శయన" అన్న కీర్తనలతో స్తుతించాడు. "మోహన రామా ముఖజితసోమా" అన్న కీర్తనను మోహనరాగంలో గానం చేశాడు.

ఈ క్షేత్ర చరిత్ర మరో విధంగా కూడ క్షేత్రమహాత్మ్యంలో చెప్పబడినది. ఇక్కడికి సమీపంలో ఉన్న భద్రిరెడ్డిపాలెమనే గ్రామంలో శబరకులానికిచెందిన పోకల దమ్మక్క అనే భక్తురాలుండేది. ఒకరాత్రి ఆమెకు స్వప్నంలో స్వామి కన్పడి అక్కడికిదగ్గఱగా తాటిచెట్టువద్ద తానున్నానని, తన్ను దర్శింప వచ్చుననీ చెప్పి అంతర్ధాన మొందాడు. ఉదయమే దమ్మక్క ఊరివాళ్లతో కలిసి అడవిని నరికించి తాటిచెట్టువద్ద ముమ్మూర్తులను కాంచినది. అందరు పరమానంద భరితులై దేవునికి నమస్కారముచేసి అక్కడొక పందిరివేశారు. ఆ స్థానమే నేటి గర్భాలయం. ఆనాటినుండి దమ్మక్క ఆదేవతలను పూజిస్తూ ఆతాటిపండ్లను నైవేద్యం పెట్టేది.

తరువాత కొన్నాళ్లకు అక్కడికి ప్రభుత్వాధికారిగా వచ్చిన కంచెర్ల గోపన్నకు దమ్మక్క ఆదేవతల వృత్తాంతము తెలిపింది. అప్పుడాయన ఆమూర్తిని దర్శించి భక్తితో ఆ ప్రదేశం వీడలేక అక్కడే నివసించాడు. తర్వాత కొంత కాలానికి దమ్మక్క పరమ పదించింది. నేటికీ ఇక్కడ జరిగే పూజానైవేద్యాలలో ఒక భాగం 'పోకలవారివంతు' అని వ్యవహరింపబడుతూ కొందరు అర్చకులకు చెందుతున్నది.

ఆనాటినుండి గోపన్న రామసేవలో నిమగ్నుడైయుండెను. ఆయన రామభక్తితో పాడిన కీర్తనలు పద్యములు ఆంధ్రదేశమంతా జన ప్రియంగా పాడబడు తున్నవి. తెలుగుదేశానికి మూర్తీభవించిన రామభక్తిగా పోతన్న, రామదాసు, త్యాగరాజు ముమ్మూర్తులు అవతరించి వెలసినారనవచ్చును.

ఆయన భక్తి ఎంతగా అతణ్ణి పరవశుణ్ణి చేసిందో అంతగానే ఆపాటలు, పద్యాలు పాడే భక్తులనూ పరవశం చేస్తాయి.

"చిక్కని పాలపై మిసిమి జెందిన మీగడ పంచదారతో
మెక్కిడి భంగి నీవిమలమే చకరూపసుధారసంబు నా
మక్కువపళ్లెరంబున సమీహిత దాస్యమనేటి దోయిటన్
దక్కెన టంచు జుర్రెదను దాశరథీ ! కరుణాపయోనిధీ !"

భద్రగిరి దర్శనంచేతనే ఆయన తన్మయత్వంతో నాట్యం చేస్తాడు.

"కంటి నదీతటంబు, పొడగంటిని భద్రనగాధి వాసమున్
కంటి నిలాతనూజ, నురుకార్ముక మార్గణ శంఖచక్రముల్
గంటిని, మిమ్ము లక్ష్మణుని గంటి, కృతార్థుడనైతి,
ఓ జగత్కంటక దైత్య నిర్దళన ! దాశరథీ ! కరుణాపయోనిధీ !"

"ముప్పున కాల కింకరులు ముంగిటవచ్చిన వేళ రోగముల్
గొప్పరమైనచో కఫము కుత్తుకనిండిన వేళ బాంధవుల్
గప్పినవేళ మీ స్మరణగల్గునొ గల్గదొ నాటి, కిప్పుడే
తప్పక చేతు మీస్మరణ దాశరథీ కరుణాపయోనిధీ"

గోపన్న రామభక్తిచేత ప్రభుత్వధనముతో రామాలయమునిర్మించి సకల వైభవాలను సమకూర్చి ఆ ఘోరదండకారణ్యాన్ని ఈ వైకుంఠంగామార్చాడు. రామునికి వాహనములుచేయించి సీతమ్మకు చింతాకుపతకంవంటి ఆభరణాలు చేయించాడు. ఆలయంలో శిల్పానికికాక సిద్ధాంతానికి ప్రాముఖ్యం ఇచ్చాడు. ప్రతిరాయి రామనామంతో సంపుటీకరించి ఆలయం నిర్మించాడని ప్రశస్తి. ప్రభుత్వధనంతో స్వామివారికి వాహనాలు, సాలగ్రామముల మాల, చింతాకుపతకం, పచ్చలపతకం, కలికితురాయి, బిళ్లలమొలత్రాడు, గజ్జెలందెలు, రవ్వలకుండలాలు, నీలాలపోగులు, ముత్యాలపోగులు, కిరీటం, మంగళసూత్రం, కొప్పుజెడలు, దంతకడియం, సర్వాంగ కవచం, సీతాలక్ష్మికంఠమాల ఇవిగాక ఇప్పటికీ భక్తులు స్వర్ణాభరణాలు రత్నాంభరణాలు స్వామివారికి సమర్పిస్తుంటారు.

స్వామివారికి అభిషేకం, ప్రభూత్సవం, దర్బారుసేవ, నవాహ్నిక కల్యాణోత్సవాలు జరుగుతుంటాయి. సప్తమినాడు అంకురార్పణ, అష్టమినాడు ధ్వజారోహణం, నవమీపుణ్యదినాన శ్రీకళ్యాణోత్సవం పూర్వంనుంచి జరుగు తున్నాయి. రామదాసు చేసిన యేర్పాటుప్రకారం ఈ ఉత్సవాలు జరుగుతున్నాయి, ప్రభుత్వ ధనం ఇలా వాడినందుకు రామదాసు ఖైదుపాలయ్యాడు.

కారాగారంలో ఆ విధంగా గోపన్న బాధలకు తాళలేక పాడినకీర్తనలకే రామదాసు కీర్తనలుగా ప్రసిద్ధికెక్కాయి భక్తుని బాధలు చూడలేక భక్తపరాధీనుడు రాముడు లక్ష్మణునితో తానీషాకడకుపోయి స్వప్నంలో నవాబుకు 6 లక్షల ధనం రామదాసు అప్పుకింద చెల్లించారు. అవే రామటెంకీలు. ఆ నవాబు దానితో రామ భక్తుడై స్వయంగా చెరసాలకుపోయి రామదాసును ఆదరించి విముక్తునిచేసి తిరిగి అతన్ని భద్రాచలానికి తహశీల్దారుగా సర్వాధికారాలూ ఇచ్చిపంపాడు. రామదాసు భద్రాచలానికి వస్తూ రామలక్ష్మణులు తానీషాకు చెల్లించిన నాణెములలో రెండు మాత్రం తెచ్చుకొని వానితో రామున్ని అలంకరించాడు. అవి యీనాడూ ఇక్కడ ఉన్నాయి, ఇప్పుడు వాటివిపోలిన వెండినాణెములు భద్రనగరం బజార్లలో అమ్ముతున్నారు.

రామదాసు అంతకుపూర్వంనుండే మహాకవియై కావ్యాలు రచించాడు. వాటిని నరాంకితంచేశాడు. చివరకు తెలివి కలిగి:—

"మసగొని రేగుపండ్లకును మౌక్తికముల్ వెలబోసినట్లుదు
ర్వ్యసనముజెంది కావ్యముదురాత్ముల కిచ్చితి మోసమయ్యో"

అని భక్తపోతన్నలాగా భక్తగోపన్నగూడ నరాంకితాన్ని దూషిస్తూ వాపోయాడు.

రామదాసు కాంచీపుర ప్రాంతంనుండి ఐదుగోత్రాలకు చెందిన వైష్ణవ బ్రాహ్మణ కుటుంబాలను రప్పించి భద్రాద్రిలో స్వామివారికి పాంచరాత్రాగమం ప్రకారం పూజలు జరిపించాడు.

రామదాసు తరువాత కొన్నాళ్లకు పాలవంచ ప్రభువులు దేవాలయ పరి పాలన చేపట్టి జరుపుతూవచ్చారు. ఆ తర్వాత సేవించినవారిలో వరదరామదాసు, తూము లక్ష్మీనరసింహదాసు ముఖ్యులైన భక్తులు. వారు భద్రగిరిలోనే నివాస మేర్పరచుకొని రామసేవ చేసినారు. నేడు జరిగే ఉత్సవాలన్నీ ఆ ఇద్దరు

భక్తులు ప్రవేశపెట్టినవే. ఇందు పవళింపుసేవ ముఖ్యమైనది. అది యిప్పటికీ జరుగుతున్నది. ఇప్పుడు గోదావరీతీరంలో ఉన్న పునర్వసు మంటపం రామదాసు నిర్మించినదే. వరదరామదాసు పరమపదించినప్పుడు శవయాత్రలో వెళ్లిన భక్తులు హరికీర్తనంచేయుచు గోదావరిలో ప్రాణాలు విడిచారు. ఆ యాత్రకు వైకుంఠయాత్ర అనిపేరు. ఇక్కడ చుట్టూ ఎన్నో శివకేశవాలయాలు ఉన్నాయి. అవి చందూలాల్, నిజాం ప్రధానమంత్రిగా ఉన్నప్పుడు నిర్మించాడు.

పట్టువస్త్రాలు మొహరీలు మొదలైనవి నిజాం నవాబు కట్నాలుపంపుతూ వచ్చాడు. అవి ఇప్పటికీ పంపబడుతూనే వున్నాయి.

భద్రాచలానికి 20 మైళ్ళ దూరంలో పర్ణశాల అనే గ్రామంలో శ్రీరాములు పర్ణశాల వేసుకొని గౌతమీసికతా తలమ్ములో విహరించాడు. శ్రీరాముడు పర్ణశాలవేసుకొని కాలక్షేపంచేసిన గ్రామం కావడంచేత ఆ గ్రామానికి పర్ణశాల అనే పేరు వచ్చింది. అచ్చటకూడ ఒక రామాలయంవుంది. అచ్చటినుండే రావణుడు సీతాదేవిని అపహరించెనని ఆ కారణంచేత ఆ శ్రీరామునికి శోకరాముడని పూర్వంనుండి జనప్రవాదము ఉన్నది. ఈ భద్రాచలంపై గల రాముడు భోగరాముడు. ఈతడు సమస్తోప భోగములు పొందుచున్న మహానుభావుడు. భద్రాచలానికి తూర్పున ముప్పదిమైళ్ళ దూరంలో శ్రీరామగిరి ఉంది. అందు శ్రీరాముడు మతంగాది మహామునులతో నాశ్రమవాసముచేసి మహర్షులతో బ్రహ్మవాదచర్చను, యోగాభ్యాసాన్ని సాగించాడు. అందుగల శ్రీరాముడు యోగరాముడు, అచ్చటగూడ ఆలయం గలదు. శ్రీరామగిరికి కొద్దిదూరములో సుగ్రీవగిరివుంది. ఈ ప్రాంతంనుండే శ్రీరామచంద్రుడు గౌతమీనదినిదాటి వానర సహాయంతో ఈ భద్రాచలానికి రెండుక్రోసుల దూరంవరకుగల ప్రదేశంకూడ శ్రీరామాజ్ఞచేత మూడులోకములను పవిత్రంచేయగల పుణ్యతీర్థ మహిమతో నలరారుచున్నదని గౌతమీ మాహాత్మ్యమునందు భద్రునకు దర్శనమొసంగిన శ్రీరామచంద్రమూర్తియే వచించినట్లు చెప్పబడియున్నది. భద్రాచలమునకు నాలుగుమైళ్ళ దూరంలో గౌతమీనదిలో ఉష్ణగుండము కలదు. దానిలోని ఉదకము వేడిగా నుండును.

## భద్రాచలం వంతెన

భద్రాచలంవద్ద గోదావరీనదిపై నిర్మించిన రహదారి వంతెనకు గత సంవత్సరం 1965 జులై 12-వ తేదీన రాష్ట్రపతి డాక్టర్ రాధాకృష్ణన్ నేత్ర

పర్వమైన కార్యక్రమంలో ప్రారంభోత్సవం చేసారు. ఆ సందర్భంలో ప్రసంగిస్తూ ఆయన సీతారాముల పవిత్రాదర్శమే భారతీయ జన జీవితానికి ధ్రువతార. ఒకమాట, ఒకబాణము, ఒకపత్ని వ్రతంగల శ్రీరామచంద్రుని మహనీయ లక్ష్య లక్షణాలే మతసమ్మత జీవితానికి ప్రాతిపదిక కావాలి. భౌతిక, ఆధిభౌతిక, సాంస్కృతిక, ఆధ్యాత్మిక జీవిత పరిపూర్ణత సాధించడానికి ఆత్మానుభూతి బ్రహ్మసంస్పర్శ ఆధారభూతాలు కావాలని అభిలషించారు. జాతీయ సమైక్య సాధనకు రామదాసు మనోధర్మం ఆదర్శం కావాలని రాష్ట్రపతి వివరించారు. ముస్లిమ్ ప్రవక్తలయిన కబీరువద్ద జ్ఞానభిక్ష బడసిన రామదాసు మన సాంప్రదాయిక సర్వమత సమాదరణకు శాశ్వత స్మృతి అని డాక్టర్ రాధాకృష్ణన్ వక్కాణించారు.

భద్రాచలం వద్ద నిర్మించబడిన వంతెన యాత్రికులకేగాక ఏజెన్సీ ప్రాంతానికిగూడా ఎంతో ఉపయోగకరంగా ఉంటుంది. సరియైనరవాణా రాకపోక సౌకర్యాలు లేక ఈ ప్రాంతంలోని అపారమైన అటవీ, ఖనిజ సంపదలు వినియోగానికి రాకుండా పోతున్నవి. ఇప్పుడు ఈ వంతెనవలన ఈ ప్రాంతంలో వున్న లక్ష ముప్పైవేల ప్రజల జీవిత పరిస్థితిని మెరుగు పరచడానికి వీలుంటున్నది. ఒరిస్సా మధ్యప్రదేశ్ రాష్ట్రాలు దగ్గరైనవి.

ఇక్కడ సమీపంలో ఒక థర్మల్ విద్యుత్కేంద్రం నాల్గుయూనిట్లతో ప్రభుత్వం జపానువారి సాంకేతిక సహాయంతో స్థాపించారు. దీనికి సుమారు 30 కోట్లధనం వ్యయమవుతోంది. ఇప్పుడు ఒక్క యూనిట్ మాత్రం పని చేస్తూ 60 మెగావాట్ల విద్యుచ్ఛక్తి సరఫరాచేస్తున్నది. 2-3 సంవత్సరాల్లో ఇంకా 3 యూనిట్లుగూడ పనిచేస్తాయి. అప్పటికి మొత్తం 240 మెగావాట్ల విద్యుచ్ఛక్తి ప్రసారం కానున్నది. దీనికి అవసరమైన నీరు ఇక్కడ ఉపనదిగా ప్రవహిస్తున్న కిన్నెరసాని నదిలో 3 కోట్ల ధనంతో ఒక ప్రాజెక్టు నిర్మింపబడుతున్నది. ఈకిన్నెరసాని చరిత్ర ప్రసిద్ధమై యెంతో అందంగా పారుతున్నట్లు శ్రీ విశ్వనాధ సత్యనారాయణగారి యీ క్రింది గేయంవల్ల స్పష్టమవుతుంది.

## కిన్నెరసాని

నడవగా నడవగా నాతి కిన్నెరసాని
తొడిమ యూడిన పూవు పడతిలా తోచింది

కడుసిగ్గు పడు రాచ కన్నెలా తోచింది
బెడగు వోయిన రత్న పేటిలా తోచింది
సాగింది సాగింది జాలుగా పారింది
ఆవు పొదుగునపాలు ధారకట్టిన యట్లు
వనదేవతలు నీళ్లు వలకబోసిన యట్లు
తల్లి చల్లని ప్రేమ వెల్లు వారినయట్లు
జల జలా పొంగింది బిల బిలా నడిచింది
పరికిణీతొక్కాడు పదియేండ్లకన్నెలా
పిల్లగంతులు వేయు తెల్లనా బెయ్యాలా
పసిపాప సెలవివారిన బోసినవ్వులా



# మోక్షసాధనములు-
# ప్రపత్తిదర్శనము

శిరోమణి
చెలమచెర్ల రంగాచార్యులు,
(రీడరు : తెలుగుశాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయము.)

మానవు లభిలషించునవి పురుషార్థములు. అవి ధర్మార్థ మోక్షములు నాలుగు. వీనిలో మోక్షము పరమ పురుషార్థము. జీవుడు జన్మమృత్యువులు, జరావ్యాధులు మొదలైన బహుక్లేశములతో 'నిండియున్న' యీ సంసారచక్రము నుండి తప్పించుకొని పరమపదమున సర్వేశ్వరుని సాయుజ్యమును పొంది తద్దివ్య మంగళ విగ్రహమును సేవించుచు ఆనందించుటయే మోక్షము. ఇదియే బ్రహ్మప్రాప్తి. దీనివలన కలుగు ఆనందమే బ్రహ్మానందము. ప్రాణులనుభవించు లౌకికానందములన్నియు సాతిశయములు. ఇది నిరతిశయము. అవి నశ్వరములు. ఇది శాశ్వతము. ఈ బ్రహ్మానంద ప్రమాణమెట్టిదో నిరూపించుచు వేదము—నడివయస్సు, మంచి ఆరోగ్యము, గొప్ప యైశ్వర్యము, సత్సంతానము అడ్డులేని అధికారము మున్నైనవి కలిగిన ఒక చక్రవర్తికి కలుగు ఆనందమును ఒక మానుషానందమునకు కొలగఱ్ఱగా పెట్టుకొనినచో అట్టి నూరు మానుషానందములు ఒక మనుష్య గంధర్వానంద మగుననుచు క్రమముగా దేవగంధర్వానందము, పితృదేవతానందము, ఆజాన దేవతానందము, కర్మదేవతానందము, దేవతానందము, ఇంద్రదేవతానందము, బృహస్పత్యానందము, ప్రజాపత్యానందము, హిరణ్య గర్భానందములను పేర్కొని, ఇవి పూర్వ పూర్వముకంటె ఉత్తరోత్తరమునూ రేసిరెట్లు అధిక ప్రమాణము కలవగుననిచెప్పి, అట్టి హిరణ్యగర్భానందముకూడ అఖండ బ్రహ్మానందములో అల్పాల్పమైన యొక యంశము మాత్రమే యగునని తేల్చెను. ఇట్టి సర్వోత్కృష్టమైన బ్రహ్మానందమును బడయుటకు జ్ఞానులగు జీవులు తహతహపడుట యుక్తమేకదా।

మోక్షపురుషార్థమును సాధించుటకు కర్మయోగము, జ్ఞానయోగము, భక్తి యోగము—అనునవి సాధనములుగా సాధారణపద్ధతిలో నిర్దిష్టము లగుచున్నవి. వీని స్వరూపాది వివేచన మిది—

## కర్మయోగము

సత్కర్మానుష్ఠానము ప్రతి వ్యక్తికిని అవశ్యముగా కర్తవ్యమైనది. విధి విహితములైన కర్మలను శ్రద్ధతో అనుష్ఠింపవలసినదిగా శాస్త్రమాజ్ఞాపించుచున్నది.

'నియతం కురు కర్మత్వం కర్మజ్యాయోహ్యకర్మణః'

(భ. గీ. 3 అ. 8 శ్లో)

'తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే కార్యాకార్యవ్యవస్థితౌ
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మకర్తుమిహార్హసి'

(భ. గీ. 16 అ. 24 శ్లో)

తద్విదుల ఉపదేశానుష్ఠానములచేతను, శ్రుతి స్మృతిమీమాంసాది రూపమైన శాస్త్రముచేతను కర్తవ్యమేదియో, అకర్తవ్యమేదియో తెలిసికొని కర్తవ్యములైన నిత్యనైమిత్తిక కర్మములను మానవుడు కామక్రోధాదులను దరిజేరనీయకుండ గను, నిష్ఠతోను, ఆచరింపవలయును. అట్టి కర్మయోగి మోక్షమును పొందును.

'ఏతైర్విముక్తః కౌంతేయ! తమోద్వారైస్త్రిభిర్నరః
ఆచరత్యాత్మనః శ్రేయ స్తతోయాతి పరాంగతిమ్'

(భ. గీ. 16-22.)

స్వకర్మానుష్ఠానము భగవదారాధనమే యని నిశ్చయించి తన్మూలమునను ముక్తి పొందనగు ననుచున్నది గీతాశాస్త్రము.

'స్వేస్వేకర్మణ్యా భిరతః సంసిద్ధిం లభతేనరః
స్వకర్మనిరతః సిద్ధియథావిందతి తచ్ఛృణు'
'యతః ప్రవృత్తిర్భూతానాంయేన సర్వమిదంతతమ్
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతిమానవః'

(భ. గీ. 18-45, 46.)

జీవుల ఉత్పత్త్యాది సమస్త వ్యాపారములును, ఏ పరమాత్మవలన కలుగు చున్నవో, ఎవనిచే ఈ చరాచరాత్మకమైన జగత్తంతయు వ్యాపింపబడినదో, అట్టి సర్వేశ్వరుని విహితవిధిచే పూజించి మానవుడు సిద్ధిని బడయునని తాత్పర్యము.

స్వకర్మానుష్ఠాత యెట్లు ముక్తినొందగలడో ఆచార్యులు వివరించిరి.

'అవిద్యయామృత్యుం తీర్త్వా విద్యయాఽమృత మశ్నుతే'

అను యజుర్వేదవాక్యమును వ్యాఖ్యానించుచు విద్యయనగా జ్ఞానమనియు, అవిద్య యనగా తత్సాధనమైన సత్కర్మాచరణమనియు స్పష్టపఱచి సత్కర్మానుష్ఠానమున జ్ఞానమును, దానివలన భగవద్భక్తియు, దానిచే భగవదనుగ్రహమును, తత్ఫలితముగా మోక్షమును లభించునని వారు ప్రకటించిరి.

మఱి! కర్మలు బంధహేతువులుకదా! అట్టివి తమ స్వభావమునకు విరుద్ధముగా ముక్తికి కారణము లెట్లుకాగలవు?—అన్నచో:

'యజ్ఞార్థాత్ కర్మణోఽన్యత్ర లోకోఽయంకర్మ బంధనః
తదర్థం కర్మ కౌంతేయ! ముక్తసంగః సమాచర' (భ. గీ. 3-9.)

ఈశ్వరార్పణబుద్ధితో నిష్కామముగా ఆచరించు సత్కర్మమెల్ల యజ్ఞమనబడును. అట్టి యజ్ఞరూపములైన కర్మలు బంధహేతువులు కావు—' అని సమాధానము. ఫలతృష్ణలో కర్మల నాచరించువారిని గీత 'కృపణాః ఫలహేతవః' అని దీనులనుగా చిత్రించి గర్హించినది. ఫలాపేక్షవిడిచి సత్కర్మానుష్ఠానము చేయువారిని వివేకులుగా ప్రశంసించి వారు మోక్షఫలమును చూఱగొందురనియు వెల్లడించినది.

'కర్మజం బుద్ధియుక్తాహి ఫలంత్యక్త్వా మనీషిణః
జన్మబంధవి నిర్ముక్తాఃపదం గచ్ఛంత్యనామయమ్'
(భ. గీ. 2-51)

## జ్ఞానయోగము

'నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే
తత్స్వయం యోగసంసిద్ధః కాలే నాత్మని విందతి'
(భ. గీ. 4-38)

జ్ఞానముతో సాటివచ్చు పావనమైన సాధనము వేఱేలేదు. నిష్కామకర్మయోగి కాల క్రమమున ఆ జ్ఞానమును తాను బడయును. అని జ్ఞానయోగ ముగ్గడింపబడినది.

దేనివలన వస్తు తత్త్వము తెలియునో అది జ్ఞానము. 'జీవుడు, ప్రకృతి, ఈశ్వరుడు'—అను తత్త్వముల స్వరూప స్వభావపరిజ్ఞానము లెస్సగాగల జ్ఞానికి స్వకర్తవ్యము సుబోధమగును. జీవునకు పరమకర్తవ్యము పరమేశ్వరానుగ్రహ సంపాదనము. ఆ పరిజ్ఞానములేనివానికి దేహమందు ఆత్మబుద్ధి: అల్పజ్ఞుడగు తనయందు సర్వజ్ఞత్వమతి—మొదలైన భ్రాంతులు పొడమును. వానిచే అహంకారాదులు కలిగి అసుర వృత్తికి దారితీసి కడపటికి వానిని పతితుని గావించును.

కర్మనిష్ఠ, జ్ఞాననిష్ఠ యను రెండును భగవంతునిచేతనే తొల్లి ఉపదేశింప బడినవి. యోగులకు కర్మనిష్ఠయు, సాంఖ్యులకు జ్ఞాననిష్ఠయు విహితములు. జ్ఞానయోగమును సృష్ట్యాది కాలములో పరమాత్మ సూర్యున కుపదేశించెనట. ఆ సూర్యుడు మనువునకు, మనువు ఇక్ష్వాకునకును ఉపదేశించిరి. అట్లు క్రమముగా జ్ఞానయోగము లోకములో వ్యాపించెను. ఈ సంప్రదాయము కొంత కాలమునకు మఱుగుపడిపోయినది కాగా—ఆ భగవానుడే శ్రీకృష్ణస్వామిగా అవతరించి అర్జునున కుపదేశించి లోకము ననుగ్రహించెను.

ఈభావము

'లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠాపురా ప్రోక్తామయాఽనఘ
జ్ఞానయోగేనసాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్'
'ఇమం వివస్వతే యోగం ప్రోక్తవా నహ మవ్యయమ్
వివస్వాన్ మనవే ప్రాహ మను రిక్ష్వాకవేఽ బ్రవీత్
ఏవం పరం పరాప్రాప్త మిమం రాజర్షయో విదుః
స కాలేన మహతా యోగోనష్టః పరంతప
స ఏవాయం మయా తేఽద్యయోగః ప్రోక్తః పురాతనః'

(భ. గీ. 4-2,3.)

అను భగవద్గీతా వాక్యములలో వ్యక్తీకరింపబడినది. ఈశ్వరుని సర్వజ్ఞత్వ, సర్వకర్తృత్వాదులను, జీవుని అల్పజ్ఞత్వాదులను, ప్రకృతి స్వరూపమును ప్రత్యక్షముగా తెల్లముచేయుటకే శ్రీ కృష్ణభగవానుడు తన విశ్వరూపమును అర్జునున కనుగ్రహపూర్వకముగా ప్రదర్శించెను.

ఈ జ్ఞానమనునది కేవలము ఆయాతత్త్వస్వరూప నిరూపణపరములగు వేద వేదాంత దర్శనపురాణాదులందుప్రోక్తములైన ఆధ్యాత్మిక వాక్యముల తాత్ప ర్యావబోధ పర్యవసన్నమైనంత మాత్రముననే చాలదు. ఆ వాక్యజ్ఞానము ముముక్షు లైన యాసాధకునకు ప్రబోధకమై భగవదుపాసనా రూపముగా పరిణమించు మహానిష్ఠకావలెను. ఈ విషయమును తత్త్వవిదులు పలువురు వక్కాణించిరి. భగవద్రామానుజ పూజ్యపాదులు వివరించిన యీ క్రింది వాక్యము ఈ ప్రకరణ మున గమనింపదగినవై యున్నవి.

'అతో వాక్యార్థజ్ఞానా దన్యదేవ ధ్యానోపాసనాది శబ్దవాచ్యం
జ్ఞానం వేదాంత వాక్యైర్విధిత్సితమ్'
'తస్మాదనాది కర్మ ప్రవాహరూపాజ్ఞానమూల త్వాద్బంధస్య
తన్నిబర్హణ ముక్తలక్షణజ్ఞానా దేవ-' (శ్రీభాష్యము)

'ధ్యానము, ఉపాసన మొదలైన పదములచే చెప్పబడునట్టిదే ఉపనిషత్తులలో ప్రతి పాదింపబడిన జ్ఞానము. వట్టి వాక్యార్థజ్ఞానముకాదు. అట్టి జ్ఞానమువలననే అజ్ఞానము నశించి, సంసారబంధము విచ్ఛిన్నమగును-' అని తాత్పర్యము. 'ఉక్తలక్షణజ్ఞానాదేవ-' అను శ్రీభాష్యపంక్తిని శ్రుతప్రకాశికా కారులు 'ఉపాస నాత్మకాదేవ=' ఉపాసనా రూపమైన జ్ఞానముచేతనే-' అని వివరించిరి.

ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి, జ్ఞాని-' అనువారు తన్ను భజింతురనియు, అట్టివారిలో జ్ఞాని సర్వశ్రేష్ఠుడనియు భగవద్గీత యిట్లు ప్రశంసించినది.

'చతుర్విధా భజంతే మాం జనాః సుకృతినోఽర్జున
ఆర్తో, జిజ్ఞాసు, రర్థార్థీ, జ్ఞానీ చ భరతర్షభ (భ. గీ. 7-16)

ఆర్తుడు తనకు కలిగిన ఆపదతొలగువఱకును, అర్థార్థి అభిలషితార్థము లభించు వఱకును మాత్రమే స్వామిని భజింతురు కావున నిత్యయుక్తులుకారు. అందుచే వారు క్రింది తరగతికి చెందిన భక్తులు. జిజ్ఞాసువు అంతకన్న కొంచెము నయము. ఇక జ్ఞానియో నిత్యయుక్తుడు, కామ్యఫలాసక్తుడుకాడు. సమస్త కర్మజాలము శ్రియఃపతి కైంకర్యమే యనుభావముతో ఆచరించువాడు. కాబట్టి జ్ఞాని అందఱికన్న మిన్న ఈ భావమే శ్రీకృష్ణభగవానునిచే-

తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తి ర్విశిష్యతే
ప్రియో హిజ్ఞాని నోత్యర్థ మహం స చమమప్రియః (భ. గీ. 7-17)

'జ్ఞానత్వాత్మైవమే మతిః' (భ. గీ. 7-18)

వీరిలో అనన్యభక్తితో నన్ను నిత్యము సేవించు జ్ఞాని విశిష్టుడు, జ్ఞానికి నేను అయినవాడను. జ్ఞానినాకు కావలసినవాడు వేయేల! జ్ఞాని నాకు ప్రాణమే—' చాటబడెను.

పవిత్రమైన యీజ్ఞానము లభించుటెట్లు? శ్రుతి స్మృతిపురాణాదుల పఠనమువలన ఈ జ్ఞానముకలుగును గాని అట్లుగా అనన్యభక్తితో ఉపాసనకావించుట ఏ కొంతమంది విద్వాంసులకో గాని యందఱకును సాధ్యముకాదు. పైగా అట్టి గ్రంథపఠనజన్యమైన జ్ఞానము సాధకుల సంశయ గ్రంథుల నన్నింటిని తొలగింపలేక పోవచ్చును. రాజవిద్యయు, గుహ్యతమము అయిన తత్త్వమగుటచే అంతంతమాత్రమున బోధపడునదికాదు. అందుచే జ్ఞానసంపన్నుడును, తత్త్వదర్శియు, కరుణాళువు నగు ఆచార్యుని సేవించి తదనుగ్రహమున ఈ జ్ఞానధనమును సంపాదింపవలెను.

'ఆచార్యవాన్ పురుషోవేద' అని శాస్త్రము. ఉత్తమగురువునాశ్రయించిన వాడే ఆధ్యాత్మిక విద్యారహస్యము లెఱుగ సమర్థుడగును.

'తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః' (భ. గీ. 4-34)

అను గీతావాక్యముకూడ గురుశుశ్రూషాదుల మూలముననే ఆత్మజ్ఞానము పొందదగునని యుపదేశించుచున్నది.

ఈ ప్రస్తావములో గుర్తింపవలసిన యొక విశేషమిది—

లోకేఽస్మిన్ ద్వివిధానిష్ఠా పురాప్రోక్తామయానఘ' అని కర్మజ్ఞాననిష్ఠలు రెండును వేఱువేఱుగా చెప్పబడినట్లు స్థూలదృష్టికి కనుపించినను యధార్థమునకు ఈ రెండుయోగములును ఫలితాంశమున ఒక్కటే. వీనిలో ఏయొక్కయోగము నాశ్రయించినను రెండింటి ఫలమును పొందవచ్చును. ఇవి రెండును వేర్వే అయినవని విద్వాంసులనరు. అపరిణత బుద్ధులగువారే యివి భిన్నములని తలంతురు. గీతలోనే యీ విషయమిట్లు స్పష్టము చేయబడినది—

'సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదంతి న పండితాః
ఏకమప్యాస్థితో యోగముభయోర్విందతే ఫలమ్' (భ. గీ. 5-4.)

నిష్కామముగా ఆచరించు కర్మయోగము, జ్ఞానయోగములోనే పర్యవసించునని తాత్పర్యము.

# భక్తియోగము

సేవార్థకమైన భజధాతువువలన నిష్పన్నమైన భక్తిపదమునకు నిరంతరమైన భగవత్సేవ యని వివక్షితార్థము ప్రకరణానుగుణము. మోక్షసాధనములలో భక్తికి విశిష్టమైన స్థానము కలదు. అన్య విషయములందు ప్రీతి, ఆసక్తి, రతి-అనబడుచు ఒప్పారెడి చిత్తవృత్తిని మరల్చి భగవత్పరముగా లభింపజేసినచో అది భక్తిగా పరిణమించును. అట్టి భక్తి మోక్షసాధన సామగ్రిలో శ్రేష్ఠతమమైనదవి 'మోక్షసాదన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ' అను శాస్త్రోక్తి తెల్లము చేయుచున్నది. ఆ భక్తికాదా చిక్కమైనంత చాలదు. అది యెడతెగనిదై సాగవలెను. తైలధారవలె భక్తి యవిచ్ఛిన్నమైనదై యుండవలెను. సర్వేశ్వరుని అఖిలహేయ ప్రత్యనీక కల్యాణగుణములను కీర్తించుట, తల్లీలాదులను స్మరించుట, తన్మంగళమూర్తిని దర్శించుట - అర్చించుటమొదలైనవి భక్తివెలయించు కృత్యములు.

'ఆత్మావాగే ద్రష్టవ్యః శ్రోతవ్యోమంతవ్యో నిదిధ్యాసితవ్యః'

అను బృహదారణ్యక వాక్యమే భక్తకృత్యములనే తెలుపుచున్నది. ధ్యానస్వరూపమును వివరించుచు శ్రీ భాష్యకారులు—

'ధ్యానం చ తైలధారావ దవిచ్ఛిన్నస్మృతి సంతానరూపమ్'

అన్నారు. మానసికముగా ధ్యానము, వాచికముగా కీర్తనము, కాయికముగా అర్చనము—ఇట్లు త్రికరణములతోను అవిచ్ఛిన్నముగా శ్రియఃపతిని సేవించు భక్తునకు మోక్షము కరతలామలకము. ఇతర సాధనములచే మోక్షమును సాధించుట మిక్కిలి క్లేశకరము. భక్తియోగముచే అది సుకరము. భక్తియోగ మాహాత్మ్యమును శ్రీమద్భాగవత పురాణమిట్లు ముక్తకంఠముగా ప్రకటించినది.

'యత్కర్మభి ర్యత్తపసా జ్ఞానవైరాగ్యతశ్చయత్
యోగేన దానధర్మేణ శ్రేయోభిరితరైరపి
సర్వంమద్భక్తియోగేన మద్భక్తోలభతేంజసా' (భాగ.)

కర్మజ్ఞానాదులగు పెక్కు సాధనములచే క్లేశపడి యేది సాధించునో అదియంతయు భక్తిపరుడు అనాయాసముగాను, శీఘ్రముగాను పొందగలుగును—అని భావము. సర్వపాపములను పోగొట్టి సాధకు నుద్ధరించు మహిమ భక్తికే కలదనుమాట వ్యాసప్రోక్తమే—

'యథాగ్నిః సుసమృద్ధార్చిః కరోత్యేథాంసి భస్మసాత్
తథామద్విషయాభక్తి రుద్ధవైనాంసి కృత్స్నశః'

(భాగ. 11 స్కం. 14 అ. 19.)

'ఉద్ధవా! నిప్పుకట్టెలను కాల్చివేయునట్లు భక్తిపాపములనెల్ల దహించివేయును' భక్తియే భగవంతుని వశపఱచుకొన గలిగినది. 'భక్తివశః పురుషః' 'భక్తిరేవైనంగమయతి'—'పరమాత్మ భక్తికే లభించువాడు. భక్తియే యీశ్వరుని పొందించునది'— మొదలైన వాక్యములు నిత్య సత్యములు.

భక్తి శూన్యములైనచో తపస్సు, జ్ఞానము, ధర్మము—ఏవియు మానవుని పవిత్రుని చేయజాలవు; ఉద్ధరింపనులేవు.

'ధర్మః సత్యదయోపేతః విద్యావా తపసాన్వితా
మద్భక్త్యపేత మాత్మానం నసమ్యక్ ప్రపునాతిహి'

(భాగ. 11 స్కం. 14 అ. 22.)

అను శ్రీ మద్భాగవత సూక్తిస్మర్తవ్యము.

దృఢమైన భక్తి, కర్మచే ఎట్టి పాపినైనను, జాతిచే ఎట్టి నికృష్టునైనను పవిత్రునిజేసి ఉద్ధరించును.

'భక్త్యాహ మేకయాగ్రాహ్యః శ్రద్ధయాత్మా ప్రియఃసతామ్
భక్తిఃపునాతి మన్నిష్ఠా శ్వపాకానపి సంభవాత్'

(భాగ. 11 స్కం.)

ఉద్ధవునితో శ్రీకృష్ణ భగవానుడు నుడివిన యీమాట యెంత యథార్థమో భక్త చరితము లెఱిగినవారికి వేఱుగా చెప్పనక్కఱలేదుగదా!

అద్భుత శక్తిసంపన్నమైన యీ భక్తి కలుగుటయెట్లు? దీనికి సాధనము లెవ్వి? అన్నచో భక్తితత్త్వ విదగ్రేసరులగు శ్రీమద్రామానుజాచార్యవర్యు లిట్లు సాధన సప్తకమును తెలిపిరి—

'తల్లబ్ధిః వివేకవిమోకాభ్యాస క్రియాకల్యాణానవసాదా
నుద్ధర్షేభ్యః, సంభవా న్నిర్వచనాచ్చ'— (శ్రీభాష్యము)

భక్తి కలుగుటకు వివేకము, విమోకము, అభ్యాసము, క్రియ, కల్యాణము, అనవసాదము, అనుద్ధర్షము—అను ఏడును సాధనములు. వీని వివరణ మిది:

1. వివేకము :

'ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిః సత్త్వశుద్ధౌ ధ్రువాస్మృతిః' (ఛాందో.) అనునట్లు సాత్త్వికాహార సేవనము మొదలైనవానిచే శరీరమును పరిశుద్ధమైన దానినిగా చేసికొనుట.

2. విమోకము :

ప్రాణికోటియందు ప్రేమయు, ఆర్తులయందు కనికరమును, పుణ్య కర్మాచరణము చేయువారియందు సంమోదమును, దుర్జనులయందు ఉపేక్షాభావమును అలవఱచుకొనుచు, కామ క్రోధములను చేరనీయక హృదయమును నిర్మలమైనదిగా నుంచుకొనుట.

3. అభ్యాసము :

ఆచార్యోపదిష్టమైన మార్గమున భగవదనుగ్రహ ప్రాప్తికి సాధనములైన మంత్రజపాదులను నిరంతరముగా కావించుచుండుట.

4. క్రియ :

ఆశ్రమ విహితములైన కర్మలను ఫలాపేక్షలేకుండ ఈశ్వరారాధన బుద్ధితో శ్రద్ధాళువై యాచరించుట.

5. కల్యాణము :

సత్యము, దానము, దయ, అహింస మున్నగు లోకకల్యాణ హేతువులైన ధర్మములను సర్వదా పాటించుచుండుట.

6. అనవసాదనము :

ఉపక్రమించిన సాధనకార్యమునుండి విరమింపకుండుట. 'శ్రేయాంసి బహువిఘ్నాని'— అనునట్లు మంచిపనికి పలు విఘ్నములు ఎదురగుట సహజమే. అనారోగ్యము, కుటుంబ కష్టములు, దారిద్ర్యము మొదలైనవానిచే సాధకుని సాధనకు ఆటంకము లేర్పడుచుండును. అయినను సాధకుడు చలింపక, ఓర్పు సడలనీయక, పట్టుదలతో సాధనను సాగించుట.

7. అనుద్ధర్షము :

సాధన ప్రభావమువలన సాధకునకు ఏవియో కొన్ని సామాన్య జనులకు లేని శక్తులు కలుగవచ్చును. పలువురు తనచుట్టును చేరవచ్చును. మహాత్ముడని

కీర్తింపవచ్చును. ఉత్సవాలు, పాదపూజలు సలుపవచ్చును. ఇట్టివానివలన సాధకుని హృదయములో 'నేనెంత గొప్పవాడను!' అను ఒక అహంకారము పొడముట కవకాశము కలదు. అట్టి స్వాతిశయభావమే ఉద్ధర్షమనబడును. ఇది పతనహేతువు. కాబట్టి యీ భావమును దరిజేరనీయకుండవలెను. 'తద్దాసదాస చరమావధి దాసదాసః' అనునట్లు వినయసంపన్నుడై మెలగుటయే అనుద్ధర్షమని నిష్కృష్టార్థము. ఈ సాధన సప్తకముచే కలిగిన భక్తివలన మానవుడు భగవదనుగ్రహపాత్రుడై ముక్తిని బడయును.

'మాంచ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే
సగుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయకల్పతే'

(భ. గీ. 14-26)

దృఢమైన భక్తియోగముచే తన్ను సేవించువాడు పునర్జన్మకు కారణభూతములగు సత్త్వరజస్తమస్సులను జయించి మోక్షపదమును పొందునని గీతాచార్యులానతిచ్చిరి.

ఈ సాధన సౌకర్య రహస్యమును గుర్తించిన వారెల్లరును తమకీభక్తియే భగవంతు డనుగ్రహింపవలసినదని యాకాంక్షించిరి.

భక్తాగ్రగణ్యులగు కులశేఖరులు—

'నాస్థాధర్మే నవసునిచయే నైవకామోపభోగే
యద్యద్భవ్యం భవతు భగవన్! పూర్వకర్మానుసారమ్;
ఏతత్ప్రార్థ్యంమమ బహుమతం జన్మజన్మాంతరేఽపి
త్వత్పాదాంభోరుహయుగ గతా నిశ్చలాభక్తిరస్తు'

(ముకుం. 5)

'నా పూర్వకర్మనుబట్టి ధర్మార్థ కామభోగములేవైన కానిమ్ము! నేను పట్టించుకొనను. ఒకటిమాత్రము నేను ప్రార్థింతును. ఓ స్వామీ! జన్మజన్మలకును అచంచలమైన నీ పాదభక్తిని అనుగ్రహింపుము'— అనియు.

అధిగతనిఖిలాగమ తత్త్వజ్ఞులగు యామున యోగీంద్రులు—

'అవబోధితవా నిమాంయథా మయినిత్యాంభవదీయతాంస్వయమ్
కృపయైవ మనన్యభోగ్యతాం భగవన్! భక్తిమపి ప్రయచ్ఛమే'

(స్తో. ర. 54)

నిచ్చుదాను నేను నీవాడనే యని గుర్తించితిని. ఓ దేవదేవా! దయతో నీయం దనన్య భోగ్యమగు భక్తినిగూడ కలుగనీయవే'—అనియు; ఆచార్యశేఖరులగు భగవద్రామానుజులు—

'అఖిలభువనజన్మస్థేమభంగాదిలీలే
వినత వివిధభూతవ్రాత రక్షైకదీక్షే
శ్రుతిశిరసి విదీప్తే బ్రహ్మణి శ్రీనివాసే
భవతుమమ పరస్మిన్ శేముషీ భక్తిరూపా'

(శ్రీభాష్యము)

జగములకెల్ల సృష్టిస్థితిలయకారుడును, ప్రపన్నులకేడుగడయు, పాలకుల తలపూవై వెలయువాడును. పరబ్రహ్మయు అగు శ్రీనివాసునియందు నాకు భక్తి కుదురునుగాక'—అనియు విన్నవించుకొన్నారు.

ఈ భక్తి తొమ్మిది విధములై యుండుననియు, ఆనవవిధభక్తితోను పురుషోత్తము నారాధించి సాధకుడు ముక్తి నొందవలయుననియు, ఇదియే సమస్త విజ్ఞానసార మనియు తత్త్వవిదులు వక్కాణింతురు. భక్తాగ్రేసరుడు ప్రహ్లాదుడు 'గురువులవలన నీవేమి నేర్చితి'వని యడిగినతండ్రి కిట్లు చెప్పెను—

'శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మనివేదనమ్
ఇతి పుంసార్పితా విష్ణౌ భక్తిశ్చేన్నవలక్షణా
క్రియతే భగవత్యద్ధా తన్మన్యేఽధీతముత్తమమ్'

(భాగ. 7 స్కం. 5 అ. 23-24)

శ్రవణాదులగు తొమ్మిది ప్రకారములతో శ్రీహరిని సేవించుట సమస్త విద్యల సారము. ఇదియే నేను నేర్చినది—'

## ప్రపత్తియోగము

మోక్షప్రాప్తికి ప్రపత్తిని మించిన సాధనములేదని పరమభాగవత సిద్ధాంతము. సాధకుడు సర్వాత్మనా తనను సర్వేశ్వరునకు సమర్పించుకొనుటయే ప్రపత్తియోగము. ఇదియే ఆత్మనివేదనరూపమైనభక్తి ప్రకారము. దీనికి శరణాగతియని ప్రసిద్ధనామము. న్యాసము, సన్న్యాసము, భరన్యాసము, సాధ్య

భక్తి, త్యాగము మొదలైనవి దీనికే పర్యాయములు. భాగవత ధర్మమైన యీ ప్రపత్తి దర్శనము వేదము, ఉపనిషత్తులు, పురాణములు, భగవద్గీత, భగవచ్ఛాస్త్ర మనబడు పాంచరాత్రాగమము మున్నైన ప్రామాణిక గ్రంథము లన్నింటిలోను ప్రతిపాదితమైనది. బ్రహ్మ, నారదమహర్షి, కపిలాచార్యుడు, వంటి పలువురిచే అనుష్ఠింపబడినది. ఆళ్వార్లచే, ఆచార్యులచే ఆదరముతో ఆచరింపబడినది.

వేదము :

ప్రపత్తి ధర్మము వేదప్రతిపాదితము—

తంపత్నీభిరనుగచ్ఛేమదేవాః పుత్రైర్భ్రాతృభిరుతవా హిరణ్యైః
నాకం గృభ్ణానాః సుకృతస్యలోకే తృతీయేపృష్ఠేఽధిరోచనేచ'
(యజు. 15 50)

పుణ్యభాజనులగు మహాభక్తులకే ప్రవేశింప నలవియైనదియు, స్వర్గాదిలోకముల కెల్ల పైన దివ్యకాంతులతో విలసిల్లుచు, త్రిపాద్విభూతియనబడు చుండు నీ సన్నిధిని, పరమ పదమును పొందుటకై ఓ స్వామీ ! మా స్త్రీలతోను, మా సంతానముతోను, మాకుగల సర్వసంపదలతోను నిన్నే శరణువేడుచున్నాము— అను భావమిచ్చు ఈ వేదవాక్యములో ముముక్షువగు మానవుడు తన సర్వస్వమును భగవదర్పణముకావించి శరణాగతి చేయవలెనను ఉపాయ ముపదిష్టమైనది.

తైత్తిరీయారణ్యకము :

బ్రహ్మవిద్య, పురుషవిద్య—అను పేళ్ళతో ప్రసిద్ధికెక్కిన ఆత్మార్పణ రూపమైన యీ న్యాసవిద్య తైత్తిరీ యారణ్యకములో మిక్కిలి స్పష్టముగా నిరూపింపబడినది :—

'ప్రజాపతి పుత్త్రుడైన' ఆరుణియను తత్త్వజిజ్ఞాసువు 'ఆత్మోద్ధరణము నకు సాధనములెవ్వి ?' యని తన తండ్రిని ప్రశ్నించెను. అందులకు ఆతని తండ్రి ప్రజాపతి 'సత్యము, తపము, దమము, శమము, దానము, ధర్మము, ప్రజోత్పత్తి, అగ్నిపూజ, అగ్నిహోత్రము, యజ్ఞము, మానసోపాసనము, న్యాసము—అనునవి ఆత్మోద్ధరణమునకు సాధనములు' అని చెప్పెను. ఆ మాట విని ఆరుణి 'ఈ పండ్రెండు సాధనములతోను శ్రేష్ఠతమమైనదేది ?'— అని తిరిగి యడిగెను. అంత ప్రజాపతి——

'తానివా ఏతాన్యవరాణి పరాంసి న్యాసఏవాత్యరేచరేత్'
(తైత్తి. 10-78.)

'నాయనా! ఈ చెప్పిన సత్యముమొదలు మానసోపాసనము వఱకు గల పదు నొకండు సాధనములును సహకార సాధనములే. న్యాసమనెడి భగవచ్ఛరణా గతియే ముక్తికి ముఖ్యోపాయముగా గుర్తింపుము—' అని తత్త్వార్థమును బోధించెను.

తైత్తిరీయమునందే మఱియొకచో ఈ న్యాసవిద్య యిట్లు చెప్పబడినది—

'ఓం వసురణ్యో విభూరసి ప్రాణే త్వమసిసంధాతా,
బ్రహ్మన్ త్వమసి విశ్వధృత్, తేజోదా స్త్వమసిం
వర్చోదా స్త్వమసి చంద్రమసః, ఉపయామ గృహీతోఽసి
బ్రహ్మణే త్వామహసే—'
'—ఓ మిత్యాత్మానంయుంజీత; ఏతద్వై మహోపనిషదం
దేవానాం గుహ్యమ్; య ఏవం వేద; బ్రహ్మణోమహి
మానమాప్నోతి; తస్మాద్బ్రహ్మణో మహిమానమ్—'

(తైత్తి. 10-72.)

'—ఓ పురుషోత్తమా! నీవు తేజోమయుడవు; సువర్ణస్వరూపుడవు; సర్వవ్యాప కుడవు; జీవిలోకమునకు చైతన్యం శక్తి ననుగ్రహించువాడవు: ఈ విశ్వము నెల్ల నీవే ధరించుచున్నావు: అగ్నికి తేజస్సును, చంద్రునకు కాంతిని ప్రసా దించుచున్నవాడవు నీవే; అట్టి నిన్నే ముక్తికై శరణువేడుచున్నాము.'—

'ఓమ్ అను ప్రణవార్థమును గుర్తించి తనను పరమాత్మకు సమర్పింప వలెను. ఇదియే సర్వోపనిషత్తుల సారము. దేవతలకు. ఇది దేవతలకుకూడ గుహ్యమైనది. ఈ న్యాసవిద్య నెఱిగిన సాధకుడు ముక్తినొందును—'

ఈ పై వేదవాక్యములలో పరబ్రహ్మస్వరూప స్వభావములును లెస్సగా ప్రస్తుతింపబడినవి. జీవలక్షణము నిర్దిష్టమైనది. జీవునకు కర్తవ్యమైన శరణా గతియు పదిష్టమైనది. తదనుష్ఠాన ప్రక్రియయు ప్రదర్శితమైనది. ప్రణవాను సంధానముననే ముముక్షువీ ప్రపత్తి తత్త్వమును గుర్తింపగలడని సూచింప బడినది.

అయినచో ప్రణవార్థమేమి ? ఆచార్యులు ప్రణవార్థము నిట్లు వివరించిరి.

'అకారార్థో విష్ణుః, జగదుదయరక్షా ప్రలయకృత్ ;
మకారార్థో జీవః, తదుపకరణం వైష్ణవమిదమ్ ;
ఉకారో ఽనన్యార్హం నియమయతి సంబంధ మనయోః ;
త్రయీసారస్త్ర్యాత్మా ప్రణవ ఇమ మర్థం సమదిశత్—'

(అష్టశ్లోకి)

అ+ఉ+మ్=ఓమ్. అకారము, ఉకారము. మకారము అను మూడక్షరములు చేరి ప్రణవమైనది. ఇందలి అకారము విష్ణువాచకము. ఆ మహావిష్ణువే జగములకు సృష్టిస్థితిలయములకు కర్త. సర్వేశ్వరుడు—అను వివక్షితార్థమును బోధించు చున్నది. మకారము జీవవాచకము. ఈ జీవసముదాయము, జగత్తు అంతయు శ్రీమన్నారాయణునకు భోగ్యవస్తువు. ఇది యంతయు ఆతనిదే యను భావమును తెలుపుచున్నది. ఉకారము అవధారణార్థకము. 'ఈజీవ కోటియు, జగత్తును ఆపరమేశ్వరునిదే ఇతరుల దేమాత్రముకాదు.' అను తాత్పర్యమును ప్రకటించు చున్నది. కాగా దీని సారాంశము—శ్రీమన్నారాయణుడే సర్వజగత్స్వామి, జీవాత్మదాసుడు. స్వామియైన యా శ్రీహరికే ఆతని దేమైన ఆత్మను సమర్పించుకొనుట యుక్తము. జీవస్వరూపమున కనురూపమైన ధర్మము-' అని పిండీకృతార్థము. ఇదియే న్యాసవిద్య.

ముండకోపనిషత్తు :

సాధకుడు ప్రణవముతో అనుష్ఠింపవలసిన ఈ న్యాసవిద్యను ముండకోపనిషత్తు ధానుష్కుడు లక్ష్యవేధనమునకు గావించునట్టి శరప్రయోగముగా చూపించి చిత్రించెను—

'ప్రణవోధనుః, శరోహ్యాత్మా, బ్రహ్మతల్లక్ష్యముచ్యతే
అప్రమత్తేన వేద్ధవ్యం, శరవత్తన్మయో భవేత్-'

(ముం. ఉ. 2-4)

'ఓం కారమే విల్లు, జీవాత్మయే అమ్ము. పరమాత్మయే గురి. సాధకుడను విలుకాడు మిక్కిలి మెలకువతో ఆగురిని కొట్టవలెను. అమ్ము వెళ్లి గురిలో చొచ్చుకొనిపోయినట్లు జీవాత్మ పరమాత్మను చేరును —' అని భావము.

శ్వేతాశ్వతరోపనిషత్తు :

మోక్షేచ్ఛగలసాధకులు శ్రియఃపతినే శరణువేడుకొనవలసి యున్నదను పరమార్థమును శ్వేతాశ్వతరోపనిషత్తుకూడ ఇట్లు నిర్దేశించినది–

'యోబ్రహ్మాణం విదధాతి పూర్వం
యోవై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై
తగ్ంహ దేవమాత్మబుద్ధిప్రకాశం
ముముక్షుర్వై శరణ మహం ప్రపద్యే–'

'లోకనిర్మాణమునకు సాధనముగా తొలుత చతుర్ముఖబ్రహ్మను సృష్టించి తత్థ్సితికి హేతువగు ధర్మమును ప్రదర్శించు వేదములను వెలయించి యాతని కనుగ్రహించి సర్వాత్మ ప్రకాశకుడుగా వెలుగుచున్న ఆ దేవదేవుని ముక్తినిగోరి శరణుపొందు చున్నాను–' అట్లనుట ముముక్షుధర్మమైన శరణాగతి యిందు వాచ్యముగనే తెలుపబడినది.

భగవచ్ఛాస్త్రము :

భాగవత ధర్మమునకు ప్రధాన ప్రమాణములలో ఒకటియైన పాంచరాత్రాగమశాస్త్రము, ఆత్మన్యాసము మోక్షసాధనములలో ఉత్తమోత్తమమైనదిగా వాకొన్నది—

ప్రపత్తిం తపసామేషాం న్యాసాఖ్యామాహు రుత్తమామ్
సన్న్యాస స్త్యాగఇత్యుక్తః శరణాగతి రిత్యపి–' (విష్వ. సం. 4-8)

మోక్షసాధన రూపములైన నిష్ఠలన్నింటిలో న్యాసమనునదియే మేటి. సన్న్యాసము, త్యాగము, శరణాగతి అనునవి దీనికే నామాంతరములు'–అని భావము.

లక్ష్మీ తంత్రమునకూడ ఈ ప్రపత్తి విద్యాస్వరూపము విపులముగా వర్ణింపబడినది. ప్రణవములో చేయదగు న్యాసరూప యజ్ఞము ఈ తంత్రములో ఇట్లు వివరింపబడినది—

'జీవాత్మానం హవిఃకృత్వా తచ్ఛరీరం మహీయసి
బ్రహ్మాగ్నౌ జుహుయాదో మిత్యనే నామ్నాయరూపిణా
ఇతి ప్రపత్తే రాఖ్యాతః ప్రయోగః ప్రణవాత్మనా
తస్యైవ విదుషోయజ్ఞః శరీరేత్ర కల్పితః–'

'జీవాత్మ యను హవిస్సును, పరమాత్మయను అగ్నిలో ప్రణవమంత్ర మగు ఓంకారములో హోమము చేయవలెను. ఇదియే ముముక్షువగు సాధకునకు వేదవిహితమైన ప్రణవ యజ్ఞరూపమైన ప్రపత్తియోగము—'

భగవద్గీత :

ప్రపత్తి దర్శనమునకు గీతాశాస్త్రము విజయధ్వజము వంటిది. భక్త శ్రేష్ఠుడగు అర్జునుని నెపముగాగొని యోగీశ్వరుడు శ్రీకృష్ణభగవానుడు ముముక్షువులకెల్ల పరమోపాయమైన ప్రపత్తి ధర్మమును సవిస్తరముగా గీతలో ఉపదేశించెను.

'యచ్ఛ్రేయః స్యాన్నిశ్చితంబ్రూహితన్మే
శిష్యస్తేఽహం శాధిమాంత్వాం ప్రపన్నమ్' (భ. గీ. 2-7)

'నా కేదిమేలో తెలియకున్నది; స్వామీ! నిన్నే శరణు పొందినాను, నీ శిష్యుడను. నాకు మేలేదియో తెలియజెప్పుము—' అనుచు పార్థుడుచేసిన ప్రపత్తిలో ప్రారంభమైనది గీత. నడుమ నడువ పెక్కు సందర్భములలో ప్రపత్తి ప్రస్తుతమైనది.

'యేయథామాం ప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహమ్'
(4-11)

'ఎవరెట్లు నన్ను పాసింతురో వారికి నేనట్లే ఫలప్రాపకుడ నగుదును—'

'మామేవయే ప్రపద్యంతే మాయామేతాంతరంతి తే'
(7-14)

'నన్ను ప్రపత్తిలో కొల్చినవారు ఈ సంసార సంబంధిమాయను దాటి ముక్తి నొందుదురు—'

'మాంహి పార్థవ్యపాశ్రిత్య యేఽపిస్యుః పాపయోనయః
స్త్రియోవైశ్యాస్తథాశూద్రాస్తేపియాంతి పరాంగతిమ్'
(9-32)

'నను శరణుపొందిన వారెట్టి వారైనను ముక్తిని బడయుదురు-'

'తతః పదం తత్పరిమార్గితవ్యం యస్మిన్గతాన నివర్తంతిభూయః
తమేవ చాద్యం పురుషం ప్రపద్యేయతః ప్రవృత్తిః ప్రసృతాపురాణీ'
(15-4)

చిరంతనమగు మాయాశక్తి ఏ పరమాత్మనుండి బయలుదేరినదో ఆపరమాత్మను శరణుపొందెదను—అను భావముతో పునరావృత్తి రహితమైన ముక్తిపదమును వెదుకవలెను—'

'తమేవ శరణంగచ్ఛ సర్వభావేన భారత
తత్ప్రసాదాత్పరాంశాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్'
(18-62)

మనోవాక్కాయ కర్మలతో ఆపరమాత్మనే శరణు పొందుము. ఆ పరమేశ్వరుని యనుగ్రహమున నీవు ముక్తినొందుదువు.

కడపటగూడ గీతాచార్యులు ప్రపత్తిధర్మమునే యిట్లు బోధించిరి—

'సర్వధర్మాన్ పరిత్యజ్యమా మేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః'
(18-66)

'సకల కర్మఫలత్యాగముచేసి నన్నే శరణుపొందుము. నిన్నే పాపములు సోకకుండునట్లుచేసి ముక్తినొసగుదును. చింతిల్లకుము.'

దీనిని చరమశ్లోకమందురు. ఇది ముముక్షువులకు ముంగొంగు బంగారము ఈవిధముగా గీతాశాస్త్రము ఆది మధ్యాంతముల యందంతటను ప్రపత్తి దర్శనమును ప్రదర్శించుచు ప్రపన్నులకు పరమ ప్రమాణమైనది. ప్రపత్తి శాస్త్రలక్ష్మికి తిలకాయమానమైన యీ క్రింది గీతాశ్లోకము ముముక్షువులకు నిత్యానుసంధేయము—

'మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసిమే-'
(18-65)

'నేను ప్రతిజ్ఞచేసి చెప్పుచున్నాను. పరమాత్మనగు నాయందే మనసు నిల్పుము నన్నే భక్తితో భజింపుము. నన్నుద్దేశించియే యాగాదులు చేయుము నన్నే నమస్కరింపుము. నన్నే పొందుదువు. నిక్కము-' ఇందుప్రబోధితమైనదే అనన్యభక్తి. అట్టి అనన్యభక్తితో పరమాత్మకు ఆత్మసమర్పణము చేయుటయే ప్రపత్తి.

ప్రపత్తిమూలముననే పరబ్రహ్మయగు శ్రీమన్నారాయణుడు లభ్యుడగు నను విషయమును భగవద్గీతాశాస్త్రము సుస్పష్టముగా ప్రకటించినదని యామునా చార్యులవారిట్లానతిచ్చిరి—

'స్వధర్మజ్ఞాన వైరాగ్యసాధ్యభక్త్యేకగోచరః
నారాయణః పరం బ్రహ్మగీతాశాస్త్రే సమీరితః'

'స్వధర్మానుష్ఠానమువలన జ్ఞానము, జ్ఞానమువలన వైరాగ్యము, వైరాగ్యముచే భక్తి, భక్తిచే సాధ్యభక్తియనబడు ప్రపత్తియు కలుగును. అట్టి ప్రపత్తిచేతనే పరబ్రహ్మయగు శ్రీమన్నారాయణుడు గోచరించునని గీతాశాస్త్రము వక్కాణించు చున్నది—'

పరమ ప్రపన్న శిఖామణులగు కొందఱు మహాత్ముల ముఖకమలముల నుండి వెలువడిన ప్రపత్తిసూక్తి పరిమళములు కొన్ని యివి :

1. 'భవతు శరణమేకో విష్ణుపోతో నరాణామ్' (ముకుం. 12)

ఈ సంసార సాగరమును దాటుటకు శ్రీహరి యను నౌకయే మాకు శరణము.'
— శ్రీ కులశేఖరులు.

2. 'అగతిం శరణాగతం హరే! కృపయా కేవలమాత్మసాత్కురు-' (స్తో. ర. 46)

దిక్కులేనివాడను, నిన్నే శరణుపొందినవాడను-నన్నో పురుషోత్తమా! దయచే నీవాడను చేసికొనుము-' — శ్రీ యామునమునివర్యులు.

3. 'తదయంతవ పాదపద్మయో రహమద్యైవమయా సమర్పితః' (స్తో. ర. 52)

'ఓ స్వామీ! నీవే నాయేడుగడవు కావున, నేడు నన్ను నేనే నీ పాదపద్మముల యందు సమర్పించుకొనుచున్నాను.' — శ్రీ యామునమునివర్యులే.

4. 'పితరం మాతరం దారాన్ పుత్రాన్ బంధూన్ సఖీన్ గురూన్
రత్నాని ధనధాన్యాని క్షేత్రాణిచ గృహాణిచ-'
సర్వధర్మాంశ్చ సంత్యజ్య సర్వకామాంశ్చ సాక్షరాన్
లోకవిక్రాంత చరణౌ శరణంతేఽవ్రజం విభో-' (శర. గద్య.)

'తలిదండ్రులు, ఆలుబిడ్డలు, చుట్టములు, నెచ్చెలులు, ఒజ్జలు, సిరిసంపదలు, ఇండ్లు, పొలాలు, ధర్మాలు, కామాలు—అన్నియునీవే ఓ శ్రియఃపతీ! ముల్లోకములనతిక్రమించిన నీ చరణారవిందములనే శరణుజొచ్చినాను—'

— శ్రీ రామానుజ భగవత్పాదులు.

5. 'అగతి, రశరణో భవాబ్ధౌలుఠ౯
వరద! శరణ మిత్యహం త్వాంవ్రజే' (వరద. స్తవ. 82)

'ఈ సంసార సముద్రములో పడికొట్టుకొనుచున్న దిక్కులేనివాడను. ఓ వరదరాజా! నిన్నే శరణు పొందినాను—' — శ్రీవత్స చిహ్నమిశ్రులు.

6. 'ఆయుః ప్రజానా మమృతం సురాణాం
రంగేశ్వర! త్వాం శరణం పపద్యే-' (శ్రీరంగ. స్తవ. ఉ. శ. 82)

'మానవులకు ఆయువును, దేవతలకు అమృతమునైన శ్రీరంగనాథా! నిన్నే శరణ్యుడవుగా ఆశ్రయించితిని—' — శ్రీ పరాశరభట్టార్యులు.

నిత్యసూరులు, దేవతలు, ఋషులు, ఆళ్వారులు, ఆచార్యులు-వీరువారననేల పరమభాగవతు లెల్లరును ప్రపత్తిమార్గానుయాయులై, ముక్తులై బ్రహ్మానందమును బడసినారు.

అతి పవిత్రమైన యీ భాగవత ధర్మతత్త్వ మెఱిగినవారే చాల అరుదని చెప్పుచు అట్టివారిలో కొందఱను శ్రీమద్భాగవత మిట్లు పేర్కొన్నది.

'స్వయంభూ ర్నారదః శంభుః కుమారః కపిలోమనుః
ప్రహ్లాదో జనకోభీష్మో బలిర్వైయాసికి ర్వయమ్ (యమః)
ద్వాదశై తే విజానీమో ధర్మం భాగవతం భటాః
గుప్తం విశుద్ధం దుర్బోధం యజ్ఞాత్వాఽమృత మశ్నుతే'
(శ్రీమద్భా. 6 స్కం. 3 అ. 20-21)

'చతుర్ముఖ బ్రహ్మ, శివుడు, కుమారస్వామి, నారదుడు, కపిలుడు, మనువు, ప్రహ్లాదుడు, జనకమహారాజు, బలిచక్రవర్తి, భీష్ముడు, శుకమహర్షి, నేను (యముడు) మేము పండ్రెండుగురము, పవిత్రమును రహస్యమునైన యీ భాగవత ధర్మము నెఱుగుదుము. ఈ ధర్మము నెఱిగినవారు మోక్షము నొందుదురు' అని యమధర్మరాజు తన భటులకుచెప్పి అట్టివారిని చెనకబోకుడని హెచ్చరించెను.

ప్రపత్తికి దేశకాలాది నియమములు లేవు.

ఈ ప్రపత్తి ననుష్ఠించుటకు 'ఇదిగో! ఈ చోటే తగినది ఈ సమయమే సరియైనది. ఈ జాతివాడే యర్హుడు—' అనుచు ఎట్టి కట్టుబాటులేదు. ఏ దేశమందైనను, ఏ సమయమందైనను, ఏ స్థితిలోనైనను, ఎవ్వరైనను, ఏ ఫలముకొఱకైనను ఈ ప్రపత్తిమాత నాశ్రయింపవచ్చును. అయినను నశ్వరములగు ఫలములనుకోరి ప్రపత్తిచేయువానికంటె శాశ్వత ఫలము నాంకాంక్షించి ప్రపత్తిచేయువాడు వివేకియగును కదా! అట్లే అల్పశక్తులగు దేవతాంతరముల నాశ్రయించువానికన్న సర్వశక్తి సంపన్నుడగు శ్రీమన్నారాయణు నాశ్రయించువాడు మిన్నకదా!

శ్రీమద్రామాయణము, మహాభారతము, భాగవతము అనునవి ప్రపత్తి నిష్ఠకు ప్రధానములైన లక్ష్యగ్రంథములుగా చెప్పవచ్చును. శ్రీమద్రామాయణమునకు దీర్ఘశరణాగతి యను ఖ్యాతియేకలదు. అందు శరణాగతి వహించినవారి సంఖ్య యెక్కువయని భావము. శ్రీ వచనభూషణము శరణాగతి దర్శనమునకు భాష్యమనదగినది. ప్రపత్తికెట్టి నియమములు లేవను విషయము ఆయాయి గ్రంథములను అందందు ప్రపత్తి ననుష్ఠించిన వ్యక్తుల స్థితిగతులను పరిశీలించిన స్పష్టపడును.

జటాయు కౌకాసురులు పక్షులు; కాళియనాగము విషసర్పము; గజేంద్రుడు పశుజంతువు; ప్రహ్లాద విభీషణులు రాక్షసవంశీయులు; శబరి గుహబడు నిషాదులు—అయినను ప్రపత్తి కర్హులేయైనారు. కావున జాతిభేదము కాని పశు పక్షి విచక్షణము కాని ప్రపత్తికి ఆటంకములు కావని తెలిసినది. అట్లే ద్రౌపది రజస్వలయైయున్న సమయమున ప్రపత్తిచేయవలసి వచ్చినది. అట్లయ్యు సర్వేశ్వరుని యనుగ్రహమును బడయగలిగినది. దీనిచే అంతరంగ శుద్ధియే యిందు ముఖ్యమైనదని తెల్లమైనది. అట్లన్నంతమాత్రమున ప్రపన్నునకు బాహ్యశౌచమక్కఱలేదనికాదు. అసాధారణ స్థితులలో ఎట్లైనను ప్రపత్తి చేయవచ్చుననుటయందే తాత్పర్యము.

ప్రపత్తి—అర్చావతారము :

పర్వేశ్వరుని స్వరూప ప్రకారము లైదువిధములని శాస్త్రములు తెలుపుచున్నవి. అవి పరస్వరూపము, వ్యూహస్వరూపము, విభవ స్వరూపము, అంతర్యామిస్వరూపము, అర్చాస్వరూపము. వీనిలో ముముక్షువు ప్రపత్తిచేయుటకు ఏది తగినది? అను ప్రశ్నవచ్చినపుడు—నిజమునకు వీనిలో ఎందైనను

ప్రపత్తి చేయవచ్చునని తేలికగా సమాధానము చెప్పుకొనదగును. కాని ప్రపత్తి నాచరించువాని శక్తిస్వభావాదులనుబట్టి పరికించినచో ఇందును కొంత సౌలభ్య సౌకర్యభేదములు కనబడును. పరమేశ్వరుని యీ పంచవిధములైన స్వరూప ములను, అవ్వాని స్వభావములను పరిశీలించినపుడు అర్చాస్వరూపమే ముముక్షు వునకు మిక్కిలి సన్నిహితమైనట్లును, అందు ప్రపత్తిని చేయుటయే సుకరమై నట్లును తోచకపోదు. క్లుప్తముగా పరవ్యూహాదుల స్వరూపమిది—

పరస్వరూపము :

ఇది పరమేశ్వరుని శుద్ధసత్త్వతత్త్వము. జ్ఞానశక్తి బలైశ్వర్యవీర్య తేజో రూప సమగ్ర షడ్గుణపరిపూర్ణము. పరవాసుదేవాభిధము. త్రిపాద్విభూతికి సంబం ధించినది. నిత్యముక్తానుభావ్యము. ఇది సామాన్యులఊహకే దుర్లభమైనది.

వ్యూహస్వరూపము :

ఇది సంకర్షణుడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు—అని వ్యవహరింపబడు చుండు సర్వేశ్వరుని అంశత్రయాత్మకము. పురుషోత్తముని సమగ్రములైన ఆఱు గుణములు రెండేసిచొప్పున విభక్తములై యేర్పడినవాడు సంకర్షణాదులు, ఈ త్రిమూర్తి స్వరూపమే వ్యూహము. ఈ పరవ్యూహస్వరూపములను శ్రీపరా శరభట్టార్యులిట్లు వివరించిరి—

'షాడ్గుణ్యా ద్వాసుదేవః పర ఇతి స భవాన్ ముక్తభోగ్యో; బలాఢ్యాత్
బోధాత్ సంకర్షణ స్త్వం హరసి వితనుషే శాస్త్ర; మైశ్వర్యవీర్యాత్
ప్రద్యుమ్నః సర్గధర్మౌనయసి చ; భగవన్ శక్తితేజోఽనిరుద్ధః
బిభ్రాణః పాసితత్త్వంగమయసి చ; తథావ్యూహ్యరంగాధిరాజ'

(శ్రీరంగ. స్తవ. ఉ. శ. 39)

'శ్రీరంగాధీశ్వరుడవుగా వెలసిన ఓజగన్నాయకా! సంపూర్ణమైన షడ్గుణ సం పత్తిచే సర్వవ్యాపకుడవై సర్వాధికుడవై వాసుదేవపరబ్రహ్మ మనబడుచు నీవు ముక్తులకే గోచరుడవు. భోగ్యుడవు. బలజ్ఞానములచే సంకర్షణాఖ్యవహించి లయకారివియు, వేదాది శాస్త్రచక్షుర్దాతవు నగుదువు. ఐశ్వర్యవీర్యములచే ప్రద్యుమ్నాభిధేయుడవై సృష్టికృత్యమును, ధర్మపాలనమును కావించు చుందువు శక్తితేజస్సులచే అనిరుద్ధనాముడవై స్థితికృత్యమును సద్గతిప్రాపకత్వమును నెఱపు చున్నావు—' అని భావము. పరమువలె ఈ విభవస్వరూపమును సాధకునకు దురావాసమే.

విభవస్వరూపము :

ధర్మమునకు దెబ్బతగిలి అధర్మము పెచ్చుపెరిగి లోకస్థితి చీకాకునొందు సమయము నందెల్ల దానిని చక్కదిద్దుటకును, దుర్జనులను శిక్షించి సజ్జనులను రక్షించుటకును సర్వేశ్వరుడు తన నిత్యవిభూతినుండి ఆయా యవసరమునుబట్టి దేవమనుజ తిర్యగ్రూపములలో ఏదేనిరూపమును గ్రహించి లీలావిభూతిలోనికి దిగివచ్చును. ఇదియే అవతారము ఇదియే విభవస్వరూపము.

భగవద్గీతలో—

'యదాయదాహి ధర్మస్యగ్లానిర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్'
'పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్
ధర్మసంస్థాప నార్థాయ సంభవామి యుగేయుగే' (భ.గీ.4అ.7-8)

అను విధముగా భగవంతుడు తానవతరించు అవసరమును, ప్రయోజనమును ఆనతిచ్చెను. మత్స్యకూర్మాదులు తిర్యక్స్వరూపావతారములు కాగా, రామకృష్ణాదులు మానవరూపావతారములు. వీనిలో కొన్ని అంశావతారములు. శ్రీరామ కృష్ణావతారములు మాత్రము పూర్ణావతారములని విజ్ఞులు నిర్ణయించిరి. ఇట్టి యవతారములయందు ప్రపత్తిచేయుట సుకరమే కాని భ్రాంతి భూయిష్ఠమైన మనో ధర్మము ఆయా అవతారములయందు సమకాలికులకు పరమేశ్వరత్వ బుద్ధిని కలుగనీయదు. వేదవేద్యుడగు పరమపురుషుడు శ్రీరామచంద్రుడుగా రఘువంశ మున అవతరింపగా ఆనాటివారిలో ఎంతమందికి ఆ దాశరథి సర్వేశ్వరుని అవ తారమని తెలిసినది? వశిష్ఠుడు, వాల్మీకి, విశ్వామిత్రుడు, భరద్వాజుడు మొదలైన మహర్షులును, మఱికొందఱు భక్తులును మాత్రమే ఆ రఘువీరుని శ్రియఃపతిగా గుర్తింపగలిగిరి. అట్లే శ్రీకృష్ణుడై యదుకులమున అవతరించిన సమయమునను గర్గాదిమునులు కొందఱును భీష్మాదులగు భక్తులు కొందఱును మాత్రమే ఆతనిని శ్రీమన్నారాయణునిగా తెలిసికొనగలిగిరి. తక్కినవారెల్లరు సామాన్యులనుగానే వీరిని తలచిరి. ఈ విషయమును లీలామానుష విగ్రహుడగు శ్రీకృష్ణభగవానుడు స్వయముగనే యిట్లు వాక్రుచ్చెను—

'అవజానంతి మాం మూఢాః మానుషీం తను మాశ్రితమ్
పరంభావ మజానంతో మమభూత మహేశ్వరమ్—' (భ.గీ.9అ.11.)

'ఆసురభావముతో నిండిన యవివేకులు స్వేచ్ఛతో లోకశ్రేయస్సుకొఱకు మానవుడనై జన్మించిన నన్ను సర్వనియంతయగు పరమేశ్వరునిగా గుర్తింపక రాగద్వేషాదులతో మెలగుచు పరిభవింతురు–'

భగవత్స్వరూప తత్త్వజ్ఞాన రసికులగు శ్రీ పరాశర భట్టార్యులవారు—

'–గరిమ స్త్వం పరిజానంతి ధీరాః
పరంభావం మనుజత్వాది భూష్ణుమ్
అజానం త స్త్వవజానం తి మూఢాః
జనిఘ్నుంతే భగవన్ జన్మకర్మ–' (శ్రీరంగ. స్తవ. ఉ.శ. 50.)

ఓ పుండరీకాక్ష ! నీవు మానవాద్యా కృతులలో అవతరించినను జ్ఞానులు నీవు పరబ్రహ్మవని గుర్తింతురు. మూఢులో జన్మరాహిత్య కారణములగు నీ అవతారములను, చేష్టలను గ్రహింపనేరక అవమానింతురు–' అని విజ్ఞులే భగవదవతార యాథార్థ్యమును తెలిసికొనగలరను భావమును విశదీకరించిరి. కావున ప్రపత్తికి విభవ స్వరూపముకూడ సుగ్రాహ్య మననేరము.

అంతర్యామి స్వరూపము :

జీవరాశియెల్ల పరమపురుషునకు శరీరమువంటిది. చరాచరాత్మకమైన జగత్తునందంతటను వ్యాపించియున్న వాడగుటచేతనే పరబ్రహ్మ వాసుదేవుడని కీర్తింపబడుచున్నాడు. గీతాచార్యుడే—

'విష్టభ్యాహ మిదంకృత్స్న మేకాంశేన స్థితోజగత్'
(భ. గీ. 10 అ. 42.)

'అంతర్యామి రూపములో ఈ జగత్తునందెల్ల వ్యాపించియున్నాను–అనియు;

'–సర్వస్య చాహం హృది సన్నివిష్టః' (భ. గీ. 15 అ. 15.)

'సకల ప్రాణి సమూహముయొక్క హృదయమున నేనున్నాను–' అనియు;

'ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా'
(భ. గీ. 18 అ. 61.)

'సర్వభూతముల హృదయమునను నిలిచినవాడను నేనే. ఆ భూతరాశినెల్ల రంగులరాట్నమువంటి యంత్రముమీద నున్నవారిని త్రిప్పినట్లు నా మాయచేత త్రిప్పుచున్నాను–' అనియు తన అంతర్యామి స్వరూపమును స్పష్టపఱచినాడు. అంతియేగాక—

'తమేవ శరణంగచ్ఛ సర్వభావేన భారత!
తత్ప్రసాదాత్ పరాంశాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్'
(భ. గీ. 18 అ. 62.)

'అట్టి సర్వప్రాణి హృదయ పీఠాధిష్ఠితుడగుట అంతర్యామి స్వరూపుడైన తదను గ్రహమున సంసారోపద్రవములెల్ల తొలగి శాంతి నెలకొనును. ఆ స్వామిని శరణు పొందుము. శాశ్వతమైన మోక్షపదము లభించును–' అనియు జగదాచార్యుడు అంతర్యామ్యుపాసనము నాదేశించెను.

సర్వసాక్షి భూతుడైన ఈ యంతర్యామి ప్రతి సాధకునకును హృదయావాసియే కావున నిత్యసన్నిహితుడై ప్రపత్తి ననుష్ఠింప అనువైనవాడే; కాని తన హృదయములోనే సర్వేశ్వరుడున్నాడను భావముదయించుటయే దుర్ఘటము. పరవ్యూహ స్వరూపములవలె ఈ అంతర్యామి స్వరూపమును అవ్యక్తతత్త్వమే యనవలసియుండుటచే సాధకునకు విశేషక్లేశ సాధ్యమగునేకాని సులభముకాదు. కావున శరణాగతికి అంతర్యామి స్వరూపముకూడ సుగమ్యము కాకపోవుచున్నది.

అర్చాస్వరూపము :

నిరాకార సాకారోపాసనలు రెండును వైదికమార్గములే యైనను సాధకునకు సాకారోపాసనమే సుకరమని తద్విదులు భావించిరి—

'క్లేశోఽధికతర స్తేషా మవ్యక్తాసక్తచేతసామ్
అవ్యక్తా హి గతిర్దుఃఖం దేహావద్భి రవాప్యతే–'
(భ. గీ. 12 అ. 5.)

'అవ్యక్తతత్త్వము అవాఙ్మనస గోచరము కావున తదుపాసకులగు ముముక్షువులకు క్లేశమెక్కువ. వారికి ముక్తి దొరకదని కాదు. దొరకును, కాని అది మిక్కిలి కష్టముమీదగాని లభింపదు–' అని భావము. సాకారమైననో అది సాధకుని దేహేంద్రియ మనోబుద్ధులకు అందునట్టిది కావున విశేషక్లేశము లేకుండగనే ఫలకారియగునని యభిప్రాయము.

కహ్యాసుడు, పుండరీకాక్షుడు, సహస్రశీర్షుడు, సహస్రాక్షుడు, సహస్ర పాత్తు - అను విధముగా పురుషోత్తముని; పద్మహస్త, పద్మాలయ, పద్మపత్రాయ తాక్షి - అనురీతిగా శ్రీదేవిని వర్ణించుచు వచ్చిన వైదిక వాఙ్మయము ఛాయలు సాకారోపాసనా భావమునకు ప్రాతిపదికలైనవి.

పరబ్రహ్మయగు శ్రీ మహావిష్ణువును దివ్యమంగళ విగ్రహుడుగాను, అఖిలహేయ ప్రత్యనీక కల్యాణగుణపూర్ణుడుగాను తత్త్వదర్శనులు రూపొం దించుకొనిరి. 'మంత్రాధీనంతు దైవతమ్' అనురీతిగా దారు శిలాలోహాది నిర్మితములైన అర్చామూర్తులందు మంత్రానుష్ఠాన ప్రభావమూలమున ప్రాణ ప్రతిష్ఠాదులు జరిపి సర్వేశ్వరసాన్నిధ్యమును సాధించుకొన్నారు.

అర్చావతారములకు సంబంధించిన ఆలయ నిర్మాణము, మూర్తిరూప కల్పనము, ప్రతిష్ఠావిధి, మంత్రజపహోమ నిత్యార్చనాపద్ధతులు—మొదలైన సమస్త విషయములను తెల్లముచేయుచు సాధకులకు మార్గదర్శకములుగా పాంచ రాత్రాదులగు ఆగమశాస్త్రములు వెలువడినవి. ఈ ఆగమములు శ్రుతులవలె పరమ ప్రామాణికములైనవనియు, ముముక్షువుల ననుగ్రహింప శ్రీమన్నారాయ ణునిచేతనే యుపదిష్టములైనవనియు, విజ్ఞానధనులగు దేశికులు నిర్ణయించిరి.

భగవదనుగ్రహప్రాప్తికి గల మార్గములలో అతి ముఖ్యమైన అర్చా స్వరూపోపాసనమార్గము నుపదేశించునది కావున ఈ పాంచరాత్రాగమశాస్త్రము నకు ఏకాయన శాస్త్రమని ప్రసిద్ధి వచ్చినట్లు తెలియుచున్నది—

'శృణుధ్వం మునయః సర్వే వేదమేకాయనాభిధమ్
మోక్షాయనాయవై పంథా ఏత దన్యోన విద్యతే
తస్మాదేకాయనం చేతి ప్రవదంతి మనీషిణః'

'మోక్షమునకు ఇంతకంటె మించిన మార్గము లేదు. కనుక ఇది ఏకాయన మనబడుచున్నది. ఇది వేదమే.' (ఛాందోగ్యోపనిషత్తులో)

'ఋగ్వేదం భగవోఽధ్యేమి యజుర్వేదం, సామవేదమథర్వాణం,
వాకోవాక్య, మేకాయనం చేతి—'

అని చతుర్వేదములతోబాటు ఈ భగవచ్ఛాస్త్రమైన ఏకాయనము పేర్కొనబడుట చూడ దీని ప్రాముఖ్యమును, ప్రామాణ్యమును ఎట్టివో తెల్లమగుచున్నది.

అట్టి శాస్త్రము లుపదేశించిన మార్గము ననుసరించి ప్రతిష్ఠితములైన భగవన్మూర్తులలో ఆ పరబ్రహ్మ దివ్యశక్తి సంపూర్ణముగా ప్రసరించి భక్తుల యభీష్టముల నీడేర్చును.

'సాధకస్య తపోయోగాత్ పూజాయాశ్చాతిశాయనాత్
ఆభిరూప్యాచ్చ బింబస్య సదా సన్నిహితోఽస్మ్యహమ్—'

సాధకుడు గావించు తపశ్శక్తివలనను, ఆతడొనరించు పూజావిశేషము వలనను, మూర్తిసౌందర్యాధిక్యమువలనను స్వామి ఆయా విగ్రహములలో సన్నిహితుడై యుండునని ప్రమాణవాక్యము.

సగుణోపాసకుడగు భక్తుడు గృహార్చామూర్తినిగాని, ఆలయ ప్రతిష్ఠితమైన మూర్తినిగాని త్రికరణశుద్ధితో—అభిగమనము, ఉపాదానము, ఇజ్య, స్వాధ్యాయములను విధముగా భక్తితో సమీపించి, ఫలపుష్పాదులు సమర్పించి, అనన్యభావముతో పూజించి, ఆ యా మూర్తులకనుగుణములుగా నిర్దిష్టములైన మంత్రములను జపించి, ధ్యానించినచో సర్వేశ్వరుని అనుగ్రహమున ఆ భక్తునకు అజ్ఞానధ్వంసకమగు బోధము పొడమును. దివ్యదృష్టికలుగును. ఆ దివ్యదృష్టిచే అభక్తవరునకు ఆ విగ్రహమునందే త్రిపాద్విభూతిలోనిదియు, దివ్యతేజోమయమైనదియు, అగు పరబ్రహ్మ స్వరూపము గోచరించును. విభవమైన కృష్ణావతారములో అర్జుననకు వసుదేవ పుత్త్రుడుగా, తనబంధువుగా, నెచ్చెలిగా, సాధారణుడుగా అంతవఱకు కనిపించు చుండిన శ్రీకృష్ణపరమాత్మ, ఆయర్జుననకే దివ్యదృష్టి యనుగ్రహించిన పిమ్మట—

'తత్రైకస్థంజగత్ కృత్స్నం ప్రవిభక్తమనేకథా
అపశ్యత్ దేవదేవస్య శరీరే పాండవస్తదా' (భ. గీ. 11 అ. 13.)

అన్నట్లు - విశ్వేశ్వరుడుగా, అనంతవీర్యామిత విక్రముడుగా గోచరించినాడు గదా! ఈ స్థితి సాధకునకు అర్చామూర్తియందును సంభావ్యమే సాధ్యమే. దృఢతరమైన భక్తితో భగవదర్చామూర్తి నారాధించు భక్తునకు ఆ స్వామి యనుగ్రహముననే ముక్తి లభించుననునది సదాచారులగు భారతీయులందఱ విశ్వాసమగుటయే కాదు - యుగయుగములుగా కలుగుచువచ్చిన యనుభవమును, అనుభూతమగుచున్న సత్యముకూడ.

దివ్యక్షేత్రములలోని భగవన్మూర్తులు కొన్ని స్వయంవ్యక్తములనియు, కొన్ని ఋషిప్రతిష్ఠితములనియు, కొన్ని మహాభక్త ప్రతిష్ఠితములనియు ఆయా స్థలపురాణాదులు పేర్కొనుచున్నవి. స్వాచార్యనియమనముచే గృహములందు నెలకొల్పుకొని ఆరాధించునవి గృహార్చామూర్తు లనబడును. నిత్యయుక్తులగు ఉపాసకులకు ఇవియన్నియు ఏకరూపములే. 'ప్రతి మాయాం విష్ణుభావః'– 'సాలగ్రామే హరి భావదర్శనమ్–' అన్నట్లుగా వారికి ఆయా అర్చామూర్తు లన్నిటియందును శ్రీమన్నారాయణా భేదాధ్యవసాయమే. ఆ దివ్యానుభూతియే.

'ప్రతి మామందబుద్ధీనామ్'–'అర్చామూర్త్యారాధనము అల్పాధికారులకే' యనుమాట యొకటి అతత్త్వజ్ఞులు పలుకుచుందురు. అది యుక్తి శాస్త్రానుభవ ముల కన్నిటికిని విరుద్ధమగుటచే ఉపేక్ష్యము. 'యాదృశీభావనాయత్ర సిద్ధిర్భవతి తాదృశీ–' ప్రత్యయమునుబట్టి ఫలమను ఆర్యోక్తి స్మరింపదగినది.

పరిపక్వ జ్ఞానమూర్తులనబడిన ఆళ్వారులును, వేదవేదాంత శాస్త్రపారం గతులైన ఆచార్యవర్యులును, అవిదిత విషయాంతరులైన మహాత్ములును ఎంద రెందరో శ్రీరంగము, శ్రీ వేంకటాద్రి - మొదలైన దివ్యక్షేత్రములందు వెలసి యున్న అర్చామూర్తులయందే తమ ప్రపత్తినిష్ఠను నెఱపి తరించి ముముక్షువులకు మార్గదర్శకులైనారు.

పరతత్త్వ నిర్ణాయకాగ్రేసరులును, విశిష్టాద్వైత సిద్ధాంత ప్రవర్తకా చార్యులునగు శ్రీ భగవద్రామానుజులు వివిధములైన దివ్యక్షేత్రములకు వేంచేసి అచటి శ్రీమన్నారాయణుని అర్చామూర్తులను సేవించి ఆనందించినారని శ్రీ పరాశరభట్టాచార్యులవారిట్లు తెలిపినారు.

'శ్రీరంగం, కరిశైల, మంజనగిరిం, తార్క్ష్యాద్రి సింహాచలౌ
శ్రీకూర్మం, పురుషోత్తమం చ బదరీనారాయణం నైమిశమ్,
శ్రీమద్ద్వారవతీ ప్రయాగ మధురాయోధ్యా గయాః పుష్కరం
సాలగ్రామగిరిం నిషేవ్యరమతే రామానుజోఽయం మునిః'

(శ్రీరం. స్తో. 7.)

కావున ప్రపత్తినిష్ఠకు అర్చావతారమూర్తి యనుకూలమైనదని సారాంశము.

ముముక్షువులకు అమృతప్రాయమైన యీ ప్రపత్తినిష్ఠను సాధకులకెల్ల అందించి మహోపకారకులైనవారు శ్రీ యతిరాజులు, వారే

'యామునార్య సుధాంబోధి మవగాహ్యాయథామతి
ఆదాయభక్తియోగస్య రత్నం సందర్శయామ్యహమ్'
(గద్యత్రయము)

అన్నారు. యామున మునులనుగ్రహించిన వాఙ్మయమునుండి భక్తియోగమునకు సారభూతమైన యీ ప్రపత్తిని గ్రహించి ప్రదర్శించితిని—అనియు,

'శారీరకేఽపి భాష్యేయా గోపితాశరణాగతిః
అత్రగద్యత్రయే వ్యక్తాం తాం విద్యాం ప్రణతోఽస్మ్యహమ్'

'బ్రహ్మసూత్ర భాష్యములో—శ్రీభాష్యములో ఈ శరణాగతి విశదముగా నిరూపితముకాలేదు. కొంత గూఢముగా చెప్పబడినది. మఱి : ఈ గద్యత్రయములోనో ఈ ప్రపత్తివిద్య మిక్కిలి స్పష్టముగా నిరూపింపబడినది. లోకతారకమైన ఆవిద్యకు నమోవాకములు—అనియు ఆదరముతో ఆనతిచ్చినారు.

అట్టి ప్రపత్తి ననుష్ఠించిన పూర్వులచే గూఢముగా నుంచబడిన ఈ దర్శనమును అందఱకును తేటతెల్లముచేసి ప్రబోధించిన మహనీయులు కావుననే—

'ప్రైకైకపూరుష సురక్షిత వంశరీత్యా
గుప్తా ప్రపత్తి పదవీ పురుషైః పురాణైః
రామానుజస్తు పరయా దయయా దయాళుః
సీమామిమా మతియయౌ జగతాం హితాయ—' (ఉప. రత్న)

పరమ కరుణామూర్తులుగా శ్రీభగవద్రామానుజులు ప్రపన్నులచే కీర్తింపబడినారు మోక్షసాధనములలో ప్రపత్తి దర్శనము సర్వశ్రేష్ఠము.



# సుస్థిర శాంతిసాధనకే

# ఆస్తికత్వము

— శ్రీపాటి శ్రీదేవి

"భగవంతునిపై విశ్వాసము గల్గివున్నప్పుడే శాశ్వత సుస్థిర విశ్వశాంతి సాధ్యము." ఇలా అంటె ఇది అందరికీ ఆశ్చర్యాన్ని కల్గించవచ్చు వైజ్ఞానిక పురోగతి జెందుతున్న ఈ రోజుల్లో భగవదారాధన, మతవిశ్వాసం, మూఢవిశ్వాసాలక్రింద జమ కట్టబడుతున్నది.

సాంకేతిక పరిజ్ఞానముతోపాటు, విషయానవలోకనం, తదనుగుణ్యమైన కారణాల పరిశోధించాలనే జిజ్ఞాస నేటి మానవునిలో పెరిగిపోతున్నందువల్ల, క్రియాత్మకంగా భగవంతునిగూర్చిన ఆలోచన అనవసరమైనదే. మొత్తానికి భగవంతుడు లేడనేధోరణి ఏర్పడుతున్నది.

వైజ్ఞానికంగా పురోభివృద్ధి చెందుతున్న ఈ అధునాతన ప్రపంచం, స్వరూపరహితుడైన భగవంతుని గుర్తించలేక పోతున్నది. ఈ పురోగతి అంతా మానవుని అమోఘమేధా సంపదను చాటేదే, కాని, ఈ పురోగతి ఎటు దారితీస్తున్నది. మానవుడు రాను రాను నిస్సహాయుడై దిక్కుమాలినవాడై పోతున్నాడు. మాక్సిమ్‌గోర్కి అన్నట్లు "మానవుడు పక్షివలె ఆకాశంలో ఎగరటం, చేపవలే నీటిలో ఈదటమైతే నేర్చుకున్నాడు కాని భూమిపై సరిగ్గా నడవటం నేర్వలేదు." అధునాతనంగా తయారుచేయబడిన యంత్రములు, వింతలు, ఈ విజ్ఞాన అభివృద్ధి ఏదైనా, భగవంతునిగూర్చిన వింత ప్రశ్నకు జవాబు చూపగల్గుతుందేమో చూడవలసివుంది.

ఈ వైజ్ఞానికాభివృద్ధివల్ల యాంత్రిక బలం పెరిగి మానవుడి శ్రమ ఎంతో తగ్గినప్పటికి అతనికి కావలసిన మనోల్లాసం, శక్తి, శాంతి, రక్షణ మొదలైనవి కొరతగానే వున్నవి.

గత సంవత్సరాల విజ్ఞాన అభివృద్ధిని - చరిత్రను, సింహావలోకనం చేసుకుంటే - హైడ్రోజన్ - ఆటంబాంబులవంటి, అణుబాంబుల తయారు చేయగల్గిన మేధాశక్తి రెండు ప్రపంచయుద్ధాలకుకూడా కారణభూత మైంది. అంతేకాదు - అంతేకాదు. ఏ క్షణంలోనైనా ప్రపంచం ముక్కలు ముక్కలుగా ధ్వంసంకాగల అవకాశాలు మరిన్ని ఏర్పడుతూ భవిష్యత్తుపై ఆశలను మృగ్యం చేస్తున్నవి.

ఈప్రపంచయుద్ధాల పర్యవసానంగా, మన పురోభివృద్ధితోబాటు మన నైతికస్థాయిని పెంచుకోవలసిన ఆగత్యంకూడా ఏర్పడింది.

సమకాలీనులలో కర్మసిద్ధాంతంవైపు మొగ్గుదల పెరుగుతూ, మతవిషయక ప్రాధాన్యత, నమ్మకం సడలిపోతున్నది. ఈ కాలంలో ఈ రెండింటి సమాంతరత లోపించి, సందేహానుగతమైన కర్మవాద పరిణామంగా, జీవితానికి కావలసిన బలమైన ప్రాతిపదిక లేకుండా పోతున్నది. మనం కర్మవాదజనిత నాగరికత ఆ స్థిరవిజయాలవైపు ఆకర్షింపబడి, అనాదిగా విశ్వసిస్తున్న పరమార్థిక సత్యాలను సందే హించటం నేర్చుకుంటున్నాము. ఈ పరిణామంగా మనం నాస్తికు లుగా, విశ్వాసరహితులుగా మారిపోతున్నాము.

ఇలా అనటంవల్ల భగవంతునిపై విశ్వాసం అంటే ఏమిటి? అసలు భగవంతుడంటే ఏమిటి? అన్న ప్రధాన ప్రశ్నలు ఉదయించ వచ్చు. నిజంగా ఈ ప్రశ్నలకు క్లుప్తంగా జవాబు చెప్పటం కష్టమే - ఐతే అన్నిటికన్న ఉన్నతమైనదీ, ఉత్కృష్టమైనదీ అగు పదార్థాన్ని, దేవుడు, దేవత, ఉత్కృష్టచైతన్యం ప్రపంచ మేధ, మూడవవ్యక్తి లేదా సర్వశక్తి సంపన్నుడు అని ఏదో ఒక పేరుతో పేర్కొంటున్నాము.

అలాగే ప్లాటో ఆరాధించిన మంచి - గ్రూసి ఆరాధించిన సౌందర్యం, బుద్ధుడారాధించిన ప్రేమ, సర్వసంగ పరిత్యాగం - గాంధీజి విశ్వసించిన సత్యము - అహింస మొదలగునవన్ని ఉన్నతాదర్శాలు - ఒక్కొక్కరు ఒక్కొక్క విధంగా కల్గించిన సంపూర్ణవిజ్ఞానం - వాటి ఆరాధన పైన జెప్పినవాని ఆరాధనవంటివే. ఉత్కృష్టవిశిష్టారాధనే మతానికి ప్రాతిపదిక. ఆరాధన అంటే మతపిచ్చితో సాగించే కర్మకాండే కానక్కర లేదు. ఐతే అలా సాగించే కర్మకాండకు మతవిశ్వాసానికి సంబంధం లేకపోలేదు. ఇలా విశ్వాసం ఉన్నప్పుడే ఆచార కర్మకాండలను సాగిస్తుంటాము. తాము నమ్మిన సిద్ధాంతాలకై తమ జీవిత సర్వస్వాన్ని త్యాగం చెయ్యటానికి సిద్ధపడినారు కొందరు. కొందరు త్యాగమూర్తులయ్యారు. మతారాధన అనేక పద్ధతులలో చెప్పబడుతున్నది. ఈ ఆరాధనపద్ధతులు ప్రతి స్వల్ప విషయములోను విభిన్నతను గల్గి, మన పూర్వీకుల పరిస్థితుల కనుగుణ్యంగా కొనసాగింపబడినవి. ఆ పద్ధతులే క్రమంగా నమ్మకాలుగా స్థిరపడి వంశానుగతమై పోయినవి. వివిధ మతాలు అంతర్గతంగా విభిన్నమార్గాలు కల్గియున్నప్పటికి - అన్నింటి ధ్యేయం మాత్రం ఒక్కటే. అదే సర్వమానవ సౌభ్రాతృత్వం. ఒక ప్రఖ్యాత తత్త్వవేత్త అన్నట్లు, "మతం మానవునిలో ఒక దివ్యాత్మ స్వరూపాన్ని కల్గిస్తుంది. తత్‌సంబంధమైన ఆముష్మిక విషయ పరిజ్ఞానం ప్రతిఫలింపజేసే అన్వేషణ, స్వీయాలోచనా పటిమలోనే మానవుని అసలైన ఉనికిస్థానంగా గోచరిస్తుంది."

అందుకే భగవంతునిపై గల విశ్వాసము వల్ల మనిషిలో ఉన్న చైతన్యాన్ని నియమబద్ధం చేసుకొని తన ఇతర బలహీనతలపై విజయాన్ని సాధించుకోగల్గుతాడు. ఇదే భగవంతునిపైన నమ్మకానికి కారణభూతమైతే అది తప్పకుండా మతంపై విశ్వాసానికి ప్రాతిపదికే కాగల్గుతుంది. ఇలాంటి విశ్వాస మొక్కటే ప్రపంచశాంతి స్థాపనకు సాధనం కాగల్గుతుంది.

భగవంతుని గూర్చిన భావన ఐచ్ఛికం కాని సత్యం, మంచితనం అన్నవి ఊహాకే పరిమితంగాక వాస్తవతను గల్గినవి. ఇదే మతసామరస వాదానికి బలాన్ని చేకూర్చుతున్నది. నీతి, తత్వము, మతము మొదలైన వాటిని సూత్రీకరించి ఉమ్మడి అవగాహనను ఏర్పరుచుకుంటే అదే వైజ్ఞానికులనుకున్నట్లు ఉన్నత మేధాసంపద, తాత్వికులనుకున్నట్లు అదే సర్వరక్షకుడు, దేవుడు.

ప్రొఫెసర్ 'వైట్ హెడ్' అన్నట్లు దేవుడు "విశాల ప్రపంచపు ఉనికికి కారణభూతమైన వస్తుసముదాయక కర్త" ప్రేమ, మంచితనం మొదలగు నవి ప్రధాన అంగములు. ఇవి మతానుగతమైనవే కాక భగవత్ జ్ఞానముతో ఏకీభవిస్తున్నవి. అంతే కాక నైతికజీవితానికి అర్థం చేకూర్చగలిగినట్టివి. భగవంతుడు లేదా అతీతశక్తి, మాత్రమే అన్నింటి కన్నా ఉన్నతమైనవి. ఇదంతా కాదనుకుంటే మానవుడు తనకుతానే సంపూర్ణుగా భావించుకొనే అవకాశమున్నది.

ఈలాంటి పరిణామం రాకుండా, మానవుడు విజ్ఞానవంతుడు, శక్తివంతుడు కావటానికి భగవంతుని నీడను కోరటంలో ఔచిత్యం లేక పోలేదు.

భగవంతుని గూర్చిన మానవుని అంతిమ అన్వేషణ నైతికబలం కొరకు మాత్రమే. ఈ శక్తే ప్రపంచంలోని అన్ని అవకతవకలను బాగు చేయగల్గుతుంది. అయితే ఇది వైజ్ఞానికపురోగతికి ప్రత్యామ్నాయం కానవసరం లేదు. కాగా నైతికబలం పరిధి లేని ఈ ఉన్నత పరిణామ హేతువైన విజ్ఞానంలో ఏకం కావాలి.

వైజ్ఞానికపరిణామం యావత్తు మానవుని స్వాధీనం. అది అతని మంచికి చెడుకు ఉపయోగపడుతుంది. మారణహోమానికి దారితీసే ఈ వైజ్ఞానికశక్తి మానవునిప్రగతికి మనుగడకు ఉపయోగపడాలి. శ్రీ రాజగోపాలచారి అన్నట్లు ప్రాణాంతకమైన బాంబులను సముద్రంలో

పారవేసి అణుశక్తిని సర్వతోముఖాభివృద్ధికి వినియోగపర్చుకోవాలి. ఇలా జరుగుతే ఏ రాజకీయ నాయకుడు అధిపత్యాన్ని వహించినా సర్వమానవ సౌభ్రాతృత్వము, సహజీవనం, పంచశీల, పరోపకారము మొదలైన వాటి గురించి ఎంతైనా అధిక్యత చూపవచ్చు. నేడు విజ్ఞానశాస్త్రము సమయమును - దూరమును తన హస్తగతము చేసు కున్నది. ప్రపంచపరిమాణాన్నే అతి చిన్నదిగా మార్చివేసింది. అంత ర్జాతీయతను ముందుకు తెచ్చింది. అంతర్జాతీయంగా మానవు లంతా ఒకరి కొకరు చేరువవటమే కాక ఒకరి విశ్వాసాలపై ఒకరు కీచులాడు కోకుండా పరస్పరం ఒక నిశ్చల సుస్థిరావగాహనను ఏర్పరుచుకుంటే రాజకీయ సిద్ధాంతాలపై ఒక దేశం ఇంకొక దేశంపై గాని, బలహీన దేశంపై బలవంతమైన దేశంగాని ఎలాంటి యుద్ధాన్ని ప్రకటించే అవ కాశమే వుండదు. అప్పుడే ఒకదేశం ఇంకొక దేశంతో ప్రగతికాముకు రాలుగా, సమైక్యంగా మనగలుగుతుంది.

యుద్ధాలు గత చరిత్రకే పరిమితమై నిశ్చలశాంతి ప్రపంచంలో పాదుకు పోగలుగుతుంది.



# శ్రీ భద్రాద్రి రామాలయ పునరుద్ధరణ - ఒక సమీక్ష



★★★

శ్రీ లక్కినేని నర్సయ్య,
చేర్మెన్ :
(భద్రాచల సీతారామాలయ
పునరుద్ధరణ సంఘం)

★★★

ఆధ్యాత్మిక సంపదకలిగిన భారతదేశంలో ఎన్నో మహిమాన్విత మైన పుణ్యతీర్థాలు, దేవస్థానాలు వున్నాయి. భారతీయ సంస్కృతినీ భగవద్విశ్వాసాన్నీ మహత్వపూర్ణంచేసి, మానవ మనస్తత్వాన్నీ, ఆశయాన్నీ సమగ్రమైన ధార్మికమార్గంలో పయనింపజేయడానికి ఇవి ముఖ్యకేంద్రాలుగా వుంటున్నాయి. అట్టి పుణ్యస్థలాలలో భద్రాద్రి ఒకటి.

పవిత్ర గోదావరినది ఒడ్డుననే ఈ పుణ్యక్షేత్రము విలసిల్లి యుండుటచే దీనికి మఱింత శోభ ఏర్పడినది. మూడు శతాబ్దముల పూర్వముదిగా చెప్పబడుతున్న ఈ దేవాలయము దేశ విదేశములనుండి

వచ్చు యెందరెందరో భక్తులను ఆనందపరచుచూ క్షేత్ర మహాత్మ్యము వెదజల్లుతున్నది. ఈ యాలయ నిర్మాణమునకు సంబంధించిన పుట్టు పూర్వోత్తరములు, శ్రీరామదాసుడు ఇందుకు పడిన దుర్భరమైన కష్టములు కథలుగా, గాథలుగా, ఇతిహాసములుగా ఆంధ్రులందరకును సుపరిచితమే. ఆంధ్రప్రజల సౌభాగ్యమునకు కొంగుబంగారమై విలసిల్లుతూన్న ఈ దేవాలయము కాలాంతర పరిణామదశలకు లోనై, పునర్నిర్మాణస్థితికి వచ్చినది.

## నిర్మాణ వివరములు :

దేవస్థాన నిర్మాణము మొత్తము స్కీమునకు యాభైలక్షల రూపాయలు వ్యయం కాగలదని నిపుణులు అంచనా వేశారు. ఈ నిర్మాణంయావత్తు శిల్పభూయిష్టమే. చోళరాజుల పరిపాలనాకాలం అనంతరం ఆంధ్రదేశంలో ఎక్కడా ఇట్టి మహత్తర నిర్మాణం జరిపించబడలేదు.

## కళ్యాణ మంటపము :

నాలుగులక్షల రూపాయిలతో ఈ మంటపము రమణీయముగా మనోజ్ఞ శిల్పయుక్తముగా నిర్మించబడినది. ఈ మంటపము చుట్టును సీతారాముల కళ్యాణము, భగవద్గీతాబోధనము మున్నగు రామాయణ కథాఘట్టములు శిల్పశాస్త్రసమన్వితంగా, చక్కగా చిత్రీకరించబడినది.

## గర్భాలయము :

ఈ మధ్యయుగంలో ఇట్టి మహత్తరశిల్పం నిర్మితంకాలేదు. గర్భాలయముచుట్టూ ఒక లక్షమంది ప్రజలు సునాయాసంగా కూర్చొని ఉత్సవాదులను కనులపండువుగా చూడడానికి వీలుగా సుమారు నాలుగైదు లక్షల రూపాయిల వ్యయం కాగల ఒక ఆడిటోరియం నిర్మించవలసియున్నది. గర్భాలయమున ముఖమంటపము, మహామంటపముల నిర్మాణము పేర్కొనదగినది. ఆలయానికి 37 అడుగుల ఎత్తు గల గోపురం నిర్మించబడుతున్నది. ఈ నిర్మాణం ప్రస్తుతం కొనసాగుతున్నది.

## చిత్రకూట మంటపము :

ఐదు లక్షల రూపాయిల వ్యయంతో నిర్మించ తలపెట్టి, ఇప్పటికి కొంత పని జరిపించబడింది.

## సత్రములు :

ప్రతి సంవత్సరము గొప్ప స్థాయిలో ఉత్సవములు జరుపించ బడుచున్న స్వామివారి కళ్యాణోత్సవములను సందర్శించు నుద్దేశ్య ముతో వచ్చు లక్షలాది యాత్రికుల సౌకర్యార్థమై ఇక్కడ ప్రజారోగ్య సూత్రముల ననుసరించి, ఆధునికములైన ఎన్నో సౌకర్యములతో సత్రముల నిర్మాణము జరిపించుటకు ఉద్ధరణసంఘం నిశ్చయించింది.

ఒకలక్ష యాభై వేల రూపాయిల ఖర్చుతో ఉద్ధరణసంఘం 'యాత్రిక సదనం' నిర్మింప జేసినది. ఇది గాక దేవస్థాన సత్రమునకు దాదాపు 20 వేల రూపాయలు ఖర్చుపెట్టి పునర్నిర్మాణం జరిపించి, వసతి సౌకర్యాలను విస్తృతంచేశారు. ఇంతేకాక 'చంద్రమౌళి సదనం' పేరిట రు. 45 వేలుతో ఒక అతిధిభవనం నిర్మించబడింది. ఇంకా 75 వేల రూపాయిల వ్యయంతో జానికమ్మసత్రము నిర్మాణము, అన్నవరం దేవస్థానము వారు 75 వేలు, మరియు తిరుపతి దేవస్థానమువారు 2 లక్షల రూపాయిల వ్యయంతో గోదావరికి అభిముఖంగా గుట్టమీద రెండు సత్రములు నిర్మించారు. రెండులక్షల అంచనాలతో (ఆంధ్రప్రభ విరాళములతో) రామదాసు ధ్యానమందిరం నిర్మాణం జరుగుచున్నది.

## ఇతర నిర్మాణములు :

ఆలయానికి పడమటదిశన వున్న నరసింహస్వామి దేవాలయము మరియు రంగనాయకుల దేవాలయము ఉద్ధరణసంఘ నిధితో పునర్ని ర్మాణము జరిపించబడినవి.

శివాలయంనుండి తిరుపతి సత్రంవరకు ఘాట్ రోడ్డు నిర్మించ బడినది. ఈ రోడ్డు నిర్మాణానికి 10 వేల రూపాయిలు ఖర్చుచేయబడినది.

నవవిధ భక్తిభావుకులైన మహనీయు లందరికీ కొంగు బంగా రంగా వరప్రదాతగా, ఆరాధ్యదైవంగా భరతఖండాన్ని దివ్య తేజోమయం చేస్తూ భద్రాద్రిలో వేంచేసి వున్న సీతా రామచంద్రులనూ, ఎందరో అనుభవజ్ఞులైన శిల్పులచే శతాబ్దాలుగా ఒక ఆకారం ఎరుగకుండా మౌననిద్రపోతున్న నిర్జీవపాషాణాలు నవజీవనచైతన్యం పొంది, వివిధభంగిమలలో, వివిధరూపాలలో భారతీయ శిల్పసంపదను తామరతంపర చేస్తున్న అపూర్వశిల్పాలనూ, చల్లగాలులు వీచే పవిత్రగోదావరి ఇంకా ఎన్నో...అన్నిటినీ చూచి ఆనందించవలసిందే కాని, వర్ణించ నలవికాదు.

ప్రజానీకానికి విజ్ఞప్తి :

ఉద్ధరణసంఘు నిర్మాణకృషి చక్కగా కొనసాగుతున్నది. ఈ కృషికి ప్రజలు, ఇతర సంస్థల అండదండలు ఇప్పుడు లభిస్తూన్నదాని కంటే ఇంకా ఉత్సాహపూరితంగా దండిగా లభించాల్సి వున్నది. ఇప్పుడు నిర్మాణం జరుగుతూన్న ఆలయ కట్టడాలు 3, 4 వేల సంవత్సరాల పరిమితి వరకు మన్నికగా చెక్కు చెదరకుండా వుండగలవని శాస్త్రజ్ఞులు అంచనావేశారు. మన సంస్కృతికీ, జాతికీ గర్వకారణమైన ఈ మహానిర్మాణకృషి మన తరమున జరుగుతూండటం ఆంధ్రులమైన మన అదృష్టంకాక మరేమిటి? ఇందుకు సర్వాంధ్ర ప్రజానీకం నడుం బిగిస్తుందని నమ్ముతున్నాను. కళ్యాణప్రదులైన సీతారామచంద్రుల పరిపూర్ణ కృపాకటాక్షములు సర్వదా ఆంధ్రులకు అభ్యుదయ కారకములు కాగలవని ఆశిస్తున్నాను.

అందరూ తప్పక ఒకసారి భద్రాద్రి విచ్చేసి, క్షేత్రవైభవాన్ని కన్నులార తిలకించ గోరుతున్నాను.



# భల్లా పేరయ్య....
# భద్రగిరి శతకము

హరి శివకుమార్.

ఆంధ్రవాఙ్మయమున శతకములకు విస్తారమైన ప్రచారమున్నది. ఆబాల గోపాలము నీ శతకములను చదువుచుందురు. జీవితములో నేదో యొక సన్నివేశమునకో, భావమునకో దృష్టాంతము కాగల పద్యములు వీనిలో తరచు వచ్చుచుండును. కావున శతకపద్యములు జనుల జిహ్వాగ్రములపై నాట్యమాడుచుండును.

శతకమనగా నూరు పద్యములు గల చిన్న కావ్యము. కాని శతకములలో 108 పద్యములుండుట వాడుక. ఆర్ష సాంప్రదాయాను సారము భగవంతుని అష్టోత్తర శతనామములచే స్తుతించినట్లు సాధారణముగా భగవన్నుతిపూర్వకములైన ఈశతకములందును 108 పద్యములుండు ఆచార మేర్పడి యుండవచ్చును. శతకములలో సాధారణముగా వృత్తనియమమో లేక పద్యనియమమో పాటింపబడును. కాని యిందలి పద్యములు ఏ పద్యమున కా పద్యమే కాని, భావైక్యత యుండదు. అంతమాత్రమున నివి భావప్రధానములు కావని చెప్ప వీలులేదు. ఇందలి భావము కవికాత్మాశ్రయమై యుండును. కావున నిందలి కవిత్వము ఆత్మాశ్రయ కవిత్వము.

ఈశతకములను స్థూలముగా నాల్గు విభాగములు చేయవచ్చును: (1) భక్తిశతకములు; (2) నీతిశతకములు; (3) వైరాగ్యశతకములు; (4) శృంగారశతకములు.

భక్తి శతకములలో భగవన్నుతి ప్రధానముగా నుండును. ఇది సామాన్యులగు కవు లందఱును జేయునట్టి నుతియే! కవి తన ప్రతిభ ననుసరించి పలు పోకడలతో చేయును. ఇంతకంటె గడుసువారు భగవన్నుతిచేయు విధానము వేరు. అది వ్యాజస్తుతి. వ్యాజస్తుతి యనగా

స్తుతిని గుహ్యముగా నుంచి నిందించుచున్నట్లుగా పైకి చెప్పుట. ఇట్టి వానిలో కవి తన ఇష్టదైవమును ఆక్షేపణలతోడను, చురుకు మాటలతో నెత్తిపొడుచుట చేతను, కర్తవ్యనిరతుడై యున్న యా దేవుని ప్రబోధించి కర్తవ్యనిరతుని గావించును. ఇట్లు కొంతసేపు వాగ్బాణములచే నొప్పించి, భక్తుడైన కవి చివరకు క్షమాపణ వేడుకొనును. సింహాద్రి నారసింహశతకము, భద్రగిరిశతకము, ఆంధ్రనాయకశతకము మొదలగునవి వ్యాజస్తుతి శతకములు.

భద్రగిరిశతకము భద్రాచలము నందలి రామభద్రుని గూర్చి చెప్పబడిన శతకము. దీనిని రచించిన పేరయ్య భల్లావంశసంజాతుడు. ఇతడు కౌండిన్యగోత్ర పవిత్రుడు. తండ్రి పెద్దన, తాత లింగన.

"భద్రగిరివాస శ్రీరామ భద్రదాస
పోష బిరుదాంక రఘుకులాంబుధిశశాంక"

అను మకుటము గల్గిన ఈ శతకము అష్టోత్తరశతపద్యపరివృతమైనది. గోలకొండరాజ్య వినాశనమందు ఔరంగజేబుకు తోడ్పడిన ఇబ్రాహీము ఖాను డనువాని బంటయిన ధంసా యను తురుష్కుడు వరంగల్లుకు నాతిదూరములో నున్న వేల్పుగొండపై దుర్గములు నిర్మించి, తెలుగు దేశమున పెక్కు దురాగతములు గావించుచు, భద్రాద్రిని ముట్టడించినాడు. ధంసా యచ్చటి విగ్రహములను ధ్వంసము చేయునేమో యని భయపడి యాలయపు పూజారులు సీతారామ లక్ష్మణ పవనసుత విగ్రహములకు కలములపై గోదావరిని దాటించి పోలవరము చేర్చిరి. తురుష్కులు ఆలయమును ధ్వంసము గావించిరి. ఆలయమునందలి సొమ్ములు బీబీల సొగసు కర్పణచేయబడినవి. పంచపాత్రలు సురాపాన వర్తకుల పాలైనవి. శఠగోపములు విప్రశతుల పాలైనవి. వస్త్రములు మాంసభక్షకుల కైనవి. పీతాంబరములు పింగళాక్షుల కైనవి. ఆలయమున కర్పూర చందనాగరు ధూపములవాసన పోయి గంజాయిపొగలు క్రమ్ముకొన్నవి. వేదశాస్త్రాధ్యయన ముడిగి మొల్లా ఖురానుల శబ్దములు బయల్దేరినవి. శ్రీరామముద్రలు పోయి అక్బరు ఒకరైనను అచ్చు లమరినవి. గరుడాశ్వ గజ రథ వరవాహనములచే బరగిన నిండ్లలో పీరీలప్రభ వెలిగినది. సత్రశాలంగణములు మత్స్యమాంసాదిక శాలాంగణములైనవి. గోదరేవులలో గోరీలమరినవి. తురకలు గరు

డాళువారి చెక్కలు, చెక్కులు, ముక్కు నొక్కివేసిరి. ఎంబెరుమానారు నింటిలో నమాజు చదివిరి. పన్నిద్దఱాళ్వారుల విగ్రహములను భంగ పఱచిరి. ఇట్టి బీభత్సమును సహించలేక ప్రజలు పలాయనమైపోయిరి. తురుష్కుల బాధ పడలేక రాముడే శరణ్యమని తలంచినవారిలో ఈ శతక కర్తయగు భల్లా పేరయ్య యొకడు. ధంసా దుర్గయమును రూపుమాపవలసినదని రాముని ప్రేరేపింపదలంచినాడు—

"ఓ రామచంద్రా! పోలవరమునకు వలస బోయి రఘువంశ మునకే రట్టడిదెచ్చినావు. తురుష్కుల కెంత చులకనైతివి? దశరథుని గర్భమున బుట్టి దశకంఠుని జంపిన దొరకిది దొడ్డతనమా? లేక కైక వరము జ్ఞాపకమువచ్చి తిరిగి వనవాసము చేయుబుద్ధి నీకు పుట్టినదా? లేక నీలాద్రిపతిని జూచి వలస బోవుట నేర్చుకొంటివా? ఇట్లు చేయ రాదని నీకు చెప్ప సౌమిత్రికైన దోచకపోయెనా? ఇల్లు వెడలుట మహాహీనమని సీతయైన చెప్పలేదా? ఔను గాదని యడ్డగించుటకు హనుమంతుడు మీ యాజ్ఞకు వెఱచినాడా? ఇది కర్తముగాదని సరి దిద్దుటకు చివఱకు వసిష్ఠుడైన చెప్పలేక పోయినాడా? ఇట్లు భద్రగిరి నుండి వీరభద్రగిరికి వలసపోవు వాంఛ నీకేమి పుట్టినదయ్యా? పోనీ— నీకు జడుపు పుట్టిన సమయమున హనుమంతుడు, సుగ్రీవుడు, అంగ దుడు, జాంబవంతుడు మొదలగు యోధాన యోధు లందఱు నేమై నారయ్యా? - అని నెమ్మది నెమ్మదిగా మందలించినాడు. శ్రీరామ చంద్రుని తుష్ణీభావమును గ్రహించి — ఓ రామచంద్రా! నీ కున్న ఉపకరణము లన్నియు వృధాగానున్నవి. శంఖము ఏ బీద జంగము చేతిలోనైన నున్నచో నూది పొట్టపోసికొనెడివాడు. చక్రము కుమ్మరి వానికడ నున్నచో కుండలైన చేసికొనెడివాడు గద. సుగాలివానివద్ద నున్నచో గోనెసంచులను సులభముగా పైకెత్తుకొనెడివాడు. నీకువలె నాల్గుచేతులు ఆధంసా కున్నచో నింకను ఇంత రాజ్యము నేలుకొనెడి వాడు. నీ వింత గొప్పవాడివని యెఱిగియే నీ పినతల్లి నిన్ను ఇల్లు వెడల గొట్టినది. శూర్పణఖ రావణునితో నీ చేతకానితనము తెలియఁ జెప్పినది. ద్వాత్రింశదాయుధోద్ధారణము గావించితివి గాని, తుపా కుల పట్ట నేరవైతివి. సకల దానవులను సంహరించు టెఱింగియు దానవుఁతో పోరనెఱుగవైతివి. పదనాల్గు లోకములు పాలించుట

యెఱిగియు నీ రాజ్యమునే నీవు కాపాడుకొనలేక పోయితివి — అని అనేక విధముల నెత్తిపొడిచినాడు.

ఇంకను రామచంద్రుని తూష్ణీభావమును సహించలేక — "ఓ రామచంద్రా! నీ వంశచరిత్రయంతయు నెఱిగికూడ నేను నీపై గల విశ్వాసమును వదలుకొనలేకపోతిని. నీఇల్లు అప్పులగంప (సముద్రము.) నీ ఇల్లాలు చలచిత్త (స్థిరత్వములేని లక్ష్మీదేవి). పాన్పు పాములపుట్ట (ఆదిశేషువు). వదినె జ్యేష్ఠాదేవి (దరిద్రదేవత). పెంపుడుతల్లి గొల్ల (యశోదాదేవి). కోడలు రాఁగ(సరస్వతి). కూతురు పాఱుఁబోతుది (గంగ). సఖుడు ఆతురుడు ఆతృతగల్గినవాడు (శంకరుడు). కుమారుడు కాముకుడు (మన్మథుడు). మఱిది క్షయరోగి క్షీణించు రోగము గలవాడు — (చంద్రుడు). తండ్రి వంచకుడు (వసుదేవుడు). అన్న (బలరాముడు) త్రాగుబోతు. స్నేహితుడు పేఁడి (బృహన్నల). ఇక నీవో— బహువేషధారివి (అవతారమూర్తివి). ఇవన్నియు తెలిసియును నీపై విశ్వాసమును పోగొట్టుకొనలేకపోయినాను. దీనికంతకు నిన్ననేల? నా ప్రారబ్ధమే కారణము. దానిని తప్పింప నెవ్వరి తరము" అని తనను తానే నిందించుకొనినాఁడు.

ఐదు సంవత్సరముల ప్రవాసానంతరము తిరిగి భద్రాద్రిలో రాముడు ప్రతిష్ఠింపబడినాడు. రామునకు దయగల్గి తిరిగి వేంచేసినట్లు కవి భావించి, నిందించినందుకు కోపగించక క్షమించవలసినదని పరిపరి విధముల ప్రార్థించినాడు — "ఓ రామచంద్రా! దానవుల గర్వ మడంచిన ఘనుడవగు నిన్ను పిఱికివా డంటిని. రావణుని గెల్చి లంకను దానముచేయబూనిన నిన్ను లోభివాడంటిని. సముద్రుని ఒక్క బాణముచే గజగజలాడించిన నిన్ను బలహీనుడంటిని. పితృకార్యమునకై పినతల్లి కోరిక తీర్చిన నిన్ను చేతకానివాడవంటివి. నీ శయ్యా భూభారకుడైన ఆదిశేషువు. నీ కుమారుడు ముల్లోకములను పుష్పముల తోడనే జయించ గల ఘనుడు. నీ మఱది శీతకరుడైన చంద్రుడు. స్నేహితుడు ఐశ్వర్యయుతుడగు శంకరుడు. ఇల్లు రత్నాకరము. ఇక నీవో అవతారమూర్తివి. ఇటువంటి నిన్ను అనరాని మాటలంటిని. నా నేరములను క్షమించి, పూర్వము నీవు రామదాసును, కుచేలుని, ప్రహ్లాదుని, నారదుని, ముచికుందుని, ద్రౌపదిని, గజేంద్రుని, శబరిని,

ఘంటాకర్ణుని, ఎట్లు దయతో బ్రోచినావో, అట్లే నా అవివేకములు హరించి దయతో నేలుము" - అని అనేక విధముల ప్రార్థించినాడు. చిట్ట చివరకు —

"కేశవ మాధవ కృష్ణ హృషీకేశ నారాయణ ముకుంద నారదనుత
పద్మనాభాచ్యుత ప్రద్యుమ్న శ్రీధర వామన గోవింద వాసుదేవ
విష్ణ్వనిరుద్ధ త్రివిక్రమాధోక్షజ నారసింహ జనార్దన మధుసూద
నయుపేంద్ర సంకర్షణ పురుషోత్తమ హరి దామోదరానంత దానవారి
అఖిలలోకాధినాథ దివ్యాంఘ్రి పద్మ
ములకుఁ బ్రణమిల్లెదను ముదమలర నేలు
భద్రగిరివాస శ్రీరామ భద్రదాస
పోష బిరుదాంక రఘుకులాంబుధి శశాంక"

అని కేశవాది చతుర్వింశతి నామములతో స్తుతించినాడు.

దీనికి ఫలశ్రుతి —

"రావణాంతక సాకేతరమణ నీదు
వలస శతకము వినువారి వలస లుడుగు"

అని ఇట్లే భద్రగిరి శతకము ప్రత్యక్షముగా రామచంద్రుని నిందించు చున్నట్లు కన్పడుచున్నను నిజమునకు ఆతని భక్తి ఇందు సర్వతో ముఖముగా గోచరించు చున్నది. ఈ శతకమున పేరయ్య దాదాపు రామాయణ కథనంతను చిత్రించినాడు. అంతేకాక దశావతారముల లోను విష్ణుమూర్తి గావించిన ఘనకార్యములను చక్కగా కాకువులో వర్ణించినాడు.

ఈ శతకము చారిత్రికముగ గూడ మిక్కిలి ప్రసిద్ధి కెక్కినది. తురుష్కుల దుర్ణయముల నింత చక్కగా చిత్రించిన గ్రంథము వేఱొకటి లేదు. అంతే కాక రాజకీయోపద్రవము నుండి ప్రజలను ఆధ్యాత్మిక శక్తితో రక్షించునట్టిదై యున్న దీ శతకము. కవి కాలానుగుణముగా ప్రజోపకారియనుట కిది తార్కాణము, నిజముగా భద్రగిరిధాముడగు శ్రీరామచంద్రుడు భల్లా పేరయ్య వ్యాజస్తుతి శతకమును వినియే ప్రజల నందఱను రక్షించియే యుండవచ్చును. ఇట్లీతడు దైవానుగ్రహము సంపాదించి ప్రజలను రక్షించినాడు.

*

# "సంస్కృతీ స్మృతులు"

— శ్రీమతి ఉదయరాజు నిర్మల.

కాలగర్భంలో అనేకం లీనమైపోతున్నట్లే ఒకానొక యుగానికి తరానికి సంబంధించిన, భావాలు, సంస్కృతి మరో తరానికి భిన్నంగా కాని, లేదా కొద్ది మార్పును కల్గియుండవచ్చును. మనదేశం అతి పురాతనదేశం. మన సంస్కృతీ సంపదకూడా అతి ప్రాచీనమైనదే. పురాతన, నవీనతలమధ్య ఏహ్యాతకు ఆస్కారం లేకుండా, పురోగతికి దోహదంగా మన సంస్కృతిని మలుచుకో గలిగితే నవసంస్కృతికి ఆలంబనం పూరన సంస్కృతే కాగల్గుతుంది. విశ్వసమాజం ఊహాకన్నా త్వరితంగా ప్రగతి పథంలో ముందంజ వేస్తున్నది. రేపటి పౌరుని గూర్చి నేడే అంచనా వేయగల తార్కికదృష్టి మనకు అలవడిపోతున్నది. బలమైన భవిష్యత్తుకు క్రమానుగత భవిష్యదృక్పథం ఒక అనుక్రమణికే కావచ్చు, ఐతే అన్నీ సాధించాలనుకున్న మానవునికి ఒకదశలో తేలకుండా మిగిలిపోతున్నది. ఆదిలో సృష్టించబడినదే, అదే ఆస్తిక, నాస్తిక వివాదం. కాగా ఆస్తికవాదాన్ని బలపరుచే సాక్షీభూతములుగా, పురాణ, యితిహాస సంబంధమైన సమస్తవిధ సాహిత్యం నిలబడగా, కేవలం తార్కికజ్ఞానంపై నాస్తికవాదం బలంగా నిలబడగల్గుతున్నది. సమాజ బలహీనతను సముద్ధరించాలను విమర్శనాదృక్పథంతో సామాన్యుని ఆకట్టుకొనేశక్తి నాస్తికత్వానికుంది. అదే ప్రత్యనుకూల పరిస్థితులలో బలహీనతకులోనై ఏదో ఒకశక్తివైపు ఆకర్షింపబడ్తాడు మానవుడు. ఆశక్తికే మరోనామకరణంచేసి భగవంతుడు లేదా శక్తి స్వరూపం అనేందుకు సందేహించడు. ఈ తార్కిక దృక్పథం కేవలం సామాన్యుని అవగాహనలోనిదే. ఐతే ఆస్తిక, నాస్తిక వాదనపట్ల మేధావుల నిర్వచనం మరోరకంగా వుండవచ్చు. అది వేరేవిషయం.

"నిప్పులేనిదే పొగరాదన్న" సామాన్య సామెతను పరికిస్తే నిజమనే తోస్తుంది. భగవంతుడు లేదా అలాంటి మరోశక్తి ఏదో లేనిదే అలాంటి వాదన ఇన్నాళ్లు స్థిరపడిపోలేదుకదా! ఐతే ఈ వివాదానికి పూర్తిగా ప్రాధాన్యత తగ్గిస్తే ఆస్తికవాదం సమాజంలో విచ్చలవిడి స్వైరవిహారం చేసే అవకాశమూ లేకపోలేదు. ఉదాహరణకు అంతా రామమయం, భగవదేచ్ఛ అంటూ వేదాంతం చెప్తూ తమ దుశ్చర్యలకు రాముని ఆధారంచేసుకొనే ధీమంతులూ లేకపోలేదు.

అనంతశక్తి సంపన్నుడైన భగవంతునికి అనేక రూపకల్పనలు చేశాం, అందుకే ఆస్తికవాదం భిన్నత్వంలో, ఏకత్వాన్నాపాదించు కోగల్గుతున్నది, శ్రీరాముడా! శ్రీకృష్ణుడా! శివుడా! ఏసుక్రీస్తా! మహమ్మదా! ఎవరు దేవుడు? అని ప్రశ్నించుకొంటే అందరూ దేవుళ్లే. అందరూ ఒక దేవుని వివిధరూపాలే అని తార్కికంగా మాత్రమే మనం సమాధానపడగల్గుతున్నాం.

భగవంతుడు శక్తిస్వరూపుడు, ఆశక్తిని మనం ఆరాధిస్తాం పూజిస్తాం, ఆయన సంతోషం పేరుతో ఏదికావాలన్నా నిర్వర్తించే ప్రయత్నంలో భక్తులుండటం సహజం. ఆ యూతరానికి చెందిన భక్తులు ఆస్తికనిష్ణులు తమ అభీష్టాల కనుగుణ్యంగా భగవంతునిమూర్తి నూహించి, అనేక రకాల ఆలయాల వెలయించి భగవత్ ప్రతిష్టకావించారు. ఈ విభిన్న దేవాలయములు బహిర్గతంగా కన్పడే కన్నుల విందైన శిల్పసంపదతో భావపుష్టికల సంఘటనల చెక్కడాలతో, ప్రతి దేవాలయ నిర్మాణానికి కావలసినంత కథారూపకల్పనతో, ఇది ఎవరికి తోచిన సంవిధానంలో ప్రమాణరహితం కాకుండా అలాంటి ప్రమాదానికి తావులేకుండా భక్తజన రంజకములై ఆస్తికవిలువలతో ఏకీభూతమైన విభిన్న ఆకృతిలో నిర్మింపబడినవి. పారమార్థికంగానే కాక, సంస్కృతీ పరంగాను, కళాత్మంగాను లక్ష్యంలో దేవాలయాలు భిన్నత్వంలో ఏకత్వం కల్గియున్నవి.

దేవాలయ నిర్మాణానికి, దేవాలయ శిల్పకళా సంపదకు దేవాలయ పవిత్రతకు, దేవాలయాల్లో వెల్లివిరిసిన సంస్కృతీ సంపదల ప్రతిబింబాలకు ఏకైక జడపదార్థం భగవంతుడు, లేదా ఆశక్తి సంపన్ను నిలీలలు నాస్తికులు ఇవి అవాస్తవములన్నా, ఈ నిర్మాణ కౌశలంలోని ఔన్నత్యానికి పరవశంపొందే ఆశ్చర్యకరమైన ఒక క్షణానైనా ఈ దేవాలయాలు నాస్తికుల్లో కల్గిస్తాయి. ఆ క్షణం చాలు వాటి విశిష్టత, పరమావధి నెరవేరినట్లేకదా !.

ఆధ్యాత్మిక ధార్మిక, సాంప్రదాయ బద్ధమైన మన పురాణ సంస్కృతిని, రేయికి రేయికి మారుతున్న నవనాగరికతకు, అనుకంప నంగా స్మృతిలో మిగుల్చగల శక్తి ఈ దేవాలయాలకున్నది. ఇది కాదన్నవారి అభిమతం వేరు. కాగా, ఆస్తికవాదాన్ని అశక్తం చేస్తున్నది కొంతమంది అస్తికోన్మాదులే. దీనికి హేతువు అట్టివారిలో భగవద్భక్తికన్న అది ఉన్నట్లు చాటుకొనే సశ్శీలత ఎక్కువ. అట్టి వారు చదువరులై సామాన్యుల తమవైపు ఆకర్షించుకొనగలరు. దీనికితోడు తమ అతిశయోక్తికి ప్రహసనంతో, ఆస్తికవిలువలే కొరవడ్డ కొందరు సమకాలీన సామాన్యులలో నాస్తికతకు పరోక్షంగా అంకు రార్పణచేస్తున్నారు. ఇదొకవైనంకాగా, కొంతమంది భుక్తికై ఆస్తి కులై, భగవంతునిపేర కొన్ని వినూత్న ప్రయోగాలను సృష్టించడం అరుదు. ఏదోవస్తువుపై దేవుడావహించి భక్తులకోర్కెలు దీర్చగలడని ఒక ప్రచారం. సరికదా, ఆ వస్తువును ఉపయోగించిన పద్ధతిలోనే వారు అనుకొన్నట్లు చెప్పించగలనేర్పు చొప్పించబడినదని ఇట్టె పసి కట్టబడకపోయినప్పటికి, కొంతకాలానికి, ఆ గారడి మరుగునబడి మరో విద్య ప్రచారంలోనికి తేబడ్తున్నది. అసలువిషయమేమిటంటే నాడు ఆస్తికవిలువలు సంస్కృతీపరంగాను కళాత్మకంగాను, సాహితీశతంగాను ఉన్నందున సమాజంలో సామాన్యుడు అనేక రకాలుగా తదనుభూతినే పొందగలిగాడు.

కానీ నేడు గారడీ – భక్తియుక్తుల ప్రదర్శనలకు కూడా ఆస్తికతను ఆధారంచేస్తూ లేదా ఆస్తికులమని చాటుకునేందుకే అన్నట్లు పూజావిధానాలను ఆడంబరయుతంగా సాగించడముతో, సమాజంలో కొంత అసలైన ఆస్తికతకు తావు సన్నగిల్లుతున్నది.

కాలప్రవాహంలోని భిన్న గతుల పర్యవసానంగా జగత్తంతా నాస్తికమేఐనా, పురాతన సంస్కృతీ పరంగా కళాఖండాలుగా, ఆస్తిక భండాగారాలుగా, వెలసిల్లగల సంపత్తిని కలిగిన మనదేవాలయాలు మన పురాతన సంస్కృతికి చెరగని తరగని వెలలేని స్మృతిభండారాలు. ఒక్కమాటలో చెప్పాలంటే పవిత్రదేవాలయాలు భూత భవిష్యత్ వర్తమాన కాల సంస్కృతీ చిహ్నాలే కాక తదనుగుణ్యాకాలంలోని మన మనోభావాలకు అనుభూతులు.

మనం భారతీయులం. మనలోని యుగయుగాలుగా రక్తంలో జీర్ణించి, ఆశ్రితమై వున్నది ధార్మికత, సాత్వకత ఐతే తదనుగుణ్యంగా రూపొందించుకోబడే మన సంస్కృతికి ఆధారం ఆస్తిక ప్రమాణమే ఐనా వివాదపడాల్సింది లేదు. ఆస్తికడాంబికాలనువిడిచి పురాతన సంస్కృతిలో, నవీనతనుజోడించి నైతికరుజువర్తనను కాపాడుకుంటూ, అష్లీలతలను వీడనాడి త్వరితమైన పురోభివృద్ధివైపు తరలితేనే పుణ్యభూమి పురాణ భూమి "భారతి" పేరు సార్ధకం కాగల్గుతుంది. ఈ మేరకు నిర్వివాదంతో మెలగటంలో అందరికర్తవ్యం లేకపోలేదు.



ఈ నాడు ...

# అభివృద్ధి పథంలో ఖమ్మం



శ్రీ జలగం కొండల్‌రావు,

(చేర్మెన్ జిల్లాపరిషత్తు ఖమ్మం)

# అభివృద్ధి పథంలో ఖమ్మం జిల్లా

ఖమ్మంజిల్లా ఒకప్పుడు పూర్వ హైద్రాబాద్ రాష్ట్రంలో వరంగల్ జిల్లాలో చేరియుండెడిది. పోలీసుచర్య తర్వాత ఖమ్మంను వరంగల్ నుండి వేరుపరచి ప్రత్యేకజిల్లాగా ఏర్పరుచబడినది. అప్పటి నుండి జిల్లాలోని వనరులను సద్వినియోగపరచుకొని జిల్లా ఆర్థికాభి వృద్ధికి కృషిచేయబడుతున్నది. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తర్వాత రాష్ట్రం లోని ఇతర జిల్లాలోమాదిరి అన్ని రంగాలలోనూ అభివృద్ధి పథంలో పురోగమించటానికి నిర్విరామ కృషి సలుపబడుతున్నది.

ఖమ్మం మొదటనుండి ఇటు పూర్వ హైద్రాబాద్ రాష్ట్రానికి అటు ఆంధ్రరాష్ట్రానికి సరిహద్దు జిల్లాగా వుండడంవలన ఇక్కడి ప్రజల సాంఘిక జీవనంపై రెండుప్రాంతాల ప్రభావమున్నట్లు గోచర మౌతుంది. ప్రజల వాడుక భాషలోనూ ఇతర కట్టుబాట్లలోనూ కాస్త ఆంధ్రప్రాంత ప్రజలతో సాన్నిహిత్యం ఎక్కువగా ఉన్నట్లు అర్థం ఔతుంది. ప్రజలు కష్టించి పనిచేసే మనస్తత్వం గలవారు. ప్రజల ప్రధానవృత్తి వ్యవసాయం. జిల్లాలోని కొత్తగూడెంలోనూ మరియు ఇల్లెందలో రెండు బొగ్గు గనులున్నవి. ఇవే ఈ జిల్లాలో గల ప్రధాన మైన పరిశ్రమలని చెప్పవచ్చును. ఈ గనుల్లో దాదాపు 60 వేల కార్మి కులు పనిచేయుచున్నారు. జిల్లాలో ప్రజల ఆర్థికాభివృద్ధికై కొన్ని మధ్యరకం మరియు లఘుపరిశ్రమల స్థాపనకై పథకాలు సిద్ధంచేయ బడుతున్నవి.

దాదాపు రెండు దశాబ్దాలలో దేశంలో జరిగిన రాజకీయ సాంఘిక మార్పుల ప్రభావం-దేశం అంతటితోబాటు ఖమ్మంజిల్లాపై బాగానే పనిచేసినదని చెప్పక తప్పదు. ప్రజా జీవితంలో రాజకీయ చైతన్యం వెల్లివిరిసినట్టు ప్రస్ఫుటంగా కన్పిస్తుంది

స్వాతంత్ర్య సముపార్జనానంతరం దేశ పురోభివృద్ధికై - జాతీయ నాయకులు తీసుకోవలసిన చర్యలగురించి సమాలోచించి పంచవర్ష ప్రణాళికలను రూపొందించి అమలు పరుచుటకు నిర్ణయించారు. దేశ పురోభివృద్ధికి కీలకమైన గ్రామసీమల పునరుద్ధరణ కార్యక్రమం ప్రధానంగా ఎంచబడినది. మొట్టమొదట జాతీయ వికాస కేంద్రాలను ఏర్పరుచారు. తోడ్తో ప్రణాళిక పథకాలనుకూడా ప్రారంభించారు. జాతీయ వికాసకేంద్రాల స్థాపన గ్రామాల అభివృద్ధి నుద్దేశించి జరిగినది. గ్రామాలలో ఆర్థిక-సాంఘిక, రంగాలలో అభివృద్ధి, తదితర విషయాలు ఇందు ఇమిడివున్నవి. ఈ కేంద్రాలద్వారా గ్రామాల అభివృద్ధికి వలయు నిధుల పంపకం, ఆజమాయిషి ప్రారంభమైంది. ఈ కమ్యూనిటి డెవలప్ మెంటు బ్లాకుల స్థానంలోనే ఆంధ్రప్రదేశ్ లో ప్రప్రథమం 1959 గా అవతరించిన పంచాయతీరాజ్ పథకం అమలు చేయబడి పంచాయతి సమితులు, జిల్లా పరిషత్తులు చట్టప్రకారం రూపొందించబడినవి. దీని ద్వారా దేశంలో అధికార వికేంద్రీకరకు నాంది పలికినట్లైనది.

ఈ అధికార వికేంద్రీకరణ=పంచాయతీరాజ్ పథకాలు, ఏ విధంగా లక్షలాది గ్రామీణ ప్రజల నాకర్షించినవి. ఎట్లా అమలు పరుచబడినవి. సత్ఫలితాలు ఎంత మేరకు సాధించబడినవన్న అంశాలపై భిన్నాభిప్రాయాలు లేకపోలేదు. కొన్ని లోపాలు అక్కడక్కడ జరిగినా వికేంద్రీకరణవల్ల ఎక్కువ ప్రయోజనం చేకూరినదని చెప్ప వలసివుంది.

ఖమ్మం జిల్లా పరిషత్తు 1959 సంవత్సరము డిసెంబర్ నెలలో అవతరించినది. ఈ తేదినాటికి ప్రతిష్టంబనలో ఉండిపోయిన జిల్లాబోర్డును రద్దుచేయటం జరిగినది. మొట్టమొదట మొత్తం జిల్లాను 15 బ్లాకులలో విభజించారు. 1964 సంవత్సరం చివరలో బ్లాకులను 13 కు తగ్గించ బడినవి.

1959 నుండి 1964 వరకు గల అయిదు సంవత్సరాల కాలం లోనూ అంతకుముందునూ జిల్లాలో ఆర్థికాభివృద్ధికొరకు ఉద్దేశించిన ప్రణాళిక పథకాలు విజయవంతంగా అమలుచేయబడినవి. జిల్లాలోని సమితి కేంద్రాలకు - మారుమూల గ్రామాలకుసైతం రవాణా సౌకర్యాలు ఏర్పాటుచేయబడినవి.

గ్రామాల అభివృద్ధికి కావలసినంత రవాణా సౌకర్యాలు లేక పోవడంవల్ల - కుంటుపడ్డుందనేది గమనించబడినది.

ఖమ్మంజిల్లాలో 1959 నాటికి ప్రతిష్టంబనలో వుండిన జిల్లాబోర్డు అధ్వర్యములో దాదాపు 21 మైళ్ల నిడివిగల రోడ్ల నిర్మాణము మాత్రమే జరిగినది.

1959-1966 వరకు అంటె దాదాపు ఆరు సంవత్సరాలలో రాష్ట్ర ప్రభుత్వం ఆంధ్రప్రదేశ్ రీజినల్ కమిటీ నిధులక్రింద రోడ్ల నిర్మాణము నకై మంజూరినిచ్చిన దాదాపు 75 లక్షల రూపాయలలో 59 లక్షల వరకు వ్యయపరుచబడినవి.

పై మొత్తం వ్యయముద్వారా ఈ ఆరు సంవత్సరాల కాలంలో దాదాపు 345 మైళ్ల పొడవుగల రోడ్ల నిర్మాణము చేపట్టబడినవి. 260 మైళ్ల రోడ్డు పూర్తిచేయబడినది. 133 మైళ్లు మెటలింగ్ కార్య క్రమంలో 64 మైళ్లు పూర్తిగా నిర్మించబడినది. ఈ రోడ్ల నిర్మాణంలో దాదాపు 303 కల్‌వర్టుల నిర్మాణం జరుపవలసివచ్చినది. వీటిలో 136 కల్‌వర్టుల పూర్తి నిర్మాణము అయిపోయినది. మిగతావాటి పని చురుకుగా సాగుతున్నది.

రోడ్ల నిర్మాణము-అభివృద్ధికై ప్రభుత్వం మంజూరిచేసిన నిధులను సద్వినియోగం చేసుకొని సత్వర రవాణా సౌకర్యాలు కల్పించుకొన్న జిల్లా తెలంగాణా ప్రాంతంలో ఖమ్మం అని చెప్పటంలో అతిశయోక్తి లేదు.

జిల్లాలో కొన్ని పాతరోడ్లను జిల్లాపరిషత్తు అప్ గ్రేడు చేసినది. అట్లా చేయబడినవి సుమారు వందమైళ్లు. అంతె జిల్లాలో రోడ్ల ఉద్ధరణ కార్యక్రమం చివరిదశ చేరినట్లె.

రాష్ట్రప్రభుత్వం రోడ్ల అభివృద్ధికి సంబంధించిన కార్యక్రమంలో భాగంగా 10 పైసల గ్రాంటుక్రింద రు. 2,43,874/-మంజూరి నిచ్చినది. ఈ మొత్తం రోడ్ల మరమ్మతులకై ఉపయోగించి 9 మరమ్మతులను చేపట్టి పని చురుకుగా సాగింపబడుతున్నది. ఇంతవరకు రు. 1,39,590–70 వ్యయమైనవి.

రవాణా అసౌకర్యాలతోబాటు గ్రామీణ ప్రజలు మంచినీటి సమస్యనుకూడా ఎదుర్కొనేవారు చాలాకాలంనుండి ప్రతి గ్రామ పంచాయతిలో మంచినీటిబావుల త్రవ్వకం చేపట్టబడినది. త్రాగేనీరు సమస్య పరిష్కార మౌతుందేకాని గ్రామీణ ప్రజానీకాన్ని అపరిశుభ్రమైన నీరు త్రాగటంవల్ల ఏర్పడే అంటువ్యాధులనుండి కాపాడడం కూడా ముఖ్యముగా భావించబడినది. ఇందుకుగాను రక్షిత మంచినీటి సరఫరా (Proteod Water Supply) పథకాలు అమలుచేయాలన్న పట్టుదల, అవసరము కన్పించినది. ఈ పథకాలు ప్రతి గ్రామానికి అమలు చేయటమంటె పెద్ద వ్యయంతో కూడుకొనిఉన్నది. క్రమక్రమంగా ఈ పథకాలను, పంచాయతీల ఆర్థికపుష్టినిబట్టి మాత్రమే చేపట్టవలసివుంటుంది.

రాష్ట్రప్రభుత్వం 1963–64 సంవత్సరంలో రు. 1,93,000/– ల అంచనాలతోకూడిన మూడు పథకాలను, 1964–65 సంవత్సరంలో మరి రెండు పథకాలు రు. 50,000/– ల అంచనాలతో 1965–66 లో మరొకటి మంజూరుచేసినది. ఈ అయిదు పథకాలకు కావలసిన పంపుసెట్లు-విడిభాగాలు కొనుగోలుచేయటం జరిగినది. పనులు ప్రారంభించబడి చురుకుగా నిర్మాణము కొనసాగించబడుతున్నది. జిల్లాలోని పంచాయతి సమితి - మేజర్ పంచాయతీలు ఇట్టి సౌకర్యముకొరకు

ఎదురుచూచుచున్నవి. గ్రామ పంచాయతీలు ఆర్థికంగా పటిష్టమై, స్వయం సమృద్ధి సాధించుకో గలిగిన నాడు ఈ సౌకర్యాలు ప్రతి పంచాయతికి ఏర్పాటు కాగలవనుటలో సందేహములేదు.

గోదావరి మహానది ఖమ్మంజిల్లా సరిహద్దుల్లోనుంచి ప్రవహించటంవల్ల, వర్షాకాలంలో అప్పుడప్పుడు ఉధృతంగావచ్చె వరదలకు - భద్రాచలం తదితర ప్రాంతాలు - లోనై కొన్ని కష్ట నష్టా ఏర్పడుతున్నవి. వరదలమూలంగా జరిగిన రోడ్ల నష్టానికి - వ్యవసాయక ప్రతిబంధ కాలకుగాను రాష్ట్ర ప్రభుత్వం గ్రాంటుగా పెద్ద మొత్తాలను మంజూరి చేసినది. 1963-64, 1964-65 సంవత్సరాలలో రు. 347936/- వివిధ పనుల నిమిత్తం మంజూరి నిచ్చినది. ఈ మొత్తంలో రు 2,50,332/—లు 14 పునరుద్ధరణ కార్యక్రమాలకై వ్యయపర్చటంజరిగినది. తలపెట్టబడిన పనులు పలుస్థాంయాలలో అమలు జరుగుతున్నవి.

ఖమ్మంజిల్లా పరిషత్తు అన్ని రంగాలతోపాటు విద్యారంగంలో కూడా చెప్పుకోతగినంత ముందంజవేసినది. జిల్లాపరిషత్తు ప్రారంభం నాటికి జిల్లాలో 29 ఉన్నత పాఠశాలలు, 22 మాధ్యమిక పాఠశాలలుండెడివి వాటిసంఖ్య ఇప్పుడు 108 కి పెరిగినది, ప్రాథమిక పాఠశాలల ఆజమాయిషీ పంచాయతి సమితి అధ్వర్యంలో నున్నది.

జిల్లాలో కేవలం పాఠశాలల సంఖ్య పెరగడమే ప్రధానంగా భావించబడలేదు. విద్యాస్థాయికూడా పెంపొందేందుకు తీవ్రంగా ఆలోచించబడుతున్నది. విద్యా సంస్థల్లో విద్యాస్థాయిని పెంపొందించేందుకు జిల్లాపరిషత్తు-ఉపాధ్యాయులు-పాలక కమిటీలు సమన్వయ భావంతో కృషి సలుపుతున్నది.

పెరుగుతున్న విద్యార్థుల సంఖ్యకు చాలీ చాలని పాఠశాల భవనములు అవరోధముగా నున్నవి. రాష్ట్ర ప్రభుత్వం ప్రాంతీయ సంఘ నిధులనుండి రు. 11. 22 లక్షలు ఉన్నత-మాధ్యమిక మరియు ప్రాథ

మిక పాఠశాలల భవననిర్మాణములకుగాను గ్రాంటుగా విడుదలచేసినది. జిల్లాపరిషత్తు స్వయంగా 45 స్కూలుబిల్డింగ్‌ల నిర్మాణము చేపట్టినది. వీటి నిర్మాణవ్యయము క్రింద రు. 12,20218/–లు అంచనా వేయ బడినది. 16 భవనములు పూర్తిఅయినవి. 13 పంచాయితి సమితుల అధ్వర్యంలో 181 స్కూలు బిల్డింగ్‌ల నిర్మాణం చేపట్టబడినది. వీటి నిర్మాణమునకు దాదాపు రు. 12,82,850/వ్యయమైనది. 30 భవనముల నిర్మాణము పూర్తి అయినది. మిగతావాటి నిర్మాణము చురుకుగా సాగుతున్నది.

ఇవి గాకను రు. 1.58 లక్షల గ్రాంటు హైయ్యర్ సెకండరీ స్కూళ్ల సైన్సు లేబరటరీల మరియు పరికరాల కొనుగోలుకు రాష్ట్ర ప్రభుత్వం మంజూరి చేసినది. ఇప్పటికి నాలుగు లేబరటరీల నిర్మాణము గావింపబడినది.

వ్యవసాయరంగం – పశుపోషణ – తదితర రంగాలలో జిల్లా వ్యవ సాయ అధికారుల మరియు జిల్లాపరిషత్తు మధ్య సమన్వయ సహకారం భావంవుంది. రైతులకు వ్యవసాయకరంగంలో అభివృద్ధిని సాధించేందుకు ఇతోధిక పంటలను పెంచేందుకు కావలసిన సహాయ సంపత్తులను అందిం చటం జరుగుతున్నది. ఎరువులు ఆధునిక వ్యవసాయకపనిముట్లు పంపు సెట్లు-కరెంటుమోటార్లు రైతుల అవసరాల కనుగుణ్యంగా అందజేయ బడుతున్నవి. ఖమ్మంజిల్లాలో వ్యవసాయం ఎక్కువగా చిన్ననీటివనరుల మీద ఆధారపడియున్నది. చెరువులు-కుంటలు వర్షాకాలములో నిండి నప్పుడు వ్యవసాయం పనులు సాఫిగా జర్గుతుంటాయి.

చిన్ననీటివనరులకు ఎప్పటికప్పుడు మరమ్మతులు చేపట్టబడు తున్నాయి. పంచాయతి సమితుల మరియు జిల్లాపరిషత్తు చట్టముల లోని 18వ సెక్షన్‌క్రింద జిల్లాలోని చిన్ననీటిపారుదల వనరులను రెవెన్యూ డిపార్టుమెంటు పై సంస్థలకు 1961 లో అప్పగించినది. ఈ విధంగా అప్పగించబడిన మొత్తం నీటివనరులు 1707 లు కలవు. వీటిక్రింద 36021-26 ఎకరాలు సాగుబడిలో వున్నవి.

వీటిలో 843 చెరువుల-కుంటల మరమ్మతు పని చేపట్టబడినవి. 1961–1966 వరకు 691 నీటివనరులపూర్తి పక్కా-మరమ్మతులను నిర్వహించటం జరిగినది. ఈ నీటివనరుల నిర్వహణ కొంత ప్రణాళిక మరికొన్ని ప్రణాళికేతర పథకాల ననుసరించి గైకొనబడినవి. పై వనరులను ప్రణాళికేతర పథకాలక్రింద అమలుచేయబడినవి.

ఇక ప్రణాళిక పథకాలక్రింద 788 చెరువులు దాదాపు 8476 ఎకరాల ఆయకట్టు కలిగినవి. పునర్నిర్మాణములోనికి గొనిరాబడినవి వీటిలో 622 చెరువులపనిపూర్తిఅయినది. 1961–65 వరకు సాధారణ వ్యయంక్రింద రు. 8.60 లక్షలు మరియు ఆడిషనల్ మద్దులక్రింద రు. 8.52 లక్షలు కేటాయించబడగా సాధారణ వ్యయంక్రింద రు. 7,56,43-96 మరియు ఆడిషనల్ మద్దులక్రింద రు. 6,30,181-81 ఖర్చులు అయినవి ఇంతవరకు.

జిల్లాపరిషత్తు అధ్వర్యంలోనేమీ, పంచాయతీసమితుల అధ్వర్యంలోనేమీ ప్రభుత్వ సహాయ సంపత్తులతో జిల్లా అధికారుల సహకారంతో వరదలవల్ల కలుగుతుండే నష్టాన్ని పునరుద్ధరించేందుకు ప్రతిసారి ఎన్నో చర్యలు గైకొనటం జరుగుతుంది.

వరదలకు గురైన ప్రజానీకానికి, రైతాంగానికి వలయు ప్రత్యేక ఆర్థిక సహాయము-ఆహారం, మందులు, బట్టలు, తక్కావి అప్పులు, గృహాలపునరుద్ధరణకు వలయు ఆర్థికనిధుల మంజూరు. ప్రభుత్వం చేస్తున్న దానితోపాటు జిల్లాపరిషత్తుకూడా వీలైనంత వరకు ఆదుకొంటున్నది.

గ్రామాలలో మంచినీటిబావుల నిర్మాణము పంచాయతి సమితులద్వారా దాదాపు 2569 వరకు చేపట్టబడినవి. వీటిలో సాంఘిక సంక్షేమ పథకాల ననుసరించికొన్ని జరిగినవి. హరిజనులకు గృహవసతికై స్థలాలకేటాయింపు తదితర సమస్యల పరిష్కారానికి తగుశ్రద్ధ గైకొనబడుతున్నది.

విద్యార్థులకు స్కాలర్ షిప్పుల మంజూరి నివ్వటంలోనూ మధ్యాహ్నం భోజన కేంద్రాలను నిర్వహించటంలో ప్రత్యేక చొరవ కన్పరచటం జరుగుతున్నది. మధ్యాహ్నం భోజన కేంద్రాలు 454 నిర్వహింపబడుతున్నవి. ప్రస్తుతం 17008 విద్యార్థులు ఈ వసతిసిబడయుచున్నారు. స్కూళ్ళ భవన నిర్మాణములకు వలయు ఫర్నిచర్ తదితర సౌకర్యాలకు స్కూళ్ల పోషక సంఘాలనుండి తమవంతు ఆర్థిక విరాళములు సేకరించటం జరుగుతున్నది. జిల్లాపరిషత్తు విద్యాసంస్థల్లో ఎదురయ్యే అనేక సమస్యలను, ఎలాపరిష్కరించవలసి వుంటుంది అందుకు అనువుగా పరిస్థితులను సృష్టించేందుకు అవలంబించదగు మార్గాల అన్వేషణకై ప్రతి సంవత్సరం ప్రధానోపాధ్యాయుల మహాసభ జిల్లాపరిషత్తు నిర్వహించుతున్నది. దీనివల్ల అనేక విషయాలను ముఖాముఖి చర్చించి ప్రయోజనాత్మకమగు నిర్ణయాలు గైకొనే అవకాశాలేర్పడుతున్నది.

పై కార్యక్రమాలన్ని ప్రజాహితానికి. అభివృద్ధికి సంబంధించినవి. వీటైనంతవరకు ఎన్నిసమస్యలు అడ్డువచ్చినా, నిరాశ నిస్పృహాజనించనివ్వకుండా ప్రణాళికా లక్ష్యాల మేరకు ముందంజ వేయటం జర్గుతున్నది. అక్కడక్కడ కొంత స్థబ్దత ఏర్పడ్డా. కొన్ని ప్రకృతిసిద్ధమైన ప్రతిబంధకాలు కల్గినా, సమధికోత్సాహంతో నేవాటిని అధిగమించుకుంటూ, లోపాలను సరిదిద్దుకుంటూ ప్రజల సహకారంతో ఇతోధిక అభివృద్ధిని సాదించటం జర్గుతున్నది.

ఈ సందర్భంలో జిల్లాపరిషత్తు కార్యాలయం దాని సిబ్బందికి సంబంధించిన కొన్ని విషయాలను పేర్కొనవలసియున్నది.

ఖమ్మంజిల్లా బోర్డుకు స్వంత కార్యాలయ భవనములేకుండేను. జిల్లాపరిషత్తు కార్యాలయము దానిసిబ్బందికి కావలసినంత విశాలమైన భవనము లభ్యంకాకపోవడంవలన విధుల నిర్వహణలో కొంత అసౌకర్యమేర్పడి 1962—63 సంవత్సరములో జిల్లాపరిషత్తు స్వంతభవన నిర్మాణమునకుపక్రమించినది. కార్యాలయము నిర్మాణానికి 4,13,485/-లు వ్యయమైనది. రాష్ట్రప్రభుత్వం గ్రాంటుక్రింద రు. 3,50,000/-లు మంజూరి నిచ్చినది.

మిగతా మొత్తం జిల్లాపరిషత్తు స్వంత జనరల్ ఆదాయము పద్దు నుండి కేటాయించి వ్యయపర్చినది బిల్డింగ్ నిర్మాణము అన్ని వసతులతో పూర్తి చేయబడి కార్యాలయము అందులోకి తరలించబడినది.

కార్యాలయ పనులకు ఇంక ఎట్టి అసౌకర్యములేదుగాని సిబ్బంది ఉనికికిమాత్రముకొంత గృహవసతి సరిగా లభించనందున కొన్ని ఇబ్బందు లేర్పడుతున్నట్లు గమనించటం జరిగినది. ఈ అసౌకర్యాన్ని ప్రభుత్వ దృష్టికి 1964–65 సంవత్సరములో ఆర్థిక ఋణసహాయానికై అర్థించటం జరిగినది. దానిమీదుగా ప్రభుత్వం స్థానిక స్వపరిపాలన మరియు గృహ శాఖలద్వారా రు. 1,20,000/–లు అప్పుగా మంజూరి నిచ్చినది. ఈ మొత్తం ద్వారా 52 గృహాలనిర్మాణం చేపట్టబడినది. అసలు మొత్తం వ్యయం రు. 3.02 లక్షలుఖర్చు అవుతుందని అంచనా వేయబడినది. మొత్తం 12 మంది యు. డి. సి, 24 మంది యల్. డి. సి. మరియు 16 మంది నాలుగవతరగతి ఉద్యోగులకు ప్రస్తుతం గృహవసతి ఏర్పడుతుంది. అధికారుల గృహవసతి సమస్య పరిష్కారానికి మరికొన్ని చర్యలు గైకొనవలసివుంది. 20% జిల్లాపరిషత్తువాటాతో మరికొంత అప్పుకై ప్రభుత్వాన్ని అర్థించటం జరిగినది.

అధికార వికేంద్రీకరణద్వారా గ్రామాల స్వయం సమృద్ధి-ఆర్థికాభివృద్ధి లక్ష్యాలు విజయవంతంగా నిర్వహింపబడుతున్నవని సగర్వంగా చెప్పుకోవచ్చు. అయితే గ్రామీణ ప్రజల్లో రాజకీయ చైతన్యం ఇంకా వెల్లివిరిసినాడు, ఈ పంచాయతీరాజ్ విధానాలు ఇతోధిక సత్ఫలితాల నివ్వగలవని మనం ఆశించవచ్చు. ఈ విధానాల అమలుకు ప్రజలు కష్టించి పనిచేయాలనే మనస్తత్వం నిధుల సక్రమవినియోగం, పథకాల అమలులో అధికారులశ్రద్ధ, అధికారుల అనధికారుల మధ్య సమన్వయ భావం, ఇవన్నీ కలసివచ్చిననాడు మనగ్రామసీమలు మూడు పువ్వులు ఆరుకాయలుగా వర్ధిల్లగలవు.

ఖమ్మంజిల్లాపరిషత్తు ప్రజల అండదండలతో ప్రగతిశీలురైన కార్యకర్తలతో, జిల్లాఅభివృద్ధికి చేయగలిగిన కృషిని నిర్విరామంగా చేస్తున్నది. ఇక ముందుకూడా చేస్తుంది.

---

MINISTER FOR LAW, LEGISLATURE,

ENDOWMENTS & PRISONS

HYDERABAD

*11th October. 1966*

*I am happy to learn that a Special Number on the shrine at Bhadrachalam is being brought out. I have gone through some of the articles contained in the volume and found them extremely interesting and useful. This Special Number deals with several important aspects of Bhadrachalam temple—historical, cultural, religious and architectural. I have no doubt that this compendious volume will be eagerly read and widely appreciated. I hope more and more temple managements will emulate this example and bring out such volumes dealing with their respective shrines. I wish this venture all success.*



(Sd.) P. V. NARASIMHA RAO.

MINISTER FOR EXCISE,
PROHIBITION AND CULTURAL AFFAIRS

HYDERABAD
*May* 1, 1966

*My dear Editor,*

*I am very happy to learn that you are going to publish a special issue of your Weekly giving complete Historical and Religious aspects of our famous Bhadrachalam temple including an account of the recent Srirama Navami Celebrations.*

*In bringing out this special issue, you are reliably doing a good service to the nation and I wish your endeavour success.*

*Yours sincerely,*
(Sd.) M. R. APPAROW

SRI SRINGERI JAGADGURU

MAHASAMSTHANA SHARADA PEETHAM

PRIVATE SECRETARY

SRINGERI—KADUR

NIZAMABAD

*May*, 26 1966

*Sir*,

*Your letter dated* 15—4—'66 *regarding publishing a special issue of your Journal giving complete historical and religious aspects of the Sree Bhadradri Seetha Ramalaya Temple was received yesterday. The delay may be due to our quick movement from place to place.*

*The temples of Sri Seetha Ramachandraswamy at Bhadrachalam were visited by His Holiness The Jagadguru Sri Shankaracharya Mahaswamuluvaru on the* 8*th*, 9*th and* 10*th of April* 1966 *and Poojas were performed.*

*His Holiness was immensely pleased with the temples and several choultries situated on the bank of Godavari and was deeply impressed with Sri Rama Kshetra, which must attract numorous pilgrims and tourists and should flourish as a most important pilgrim centre, and all those who are fortunate to have the Darshan of Sree Sitha Ramachandraswamy would surely be blessed. The idea of publishing a special issue regarding such a sacred place is glorious.*

*I am conveying the gracious Blessings of His Holiness and His best wishes that your " Congress " may thrive well and be one of the best Journals in Andhra Pradesh.*

*Yours sincerely,*

(Sd.) C. K. CHANDRASEKHARIAH

MINISTER FOR
INFORMATION & BROADCASTING
INDIA

NEW DELHI
*April* 25, 1966

*Our country has an ancient and rich heritage. This heritage need be supplemented and not necessarily supplanted under the strong wave of modernity.*

*" Congress," a Telugu weekly of Warangal, has been trying to popularise the culture and heritage of our country for the past nine years. Now they are bringing out a special issue on Bhadrachalam temple of Andhra Pradesh.*

*I wish the weekly every success.*

(Sd.) RAJ BAHADUR

* * * * * * * * * * *

GOVERNOR
MADHYA PRADESH

RAJ BHAVAN
PACHMARHI
*April* 20, 1966

*I am glad to know that the " Congress " a National Telugu Weekly, is bringing out a special issue on the Bhadrachalam Temple, the ancient and renowned temple of Andhra Pradesh. I wish all success to this effort.*

(Sd.) K. C. REDDY

GOVERNOR

MYSORE

RAJ BHAVAN

BANGALORE

*May* 6, 1966

*Dear Sir,*

*I send my best wishes for the success of ' Sri Bhadradri Seeta Ramalaya Temple Special Issue ' which you are bringing out.*

*Yours faithfully,*

(Sd.) V. V. GIRI

* * * * * * * * * * *

GOVERNOR OF MAHARASHTRA

RAJ BHAVAN

POONA

*May* 9, 1966

*I am glad to hear that the CONGRESS a national Telugu weekly will be bringing out a special issue " SRI BHADRADRI SEETARAMALAYA TEMPLE SPECIAL ISSUE." I am sure the venture will be a great success. I send my best wishes.*

(Sd.) P. V. CHERIAN

MINISTER FOR FINANCE AND INDUSTRIES
ANDHRA PRADESH

"VIJAYA VILLA"
LALLAGUDA
HYDERABAD-17

*April* 21, 1966

*Dear Sir, Editor,*

*I am happy to learn that you are bringing out a special number dealing with the historical background of Sri Ramachandra's Temple at Bhadrachalam. This is a commendable effort on your part.*

*Few people know the details of this sacred temple and many more do not know. I am sure if the correct data is collected and compiled in the right manner it would greatly help in acquainting the public with this subject. This would be a service rendered to a good cause. I hope every effort would be made to present authentic data on this subject.*

*Wishing your special issue all success.*

*Yours sincerely,*

(Sd.) M. CHANNA REDDY

* * * * * * * * * * *

DEPUTY LEADER
CONGRESS PARLIAMENTARY PARTY

24, CANNING LANE
NEW DELHI

*May* 6, 1966

*Sree Rama's Temple at Bhadrachalam is one of the few temples which is popular and which attracts large number of pilgrims from Andhra Pradesh. It is being renovated and the Committee got donation from the large number of Devotees. I am happy you are bringing out a Souvenir giving full information about the Temple.*

*I offer my sincere congratulations to the Committee for collecting a large amount and for getting the Temple renovated. I pay my tribute to the great services rendered by Shri Kalluri Chandramouli.*

(Sd.) B. GOPALA REDDI

గొట్టిపాటి బ్రహ్మయ్య,
చేర్మన్.
ఆ. ప్ర. లెజిస్లేటివ్ కౌన్సిల్.

"రాఘవ సాదన్'
6-3-1248, సోమాజిగూడ
హైదరాబాద్ — 4.

ప్రియమిత్రమా !

నమస్కారములు.

శ్రీ భద్రాద్రి సీతారామాలయంగూర్చి తెలుగు జాతీయ వారపత్రిక "కాంగ్రెస్" ప్రత్యేక సంచిక వెలువరిస్తున్నట్లు విని ఆనందించితిని. ఇది మన అతి ప్రాచీనమైన సుప్రసిద్ధ యాత్రాస్థానం. దానిని పునరుద్ధరించిన మహాభక్తుడు గోపరాజు రామదాసుగా ప్రసిద్ధుడు. పరమ పూజ్యుడు.

భారతదేశములో ఆరాధింపబడు దేవుళ్ళలో శ్రీరాముడు జనతాదేవుడు. సీతారాముల ఆలయంలేని గ్రామంగాని, పల్లెగాని ఉండదు. ఆయన ఆదర్శపురుషుడు. ఆదర్శప్రాయుడైన కుమారుడు, సోదరుడు, రాజు. సర్వ గుణ సంపన్నుడు, త్యాగమూర్తి, ఏకపత్నీవ్రతమును ఆచరించిన మొదటి రాజు. పూర్ణపురుషుడు. అట్టి అయోధ్య రాముణ్ణి భద్రాద్రి రాముణ్ణి చేసుకున్న అదృష్టవంతులము ఆంధ్రులము. రామభక్తి ఉగ్గుపాలతో పెంచిన మన త్యాగరాజు, పోతరాజు, గోపరాజు మనకు నిరంతరం పూజనీయులు. మానవునిలోని దేవత్వం పెంచి పోషించునది రామాయణపాత్రలు. రాముడేగాదు శీతమ్మతల్లి, భరతుడు,

లక్ష్మణుడు, హనుమంతుడు, గుహుడు మహా త్యాగ మూర్తులు. అన్నికాలాలకు ఆదర్శమూర్తులు. సాటిలేని మహాభక్తుడు, త్యాగమూర్తి, నవ వ్యాకరణవేత్త, మహా వీరుడు, రాజకీయ దురంధరుడు హనుమంతుడు వానరుడు కాదు. ఆనాడు వనచరుడు. ఆయన మన దండకారణ్యా వాసి యగుట మనకు గర్వకారణము.

రాజకీయ, సాంఘిక పునరుద్ధరణమును సాధించు కొనిన మనజాతి ఆధ్యాత్మిక పునరుద్ధరణమునుగూడ పొందవలసిన సమయమాసన్నమైనదని నేను భావిస్తు న్నాను. పరమాత్మునిలో ఆయన సర్వశక్తి సంపన్నతలో మన విశ్వాసం దృఢమగుటకు యిది అత్యావశ్యకం. కావున "కాంగ్రెస్" పత్రిక యీ ప్రత్యేక సంచిక ప్రచురణ ద్వారా ఒక వుత్తమకార్యము నెరవేర్చుచున్న దని నేను భావిస్తూ అభినందిస్తున్నాను. ఆ సీతారామ చంద్రులు మీ పత్రికను ఆశీర్వదించుదురుగాక.

భవదీయుడు,

గొ. బ్రహ్మయ్య.

MINISTER OF TRANSPORT,
AVIATION, SHIPPING & TOURISM,
INDIA

NEW DELHI-11
*April* 20, 1966

*Dear friend*

*I am glad to learn that a special issue of " Congress " giving complete historical and religious aspects of Bhadrachalam temple is being brought out in May,* 1966. *I am sure the issue will be informative and useful. I wish it every success.*

*Yours sincerely,*
(Sd.) N. SANJIVA REDDY

* * * * * * * * * * *

MINISTER OF INDUSTRY
GOVERNMENT OF INDIA

NEW DELHI
*April* 26, 1966

*Dear Friend,*

*Thank you very much for your letter dated the* 15*th April,* 1966.

*I am very happy to note that a special issue on Sree Bhadradri Seeta Ramalaya Temple is being brought out by the Telugu Weekly " Congress." I wish your venture in advance all success.*

*Yours sincerely,*
(Sd.) D. SANJIVAYYA

BHARATIYA VIDYA BHAVAN
CHAUPATTY ROAD
BOMBAY-7
*April* 18, 1966

*Dear Friend,*

*Your letter of* 15*th April* 1966.

*I am glad to know that the 'Congress' is issuing a special issue giving complete Historical and religious aspects of Bhadrachalam Temple. I wish your efforts every success.*

*Yours sincerely,*
(Sd.) K. M. MUNSHI

* * * * * * * * * * *

MINISTER FOR
MUNICIPAL ADMINISTRATION & FORESTS

HYDERABAD
*May* 13, 1966

*Dear Editor,*

*I am glad to know that you are bringing a special issue of Sri Bhadradri Seeta Ramalaya Temple. I hope it will bring out the spiritual message reflecting the broad features of our Hindu Religion. It is significant that you are bringing out this issue at a time when this ancient temple of Sree Rama is being renovated.*

*Yours sincerely,*
(Sd.) N. CHENCHURAMA NAIDU

# ఒక తరం కథ

—⁕⁕⁕⁕—

ఈ నాడు మనం నివసిస్తున్న యీ కాలం చరిత్రలో అత్యంత ప్రధానమైనది. నేడు భారతదేశం ఆదర్శవంతమైన అభ్యుదయపథంలో అతి వడిగా పురోగమిస్తున్నది. ఎదురవుతున్న అనేక జాతీయ, అంతర్జాతీయ సమస్యల్ని అధిగమించి ప్రగతిలోకి ప్రయాణిస్తున్నాం మనం. మనం చేస్తున్న ఈ మహా యాత్రయొక్క సమగ్రస్వరూపాన్ని తెలుసుకోవాలంటే,

సమాచార పౌరసంబంధశాఖ ప్రచురిస్తున్న

## "ఆంధ్రప్రదేశ్"

## సచిత్ర మాస పత్రిక చదవండి.

ప్రతినెలా 90,000 కాపీలు అమ్ముడవుతున్నాయి.

విడిప్రతి వెల 30 పైసలు.

టి. రామచంద్రరావు,
డైరెక్టర్
సమాచార, పౌరసంబంధశాఖ ఆంధ్రప్రదేశ్.

## THE WARANGAL DISTRICT COOPERATIVE MARKETING SOCIETY LTD., WARANGAL.

Registered No. 412 T.K.

Registered on 6—2—1964. Started work on 21—12—1964.

No. of members. Share capital from affiliated societies

Share capital contributed by Government.

**Board of Management.**

1. *President* ... SRI E. VENKATA RAMA NARSAIAH
2. *Vice President* ... SRI V. RAGHAVA REDDY.
3. *Treasurer.* ... SRI P. AMRUTHA REDDY
4. *Director* ... SRI M. KRISHNA, M.L.A.,
5. *Director* ... SRI SANTHOSH CHAKRAVARTHI.
6. *Director* ... SRI B. NARAYANA.
7. *Director* ... SRI N. V. KRISHNA RAO.
8. *Director* ... SRI K. VARDHA REDDY.
9. *Director* ... SRI G. SATYANARAYAN RAO.
10. *Director* ... SRI P. JANARDHAN REDDY, Advocate, President Dist. Co-op. Central Bank Ltd., Warangal.
11. *Director* ... The Deputy Registrar of Co-op. Societies, Warangal.
12. *Director* ... The Secretary Zilla Parishad Warangal.

Special features:—

(*a*) (i) The area of operations extend to whole of the Warangal revenue district.

(ii) Only Agricultural credit societies, and the Agricultural produce Marketing Societies are eligible for affiliation to the society.

(*b*) The society is the sole distributor of nitrogenous fertilizers to the agriculturist throughout the district. During the year 1965—66 it has distributed 5,532 tons of the fertilizers through its affiliated societies spread throughout the district and throughout its depots.

(*c*) The society has entered the market to purchase the agricultural produce direct from the ryots granting them special facilities. During the year 1965-66, the society has purchased 21,644 quintals of paddy worth Rs. 9,52,987/- for conversion into rice and supply to the Food Corporation of India.

It has also purchased of maize 5,905 quintals worth Rs. 2,74,346/- and supply to the other states under the permits issued by the Registrar.

Besides, the society is trading in pulses and the construction of a dhal mill with Government aid is in progress. The society is also a wholesale dealer in sugar.

The society is acquiring a rice mill at Warangal with Government aid.

(*d*) The society has been granted financial aid for the construction of a big godown at Warangal and two small godowns one each at Nekkonda and Narsampet. Within one year of its starting the society has made remarkable progress though it is hardly a year since it was started on it work.

# ది ఖమ్మంజిల్లా కో-ఆపరేటివ్ మార్కెటింగ్ సొసైటి, లిమిటెడ్. (రిజిష్టర్ నెం. 345 TE)

అధ్యక్షులు:
కె. అనంతరెడ్డి, బి.ఏ.



ప్రారంభం
11-11-1964

ఈ సొసైటిద్వారా జిల్లాలో పరపతిసంఘాలద్వారా, తాలూకా మార్కెటింగ్ సొసైటిలద్వారా, అమోనియం, యూరియా, సల్ఫేట్, మున్నగు రసాయనిక ఎరువులు కంట్రోల్ ధరలకు జిల్లానలుమూలల రైతాంగానికి అందచేయబడుచున్నది. హైద్రాబాద్ కెమికల్స్ ఫర్టిలైజర్స్ మిల్లునుంచి, ఆంధ్రషుగర్, కెమికల్స్‌మిల్లు, కొప్వ్వారునుంచి, సూపర్‌ఫాస్పేప్ అంప్ మిక్చర్ తెప్పించి సరసమైన ధరలకు అందచేయబడుచున్నది.

గోధుమలు, పంచదార, పచ్చిశనగపప్పులు, తవుడు, ఉలవలు, ప్రత్తి గింజలు, వేరుశనగచెక్క, ఆముదపుచెక్క మరియు క్రిమి సంహారక మందులు రైతుల అవసరాలకనుగుణ్యంగా తెప్పించి సరసమైన ధరలకు అందచేయబడుచున్నవి.

సొసైటి A. P. H. 946 లారీ ఖరీదుచేసి అత్యవసర పనులకు వుపయోగించుచున్నది.

సొసైటి 1 లక్ష 50 వేల ఖర్చుతో బియ్యం మరియు పప్పుల మిల్లును నిర్మాణముగావించుచున్నది.

సొసైటి రైతులవద్దనుండి ఆహారధాన్యాలు తక్కువ లాభముతో రైతులకు గిట్టుబాటయ్యే ధరలకు ఖరీదుచేయుచున్నది.

ఈ అనతికాలములో ఈ సొసైటి రూ. 64000/- లాభము గడించినది.

| షేరు ధనము | సొసైటిల షేరు ధనము | ప్రభుత్వ షేరు ధనము |
|---|---|---|
| రూ= 4200/- | రూ= 23650/- | రూ= 40000/- |

వై. రాజేశ్వరరావు.
బిజినెస్ మేనేజర్ కో-ఆపరేటివ్ సబ్‌రిజిస్ట్రార్.

# ది ఖమ్మం కో-ఆపరేటివ్ మార్కెటింగ్ సొసైటి లిమిటెడ్,

స్థాపితం: 1945 ఖమ్మం. (రి. నెం. 6227) ఫోన్. నెం. 98

ఈ సొసైటిద్వారా ఖమ్మం తాలుకాలోని రైతాంగమునకు కావలసిన అమ్మోనియం సల్ఫేట్, అమ్మోనియం సల్ఫేట్నైట్రేట్ తదితరరసాయనిక ఎరువులను ప్రభుత్వ నియమిత ధరలకు విక్రయించుచున్నాము.

మైసూరు ఫర్టిలైజర్స్ కంపెనీనుండి మరియు ప్యారీ కంపెనీల ఎరువులు మరియు క్రిమిసంహారకమందులుకూడా సప్లై చేయుచున్నాము.

రైతాంగమునకు కావలసిన వ్యవసాయక పనిముట్లు, పట్టాలు, రేకులు, ఇరుసులు, మొదలగునవి కంట్రోలు ధరలకు అందచేయుచున్నాము.

సొసైటికి లభించిన చక్కెర, గోధుమలు, బియ్యం, రవ్వ, మైదా, శనగపప్పు, వగైరా నిత్యావసర వస్తువులను ప్రజానీకానికి సరసమైన రేట్లకు సప్లై చేస్తూతోడ్పడు చున్నాము.

ఇండియన్ ఆయిల్కార్పోరేషన్వారి కిరసనాయిలు స్థానికంగా సప్లైచేయుటకే మార్కెటింగ్ సొసైటి, ఏజన్సీ బడసియున్నది. ప్రజానీకానికి అవసరం మేరకుకంట్రోలు ధరలకు సప్లై చేస్తున్నాము.

దాదాపు ఒక దశాబ్దమునుండి ఖమ్మంమార్కెట్లో అడ్తీమరియు కమీషన్ వ్యాపారంకూడా నడుపుతూ రైతాంగమునకు హెచ్చుధరవచ్చునట్లు సహాయపడుచున్నాము.

సొసైటీ తన నిర్వహణ ఖర్చులు ముడిపెట్టుకుంటూ పరిమితలాభాల నార్జించుటయే ధ్యేయంగాపెట్టుకొని అడ్తీవ్యాపారంలోని కమీషన్లో 20% తిరిగి రైతులకు వాపసుచేయుచున్నాము.

ప్రభుత్వసూచనల ననుసరించి మధ్యదళారులలాభాల నరికట్టే వుద్దేశ్యముతో లక్షరూపాయల వ్యయంతో ఒక ఆయిల్మెల్లును మరియు గోదాములను స్వంతానికి నిర్మించడం జరుగుచున్నది.

| సొసైటి ప్రస్తుత సభ్యత్వము సొసైటిలు - వ్యక్తిగత సభ్యులు | సభ్యుల షేర్లు | సొసైటిల షేర్లు |
|---|---|---|
| 118 - 1649 | 95114 - 66 | 5562-22 |

గవర్నమెంటు వాటాధనం రూ. 80000/-

ఇట్లు :

కె. పాండురంగారావు, ఆఫీసర్ ఇన్చార్జ్

# ది పాల్వంచ కో-ఆపరేటివ్ మార్కెటింగ్ సొసైటి, లిమిటెడ్. (రి. నెం. 11277)

అధ్యక్షులు:
ఎ. శివరామకృష్ణయ్య.

ఆఫీసు: కొత్తగూడెం

స్థాపితము
1945

పాల్వంచ మార్కెటింగ్ సొసైటి గతరెండు దశాబ్దాలనుండి పాల్వంచతాలూకా రైతాంగమునకు సేవచేయుచున్నది. ఆధునిక వ్యవసాయ పద్ధతులను రైతులు అవలంభించేందుకు ప్రోత్సహించడమే గాకుండా వారు వ్యవసాయోత్పత్తులను పెంచేందుకు ఉపయోగపడే రసాయనిక ఎరువులను బహుకాలంనుండి సరఫరాచేస్తున్నది.

రైతాంగానికి కావలసిన వ్యవసాయక పనిముట్లు, బండిపట్టాలు రేకులు, ఇరుసులు, ఇంకా కొట్టాలకు కావలసిన జింకుషీట్లు తదితరములు సక్రమంగా అందచేయపడుచున్నవి.

ప్రజల నిత్యావసరవస్తువులైన చక్కెర, గోధుమలు, బియ్యము, రవ్వ, మైదా, మరియు పప్పుధాన్యాలు ప్రభుత్వము నియమించిన ధరలకు సప్లైచేయుచున్నాము.

సొసైటి అడ్తీ వ్యాపారంకూడా నిర్వహించుచు రైతాంగానికి తమ వ్యవసాయోత్పత్తులకు న్యాయమైనధర గిట్టుబాటయ్యేటట్లు తోడ్పడుచున్నది.

మార్కెటింగ్ సొసైటి స్వంతగోదాములు కలిగి యున్నది.

| సొసైటి సభ్యత్వం<br>సొసైటిలు – వ్యక్తిగత సభ్యులు | మొత్తం వాటాధనం | ప్రభుత్వం వాటాధనం |
|---|---|---|
| 54 – 430 | 25392 – 42 | 23000/– |

ఇట్లు:
జి. జానకిరామయ్య
సెక్రెటరీ

## KOTHAGUDEM COLLERIES

## CONSUMERS' CO-OPERATIVE SOCIETY LIMITED,

**Regd. No. 11278.**

With the great initiative efforts of Late Mr. D. Sheshagiri Rao, (General Secretary of Singarani Colleries Workers Union). This society under the caption " Kothagudam Colleries Cooperative Society was started, on 29—1—1945 with an enrolment of 2000 share holders. Mr. J. R. Taylor ' Colleries Pay Master ' was the first chairman of this organisation. This collery workers concern was registered on the 26th of Amardad in 1355 fasli and it is being Governed by a Chairman one Secretary with nine other managing committee members—all elected by the share-holders—with periodical supervision of the Government Co-operative Department Officials.

The main object of starting the society was to facilitate the colleries workers with the supply of all essential commodities. Since its inception this has begun functioning most successfully under the consequetive chairmanships of Sri S. K. NargundKar (Managing Director S. C. Colleries) and Sri L. R. Sharma General Manager, S. C. Company Ltd., through the streaneous efforts and able guidance of above two Chairmen, Secretaries and the Managing Committee members the society could be able to prosper and stand today with will stablized assets *viz.*, nine palacial buildings two Bedford Lorries and two Flour Mills. This society owns one central Stores at the Main Bazar and six other branches scattered at distant to colleries where the coal miners work and live. Through these shops all the essential commodities together with Government controlled items are catered to the worker at fair prices.

Now there is a proposal from the Central Government Coal Miners welfare Organisation to convert the colleries Society into a Wholesale Cooperative Central Stores and this is likely to be materialised in a couple of months.

To day this society stands proud with a sound financial position and it is needless to mention that this prosperity is mainly due to the benevolent patronage and the untiring efforts of Sri L. R. Sharma Chairman and the sincere Cooperation of the Managing committee members, the collery officials and the collery workers Union.

On behalf of the Managing Committee Members,

P. SAMBASHIVA RAO,

*Hon. Secretary.*



*Seated:*—Mr. N. D. Abraham, *Office Manager;* Mr. M. Ch. Narasaiah, M.C.M.; Mr. M. Krishna Rao, M.C.M.;
*L. to R.* Mr. Ch. Rajiah, M.C.M.; Mr. A. Srinivasan, M.C.M.; Mr. V. R. Babu Rao, *Internal Auditor;* Mr. P. Sambasiva Rao, *Hony. Sec.;* Mr. L. R. Sharma, *Chairman;* Mr. D. N. Devasahayam, *Patron;* Mr. K. Brahmananda Rao, M.C.M.; Mr. Ch. V. Subba Rao, M.C.M.; Mr. A. Singaravelu, M.C.M.; Mr. K. Venkata Rao, M.C.M.; Mr. S. Jonathan, ***Sales Man.***

# Warangal Chamber of Commerce

ప్రెసిడెంటు :
శ్రీ సిద్ధంశెట్టి రామనాథం.

ఉపాధ్యక్షులు :
రామిని మృత్యుం జయలింగం.

కార్యదర్శి :
శ్రీ వెలిశాల కనుకయ్య.

సంయుక్త కార్యదర్శి :
శ్రీ భూపతి కృష్ణమూర్తి.

కోశాధిపతి :
శ్రీ చకిలం విరూపాక్షలింగం

ప్రజానురంజకమైన పద్ధతులలో వ్యాపారమును నడుపుటలో వ్యాపారస్తులకు తోడ్పడుటయే చేంబర్ ప్రధాన లక్ష్యము.

నేడు భారతదేశం ఆర్థిక, ఆహార రంగములలో అతి క్లిష్టదశ నెదుర్కొంటున్నది. ఈ క్లిష్ట సమయంలో వ్యాపారస్తులు తమ బాధ్యతలను గుర్తించి, దేశభక్తిలో-తాముకూడా తీసిపోరనే యదార్థాన్ని చాటేందుకు న్యాయసమ్మతమైన - పరిమితమైన లాభాల నాశించియే వ్యాపారం సల్పుటకు చేంబర్ ఆదేశించియున్నది.

... ఇంకనూ ...

వరంగల్ జిల్లాలో వ్యాపారవాణిజ్యముల, పరిశ్రమల అభివృద్ధికి విశేషమైన కృషి సల్పుతున్నది. వ్యాపారస్తుల, మరియు పరిశ్రమలతో సంబంధం కలవారి సమస్యలను పరిష్కరించెందుకు - తోడ్పడుచున్నది.

సర్వే జనా సుఖినోభవంతు అన్న నానుడి ప్రకారం, వ్యాపార వాణిజ్య పారిశ్రామిక రంగాలలోని అందరిమధ్య స్నేహసామరస్య పూర్వకమైన సంబంధాలను నెలకొల్పటం, చేంబర్ యొక్క ముఖ్య ఆశయాలలో ఒకటి.

అమలులో ఉన్న వ్యాపార చట్టాల లోతుపాతులను ప్రభుత్వంచే ఎప్పటికప్పుడు ప్రవేశపెట్టబడే నూతన చట్టాలలోని సాధకబాధకాలను సమూలాగ్రంగా పరిశీలించి, గ్రహించి - వ్యాపారస్తులకు ప్రయోజన కరంగా వుండునట్లు అమలు అగునట్లు కృషిసల్పుట మరొక ఆశయం.

వ్యాపారస్తులకు కావలసిన వ్యాపార సమాచారములు, విజ్ఞానము అందజేయుటకు ఎల్లప్పుడూ సిద్ధం.

## ఉన్ని పరిశ్రమను ప్రోత్సహించండి

మీకు కావలసిన పలురకాల

* ఉన్ని కంబళ్లకు
* బ్లాంకెట్లకు



గట్టిరకము నేతతో
నాణ్యమైన సరుకును
సప్లైచేయుటకు
పేరెన్నికగన్న సంస్థ



**మాతో వెంటనే సంప్రదించండి**

# ఉన్ని పారిశ్రామిక

# సహకార సంఘం లిమిటెడ్.,

ముల్కనూరు, హుజురాబాద్ తాలూకా.

| | |
|---|---|
| ముల్కనూర్ - హుజురాబాద్. | ముల్కనూరు - జనగాం. |
| సేల్సు డిపోలు: | ఉత్పత్తి కేంద్రాలు: |

| | |
|---|---|
| ప్రెసిడెంట్: | సెక్రెటరీ: |
| చవ్వాల చిననర్సయ్య. | బి. వెంకటయ్య. |

# The Warangal
# Co-operative Marketing Society Limited.

**WARANGAL—A. P.**

(Estd. 1943)

| | | |
|---|---|---|
| PRESIDENT | ... | Sri V. Raghava Reddy, |
| VICE PRESIDENT | ... | Sri E. Jagannadha Rao, |
| SECRETARY | ... | Sri P. Vasudev, B.A., |
| MANAGER | ... | Sri Md. Khaja. |

SHARE CAPITAL:

| | | Rs. |
|---|---|---|
| Individuals | ... | 1,21,331—00 |
| Societies | ... | 1,086—00 |
| Govt. of A.P. Contribution | ... | 35,000—00 |
| Govt. Share Capital | ... | 1,17,500—00 |

BUSINESS: Distribution of controlled commodities such as sugar, wheat, Rice and other general food stuffs, (*b*) procurement of paddy and processing it into rice, (*c*) Distribution of agricultural impliments, chemical fertilisers, Electric Motors, pump sets, oil engines, iron & steel, zinc sheets, Animal feeds etc., (*d*) private agents for distribution of Chemical Fertilisers, and other various marketing business to facilitate the agriculturists through their primary societies in establishing depots in various centres at Warangal Urban and Rural areas.

SOCIETY INVESTMENTS: One owned rice mill at Warangal and Ghanpur, fourteen owned godowns at Warangal and two big own godowns at Warangal. Society having own land nearly 2 acres at Warangal and plot situated at Market Yard. Society having a own lorry. Society invested amounts on Govt. loan Bonds for an amount of Rs. 22,520 and invested amount in Co-operative institutions Rs. 14,907/-

*"Co-operatives will help those who help themselves."*

# శ్రీ సత్యనారాయణస్వామి దేవస్థానము

## కొత్తపల్లి

తా॥ కరీంనగర్.



కరీంనగర్ జిల్లా కేంద్రానికి 4 మైళ్లదూరంలో జగిత్యాల బస్సురూటులో గల కొత్తపల్లి గ్రామములో శ్రీ సత్యనారాయణస్వామి దేవాలయము ఉన్నది.

ఈ దేవాలయము విశేష వ్యయప్రయాసలతో శ్రీ భోగ మల్లయ్యగారు తన గారాల బిడ్డడైన భూమయ్య నిర్యాణముచేసిన సందర్భములో ఆత్మశాంతికై నిర్మించినారు. ఇందులో ప్రతిష్ఠాపన చేయబడిన విగ్రహాలను ప్రముఖ శిల్పులు తెనాలి వాస్తవ్యులు కడు మనోహరంగా చెక్కారు.

దేవాలయములో శ్రీ ఆంజనేయస్వామి, శ్రీ విఘ్నేశ్వర, శ్రీ సుబ్రమణ్యేశ్వర, శ్రీ గాయత్రీ, దుర్గ, శ్రీ మార్కండేయ, ఆదిశంకర, రామానంద తీర్థ మరియు నవగ్రహ విగ్రహములు, ఆగమ వైదిక పద్ధతిన ప్రతిష్టింపబడినవి. శ్రీ సత్యనారాయణస్వామి విగ్రహము పంచాత్రయుక్తముగా ప్రతిష్టింపబడినది. మొదటి శార్వరినామ సం॥ శ్రావణమాసములో శ్రీ రామానంద సరస్వతి స్వామి (బెల్లంకొండ)వారి పర్యవేక్షణలో శ్రీ సత్యనారాయణస్వామి విగ్రహ ప్రతిష్టాపన శ్రీ జంద్యాల సుబ్రమణ్యశాస్త్రిగారి అధ్వర్యములో వైభవంగా జరిగినది.

తర్వాత 6—5—63 తేది ఉదయం శృంగేరీ పీఠాధిపతి జగద్గురువు శ్రీ అభినవ విద్యాతీర్థ స్వామివారి పర్యవేక్షణలో యంత్రోపయుక్తముగా పూర్తి విగ్రహములకు ప్రతిష్టాపన జరిగినది.

నిత్యము ధూపదీప నైవేద్య అర్చనా కార్యక్రమాలు త్రికాలములందు విధిగా జరుగుతుంటాయి. ప్రతి సంవత్సరము ఆశ్వయుజమాసంలో నవరాత్రి మహోత్సవములు శాస్త్రీయంగా దిగ్విజయంగా నిర్వహింపబడుతుంటాయి.

సంవత్సరాది - శ్రీరామనవమి - వైశాఖ పూర్ణిమ - కృష్ణాష్టమి - వినాయక చతుర్థి - కార్తికపూర్ణిమ పర్వదినాలలో కృత్తికా పూజలు, ముక్కోటి - సంక్రాంతి మహాశివరాత్రి పర్వదినాలలో మహా వైభవంగా పూజయి జరుగును.

ప్రతి దేవాలయములో ప్రత్యేక అర్చకులు - పునశ్చరణ - అర్చన క్రమముగా జరుపుదురు. దేవాలయము పారిశుద్ధ్యము, దీపాలంకరణ తదితర విషయముల గురించి ప్రత్యేకశ్రద్ధ గైకొనబడుచున్నది. దేవాలయంవద్ద ప్రజానీకానికి మరియు పశువులకు పర్వకాలములందు మంచినీటి వసతి పంపులద్వారా, తొట్లద్వారా కల్పించబడినది.

ఒక వసతికలిగిన పెద్ద ధర్మశాల - వివాహాది శుభకార్యములు జరుపుకొనుటకు వీలుగా పెద్ద హాలుతో నిర్మించబడినది. పూజారులకు నివాసయోగ్యమైన గృహములు నిర్మించబడినది.



శ్రీ కోదండరామస్వామివారి దేవాలయము, తిరుపతి.

# కరీంనగర్ డిస్ట్రిక్టు కో-ఆపరేటివ్ మార్కెటింగ్ సొసైటి లిమిటెడ్,

పాలకవర్గము :—

శ్రీ ఎ. వి. రమణరావు (అధ్యక్షులు)
శ్రీ పి. వి. నర్సింగరావు (ఉపాధ్యక్షులు)
శ్రీ ఎ. కె. విశ్వనాధరెడ్డి (కోశాధిపతి)
శ్రీ పి. కృష్ణారెడ్డి (డైరెక్టర్)
శ్రీ యం. బుచ్చిరెడ్డి (డైరెక్టర్)
శ్రీ కె. లక్ష్మీనరసింహరావు (డైరెక్టర్)
శ్రీ ఎ. వి. రాజరెడ్డి (డైరెక్టర్)
శ్రీ వామనరెడ్డి (డైరెక్టర్)
శ్రీ యం. భీమారావు (డైరెక్టర్)
శ్రీ డి. హనుమంతరావు (డైరెక్టర్)
మరియు డిస్ట్రిక్టు సప్లై ఆఫీసరు.

కరీంనగర్ జిల్లా సహకార మార్కెటింగ్ సొసైటి తన స్వంత డిపోలద్వారా, జిల్లాలో పరపతి సంఘాల ద్వారా, తాలూకా మార్కెటింగ్ సొసైటిద్వారా, అమోనియా, యూరియా మున్నగు రసాయనిక ఎరువులు, కంట్రోలు ధరలకు జిల్లా నలుమూలల రైతాంగానికి అందజేయుచున్నది.

రిజిష్టర్ నెం. 321/T. D.

హెడ్ ఆఫీసు - కరీంనగర్. (ఆ. ప్ర.)

హైద్రాబాద్ కెమికల్స్ అండ్ ఫర్టిలైజర్ ఫ్యాక్టరీనుండి, ప్యారి అండ్ కో వారివద్దనుండి సూపర్, పేడిమిక్చర్, అమోనియం పాస్ ఫేటు ఖరీదుచేసి సప్లయి చేయుచున్నది.

1965-66 సంవత్సరములో రు. 8,98,657–78 ల విలువగల 19,467–89 క్వింటాళ్ల ధాన్యం, రూ. 7,57,719–84 ల విలువగల 14,096–86 క్వింటాల్ల మక్కజొన్న మరియు రు. 66,547–40 ల విలువగల 866–26 క్వింటాల్ల అపరాలు ఖరీదుచేసి ఇతర రాష్ట్రములకు రవాణా చేసియున్నది. ఈ సొసైటి చక్కెర - శనగపప్పుకూడా కంట్రోలు ధరలకు సప్లై చేయుచున్నది.

సహకార రైస్‌మిల్లులు కరీంనగర్, జమ్మికుంట పట్టణములలో స్థాపించబడినవి. సొసైటి స్వంత స్థలములు, మూడు గోదాములు గలిగివున్నది. మరి మూడు గోదాములు నిర్మాణదశలో యున్నవి. రెండు లారీలు, ఒక ట్రాక్టర్ - ఒక జీపులను సొసైటి స్వంత లాభములనుండి ఖరీదుచేసి ఆదర్శవంతముగా నడుపుచున్నది.

1965 - 66 సం॥నకు సొసైటి ఆర్జించిన అంచనా లాభములు రు. 3,00,000/– అని చెప్పుటకు ఎంతయో గర్వపడుచున్నాము.

ప్రజలకు ఇబ్బందులు కలుగకుండా నిత్యావసర వస్తువులు సరసమైన ధరలకు లభించుటకు డిపోలను స్థాపించటం జరిగినది. తోడ్తో రైతులకు గిట్టుబాటయ్యే ధరకూడా అందజేయుటకు తోడ్పడుచున్నది.

ఇట్లు,

యం. ఆర్. శాస్త్రి, B. A.,

బిజినెస్ మేనేజర్.

# HINTS TO PILGRIMS.

1. Devasthanam Choultries are near the Railway station.
2. The following facilities are available:
   (*a*) Free accommodation and also furnished rooms on payment.
   (*b*) Free issue of vessels.
   (*c*) Luggage room for depositing luggage free of charge.
   (*d*) Canteens for food.
   (*e*) Transport facilities to Tirumala, Tiruchanur and Renigunta at rates notified.
   (*f*) Taxies for hire.
   (*g*) Postal facilities.
   (*h*) A Railway Booking office.
   (*i*) Co-operative Stores for purchasing provisions at fair prices.
   (*j*) A Free dispensary for medical aid.
   (*k*) Licenced coolies to carry your luggage at rates prescribed.
   (*l*) Enquiry Offices for guiding you.
   (*m*) Book-stall for guide books, pictures, prardhana samans current Naya paise coins etc., at cost price.
3. Don't purchase uncurrent Ragi or Vaddi kasulu; but deposit all your offerings in the Hundis kept in all temples or give them in temple offices and obtain printed receipts. Otherwise you will not fulfil your vows.
4. At Tirumala, there are Devasthanams guides, Kalyanakatta and purohit sangams authorised by Devasthanams. Utilise their services.
5. Beware of bogus pandas or dalalies, who mislead you in the performance of your vows and disposal of your offerings.
6. Tirumala is a sacred place. Avoid taking meat, wearing of flowers or wearing of shoes while at Tirumala.
7. Take bath, wear clean clothes and have Darsan of God.
8. Please do not offer money or presents to any one to assist you in getting these facilities. The Devasthanam servants are always at your service.
9. Seek the assistance of the Enquiry Offices and temple officials for helping you in the proper conduct of your pilgrimage and vows.
10. Please forward complaints and suggestions to the EXECUTIVE OFFICER, T. T. Devasthanams, Tirupati.

**Issued by T. T. Devasthanams, Tirupati.**